# కృతజ్ఞులము

డాక్టరు బ్యాబిట్ గారి Human Culture and Cure యొక్క వివిధ భాగములను చదువుకొనుటకును తర్జుమా చేసుకొనుటకును మావద్ద చాలకాల ముంచిన

౧ మహారాజశ్రీ వేమూరి చిన్నయ్యారావు పంతులు, బి. ఏ., బి. ఎల్. గారికిని

౨ బ్రహ్మశ్రీ దువ్వూరి వీరభద్రయ్యగారికిని

3 ఈ గ్రంథములోని మొదటిభాగమునందలి పటముల దిమ్మె లన్నియు ఉచితముగా తయారుచేయించి యిచ్చిన ఆంధ్ర పత్రికాధిపతులు విశ్వదాత, దేశోద్ధారక, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికిని

౪ గ్రంథరచనకు నన్ను నిరంతరము ప్రోత్సహించుచు, Human Culture and Cure 1, 2 భాగములను టైపు చేయించిన ప్రతుల నిచ్చిన

మహారాజశ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికిని

౫ గ్రంథముద్రణమందు ప్రత్యేకశ్రద్ధ వహించిన చి॥ కుందా నరసింహమూర్తికిని.

గ్రంథకర్త:

# పీఠిక

డాక్టరు ఈ. డీ బ్యాబిట్, ఎం. డి., ఎల్. ఎల్. డీ గారు ఇంగ్లీషులో అనేకశాస్త్రముల బరిశోధించి 'Principles of Light and Color' అనియు 'Human culture and cure అనియు రెండు ఉద్గ్రంథములను రచించిరి. ఇవిగాక 'The Health Manual' అనియు 'Health ahd Power' అనియు 2 చిన్నగ్రంథములను రచించిరి.

ఇంతవరకు Health ahd Power అను గ్రంథమును తెలుగులో 'వర్ణవైద్యమంజరి' అను పేరను; Principles of Light and color లోని Chromotherapentics అను భాగమును 'ప్రౌఢ ప్రభాకరము' అను పేరను రచించియున్నాను.

ఇప్పుడు 'సునిశితవైద్య'మను పేర రచించిన యీ ఉద్గ్రంథము నకు మూలము Human Culture and Culture. ఇది 5 భాగములు గలది. ఇందు 1,4,5 భాగము లీ సంపుటమునకు మూలము. ఇందలి విషయములు సునిశితములగు తత్త్వములతో చికిత్సచేయు విధమును బోధించును.

గ్రంథరచనావిధానము.

కేవలము మాటలకుగాక సాధ్యమైనంతవరకు భావముల కే భాషను తొడిగితిని. గ్రంథము ముద్రిం కిచ్చుటకు పూర్వము నలుగురైదుగురిచే చదివించితిని. వారు కఠినముగా నున్నవని గుర్తుపెట్టిన భాగములను, పదములను తిరిగి వ్రాసితిని. గ్రంథములోని భాష శక్యమైనంతవరకు బాగుగా వాడుకలో

నున్న పదములతోడనే వ్రాసితిని. సంధులను అవసరమైన చోట్లనెల్ల విడదీసితిని. భావముయొక్క లాలిత్యము తెలియజేయుటకు గ్రాంథికభాషతోగాక గ్రామ్యభాషతో బాగుగా సాధ్యమగునట్లు తోచిన అట్లే చేసితిని. గంభీరమగు భావములను తెలియజేయుటకు కొన్ని సాంస్కృతికపదముల నటునిటు వాడితిని.

పారిభాషికపదముల నిదివరకు తెలుగులో ప్రచురింపబడిన శాస్త్రీయగ్రంథములనుండి ధారాళముగా వాడుకొంటిని. కొన్ని పదములను నేను సృష్టించుకొంటిని. ఎట్టి పారిభాషిక పదములు వాడినను వానినెల్ల ఆయాచోట్లందే వివరించి యుంటిని.

అడుగడుగునకును ఎట్టి శాస్త్రము సామాన్యులకు సయితము తెలియునా? యను ఆవేశముతోడనే వ్రాసితిని. అందువలన భాష యెక్కడనైన కుంటుపడినదేమో నాకు తెలియదు.

### గ్రంథనామము.

సృష్టియందు స్థూలభూతములు నడచుటకు సూక్ష్మతత్త్వములు కారణము. సూక్ష్మభూతములు తమ స్థితిని స్థూలభూతముల ద్వారానే తెలియజేయగలవు. ఆత్మ దేహము లేనిదే ద్యోతకము కాజాలదు. ఆత్మలేనిదే దేహమునకు చలనము లేదు. స్థూలమైన శక్తులకన్న సూక్ష్మశక్తు లెక్కువ శక్తిమంత

ములు అను విషయము మీా గ్రంథమున నామూలాగ్రముగా నిరూపింపబడినది. సునిశితములగు తత్త్వము లెంత సూక్ష్మముగను, త్వరగను, రోగములను కుదుర్చునో, యితరపద్ధతులకు చొరశక్యముగాని లోపలిభాగముల కెట్లు చొరబారునో, యెంత సుఖవంతములుగా నుండునో, ఫలమెట్లు శాశ్వతముగా నుండుచున్నదో యీా గ్రంథమున సిద్ధాంతము చేయబడినది. కాన దీనికి సునిశితవైద్యమని పేరిడితిని.

## గ్రంథవిషయప్రవేశము.

మిక్కిలి బహుళముగా నున్న గ్రంథవిషయమును గురించి యిచ్చట యెంత వ్రాసినను అప్రస్తుతమే యగును. అసాధ్యము గూడ. పెద్దల పాదకమలములకు నమస్కరించుట మొదలు తోరణపు మండలు కట్టుకొనుటవరకు కారణములు చెప్పవలెనన్న యీాగ్రంథమే చదువవలయును. ఇందున్న విషయములయొక్క బాహుళ్యము, నైశిత్యమును, చదివిన తెలియునే కాని యెంతవ్రాసినను సరియైన విషయప్రవేశమును గలిగింపలేమని మనవి, చరిత్ర వర్ణనముగూడ. గ్రంథము నవలవలె ఒక్కతూరిచదివి ఆనందించి ఆవలపారవేయదగినదిగాదు. ప్రతి విషయము నధ్యయనము చేయవలయును, పరిశోధింపవలయును. అనుభవమునకు తెచ్చుకొని తరింపవలసినవిగా నున్నవి.

## రసాయనశాస్త్రపుచిహ్నములు.

రసాయనశాస్త్రమునకు సంబంధించిన చిహ్నములు (Symbols) దాదాపుగా తప్పవడినవి. ఇది ముద్రణకాలమున జరిగిన

పొరపాటు. తప్పొప్పులపట్టిక చేర్చితిని. దానినిబట్టి తప్పులు దిద్దుకొనదగును.

ఇప్పటి కీవిధముగా నీ యుద్గ్రంథమును రచించి విజ్ఞా కర కమలములయం దుంచుచున్నాను. ఇందలి సారమును గ్రహించి కొన్ని కుటుంబములైన నారోగ్యముకొరకై మందులకై దేవు రింపక సునిశితములగు తత్త్వములను స్వీకరించి బాగుపడిన నా కదే ఆశీర్వచనముగా భావింతును.

గ్రంథకర్త.

# సూర్యోపాసన

ఆధునికపరికృతిశాస్త్రమందు సూర్యుడు ఒక్కడే కాడనియు, ఒక (Neclues) అనగా మూలశక్తిచుట్టు ఏడుసూర్యగోళములు ప్రచండవేగముతో గిర్రన తిరుగుచున్నవనియు, ఆయేడు గోళములు నేడురంగులు గలవిగా నుండుననియు, వీనికన్ని టికి తేజస్సు ఆ మూలశక్తినుండియే వచ్చుచుండెననియు తేల్చి నట్లు తెలియుచున్నది. ఆర్యులు దీనిని అనేకవేలసంవత్సర ములకు పూర్వమే తెలిసికొనినట్లు తైత్తిరీయారణ్యకభాగ ములోని మొదటిప్రశ్నమునుబట్టి గ్రహింపగలము. వీనిని మన పెద్దలలో చాలమంది అధ్యయనము చేసినవా రున్నారు. అర్థము తెలిసినవారుకూడ కొంద రున్నారు. అందులోని సప్తమా నువాకములో "ఆరోగో భ్రాజః పటరః పతఙ్గః.........అను వాక్యమందు "తే అస్మైసర్వేదివమాతపన్తి" అనియు "కశ్య పోష్టమః, స మహామేరుం న జహాతి తస్యైషాభవతి" "యస్మి న్థ్సూర్యా అర్పితాస్సప్తసాకమ్" అని; ఇంకను "అపశ్యమ హామేతాన్సప్తసూర్యానితి, పఞ్చకర్ణో వాత్స్యాయనః సప్తకర్ణ శ్చ ప్లాక్షిః" అని యేడుగురు సూర్యులను చూచితిమని చెప్పినట్లును కాన్పించుచున్నది. ఆమధ్య నుండునట్టి మహా శక్తినికూడ చూచిన ట్లీ క్రిందివాక్యమువల్ల తెలియు చున్నది. "అపశ్య మహామేతత్సూర్య మణ్డలం పరివర్తమా నమ్, గార్గ్యఃప్రాణత్రాతః" ఇత్యాదిగా నేటిపరికృతిశాస్త్ర జ్ఞుల కందని అనేకనూతనవిషయములు సార్థముగా అరుణము చదివినవారికి గోచరించు నని నానమ్మకము. ఇంతేకాక,

ఆ మూలశక్తినే పురాణములు విష్ణువుగను, ఇంద్రుడుగను, శివుడుగను, అగ్నిహోత్రుడుగను వర్ణించియున్నట్లు మనకు గోచరింపగలదు. రామావతారము వసంతఋతువుయొక్క కాలమానము తెలుపును. అనగా రాముడు ఇంద్రుని కుమారుడైన వాలిని వధించి సుగ్రీవునకు పట్టముకట్టెను. అనగా మూలశక్తి మేఘములయొక్క ఆడంబరము లేకుండ చేసి సూర్యపుత్రుడు అర్థాత్తు వెలుతురు, వేడిమితో కిరణములకు ప్రాధాన్యమొసంగెను. ఇట్లే కృష్ణావతారము వర్షఋతువు యొక్క విలాసమును బోధించును. రామావతారములో జననము పగలు 12 గంటలకు కాగా, కృష్ణావతారములో జననము రాత్రి రెండుజాముల వేళ. అనగా వర్షాకాలములో అందులో, శ్రావణబహుళ అష్టమియందు రాత్రి రెండు జాముల వేళ, సూర్యపుత్రుడు అనగా వెలుతురు శూన్యమై పోగా నింద్రపుత్రుడగు వర్షము పట్టాభిషిక్తమై యున్నది. ఇట్లే నృసింహావతారమందును రక్తమాంసములను జుర్రినా నట్టి సూర్యుని ప్రతాపమే వర్ణింపబడినది. ఇట్లే వామనావతారమునందును "ఇంతింతై వటు డింతయైనవాడు" సూర్యభగవానుడే. అందణగద్రొక్కబడిన బలి చీకటియే. ఇట్లే యితరావతారములును ఆయా జయంతులయొక్క కాలవర్ణనగా కన్పించుచుండును. వీనికన్నిటికిని మూల మొక విష్ణువే. అనగా "కశ్యపోఽష్టమః" అనబడిన (Neclues) మూలశక్తియే. దీనిని గురించియే పురాణములు వర్ణించినవి. భక్తులుపాసించినారు. జ్ఞానులు వివేచనచేసినారు. అందుకనియే,

"అసావాదిత్యోబ్రహ్మ" అని మనము నిత్యమును ఉపాసన చేయుచున్నాము.

ఆదిత్యహృదయమును ఉపాసనపొందియే రాముడు రావణుని జయించినాడు. అర్జునుడు కౌరవుల జయించినాడు. (ఇందు మొదటిది శ్రీమద్రామాయణమునందును, రెండవది పద్మపురాణమునందును గలవు) ఆదిత్యహృదయమునకు మనము తెలిసికొనుటలో ఆధునికశాస్త్రములు మిక్కిలి సాహాయ్యపడును. "తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితం, రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయసముపస్థితం, దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్, ఉపాగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవాన్ ఋషిః." యుద్ధమునకు వచ్చిన రావణుని జూచి దేహమునందును మనస్సునందును బడలిక కలిగిన రాముడు విచారింపగా, దేవతలతో సహా యుద్ధమును చూచుటకు వచ్చిన అగస్త్యులవారు, (ఈయననే 'భగవాన్' అనియు, 'ఋషి' అనియు పేర్కొనియున్నారు) వచ్చి యుపదేశించినట్లు గలదు. అగస్త్యుడు ఆకాశమునందుండిన నక్షత్రమే కాని వేరుకాదు. ప్రతిపెలుతురునందును ధ్వనియుండు ననుట ఆధునికప్రకృతిశాస్త్రపరిశోధన ఫలితమై యున్నది. ఆధ్వనిని మనహృదయములు స్వీకరింపవలయు నెడల మనహృదయములు మిక్కిలి సునిశితమైన వై యుండవలెను. ఆ నైశిత్యము తగ్గుటవలననే సూర్యవంశమునందుద్భవించినవాడయ్యును సూర్యభగవానునినుండి సమగ్రశక్తిని స్వీకరింపలేకపోయెను. అగస్త్యమండలమునుండి వచ్చిన కిర

ణములవలన రాముని హృదయమునందు జీవనము కలిగి సూర్య కిరణమును స్వీకరించు సామర్థ్యము కలవాడాయెను. అందువలననే సర్గాంతమున "అథ రవి రవద న్నిరీక్ష్య రామం ముదితమనాః పరమం ప్రహృష్యమాణః, నిశిచరపతిసంక్షయం విదిత్వా సుర గణమధ్యగతో వచ స్త్వరేతి." అని కలదు. 'రవయతీతి రవిః' ధ్వనిచేయువాడు గనుక రవియని పేరు వచ్చినది. ఆరవి "అంతర్బహిశ్చ తత్సర్వం, వ్యాప్య నారాయణః స్థితః," ఆదిత్య హృదయమునందు వర్ణింపబడిన దీమూలశక్తియే. మన హృదయమునందును ఉన్నట్టి తత్త్వమును "సబ్రహ్మాసశివస్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్స్వరాట్." అని యన్నారు. ఆ తత్త్వమే ప్రతిరక్తబిందువునందును గలదు. అదే ఆదిత్యహృదయమునందు "ఆతపీ మండలీ మృత్యుః పింగళస్సర్వతాపనః, కవిర్విశ్వో మహాతేజా రక్తస్సర్వభవోద్భవః." అని చెప్పబడినది. మన దేహమునందలి ప్రతిరక్తబిందువును సుష్ణధర్మము గలిగి వర్తులాకారిముగా నుండి మాలిన్యముల పాలిటి మృత్యువుగాను, పింగళవర్ణము గలదిగాను, ఇతరభాగములకు వేడి నిచ్చునదిగాను, 'కవిః' అనగా నింద్రియములను ప్రేరేపించునట్టిదగాను, 'విశ్వః' దేహమంతటను వ్యాపించునట్టిది గాను, 'తేజః' దేహమునంతకు కాంతినిచ్చునది గాను, ఎందుండి సర్వ ధాతువు లుద్భవించునో అట్టిదిగాను, ఈ రక్తము వర్ణింప బడినది. ప్రతిరక్తబిందువునందును సప్తధాతువు లున్నవి. ప్రతిరక్తబిందువునందును ఆ మూలశక్తి యున్నది. కావున సూర్యునియందుండియే, సౌరమగు (అనగా సూర్యసంబంధ

మగు) మనదేహమునకును, శక్తిని స్వీకరించుట సహజమును, గుణవత్తరమును అయియున్నది. అందువలననే మనము సవితృ మండలవర్తినియైన సావిత్రి నుపాసించుచున్నాము.

దీనినే ప్రత్యేకమంత్రములచేత సౌరోపాసనచేయుచున్నారు; ఆదిత్యహృదయము పారాయణచేయుచున్నారు; మరికొందరు సూర్యనమస్కారములు చేయుచున్నారు; మరికొందరు సూర్య కిరణములతో చికిత్సచేయుచున్నారు. ఎవరేదిచేసినను, ఎట్లు చేసినను తెలిసి చేసినయెడల అధికప్రయోజనము కలుగును. *

* ప్రకృతిశిబిరములో సూర్యోపాసననుగూర్చి యిచ్చిన యుపన్యాసముయొక్క సంగ్రహము.

# సునిశిత వైద్యము

## విషయసూచిక



ఉపోద్ఘాతము

## ఒకటవ భాగము

### చికిత్సాతత్త్వము - పరికరములు

# రెండవభాగము

## నాడీమండలము - ఉన్మాదము

## మూడవ భాగము

అవయవములు - వానియందుకలుగురోగములు.

మగు నాడులు- బృహద్ధమనినుండి ధమనులు- రక్తచలననాడులు- మంటలకు చికిత్సచేయుట - పరున్నప్పుడు పడకయొక్క స్థితి - వికారము, వాంతులు - పొగాకు వాడుట - అమవాతము - వర్ణవైద్య ప్రభావము - ఒకబ్రాహ్మణుని జయములు - భారతీయులందరును వర్ణవైద్యమునే యవలంబింతురు- శ్యామోదకమునందలి ఐంద్రజాలిక ప్రభావము - గానముయొక్క వర్ణము- బాధను తగ్గించుట లేక ఆపుట - తాగుడునుగురించి ఫ్రెంచివారి నిర్ణయము- ఆదేశముయొక్క ప్రభావము - ధాతుకాంతశక్తి - నాడుల సంబంధమగు పోట్లు - బిగుతైనరవికలు - కాంతిచికిత్స - విద్యుచ్ఛక్తిని గురించిన శాస్త్రీయజ్ఞానము కొందరకు లేదు- క్షయ, ఇతరవ్యాధులు - వివరములతో కూడిన యొకజాబు - ఆతపము, వర్ణములచే రోగములు కుదురుట - సౌరవ్యాయామసదనములు - ప్రకృతిశాస్త్రజ్ఞుల అభిప్రాయములు.

# ఉపోద్ఘాతము

శాస్త్రమని చెప్పుటకే వీలులేని ప్రస్తుతపు మందువైద్య మును సశాస్త్రీయముగా జేయుటకు ప్రయత్నించుట అవ సరము. ఎందరు మతాచార్యులు నీతి నుపదేశించు చుండి నను, యెన్ని కళాశాలలు ఆరోగ్యము, ఆనందములను గురించి బోధించుచుండినను, మందుసంచులతోడి వైద్యులు వెన్నాడి సంరక్షింపఁ బ్రయత్నించు చుండినను, పాపము! మానవులు అవినీతిపరులై, వ్యాధిగ్రస్తులై, దుఃఖమును పొందుచునే యున్నారు. మానవాభ్యుదయమునకై యింతె కన్నను శ్రేష్ఠతరమగు మార్గముల నన్వేషించుట యవసరము.

శక్తియొక్క ఆకాశ-పరమాణు సిద్ధాంతమును గురించి నేను కనిపెట్టిన దానిని నా "తేజోవర్ణశాస్త్రము" (Principles of Light and Colour) నందు, రాసాయనిక శాస్త్ర తత్త్వము పూర్తిగ వెల్లడియై, శారీరక - మానసిక రహస్యము లంజలి గుప్త విషయములు స్పష్టమగుటవలన నేను యీ భాగ మున చికిత్సాశాస్త్రమునకు సంబంధించిన సామాన్య సూత్ర ములనే వెల్లడించుట యావసరమని భావించితిని. దానివలనఁ దోడివైద్యులేగాక, దుఃఖమువలనను, రోగమువలనను నిరం తరము బాధపడుచు చీకటిలో దరిగానక తొట్రుపడుచున్న మానవ సముదాయమునకు సాయపడినవాడ నగుదునని యా శించితిని. ప్రస్తుత సందర్భమున ముఖ్యముగా 3 విషయము లవసరమని తోచుచున్నది.

1. చికిత్సా శాస్త్రము:- ఇందు బాహ్యప్రపంచము సంగలి (సృష్టి లేక ప్రకృతి యందలి) రాసాయనిక ధాతుపోషకశక్తులను రోగియొక్క రాసాయనిక, ధాతు శక్తులకు సాయపడునట్లు చేయుట కవసరమగునట్టియు, నెన్నటికిని మార్పు చెందనట్టియు విధులను నిర్దేశించుట;

2. చికిత్సా సామగ్రి:- ఇప్పుడున్న మందు వైద్యసంబంధమగు సామగ్రి కేవల మసమగ్రమును, అసమర్థమును నగుట, వలన నేను చాల కాలము యోచించి సూర్యుని కాంతియందు స్నానము చేయుట కవసరమగు నుపకరణములను, సూర్యకిరణములను కేంద్రీకరించు పనిముట్లను, సూర్యకిరణములందలి వర్ణములను వ్యాధిగ్రస్తమగు భాగమునందు ప్రసరింపజేయుటకును, కొన్ని పదార్థములను వర్ణాపాదితము జేయుటకును నవసరమగు నుపకరణములను గనిపెట్టితిని. వీనివలన వ్యాధి నివారణమగును గాన యిట్టి చికిత్సా సామగ్రియును;

3. సునిశితశక్తుల ప్రయోగము:- దేహమునందెచ్చటనో యున్న ధాతు, మానసిక, ఆత్మీయశక్తులను గదలించి, బలము గలిగింపగల సూక్ష్మతమశక్తులను లేక సునిశితశక్తులను (Fine forces) ప్రయోగించుటయును. ఇట్టి సూక్ష్మతమ శక్తుల ప్రయోగమువలననే దేహమున కంతటికిని నిజమగు నట్టియు శాశ్వతమగునట్టియు నున్నతి గలుగగలదు. శారీరక, ఆత్మీయశక్తు లొకదాని నొకటి వదలి యభివృద్ధి నొందనేరవు. మానవులను మతాచార్యులు కేవలము ఆధ్యాత్మిక శక్తుల

ద్వారానే గణించవలెననియు, చికిత్సకుడు (మందువైద్యుడు) కేవలము ఈ స్థూలశరీరమునకే ప్రాముఖ్యము నిచ్చుచు దానిని పోషించుటయే మోక్షమని యెంచుటచేతను, మానవసము దాయమును నొంటికాలితో నడిపించినవారై తుదకు వ్యర్థులగుచున్నారు. వర్ధచికిత్స ప్రపంచమునకు నూతనకాంతులతో బ్రత్యక్షమైనది. జలమునందలి చల్లదనము, వాయువు, కాంతశక్తితోడి మర్దనాదులు, మిక్కిలి సూక్ష్మతమశక్తులు, వీనివలన నాడీరక్షణయు, మానసికోన్నతియు, రక్తోజ్జీవమును గలుగును. ఇట్టి యున్నతమగుశక్తుల నభివృద్ధి చేయుటకై స్వాభావికమును, అనుభవసిద్ధమునునగు యితరవిధానములను బ్రయోగించుటయు యీ గ్రంథముయొక్క యుద్దేశము. ఈ శాస్త్రమువలన మానవులు యేచిన్నరోగము గలిగినను వైద్యునికై యెదురుచూడ నక్కరలేకయే రోగముయొక్క సామాన్యస్వభావమును గుర్తించి రోగముగలిగినప్పుడు తగునట్లు వర్తించుటకు వీలుపడును. వైద్యుడీ శాస్త్రముయొక్క విశేష పరిచయానుభవములం గడించి తీవ్రమగు రోగములకు తగుసలహాలిచ్చుటకును, చికిత్సచేయుటకును నుపయోగపడును. ముఖ్యముగా బాలింతజబ్బు, నాడీశోషణము (Nervous Exhaustion) మొదలగునవి గలిగినప్పుడును జాగ్రత్తగ సలహాలిచ్చి చికిత్సజేయుటకీ నవీనవైద్యశాస్త్రము యెక్కువగ తోడ్పడగలదు. కాన యీ శాస్త్రము వైద్యునకును, సామాన్య మానవునకును యొకేమాదిరిగ నుపయోగకరమగును.

తేజోవంతులును, బలిష్ఠులు నగు పురుషులు, సౌందర్యవతు లగు స్త్రీలును గలిగి, సర్వమానవకోటికి సుఖము గలుగుటయే నాకత్యంతానందదాయకమగు నాశయము.

సామాన్య మానవులునయితము నాభావను, నేను వ్రాసిన భావములను గ్రహింపగలుగుటకై నేను వ్రాయు భావ సాధ్యమైనంత శాస్త్రీయపదవిరహితమై యుండును. ఆపద ప్రయోగము వలన మాత్రమే భావములను చక్కగ వెల్ల డించుటకు సాధ్యమని తోచినపుడు మాత్రము ఆయాచోట్ల అట్టి శాస్త్రీయపదములను ప్రయోగించితిని.

శాస్త్రజ్ఞానము గలవారికి యుపయోగించు నవీనవిజ్ఞానము గూడ యిందుగలదు. వైద్యశాస్త్రమును గూర్చి యనేక యుద్గ్రంథములు గలవు. అందలి పారిభాషిక పదములను (Technical Terms) నేర్చుకొనుటకే జీవితమంతయు వ్యయ మై, యందలి విజ్ఞానమును గ్రహించుట కెంతమాత్రమును గాలము జాలుటలేదు. ధనరహితమగు చక్కనిసంచికి ధనము లేని కారణమున యెట్లు విలువలేదో అటులనే విజ్ఞానరహిత మగు పారిభాషిక పదములను నేర్చుకొనుట వలనగూడ నిరు పయోగమైనది. కాన మానవులందరును యీ నూతన శాస్త్రమును సంతోషముతో స్వీకరించి మానవాభ్యుదయ మునకు దోడుపడ గోరుచున్నాను.

—డాక్టరు ఇ. డి. బాబిట్,
యం. డి. ఎల్. ఎల్. డి.

హరిః ఓం

ఒకటవ కిరణము

# శక్తితత్త్వము

**1. శక్తియొక్క లక్షణములు :—** రెండు లక్షణములు ఒకటిగా కలసినప్పుడు శక్తి గలుగును. ఒకటి సునిశితమై వ్యాపక స్వభావము గలది. రెండవది స్థూలమై తాను స్వయముగా కదలజాలనిది. వీనిలక్షణములు భిన్నముగాగాని ఒకదాని కొకటి ఆశ్రయముగాగాని యుండును. రెండవలక్షణము స్థూలమై యుండుట - అందువలన సునిశితస్వభావము కలిగిన మొదటిలక్షణముతోడి సంబంధ మున్నప్పుడే దానికి కదలిక గలుగును. సునిశిత స్వభావమునకు వ్యాపించుటకు స్థూలలక్షణముగలది లేనియెడల అది ద్యోతకమే కాదు.

**ఉదాహరణములు :—** నీటిచే యంత్రములు నడుచును. వాయువుచే గాలిమరలు నడచును. ఆవిరిచే యింజను నడచును. రక్తముచే దేహాయంత్రము నడచును. ఇందలి రెండులక్షణము లివి—

| | |
|---|---|
| సునిశితము | స్థూలము |
| నీరు | యంత్రముయొక్క చక్రములు |
| గాలి | గాలిమరయొక్క చక్రములు |
| ఆవిరి | ఇంజను |
| రక్తము | దేహాయంత్రము |

2. అదృశ్యశక్తులు :—అనగా మన మామూలుకంటికి కనబడని శక్తులు. ఈసృష్టియందలి అన్ని పదార్థములును పరస్పరసంబంధము గలిగి యేకీభవించి వర్తించుచుండును. ఈ న్యాయము మన మామూలు కంటికి కనబడు వస్తుచయమునకే గాక కంటికి గనబడని పదార్థములకు గూడ వర్తించును. దృశ్యప్రపంచమునందలి శక్తు లన్నిటియందును పాదరసమువలె చలించు స్వభావముగలదు. ఈ స్వభావమే అదృశ్యప్రపంచమునందలి శక్తులకును గలదు. పైనజెప్పిన సృష్టియొక్క పరస్పర సంబంధము ననుసరించి విద్యుచ్ఛక్తి, వేడిమి, వెలుగు, రంగు, నాడీశక్తి, రాసాయనికశక్తి మొదలగు సునిశిత శక్తులందుగూడ పాదరసమునంటి ఘనీభవించిన ద్రవములుగలవు గాని యీ ద్రవములు స్థూల అణుసముదాయము ననుసరించియు, చలనమునకు ప్రత్యేకించియుండున్యాయమును బట్టియు వర్తించుచుండును.

3. సాధారణముగ దుర్గ్రాహ్యము లనుకొనబడెడి శక్తులు :— దృశ్యప్రపంచమునందలి శక్తులకు గురుత్వము (Weight), చలనము (Motion) గలదు. అదృశ్యములగు విద్యుచ్ఛక్తి, వేడిమి, వెలుగు, కాంతశక్తి, రాసాయనిక శక్తులకును గురుత్వాదులు గలవు. శాస్త్రవేత్తలు తలంచునటుల వీనిని దుర్గ్రాహ్యశక్తులని త్రోసివేయుటకు వీలులేదు. శాస్త్రవేత్తలు వీనిని పదార్థములే గావనియు, కేవలము చలనమునందే వానికి రూప మున్నదనియు వివరింప నభిలషించెదరు. కాని యీ చలనమునకు కారణమేది? వాయుయంత్రమును నడుపు-

శక్తికి గురుత్వము లేదని వారి సిద్ధాంతము. ఆశక్తి దాని రెక్కల చలనమువలన గలుగుచున్న దందురు. ఆరెక్కలను కదలించు వాయువును గురించి వారు యెరుగనే యెరుగరు. గాని అచట వాయువు గలదు. అది తెలిసికొనుటకు వీలయిన పదార్థముగూడ ఒక శాస్త్రవేత్త సునిశితమగు త్రాసుతో వెలుగుయొక్క నీగురుత్వమును గుర్తించెను. వివిధవర్ణముల (రంగు) యందలి శక్తులు అనుభవముచే గుర్తింపబడినవి. సీసాలలో జాగ్రత్తగ చొప్పింపజేసిన వివిధవర్ణములైన తేజఃకిరణములును మందులవలె అద్భుతముగా ఉపకరించినవి. కాంతియందలి వివిధవర్ణములందు గలధర్మములు వర్ణధర్మ పరిశోధక యంత్రము (Spectrascope) తో పరీక్షించి గుర్తింపబడినవి, కాన వెలుగు, విద్యుచ్ఛక్తి, వేడిమి, నాడీశక్తి, కాంతశక్తి మొదలగునవన్నియు, కేవల పదార్థములే యనియు, వానికిని గురుత్వము, చలనము నన్ని పదార్థములవలెనే గలవనియు, అనుభవమును జూచినను ప్రకృతిని పరిశీలించినను గాన్పించుచున్నది.

4. శక్తియననేమి ?:— పదార్థము (Matter), చైతన్యము (Spirit) కలసి ఆదిశక్తి యగుచున్నది. చైతన్యమునందు శక్తియున్నది. పదార్థముతో గలసిన చైతన్యమే విలక్షణమగు శక్తి. శక్తి ద్వివలక్షణము గలదైయుండునని, విశ్వమును పరిశీలించిన గోచరమగుచున్నది.

5. వైహాయసశక్తులు:— వాయుపదార్థములకన్నను తేలికవై అతిసూక్ష్మమై ద్రవలక్షణముగలిగిన శక్తులే వైహాయసములనబడును. ఇవి సాధారణమగు అణుసముదాయముగుండా ప్రవహించునపుడు ఆ అణువుల తీవ్రచలనమువలన మారుచు వేడి, విద్యుచ్ఛక్తి, రంగు మొదలగునవి గలుగుచుండును. ఈ చలనముయొక్క వైఖరినిబట్టియు, వైహాయసముల యొక్క సామర్థ్యమునుబట్టియు వేడి, రంగు మొదలగు వానియొక్క హెచ్చుతగ్గు లేర్పడును. వైహాయసము లన్నిటియందును పదార్థము, చైతన్యమును కలిసియే యుండును. కేవల వైహాయసముగాని, కేవల చలనముగాని యుష్ణాదుల గలిగింప జాలవు. అవి రెండును గలిసిననే యుష్ణాదిశక్తు లుద్భవించును. చిరకాలమునుండియు ప్రకృతిశాస్త్రవేత్తలు విద్యుదాదులు ఒక్కొకప్పుడు కేవలము ద్రవములనిగాని మరొకప్పుడు కేవలము పదార్థములో నుండెడి పరమాణువులయొక్క చైతన్యమనిగాని వేర్వేరుగ జూచుచున్నారు. ఇది యొకేచక్రముతో నడప యత్నించుచున్నట్లున్నది. పదార్థము, చలనము గలసిననే శక్తిగలుగును. రాసాయనిక విధుల ననుసరించి సునిశితశక్తి నాకర్షింప సమర్థముగా తయారు జేసిన (Tissue paper) కాగితముపై సూర్యకాంతిని ప్రసరింపజేసి యాకాగితమును రోగిపైగప్పినచో నందురోగనివారకశక్తిగలదని నే ననేకపర్యాయములు పరిశీలించి స్థిరపరచి యుంటిని. అటులనే రంగు అద్దములద్వారా సూర్యకాంతిని ప్రసరింపజేసిన జలాది పదార్థములందును రోగనివారక శక్తిగలదనుట విదితము. ప్రొఫెసర్

క్రూక్సుగారు కాంతి పదార్థమే ననియు, వైహాయసములు గల వనియును యొప్పుకొనియున్నారు. జంతుకాంతశక్తి (Animal magnetism), మానసికకాంతశక్తి (Psycho-magnetism) వివిధములగు సూక్ష్మశక్తులు, విద్యుచ్ఛక్తి, వెలుఁగు, వర్ణము-యివి యెల్లను సునిశితమగు ప్రవాహములు. మానవదేహము మొదలగు పదార్థములం దివి బ్రవహించుచుండును. మనకు వెలుపలను లోపలను గల వాయువునందెల్ల యీ శక్తులు బ్రవహించుచుండును. జాగ్రత్త గలిగి వాని తత్త్వమెఱిగి బ్రవర్తించినచో నాయా శక్తులను మన యభీష్టానుసార ముపయోగించుకొనవచ్చును. విద్యుచ్ఛక్తి యనబడు సునిశితమగు వాయుప్రవాహము, ఉత్తరదిక్కుగా ప్రవహించుచుండును. కాన యినుప సూదిని ఆవైపునకే చూచునట్లు చేయును. మామూలుగాలి తనవెంట పదార్థముల నిట్టే యీడ్చుకొని పోవుచుండునుగద! విద్యుత్సంబంధమగు సుడిగాడ్పులు (Electric Whirlwinds) అయస్కాంతముచుట్టును వ్యాపించి పదివేలపౌనుల బరువుగల వానినైనను గదలించును. ఇటులనే కాంతి, శక్తి యధికముగా గల యోగులు జనుల ననేకులఁ దమ వంక కాకర్షించుకొన సమర్థులై యుందురు. ఇంత శక్తిగల విద్యుదాదులకు గురుత్వము లేదనుట యసంగతము గాదా?

6. శక్తియొక్క ద్వివిధత్వము :— ఈ గ్రంథమునకు మొదటనే శక్తికి రెండు లక్షణములు గలవనియు మొదటి లక్షణము సునిశితస్వభావము గలిగియుండి రెండవ లక్షణమగు స్థూలస్వభావములో గలసి పని చేయుచుండుననియు

చెప్పియుంటిని. వాయువొక శక్తి. ఇందు సునిశితమగు వైహాయసములుండి ప్రాణవాయువు నందును, నత్రజనియందును నున్న సాధారణ అణుసముదాయముగుండా ప్రవహించుచు శీతోష్ణాదులను గలుగజేయుచుండును. వాయుయంత్రమునందుండు చక్రములను కేవలము వాయువే గదలింపజాలదు. వాయువు, వాయుయంత్రపు రెక్కలను గదలింపవలయు. ఆ చలనముచే లోపలి చక్రములు నడచును. కేవలము రెక్కలు యంత్రమును గదలింపజాలవు. రెక్కలు లేనిచో వాయుయంత్రమును గాలి యేమియు జేయజాలదు. ఈ వైహాయసములే వాయువునందలి చలనశక్తికి గారణము. చలనముచే బుట్టు వేడిమివలన వాయువు తేలికయై పైకి బోవును. బరువగు శీతవాయు వాస్థలమునకు నెట్టుకొని వచ్చును. ఇట్లే వాయువునందు గమన మేర్పడును. ఈవాయువే యోడల నడుపును. భీకరరూపమును దాల్చి గృహములను దలక్రిందుల జేయును. వేడిమివలన వాయువునకీ శక్తి గలుగుచున్నదని-కొంత -అనుచున్నారు. ఇది సత్యదూరమైనది. మన మొక రాతిని విసరితి మనుకొనుడు. శక్తి రాయియందున్నదా? లేదు. చేయి శక్తియందుమా, అది సునిశితమైనది గాదు, కండరములందుమా అవియును స్థూలమైనవే. వీనిని సయితము గదలించి చేతిలో రాతిని విసరివేయించుటకు మూలకారణమైనవి నాడీవైహాయసములు. అనగా దేహమునందలి సునిశితమగు జీవపదార్థము. ఇట్లే రాయి, చేయి, కండరములు — వీనియందు స్థూలతయే యుండుటచే

ప్రకృతి శాస్త్రవేత్త విసిగి సునిశితశక్తిని గానక విద్యుచ్ఛక్తి, కాంతశక్తి, వెలుగు, వర్ణాదులు కేవల చలనములేగాని పదార్థములు గావని నిర్ధారణజేయ సాహసించుచున్నాడు.

ప్రకృతిని బహు జాగరూకతతో బరిశీలించినగోలదిని శక్తి యందలి గుప్తమైయున్న సునిశిత తత్త్వము గోచరమై యనేక విషయములను సక్రమముగా గ్రహింప వీలగుచున్నది.

7. చైతన్యము — పదార్థము :— అణువులయొక్క స్వరూప స్వభావములు పరిశీలించిన గొలందిని అణురహితమై మార్పు పొందనిదై అమరమై యన్నిటికిని మూలమై ప్రాణమై శాశ్వతమై యెల్లప్పుడును స్థితస్థాపక గుణముగలిగి సునిశితమగు అణుసముదాయముగుండా ప్రవహించుచు వాటిని చలింపజేయుటకు భౌతికపదార్థము లన్నిటికంటెను సునిశితమగు బదార్థ మొకటి యుండవలెనని తెలుచున్నది. అణురహిత మగు నీ సునిశిత పదార్థమునే చైతన్యమత గాని జీవమని గాని అందుము. ఈ చైతన్యమే శక్తికి మూలకారణమై ప్రపంచమునకు ప్రాణమై యున్నదని చెప్పునపుడు, పదార్థము లోనికి చైతన్యమును తన యణువులయొక్క శక్తినుండి లాగుకొనుచుండుటచే, పదార్థమునకు సైతము చైతన్యముతో సమమగు ప్రాముఖ్యము నివ్వవలసి యున్నదని నేను గ్రహించితిని. అనగా పదార్థమునకు, జీవము తోడు లేకున్నను జీవమునకు పదార్థము తోడు లేకున్నను యే యొకటియు బని చేయజాలదు. ప్రపంచమునందలి యీ ద్వివిధత్వమును

తెలుసుకొనుటవలన అనేక దోషములు సర్దుబాటు అగును. పూర్వ సాంప్రదాయక వైద్యులు కేవలము మోటైన భౌతిక పదార్థములను నమ్మి యుండుటచేతను, సుప్రసిద్ధుడైన హానిమాన్ శక్తియంతయు జీవమునకే గలదని నమ్మి యుండుట చేతను గొప్ప లోపములు జరిగెను. దైహిక పరిస్థితులను అప్పుడప్పుడు జీవశక్తులచేత ప్రచండముగా మార్పు జేయు గలము. అటులనే దైహికావయవముల ద్వారా మనస్సునందు మార్పు కలిగింపవచ్చును.

ఉదాహరణము :— మానసిక స్తబ్ధత సారాయి మొదలగు యోషధుల స్వీకరణమువలన గలుగుచున్నది. తలకు దగిలిన దెబ్బలకు మందులు మొదలగు వాటివలన మనస్సు చెడిపోవు చున్నది.

రెండవ కిరణము

# శక్తియొక్క రెండు గొప్ప విభాగములు

శక్తుల లన్నిటిని రెండు భాగములుగ విడదీయ వచ్చును. 1. వేడియందు వలె వ్యాకోచము (Expansion) కలిగించు శక్తులు, 2. శైత్యమునందువలె సంకోచము (Contraction) గలిగించు శక్తులు.

శక్తులు.

1. ఉష్ణము:— అణుపంక్తికి చుట్టునున్న వాహికలగుండా సునిశితమగు వైహాయసములు ప్రసరించినపుడు యెంతవడిగా బ్రసరించుచుండిన, నంత యెక్కువ యుష్ణమును కలిగించును. అప్పుడా వైహాయసములు ఉష్ణకారులగును. ఏవాహికలద్వారా నవి ప్రసరించునో యా వాహికలు యుష్ణతత్త్వము అగును. రెంటియొక్క చేరిక వేడిని గలిగించును. సూర్యకాంతి యందలి వేడిలోని తారతమ్యములు కంటికి కాన్పింపవు. వైహాయసములు అణుసంబంధమగు వలయములు సునిశితమైనప్పుడా కాంతి యెరుపుగ నారింజపండు వర్ణములుగ గాన్పించును. సూర్యకాంతియందున్న యుష్ణమునందు తారతమ్యములు గలవు. మానవదేహమునందలి మిక్కిలి సునిశితమైన జీవశక్తులు స్థూలదృష్టికి రంగువలె కాన్పింపనంతటి సునిశితమై యుండును. వేడిని గొలుచు యంత్రములతో వీనిని గొలువలేము. కాని సునిశితస్వభావముగల మానవుల కిది వెంటనే

యనుభవమగును. ఈ క్రింద చేర్కొనబడినవి శక్తియందలి యుష్ణవిభాగమునకు జెందినవి.

అగ్ని; ఆవిరి; వేడిగాలి; వేడినీరు; అయస్కాంతము నందలి దక్షిణపుచివర; విద్యుద్యంత్రమునందలి వ్యతిరేకపు చివర; హైడ్రోజము; క్షారమగు లోహములు; శుద్ధరక్తము; దేహము నందలి ఎడమభాగము; శిరస్సు; చెట్లయొక్కయు, కొమ్మల యొక్కయు భూమిపైపుననుండు భాగము; స్ఫటికముల యొక్క సన్నని చివర; ఎరుపు - నారింజపండు వర్ణము; పసుపువర్ణము; పసుపు - ఆకుపసుపు కలిపిన వర్ణములు; విరే చనకారులు; వాంతికరములు; తియ్యదనము; ఆవాలు; అల్లము మిరియాలు మొదలగునవి; క్రొవ్వు పదార్థమునందలి అంగా రము; దేహమును కంగునట్లు చేయునవి; స్వేదము కలిగించు నవి; జ్ఞాననాడులు: పొటేసా, అమ్మోనియా (నవాసారము) ల వంటి క్షారములు; ఎడమచేతి వేళ్లు.

2. విద్యుచ్ఛక్తి లేక శీతము:—అణుపంక్తియొక్క మధ్య గా వైహాయసములు ప్రసరించి అణువులను ముడుచుకొనునట్లు చేయును. ఇందువలన గలుగు పరిణామమే విద్యుచ్ఛక్తి లేక శైత్యము అనబడును. భూమియొక్క ధృవప్రాంతములయందు దీ విద్యుచ్ఛక్తి యనబడు శీతము అత్యధికముగానుండును. అణు వులలోని వాహికలగుండా ప్రవహించు వైహాయసముల తార తమ్యమువలన వివిధరకముల విద్యుచ్ఛక్తి గలుగుచున్నది. విద్యుచ్ఛక్తి యెక్కువగా నుండు చన్నీరు, మంచు, తుషా

రము, శీతగాలి మొదలగువానియందు సునిశితములు గాక మున్నగైన వైహాయసములు ప్రవహించుటచేత మనకు శైత్యానుభవము గలుగుచున్నది. విద్యుద్యంత్రమునందలి శైత్యము అనేకులకు గోచరింపదు. కాని సునిశిత స్వభావముగల వారలకిది అనుభూతమగును. సూర్యకాంతియందలి శైత్యము పైయంత్రమునందలి శైత్యమునకన్న సునిశితమైన దగుటవలన కంటికి ఆకాంతి నీలము, నీలిమందువర్ణము, ఊదారంగుగా మాత్రమే గోచరించును. పైకాంతియందు సహజముగనే శైత్యస్వభావ ముండుటచేత రంగులు బలమును వృద్ధిజేయుటయు, వేడిమిని తగ్గించుటయు, ఆయాసము తగ్గించుటయు, తాపమును బాధను పోగొట్టుటయు, వేడినాడులను రక్తమును సౌమ్యపరచుటయు గలుగుచున్నది. సూర్యకాంతి యందలి యీ రంగులయొక్క శీత స్వభావమును వేడినికొలుచు యంత్రములు కొలువలేవు. అయినను మిక్కిలి సునిశితమైన యీ శీత శక్తులను మన కన్నులు నీలము, ఊదారంగులుగా చూడగల్గుచున్నవి. మానవునియం దుండు అత్యంత సునిశితమగు ఆత్మీయశక్తులే మానసిక విద్యుచ్ఛక్తి, మానసిక కాంతశక్తి అని చెప్పబడును. ఈ శక్తులుగలవారు అసంఖ్యాకములగు వ్యాధుల నత్యద్భుతముగా కుదిర్చియున్నారు.

ఈ క్రింద బేర్కొనబడినవి శక్తియందలి శీతవిభాగమునకు జెందినవి:— మంచుగడ్డ; చల్లనినీరు; చల్లనిగాలి; అయస్కాంతమునందలి ఉత్తరపుచివర; విద్యుద్యంత్రము నందలి సవ్యపుచివర; గంధకధుమ్రము, శంఖద్రావకము మొదలగు

దావకములు; నీలము- ఆకుపసుపు; నీలము- ఊదా; ఊదా వర్ణములు. మురికిరక్తము; దేహమునందలి కుడివైపు - సాధారణముగా పాదములు; చెట్లయొక్కయు, కొమ్మలయొక్కయు ఆకాశపువైపుభాగము; స్ఫటికములోని వెడల్పైన భాగము; దేహమునందు పైన ప్రవహించు స్థూలనాడీశక్తులు; ప్రాణవాయువు; పుల్లని ఫలములు; బలవర్ధకములును; వేడిమిని, ఆయాసమును, బాధను, తాపమును తగ్గించునవి; కుళ్ళునావునవి; లోహకాంతశక్తి; కుడిచేతి వ్రేళ్లు.

సునిశితతత్వము గలవారి కణతల సమీపముగా స్ఫటికముల యొక్క వెడల్పైన భాగములుగాని, అయస్కాంతము యొక్క ఉత్తరపు చివరగాని, కొమ్మయొక్క చివరలుగాని, కుడిచేతిచివరగాని యుంచినయెడల వారి మెదడునకు శాంతియు చల్లదనమును చేకూరును. వారి ఎడమచెయ్యి పై జెప్పిన పదార్థములయొక్క రెండవవైపున నుంచినయెడల మానసికోద్రేకము గల్గి ఒక్కొక్కప్పుడు అత్యంతమగు కోపమును బొందెదరు. రోగి దేహములోనికి బ్రసరింపజేయగల యీ శక్తులను పూర్వసాంప్రదాయ వైద్యులు తెలిసికొనినయెడల నాడీవ్యాధులను గుదుర్చుటలో వారికి గల అసామర్థ్యము తొలగిపోయి యుండెడిది.

3. కాంతశక్తి :— ఆంపియర్ చెప్పినట్లు వలయములుగా నేర్పడిన విద్యుచ్ఛక్తియే కాంతశక్తి. లోహములో నున్న అణువులయందలి కేంద్రభాగమునందలి ప్రచండమగు స్వీక

2

రణశక్తిచే విద్యుచ్ఛక్తి అసంఖ్యాకములగు సుడిగుండము లుగా నేర్పడుచున్నది. సుడులుగా దిరుగని విద్యుద్వాహికలు గూడ కొన్ని యుండును. వానిలో బలమైన విద్యుత్ప్రవాహ ములు దక్షిణపుచివర నారంభించి ఉత్తరపు చివరకు చేరు కొనును. ఇతరములగు బలహీనములయిన విద్యుద్వైహాయస ములు పైదానికి వ్యతిరేకముగా వ్యాపించుచుండును. అన్ని వస్తువులయందును, అన్ని జంతువుల జీవమునందును హెచ్చు తగ్గుల భేదములతో నీ కాంతశక్తి యుండును. వస్తువులద్వారా నిలువుగా గాక వ్యతిరేకముగా వైహాయసములు వ్యాపించి నపుడు అది వ్యతిరేకకాంతశక్తి (Dia-Magnetism) అని పిలువబడును. అదిగూడ అన్నివస్తువులు, జంతుజీవములయం దుండును. ఇది మిక్కిలి మందముగా పనిచేయుచుండును.

ఇనుమునందును, ఉక్కునందును నుండి పనిచేయు కాంతశక్తికి అయస్కాంత శక్తియని పేరు. జంతుజీవములందుండి పనిజేయు నింకొక రకపు కాంతశక్తికి జాంతవశక్తి అనిపేరు. ఆత్మీయ మానసిక సంబంధమైనదై సునిశితమును, నుత్తమమును నగు వైహాయసములతో సంబంధించిన శక్తికి మానసికశక్తి, ఆత్మ శక్తి తపశ్శక్తి యనిపేరు. స్త్రీలయందు యీశక్తిగుప్తమై వ్యతి రేకముగా నుండును. పురుషులయందు ఈశక్తులు బహిర్గతమై సవ్యమైయుండును. కనుకనే యిదివరకు బేర్కొనిన నియమ ముల ననుసరించి ఒకేవాతావరణమునందు, పాఠశాలలందును దేవాలయము లందును, సంఘములందును, శుభాశుభకార్య ములపట్లను కలిసి తిరుగుటవలన ధాతుశక్తులు అభివృద్ధియై

సరళమగును. ఉభయులకును నైతికపారిశుద్ధ్య మేర్పడును. మతగురువులు, ఆశ్రమములు, ఒకతెగ మరియొకతెగను విసర్జించి యేకాంతముగ జీవించుటవలన అవనతియు తుదకుదుఃఖమును గలుగుచున్నది. సూర్యకాంతశక్తి ప్రపంచమునందలి వృక్ష, జంతు జీవములను ఉజ్జీవింపజేయుచున్నది. రోగముల నివారించుటలో మానసికశక్తివలెనే సూర్యకాంతశక్తి మిక్కిలి ప్రభావయుత మైనది.

4. దివ్య విద్యుచ్ఛక్తి:— భూమిసంబంధమైన శక్తుల కనుగుణముగా మనము జీవింపగలుగునంతవరకును మనకు పరిపూర్ణారోగ్యము గలుగదు. బారన్ రేచిన్‌బాక్ దివ్యశక్తులను గురించి అసంఖ్యాకములును, సుప్రసిద్ధములునగు పరిశోధనల జేసెను. సునిశితస్వభావముగల వ్యక్తులు దక్షిణపువైపు పడమటవైపు తలనుంచుకొని నిద్రించుటవలన నాడీమండలమునందు చలనము గలిగినదనియు, మందుయొక్క శక్తులు నశింపజేయబడినవనియు నతడు ఋజువు పరచెను. ఉత్తరముగా తలనుంచి వారిని బరుండజేయుటచే వెంటనే వారికి శాంతి గలుగుచుండెననియు నాతడు గనిపెట్టెను. దక్షిణముగను పడమటగను తలనుంచుకొని కొలదినిముసములే పరుండినను, వారిలో నింకను మిక్కిలి సునిశితమైన స్వభావముగలవారికి ఈడ్పు గలుగుచుండెను. కాని పైవిషయములలో బారన్ రేచిన్‌బాక్ గారికి తగినంత అనుభవము లేకుండుటవలన వారి యభిప్రాయములు సమంజసములుగ దోచవు. భూమియొక్క ధ్రువప్రాంతములకు భూమియం దెచ్చటనున్న శీతమైనను ప్రచండవేగముతో

లాగివేయబడుచుండును. ఇట్లుత్తరార్ధగోళమునందు ఉత్తరధ్రువమునకును, దక్షిణార్ధ గోళమునందు దక్షిణ ధ్రువమునకును ప్రచండవేగముతో విద్యుచ్ఛక్తి ప్రయాణము చేయును. తలలో రక్తమును, వేడియును నధికముగా నుండునుగాన దిక్సూచి యంత్రములోని సూదిని ఉత్తరాభిముఖముగా లాగివేయునట్టి శీతశక్తులు తలకు తగులుట అవసరముగాన ఉత్తరార్ధ గోళములోనివారు తలయుత్తరపు దిక్కుగను, దక్షిణార్ధ గోళములోనివారు తల దక్షిణపు దిక్కుగను నుంచుకొని నిద్రించవలయును. ఈశాన్యపు దిక్కుగా తల నుంచుకొని నిద్రించుటవలన నెక్కువ మేలు గలుగును. అందువలన తలకుత్తరపుదిక్కున నున్నట్టియు, తూర్పుదిక్కున నున్నట్టియు శీతశక్తులు తగిలి మేలు గలుగును. లండను, ప్యారిసునగరములలో దిక్సూచియంత్రము చూపుదిక్కులలో కొద్ది భేదము గలదు. కనుక పైసూదిమొన చూపినవైపును పూర్తిగా అతిక్రమింపరాదు. వివిధదేశములలోని విద్యుచ్ఛక్తియొక్క ప్రవాహములయందలి భేదములవలన నీతారతమ్య మేర్పడును. మిక్కిలి బలము గలిగి మెదటితో బనిచేయని పాటకపు జనులు తల లెట్లుంచుకొని పరుండినను వారికి సౌఖ్యమే కలుగును. కాని వారిలో చాలమంది యెల్లప్పుడును తప్పుదిక్కుగానే పరుండుచుండినయెడల వారినాడీమండల ముద్రేకస్వభావము గలదగును. మానసికశక్తులు మాంద్యమై రక్తము నాడీశక్తి మెదటిలో లోపించియున్నవారికి దక్షిణము, పడమట తల నుంచుకొని నిద్రించుట మేలు గలుగుట నిజమే.

పడమటవైపునకు లనుంచుటవలన నరముల శక్తియు దక్షిణపు వైపునకు తల నుంచుటవలన రక్తమును నెక్కువగ నుద్రేకించును.

5. ఘర్షణవిద్యుచ్ఛక్తి:— చర్మముమీద చేతులతో తడుముట వలనను కుంచెల నుపయోగించుటవలనను ముతకతుండు గుడ్డలు చేతులతో చఱచుటవలనను, సాగునట్టియు చదరమైనట్టియు కర్రతోగాని, సారముల్లుతోగాని కండమీదకొట్టుట వల్లను, గిల్లుట మొదలగు వానివల్లను, వేడిమితో గూడిన ఘర్షణవిద్యుచ్ఛక్తిని ఉద్దీపింప జేయవచ్చును. చేతియందు కాంతశక్తిని వ్యాపింపజేయు స్వభావము సైతముండుటవలన కేవలము ఘర్షణవిద్యుచ్ఛక్తిని నుద్దీపింపజేయు నే కృత్రిమోపకరణమును దీనికి సాటిరాదు. కేవలము విద్యుచ్ఛక్తి మిక్కిలి స్థూలస్వభావము గలది. దేహముపై భాగము నంటి వ్యాపించు నాడులవరకు మాత్రమే యీ శక్తి వ్యాపించును. కాని చర్మక్రియ నుద్దీపింపజేయుట కిది మిక్కిలి అసామాన్యమైనది. అంతరవయవములలో పేరుకొని మంటలను గలిగించునట్టి మాలిన్యమును వెలువరించుటద్వారా చర్మక్రియ యుపయోగకారి యగును. సునిశితమగు నాడీమండలము గల వారికీ శక్తివలన నుద్రేకము గలుగును. కాంతశక్తిని వృద్ధి చేసికొనిన వారి చేతులయందు అత్యధికమగు శక్తియుండును. సామాన్య మానవులయందునయితే మిది కొలదిగా నుండును.

6. శీతపదార్థములు, ఉష్ణపదార్థములు:— కొన్ని రంగులు గలపదార్థములు వేడిచేయుననియు, కొన్నిరంగులుగల

పదార్థములు చలువజేయు ననియు వెనుక దెలిపియున్నాను. ప్రపంచములో నున్న పదార్థములలో సూర్యకిరణములలో నుండి విడదీసిన రంగులు గాని ఘనపదార్థములు గాని వాయు పదార్థములుగాని వేనియందు ఎరుపు, నారింజపండువర్ణము, పసుపు వర్ణములు ప్రధానముగ నుండునో నా పదార్థములు వేడిశక్తుల తెగలోనివి. అటులనే యే వస్తువులయొక్క నిజ తత్త్వము నీలము, నీలిమందు వర్ణము, ఊదావర్ణముల గలిగి యుండునో నవి యెల్లను శీతశక్తులకు సంబంధించిన విభాగ ములు.

ప్రకృతియందు పరస్పర వైరుధ్యము లేదు. ఎరుపుశక్తివలనను మెరపపండు నందును మంటలుపుట్టు స్వభావ మున్నప్పుడు, యెర్రని సూర్యకిరణమునందుగాని, ఎరుపు ప్రధానముగా గల పదార్థములందు గాని అదే మంటలు పుట్టించు స్వభావ ముండును. అట్లనే ప్రపంచములో నెచ్చట కాన్పించినను నీలి వర్ణముగలవి వేడిమిని తగ్గించునవిగా నుండును. కాని వస్తు వులయొక్క శక్తిపైన స్థూలదృష్టికి కాన్పించువాని వర్ణముపై నాధారపడియుండదు. మద్యసారము (Alcohol) మొదలగు పదార్థములు కొన్ని వాయువులు చూచుటకు వర్ణము వేరుగను గుణము అందుకు భిన్నముగను నుండుటగూడ గలదు. కొన్ని పైకి నల్లగను, తెల్లగను నుండవచ్చును. అట్టి స్థితు లలో వానిని కాంతివంతము లగునంతవరకు వెచ్చచేయ వలయును. ఈ కిరణములను వర్ణ వివేచక యంత్రము (Spectro - scope) ద్వారా ప్రసరింపజేసినయెడల వాని

యొక్క నిజవర్ణములు బైటపడును. పొటాసియమ్ తెల్లగా నుండును. దానియందు మిక్కిలి ముత్కైన ఎరుపు స్వభావ మున్నది. అందువలననే పొటాసాలో కాలుస్వభావ మున్నది. హైడ్రోజను (Hydrogen) పారదర్శకమగు (transparent) పదార్థము. దానియందు మిక్కిలి బలమైన ఎరుపురంగున్నది. ఎరుపు — (నారింజపండువర్ణము) ఇందలి సరియైన వర్ణము.

మద్యసారము, అమ్మోనియా, మొదలగు హైడ్రజనుప్రధానముగాగల పదార్థములయందలి దహనస్వభావమును గుర్తింప వచ్చును. ప్రాణవాయువు పారదర్శక (Transparent) మగు నొకగాలి. దానియందు నీలము, నీలిమందువర్ణము ప్రధానమగు వర్ణములు. మిక్కిలి శీతస్వభావము గలది. హైడ్రోజను వేడిస్వభావము గలదిగదా. ద్రావకముల (Acids) లోని వేడిని తగ్గించునట్టియు సంకోచపఱచునట్టియు స్వభావము వానియందు ప్రాణవాయు వుండుటవలన గలిగినదే.

రాసాయనిక అనురాగము (Chemical affinity) యొక్కతత్త్వ మెరుగక పోవుటవలననే ప్రాణవాయువు వేడిపదార్థమనియు, మిక్కిలి వేడిమిని కలిగింప సాధ్యమైన దగుటవలన విద్యుచ్ఛక్తిని ఉష్ణశక్తియనియు శాస్త్రజ్ఞులు పొరబాటుగా భావించుచున్నారు. ప్రాణవాయువుయొక్క నిజవర్ణము వర్ణవివేచక యంత్రములో శీతవర్ణములకు సంబంధించినదే యని వారికి తెలియును. విద్యుచ్ఛక్తియందు సంకోచ శక్తి యుండుటయు వారెరుంగుదురు. ధ్రువప్రాంతములయందు విద్యుచ్ఛక్తియు కాంతి

శక్తియు అత్యధికముగా నుండునని వారెరుంగుదురు. విద్యు ద్యంత్రముసమీపమున శీతము సునిశిత మైనదగుటవలన మామూలునాడుల కాచల్లదనము తెలియదు. అందువలన విద్యుచ్ఛక్తియు శీతమును అవినాభావసంబంధము గల వని వారు గ్రహింపలేకున్నారు. సునిశితతత్వము గలవారందరికిని అయస్కాంతము (Magnet) యొక్క ఉత్తరపుచివరయందును, విద్యుద్యంత్రముయొక్క సవ్యఅగ్రమునందును చల్లదనమును అనుభవించెదరు. నీలికాంతిప్రసారమువలన వేడిని గొలుచు యంత్రములోని పాదరసము దిగిపోవును. రాసాయనికానురాగ మను పేరుగల యీ క్రింది కిరణములో, ఈ కిరణములో పేర్కొనబడిన అద్భుతములను, శీత మెట్లు వేడిమిని, వేడిమి యెట్లు శీతమును కలిగించునో ఆ విషయమును వివరించెదను.

మూడవ కిరణము

# రాసాయనికానురాగము

## (Chemical Affinity)

ఒకేపరిమాణము గల్గి వివిధరూపములు గల్గిన అణువులలో, మిక్కిలి వైశాల్యమును పెంచు నుష్ణశక్తి లోకవంకను, మిక్కిలి సంకోచమును గలిగించు శీతశక్తు లోకవంకను, నుండి ఒక జాతియణువుల కేంద్రమందలి స్వీకరణశక్తి వేరొకజాతి అణువుల కేంద్రములందలి స్వీకరణశక్తిని ప్రచండవేగముతో నాకర్షించి ఒకజాతియణువులతో వేరొకజాతి యణువులు కలిసికొనిపోవుటను రాసాయనికానురాగ మందురు.

1. ఉదాహరణములు:— ప్రాణవాయువులో నున్న నీలమైన శీతాణువులు హైడ్రజములోని యెర్రని ఉష్ణఅణువులతో కలియుటచే జల మేర్పడుచున్నది. క్లోరైన్ లోని పసుపు, ఆకుపసుపు వర్ణములు గల అణువులు సోడియంలోని తెల్లని అణువులతో చేరుటచే సోడియమ్ - బైకార్బొనేట్ అను మిశ్రమపదార్థ మగుచున్నది. వేడియణువులలో శీతాణువులు చేరిన ట్లెట్లు గుర్తింపవచ్చు ననగా, నన్నని వస్తువులను లావు వస్తువులు ఇముడ్చుకొనును. ఇంకొక సంగతివలన నిది యింకను స్పష్టముగా తెలియగలదు. ఉప్పులో అనగా సోడియమ్బైకార్బొనేటులో నున్న శీతాణువులవర్ణము లోపించి ఉష్ణాణువుల వర్ణములు పైకి కాన్పించును. క్లోరియంలోని వర్ణశక్తులు సోడియం అణువులందలి తెల్లని కోశములలో చేగి

పోవును. కార్బనేట్ ఆఫ్ సోడాలో నున్న నల్లని అంగారమును సోడియంలోని తెల్లని అణువులు మ్రింగివేయును. చిరకాలము నుండి రసాయనవేత్తలను తికమకపెట్టిన విచిత్ర విషయము లిట్లు స్వాభావిక మగు వివరణచే విడిపోవుచున్నవి. నీలము-ఆకుపసుపు, నీలము- నీలిమందు వర్ణము, మిక్కిలి బలమైన రంగులు. అంగారము మొత్తముమీద ఉష్ణజాతికి చేరినదే యైనను పొటాసియమ్-సోడియమ్ వంటి క్షారధాతువుల కన్న శీత మయినది. ఉష్ణాణువులు తక్కువగా నుండి శీతాణువులు ఎక్కువగా నున్నప్పుడుమాత్రము శీతాణువులు వెలుపలనుండి ఉష్ణాణువులు లోపల చేరుటయును గలదు.

2. అభిప్రాయములు:—మనశాస్త్రవేత్తలు ఈ విషయమై ఎక్కువ పరిశోధనలను జేసి విజ్ఞానమును సంపాదించియున్నను అనేకమగు ముఖ్యసూత్రములను వారింకను గ్రహింపలేకనే యున్నారు. డాక్టర్ అట్ఫీల్డు (Dr. Attfield) తన రసాయన శాస్త్ర మను గ్రంథములో నిట్లు వ్రాసిరి. "ఇతర శక్తులవలెనే రాసాయనిక శక్తులను వివరించుట దుర్ఘటము. రెండువస్తువులు కలిసినప్పు డొకవస్తువుయొక్క వర్ణము లోపించుట విచిత్రమే" T. B. Barkas, F. G. S. గారు ఇట్లు వ్రాసెను. "సృష్టిలోని యితరశక్తులవలెనే రాసాయనికానురాగమును వివరించుట దుర్ఘటము." ప్రొఫెసరు 'రాబర్టు హంటు' యిట్లు చెప్పుచున్నాడు. "ప్రకృతిశాస్త్రములందు గర్వోక్తితో గూడుకొన్న మన అభివృద్ధి యొకవంక నున్నను పదార్థములయొక్క ఆంతర్య స్థితులనుగురించి మనకింతవరకును విస్పష్టము గాలేదు. అణు

సంబంధమైన శక్తులు మన భావమునకు అందనివిగా నున్నవి." "మనకు అణుస్వభావము తెలియదు." అని 'ఫెరడే' చెప్పినాడు. సృష్టియందలి శక్తిస్వభావము ననుసరించి మనము వర్తింప నారంభించినచో నీ విషయములు కేవలము సామాన్యవిషయము లనియు, మానవులకు ఊహాతీతములు కాకుండుననియు ఈ సుప్రసిద్ధులకు సూచించుచున్నాము. సృష్టియందలి సత్యసిద్ధాంతములపై నాధారపరచిన తప్ప మందు మొదలగు శాస్త్రము లన్నియు నానాటికి మార్పునొందు నట్టివిగానే యుండగలవు.

3. రాసాయనికముగ సమ్మేళనము నొందక కేవలము వాతావరణములోని ప్రాణవాయువు హైడ్రిజము, నవాసారవాయువులవలె కలిసియుండుట, ఒకే చిత్రములో సమ్మేళనము నొందక కలిసి కాన్పించు వివిధవస్త్రములవలె నుండును. వాతావరణమునం దుండి కొలదిగ కలిసియుండి మానవ జీవనాధారములగు ఈ వాయువులే రాసాయనిక సమ్మేళనము నొందిన యెడల మానవప్రాణహారము లగు నైట్రోజన్ ఆక్సైడ్సువంటి విషములుగా నేర్పడును.

4. రాసాయనికానురాగమువలని గొప్పలాభము:—రాసాయనికానురాగమునందు ఒక్కవిషయమున నున్న ఆధిక్యము దానికి వ్యతిరేకమగు విషయముయొక్క సమ్మేళనముచే సమరసపడును. అట్లే కానియెడల ఈ విశ్వమునందలి పదార్థము లన్నియు అధికోష్ణమువలనగాని అధికశీతలమువలనగాని

ఆందోళనము నొంది అతిఎరుపువలన మంటలను అతినీలము వలన మాంద్యమును ఈవ్వును గలిగి నాశనము నొందియుండ వలసినది. వేడిరక్తములో నున్న ఎరుపువర్ణముయొక్క అధిక సంచలనమువలనను, నాడులలోని పసుపుధాతువువలనను ఉద్రిక్తస్వభావము గల్గి పిచ్చిఏర్పడిన రోగులకు నీలము, ఊదా రంగులను ఇంటికప్పుయొక్క లోపలిభాగమున చిత్రించి అందు కూర్చుండబెట్టుటవలన గంటలలో కొందరికిని, దినములలో గొందరికిని, వర్ణసామరస్యమువలన రోగనివారణమైన విష యము లనేకములు వివరింపవచ్చును. నీలిధాతువు ఎక్కువగా నుండి రక్తవాహికలు నీలమై గోళ్ళు నీలిరంగు గలిగి ముఖ కాంతి తగ్గిపోయి నిరాశగల్గి పనియందు బద్ధక మేర్పడి నశించి పోవ సిద్ధముగా నున్న రోగులకు ఎర్రని అద్దములో నుండివచ్చు వెలుతురు గలిగి ఎర్రని రంగుగల పైకప్పు లోపలి భాగము (Ceiling) గల యింటిలో ఒక్కదినము కూర్చుండబెట్టుటచే నూతనోజ్జీవము గలిగి ఆరోగ్యము, ఉల్లాసము గలిగినది. రంగులకు సంబంధించిన ఈ నియమము మందులకు సైతము చెల్లునని ముందు తెలిసికొనగలరు.

5. వేడిమియు చల్లదనమును:—ఒకదాని నొకటి ఎట్లు వృద్ధి బొందించునో వివరింపవలసి యున్నది. ఇదివరకు చెప్పినట్లు విరుద్ధస్వభావముగలవి యొకదానినొకటి ఆకర్షించును. శీతోష్ణ ములు ఒకదానినొకటి ఆకర్షించుకొనును. శీతమై తేమగల ప్రదేశములలో శుద్ధరక్తములోని హైడ్రజము మొదలగు ఉష్ణధాతువులు, గాలిలోని ప్రాణవాయువు చల్లదనముల

వలన నుద్దీపనము నొంది ముఖమునకు ఎక్కువ ఎఱ్ఱదనము గలుగును. గాలిలో వ్యాయామము చేయువారికిది యింకను ఎక్కువగా గలుగును. కొవ్వుపదార్థములలోని అంగారమును ఉష్ణధాతువు శీతవాయువువలన సులభముగా జీర్ణమై రక్తము లోనికి చేరిపోవును. ఉష్ణమండలములందదేపదార్థము పైత్య కోశమునందు జేరి దేహమునకు భారభూత మగును. ఉష్ణమండల ములో పెరిగిన గోధుమలు యవలు మొక్కజొన్నలు మొద లగు ధాన్యములు శీతమండలములో నిలువక చెడిపోవును. అవే ధాన్యములు శీతమండలములో పెరుగునప్పుడు పిండి పదార్థముగా అంగారమును భాస్వరము మొదలగు ఉష్ణ ధాతువులను ఎక్కువగా స్వీకరించుటచే ఎక్కువ కాలము నిలువయుండ గలుగును. వాతావరణమునందుండి సూర్య కాంతియొక్క సాహాయ్యమువలన ఈధాన్యముల యొక్క ఆకులకును శీతవాతములచే గలిగిన సమ్మేళనమువలన రాసా యనికముగా ఉష్ణశక్తులను స్వీకరించును. స్పెయిను మొద లగు వేడిదేశములలో పెరిగిన నీరుల్లి ఇంగ్లండు మొదలగు శీతలదేశములో బెరిగిన నీరుల్లికంటె తక్కువ కారముగను తక్కువ వేడిచేయునదిగను నుండును. ఇట్లు ప్రకృతి మన అవసరములవెంట విచిత్రముగా వర్తించుచున్నది. మన శాస్త్రవేత్తలకు రాసాయనికానురాగముయొక్క మర్యాద తెలియకపోవుటవలన ప్రాణవాయువువంటి నీలి తత్వము గలది, రాసాయనికసమ్మేళనమునందు ఎరుపురంగు గల దగుటయు; పొటాసియమువంటి ఎరుపుధాతువు గలిగిన

క్షారపదార్థము, రాసాయనిక సమ్మేళనమునందు నీలి వర్ణముగల దగుటయు వివరింపసాధ్యముగాని విషయము లుగా నేర్పడినవి. వ్యతిరేకపదార్థములయందు మాత్రమే, అమ్లపదార్థములకును క్షారపదార్థములకు మాత్రమే, శీతోష్ణ వర్ణములకు మాత్రమే, సామరస్యము గలుగు ననిగుర్తించు కొనినచో ఊహింప సాధ్యముకాని ఈ వైచిత్ర్య కార ణము తీరిపోవును. ఎరుపు- నీలమును; పసుపు- ఊదావర్ణము; నారింజపండువర్ణము- నీలిమందువర్ణము- వీనికి పరస్పరాను రాగము గలదు. లిట్మస్ (Litmus) కాగితము ద్రావకములో నుంచిన యెడల ద్రావకమునందు ప్రాణవాయు వుండుట వలన కాగితము ఎర్రబడును. ఇట్లే ఆ కాగితమును క్షారము లయం దుంచినపుడు వానియందు ఎరుపు పసుపు ధాతువు లుండుటవలన ఆ కాగితము నీలముగా గాని ఊదావర్ణముగా గాని మారును. ఇట్లు శీతము ఉష్ణమును, ఉష్ణము శీతమును వృద్ధిచేయును. కాని ఒక సంగతి జ్ఞాపకమునం దుంచుకొన వలయును. ఎరుపుధాతువు అసలే లేని పదార్థములో నీలమగు ప్రాణవాయువు సమ్మేళనము చేసినను వేడి గలుగదు. అంగారమువంటి వేడిస్వభావము గల పదార్థముతో సమ్మే ళనము నొందినప్పుడు ప్రచండమగు వేడిమియు వెలుతురును గలుగును. దీనినే మానవదేహమున కనువర్తింప జేయుదు. వేడితత్త్వముగల యెర్రని దేహముగల యెర్రని శుద్ధరక్తము గల ఒక మనిషి కలడు. వానికి శీతోదకస్నానముగాని శీతోదకపానము గాని చేయించినయెడల వాని దేహమునం

దున్న ఉష్ణము ఈ శీతోదకమువలన కొంచెముగ ఉద్దీపనము నొంది మిక్కిలి వేడిమి గలుగును. వానికి నిద్ర లేచుట తోడనె ప్రాతఃకాల శీతోదకస్నానము చేయించినయెడల మిక్కిలి మేలు గలుగును. ఒకనికి నీలిధాతువు ప్రబలమై, శుద్ధ రక్తము కంటె అపరిశుద్ధరక్తము అధికమై, కాంతివిహీనమై యున్నాడు. వాని దేహములోని నీలిధాతువునకు సరిపోయిన ఉష్ణధాతువు లేదు. శీతోదక మనిన భయపడును. విద్యు ద్యంత్ర సమీపమునందలి శైత్యమునుసయితము మతడు భరింప లేడు. వేడినీరో, ఎర్రని కాంతియో, ఇతరమైనయే వేడిచేయు విధానమైనను వానియందలి వేడిమిని ఉద్దీపనము చేసి ఆరోగ్య మును శక్తిని గలిగించును. ఒకని కేది యమృతమో ఇంకొకని కదియే విషముగా పరిణమించుట దీనివలన కాన్పించుటలేదా! విరుద్ధప్రకృతులు గల ఇద్దరికి ఒకేరకపు మందు వాడుట మూర్ఖత్వము గాదా!

మంచుగడ్డ, చన్నీరు వాడుటవలన క్రమక్రమముగా ఉష్ణా ధిక్యమును దేహమునకు గలిగించుటకును, వేడినీటిని వాడుట వలన నానాటికి వేడిమిని తగ్గించుటకును ఏ ముఖ్యసూత్రము నవలంబింపవలయును? పై నుదహరించినసూత్రమే ఈప్రశ్నకు సహితము వర్తించును. ఉష్ణాధిక్యముగల యొకవ్యక్తిని హిమ శీతలమగు జలములో నిలువయుంచగా నుంచగా, నీటి లోని శైత్యమునకు ప్రతీకారము చేయగల ఉష్ణమే లేకుండ పోవును. రెండు విరుద్ధవస్తువుల యొక్క (శీతోష్ణములు) స్వభా వములు సామరస్యమును బొందినయెడల వాని కన్యోన్యము

ప్రతీకారము గలుగదు. కనుక ఒకదానియందున్న ఉష్ణమును వృద్ధిచేయ దలచుకొనినపు డందలి యుష్ణము తగ్గిపోవునంత తీవ్ర శైత్యోపచారము చేయరాదు. ఒకతూరి కొలదికాలము నీటిలో మునుగుటయో, ఈదుటయో, నీటిని ఒడలిపై పోసికొనుటయో, చేయుటవలన దేహమునందలి యుష్ణము ఉద్దీపనము బొందును. అనగా రాసాయనిక ప్రతీకారము జరుగును. దీర్ఘకాలము నీటిలో నున్నపు డట్టి రాసాయనిక ప్రతీకారము జరుగక పోవును. ఫిలడల్ఫియాలో 'జెనరల్ప్లజన్టన్' గలడు. తన ద్రాక్షతోటకు అతడు పైకప్పుగా అద్దములను గప్పెను. అందులో ఏడువరుసలు మామూలు తెల్లని అద్దములను ఒక వరుసమాత్రము నీలిరంగు అద్దములను కప్పించెను. వాని నుండి వెలుగు లోనికి ప్రసరించుచుండెను. అద్దములవరుసలలో నీలివర్ణము మిక్కిలి కొద్దిభాగమే యుండుటవలన తెల్లని అద్దములనుండి ప్రసరించిన కాంతియందలి వేడిమిని తగ్గించివేయునంత అధికముగా లేదు. కనుకను, ఆ వెలుతురునందలి ఉష్ణతత్వమును రాసాయనికానురాగవశమున వృద్ధిచేయగలిగినదిగా నుండుటవలనను ఆరుబయట ఫారన్హీట్ (F. H. 36°) 36 భాగలవేడి అనగా దాదాపు మంచుగడ్డ కట్టునంత శీతలముగా నున్నప్పుడు ఆ యావరణయందు 110° ల వేడిమి యున్నట్లు కొలువబడినది. అన్ని అద్దములుగాని అందులో సగముగాని నీలియద్దము లున్నప్పుడు, నీలియద్దము లేమియు లేనప్పటికంటె శీతతరముగా నుండియుండెడిది. ఏల యనగా ఆ నీలియద్దములయందలి శీతశక్తులకు ప్రతీకారము

చేయగలిగినంత ఉష్ణధాతువు ఆ తెల్లని యగ్దములయందు లేదు. కనుక ఈ విరుద్ధధర్మములు గల శక్తులను మనము దాదాపుగా సమముగా నుంచిననేగాని కోరినంత మేలు చేకూరదు. అప్పుడే రాసాయనిక మైనట్టియు ధాతుసంబంధమైనట్టియు సమగ్ర ప్రతీకారము జరుగును. కనుక జనుల కందరికి ఒకే శీతప్రక్రియ గాని ఉష్ణప్రక్రియగాని చేయుట మార్గ మనిపించుకొనును. ఇప్పుడు స్వజాతి అణువులకు కలిగిన సమ్మేళనమునందు ఎక్కువ శక్తి యుండదని గ్రహింపగోరెదను. ఇట్టే శీతస్వభావము గల ప్రాణవాయువునందు వేడిస్వభావము గల ఒకింత హైడ్రోజము చేరినయెడల మిక్కిలి శీతలమైన జల మేర్పడుచుండును. వేడి స్వభావము గల కొద్ది గంధకముతో శీతస్వభావము గలిగిన నాలుగురెట్లు ప్రాణవాయువుతో చేరుటవలన అత్యంతశీతస్వభావము గల గంధకధృతి ఏర్పడుచున్నది. అందు రెండుభాగములు హైడ్రోజము, ఒక్క భాగము గంధకమును నాలుగుభాగముల ప్రాణవాయువును గలదు. పొట్టాసియమ్ వేడి స్వభావము గలది. అందులో సగభాగము ప్రాణవాయువు చేరినప్పుడు దానియందలి ఉష్ణము అధికతరమై అత్యధిక దహనస్వభావము గల పొటాసా ($K_2O$) అను పదార్థమగుచున్నది. శీతోష్ణశక్తులను సమముగా సమ్మేళనము చేసినప్పుడు శీతోష్ణములు రెండును సామరస్యమును బొందును. ఎరుపుధాతువు గల హైడ్రోజమును నీలిధాతువు గల ప్రాణవాయువుతో చేర్చినప్పుడు నీరగును. ఇది సృష్టియందలి సమగ్రమగు రాసాయనిక మిశ్రమము. ఇందు అన్నివస్తువులును.

గరగును. ప్రాణవాయువునందలి అణువులు మిక్కిలి బరువైన వగుటవలన తేలికయైన హైడ్రజమునందలి అణువులు రెండేసి కలిసినగాని సామరస్యము కలుగనట్లు తోచుచున్నది. శీతోదకమునందు శైత్యమును ఉష్ణోదకమునందు వేడిమియును ఉన్నప్పటికిని కేవలము నీటియందు శీతోష్ణముల సామరస్యమును బొందియే యుండును. మిక్కిలి శీతస్వభావము గలదని చెప్పబడిన గంధకధృతియందు కాల్చు స్వభావము ఏలయున్నదని యడుగవచ్చును. అది కాల్చుటలేదు. అందలి శీతశక్తులత్యంత మగుటవలన ఏవస్తువుతో నది సమ్మేళనము పొందునో అందలి ఉష్ణశక్తులనెల్ల వెలుపలికి లాగును. అందువలన నావస్తువులు కాలిపోవును. తీవ్రములగు ద్రావకములెల్ల నిట్టి స్వభావమునే గలిగియుండును ఎక్కువనీటితో చేర్చి స్వీకరించి నప్పుడివి శీతస్వభావము గలిగియే యుండును.

6. దేహసంబంధమైనవియు మానసికసంబంధమైనవియు శక్తులన్నియును రాసాయనికానురాగము రాసాయనికప్రతీకారములయొక్క నియమముల ననుసరించియే యుండును. మందు వైద్యులకు ఈ నియమములు తెలియవు అని నేనుదాహరణ సహితముగా వేరొకచో నిరూపించియున్నాను. అందు నే నీకింద్రిటి విషయమును చేర్కొంటిని.

(1) దేహములో నున్న ఇతరభాగములనుండి మెదటికిని, మెదటినుండి యితరభాగములకును వెన్నుపామునందలి రంధ్రముగుండా వ్యాపించియున్న నాడులవెంట నున్నితమగు

వైహాయసములు ప్రసరించుచుండును. నాడులయొక్క ఆవరణాలు వానిని వెలుపలకు ప్రసరింపకుండజేయును. దీనికి నరముల శక్తి యందురు. (2) కండర మెచ్చటనైనను ముడుచుకొనవలసినప్పుడు మెదటినుండి చల్లని స్వభావము గలిగి ముడుచుకొనునట్లు చేయగల వైహాయసములు చలననాడుల వెంట పంపబడును. ఎచ్చటనైనను స్పర్శ గ్రహింపవలసివచ్చినప్పుడచ్చటి జ్ఞాననాడులు వైహాయసములను బంపి మెదటికి తెలియబరచును. మెదడు వెన్నుపాము, నాడుల సంధులు, వీనియందలి నీలముతో కలసిన తెలుపురంగు గల పదార్థముతో అందేయుండునట్టి ఎరుపుతో కలిసిన బూడిదవర్ణము గల పదార్థముతో కలిసి ప్రాణశక్తులను నిర్వహించుచుండును. ఆహారమునందలిలోపమువలనను దుర్గలవాటు మొదలగు కారణములవలనను రక్తమునందలి చలనస్వభావముగల (cholestrine) కొలాస్ట్రిన్ అను పదార్థమును కాంతినొసంగునట్టి భాస్వరమును మరియు జాంతవకాంతశక్తి మానసికశక్తుల సంబంధమైన వైహాయసములవలన త్వరగా ఉద్దీపన బొందు ఇతరచురుకైన ధాతువులును లోపించియున్నప్పుడును రక్తమునందలిదోషమును బోగొట్టి నవశక్తిని నింపునట్టి వాయువునందలి చల్లనిప్రాణవాయువు ఊపిరితిత్తులలోనికి ధారాళముగా చేరనప్పుడును ప్రాణసంబంధమైన వైహాయసములు చురుకుదనమును గోల్పోయి అంతరవయవములును బహిరవయవములును మూసికొనిపోయి విషమగతి గలవై యుండును. మెదటిలో కొన్ని కేంద్రము లున్నవి. వానికిని

దేహములోని కొన్ని ప్రదేశములకును సంబంధ మున్నది రాసాయనికముగ వీనికిని వానికిని ప్రచారము జరుగుచుండును. దేహమునందు వివిధరకముల వైహాయసములు పని చేయుచుండును. ఘర్షణసంబంధమైనట్టియు జాంతవసంబంధమైనట్టియు స్థూలవైహాయసములనుండి రక్తమును ఉజ్జీవింపజేయు సూక్ష్మవైహాయసములును అంతకన్నను సూక్ష్మతరమైన నాడులలోని వైహాయసములును జీవునకు ప్రధానసేవకులై నుదుటియందును బ్రహ్మరంధ్రమునందును నుండి యితర వైహాయసములును, దైహికఆంతరక్రియలను నిర్వహించునట్టి సూక్ష్మ అతిసూక్ష్మముగు ఆత్మవైహాయసములును దేహము నుండి పనిచేయుచుండును. ఈ వైహాయసములు రక్తనాళముల గుండను నాడులగుండను వ్యాపించి దేహమునుండి వెలుపలకు సహితము వ్యాపించును. కోట్లాదిగా వెలువడు ఆవైహాయసములు దేహమునుండి వెలుపలకు కడుదూరము వ్యాపించును. ఇవి స్థూలదృష్టికి కాన్పింపవు. కాని సునిశితతత్వము గలవారికి అనుభూతమగును. ఆత్మశక్తివలన వీనిని తన దేహమునందంతటను వ్యాపింపజేసి ఉజ్జీవమును గలిగించి రోగనివారణ చేసికొనవచ్చును. దీనినే వృద్ధిచేసికొనినయెడల ఇతరుల దేహములలోనికి వ్యాపింపజేసి వారి ప్రవర్తనమును పరిస్థితులను మార్పుచేసి బాగుచేయవచ్చును. ఇతరులదేహములలోనికి ప్రాణదాయకములగు నీ వైహాయసములను, చేతులు మొదలగునవయవములద్వారా వ్యాపింపజేతురు. భావనాతీతమైన విశ్వాసమువలనగాని మానసిక ప్రతీకారమువలనగాని సాధ్య

ములుగాని అత్యద్భుత రోగనివారణములు గలుగును. మానసిక వైహాయసములను అభ్యంతర మార్గముల ప్రవేశబెట్టినప్పుడు మాత్రమే యిట్టివి గలుగును. ఈ సునిశితశక్తులే ఈ స్థూలదేహమును జీవాత్మతో సంబంధింప జేయుచున్నవి. ఈ సృష్టియంతటికిని ఇదియే మూలకారణము*

---

* నే నింత స్పష్టముగా వ్రాయుట మిక్కిలి మనుసుతనముగా భావింపవచ్చును. కాని నే నిట్లు వ్రాయగలుగుటకు కారణము స్థూలదృష్టికి కాన్పింపని యీసునిశితశక్తులను నేను స్వయముగా చూచియున్నాను. కడుసున్నితమగు వెలుగును రంగులను చూచుటద్వారా వైహాయసములయొక్క నడకను గుర్తించియున్నాను. శక్తియందలి సున్నితమగు వర్ణములను ఇతరు లనేకులు సయితము చూచియున్నారు. ఆస్ట్రియాదేశములోనున్న సుప్రసిద్ధుడగు భారన్ రేచిన్ బాక్ అనువారు సున్నిత తత్త్వము గలవాడని ఆతడు పేర్కొనిన అరువదిమందితో ఆతడు చేసిన వేలకొలది పరిశోధనలందు దివ్య వైహాయసమును ఋజువుపరచి యున్నారు. అసంఖ్యాకములగు అద్భుతములను వివరింపగలిగిన ఈ శక్తితత్త్వమును నేను వ్రాయగలుగుటకు సున్నితమగు వెలుగు, రంగులు, సృష్టిలోని ఆంతర్యమును వెలువరించుటయే కారణము.

నాలుగవకిరణము.

# రాసాయనికప్రతీకారము

ఒకే తరగతి శక్తియు ఒకే రకపు రంగును గల రెండు వస్తువులు ఒకదాని నొకటి యుద్దీపింపజేయును. దీనికి **రాసాయనికప్రతీకారమని** పేరు.

1 ఉదాహరణము :- 1 'సజాతివస్తువులు పరస్పరము ప్రతీకారము చేసికొనును' (Similars repel) అను సిద్ధాంతము ననుసరించి యున్నది. 2 సవ్యవిద్యుజ్జాతివస్తువులు గాని, అపసవ్యవిద్యుజ్జాతి వస్తువులు గాని, జోడించియుంచి చూడవలయును. ఆ వస్తువులలోని అణువులకు వెలుపల నున్న వైహాయసములు ఒకదానిపై నొకటి కలియబడి ఒకదాని నొకటి తెఱుముకొనును. అందువలన ఆ వస్తువులయందలి అణువులలో నుద్రేకము గలుగును. ఒక ఎఱ్ఱని రంగుగల మొక్కను తీసికొనుము. దానిపై బడు **సూర్యకాంతి** కడ్డముగా ఒక ఎఱ్ఱ అద్దమును కట్టుము. కొన్ని దినములలో నందలి ఎఱుపువర్ణము మిక్కిలిగా వృద్ధిబొందును. కనుక ఎఱుపువర్ణము ఎఱుపువర్ణమును వృద్ధిజేయు నని తెలిసికొనవలయును. ఆకుపచ్చని ఆకుపై నీలికాంతి పడునట్లు నీలియద్దమును కట్టుము. ఆ యాకు మిక్కిలి నీలము-ఆకు పసుపువర్ణము గలదై పెంపు సయితము మిక్కిలి వృద్ధిబొందును. కిరణవైద్యమను శీర్షిక క్రింద ఎఱ్ఱనిదైన రక్తమును ఎఱ్ఱని ధాతువులవలనను పచ్చని

పైన పిత్తరసనాడులును వసువుధాతువుల వలనను ఎట్లు ఉద్దీపన బొందునో వివరించియున్నాను.

2. మానవజీవితమునందు రాసాయనిక ప్రతీకారము :- ఇద్దరు వ్యక్తులు ఒకే రకమువారున్నారు. వారి మానసిక స్వాభావిక స్థితులు సజాతీయముగా నుండును. ఇద్దరి వెండ్రుకలును నెఱ్ఱిగా నుండును. వారి ముఖకాంతియు ఎఱ్ఱిగా నుండును. వారిద్దరు కలిసి జీవించిన యెడల వారి దేహాములందలి వేడిమి వృద్ధి బొంది వైరుధ్యము గలిగి కొన్ని దినములకు మంటలతో గూడిన వ్యాధులు గల్గును. ఇద్దరు నన్నని వాండ్రు. రక్తముయొక్క వర్ణము ఎఱుపు తగ్గి కాంతిహీనముగా నుండును. వారిద్దరు సాహచర్యము చేసినయెడల వారిద్దరికి నున్న చల్లదనము వృద్ధియై అన్యోన్యముగా అసూయ ఏర్పడి కాలికవ్యాధుల కాస్పదమగును. ఇందు మొదటిదానియందు నిద్దరికిని వేడిమి ప్రధానముగా నున్నది. అన్యోన్య ఆకర్షణములకు శీతము ఒకరియందును లేదు. రెండవదానియందట్లే, ఇద్దరియందును శీతమే యున్నది గాని అవసరమైన వేడిమి లేదు. ఎఱ్ఱిని వెండ్రుకలును, ఎఱ్ఱిని ముఖకాంతియు ఎల్లప్పుడును వేడిగలవారుగనె ఉండ నగత్యము లేదు. వారిలో ఇతరధాతువులు లోపించి యున్నప్పుడు ఉష్ణమునకు తగిన ప్రతీకారము జరుగక పోవచ్చును.

ఒకేతరగతియు ఒకేరూపమును గల రెండు శక్తుల యందలి ప్రతీకారము అత్యంతాధికముగ నుండును. ఒక జలప్రవాహ

మున కెదురుగా వాతము వీచినను ప్రతీకారము స్వల్పముగా నే యుండును. రెండును వేఱువర్ణములే యైనను పసుపు ఎఱుపు కాంతులు ఒకదాని నొకటి సంధించినపుడు ప్రతీకారము మిక్కిలి ఎక్కువగా నుండదు. ఒక ఉన్నిగుడ్డపై అద్దము వేసి కొలది తూరులు రుద్దిన తరువాత అందులోని రెండు వెండ్రుకలను తీసి దానికి సమీపముగా నుంచినయెడల ఆరెండు వెంట్రుకలను దానికి సమీపముగ లాగబడి ఒకేజాతి విద్యుచ్ఛక్తిని స్వీకరించును. అవే ఒకదాని కొకటి సమీపముగా నుంచిన యెడల విముఖత్వమును బొందును. ఒక వెంట్రుకను ఉన్ని గుడ్డమీద రుద్దిన లక్కకు సమీపముగను, ఇంకొకదానిని పై అద్దమునకు సమీపముగను నుంచి తరువాత వానిని రెంటిని ఒకదాని కొకటి సమీపముగా నుంచినయెడల వానిలోని శక్తులు సామరస్యమును బొందువరకును ఒకదాని నొకటి సమీపించి తరువాత విడిపోవును* అట్లే వివిధప్రకృతులు గల

---

*విద్యుచ్ఛక్తినిగూర్చి శాస్త్రజ్ఞులకు వివిధమగు నభిప్రాయములు గలవు. ఫ్రాంక్లిన్ మొదలగువారు విద్యుచ్ఛక్తిలో సవ్యాపసవ్యము లగు రెండు తెరగుల ద్రావము లున్నవని నమ్ముచున్నారు. ధూఫే మొదలగువారు విద్యుచ్ఛక్తియే విట్రియస్ (Vitreous) అద్దములలో కలుగునట్టిది, రెసినస్ (Resinous) రెసిన్ వంటి పదార్థములలో కల్గునట్టిది, అను రెండుతరగతులుగా నుండునని నమ్ముచున్నారు. అణువు వైహాయసములకు సంబంధించిన నాపరిశోధనలలో అనేకరకముల విద్యుచ్ఛక్తులున్న వనియు అవి అన్నియు ఒకే సూత్రములపై నాధారపడి వర్తించుచున్నవనియు తేలినది. కాని అద్దములలోని విద్యుచ్ఛక్తిలో ప్రవాహములు సవ్యమైనవి, పై భాగమున

ఇద్దరు వ్యక్తులు కలిసి జీవించినయెడల కొంతకాలమువరకును వారి కిద్దరికిని సౌఖ్యము వృద్ధియై అతిసాహచర్యమువల్లను, సహనిద్రవల్లను వారి ప్రకృతులు సామరస్యమును బొంది తరువాత అన్యోన్యముగా ప్రీతిరాహిత్యమును అసహ్యమును గలిగి క్రమముగా ఆపద గలుగును. వివాహితులగు దంపతులు ఆరు అడుగులకు తక్కువ లేకుండు దూరమున అన్యోన్యము శయనించినయెడల వారి అన్యోన్యానురాగమును ఆరోగ్యమును చిరకాలము నిలిచియుండును.

ఈ సూచనను గురించి అన్యోన్యానురాగము గలిగిన సుఖదంపతు లనేకులు పరిహసించుచున్నారని నాకు తెలియును. ఏకశయ్యాగతు లగుటవలననే ఆరోగ్యానందములు వృద్ధి నొందిన వని తెలుపుచున్నారు. రాసాయనికముగాను సాంఘికముగను దంపతు లన్యోన్యము మాసములు చివరకు సంవత్సరములు కలిసియుండినను సౌఖ్యముగా నుండునట్లు ఏర్పడియుండు నని నేను ఒప్పుకొనుచున్నాను. కాని ఎక్కువభాగము ఇద్దరిలో నున్నశక్తులు ధారాళముగా పీల్చివేయబడుటయో ఒకరిలోని కాంతశక్తి అత్యధికముగా రెండవవారిచే స్వీకరింపబడుటయో కలిసి పరుండుటవలన వేడి వృద్ధియై అపరిమిత

నుండును. రెసిన్‌లో నది లోపలినుండి అపసవ్యముగ నుండును. పిల్లి చర్మములోని విద్యుచ్ఛక్తి అద్దములోని విద్యుచ్ఛక్తి కన్న దృఢతరమైన దగుటవలన దానికి వ్యతిరేకమైనదిగా నున్నట్లు తోచును.

సంగమేచ్ఛ గలిగి నాడీశక్తి తగ్గిపోవుటయో గల్గుచుండును. ఇంతదూరము మేల వ్రాసితి నన అన్యోన్యానురాగమునకు భంగము వాటిల్లనున్నప్పుడు ఒకరికొకరు దూరమగుటయో నియమానుసారముగా జీవించుటయో చేయుదు రనియు విషయము తెలిసి ప్రవర్తించెద రనియు వ్రాసితిని.

ఐదవకిరణము.

# సమరసనియమములు

రెండు విరుద్ధశక్తులు కలియుటవలన సామరస్య మేర్పడును. రాసాయనికానురాగమునందు ఈ నియమములు ఎక్కువగా వర్తించును. వేడివస్తువులు చల్లనివస్తువులతోను వేడివర్ణములు విద్యుద్వర్ణములతోను ఆమ్లములు క్షారములతోను కలియుటను మనము చూచియున్నాము.

1. సరియైన మార్గము రెండు విరుద్ధశక్తులమధ్యగా గాక ఆ రెంటియొక్క సమ్మేళనమునం దున్నది.

2. ప్రాణశక్తుల యందలి శీతోష్ణములలో సరియైన సమ్మేళనమును సామరస్యమును ఆరోగ్యమగును. దైహికఆత్మీయ స్థితులయొక్క ధారాళమైన రాసాయనికానురాగవశమున ఆరోగ్యము గలుగును. దేహమునందలి శీతోష్ణముల సామరస్యములయొక్క ఆవశ్యకత తెలియుచున్నది గదా. ఈ సామరస్యమును గలిగించుటకు సృష్టియందలి సున్నిత శక్తులచే దేహమునందలి శీతోష్ణవర్ణముల నుజ్జీవింపజేయవలయును.

3. ధాతుశక్తులలో నీ ద్వంద్వము సామరస్యమును బొందక ఒక భాగము తరుగుగ నుండుటయో లేకుంటయో జరిగినప్పుడు వ్యాధిగలుగును. రాసాయనికానురాగవశమున సామరస్యమును గలిగించుటకును రాసాయనికప్రతీకారవశమున దేహములోని మాలిన్యమును నెట్టివేయుటకును ప్రకృతి చేయు ఉపయోగ

కరమైన ఘర్షణయే వ్యాధి. ఇట్టి యేకపక్షాధిక్యతవలన గలిగిన జ్వరములు, మంటలు, తరుణవ్యాధులు, దేహము కందుట, మొదలగు వ్యాధులలో శీతోదకములోని విద్యుచ్ఛక్తియు, శీతవాయువు, నీలము లేక ఊదాకాంతి, చల్లదనమును గలిగించు నాహారములు—(ఆమ్లఫలములు) వాడుటవలన సామరస్య మేర్పడి రోగనివారణ మగును. చలి, పక్షవాయువు, పాలిపోవుట, రక్తక్షైణ్యము, రక్తము ఒక ప్రదేశములో జేరుట, కాలిక వ్యాధులు మొదలగు శీతాధిక్యముచే గలుగు వ్యాధులకు వేడినీరు, వేడిగాలి, ఎరుపు, పసుపుకాంతి, వేడి జేయు నాహారములు, వేడిచేతితో ప్రసరింపజేసిన కాంతశక్తి మొదలగు ఉష్ణశక్తులవలన సామరస్యము గలుగును.

4. రోగసూత్రములు:— రోగమనునది కేవలము భౌతికపరిస్థితులవలననే కలుగుననియు భౌతికపదార్థములవలననే కుదురుననియు నిర్ధారణచేయుచున్నారు. కేవలము వ్యతిరేకముగా నింకొక పద్ధతివారు రోగ మాత్మసంబంధమైనదనియు మందులు మొదలగు భౌతికోపచారములవలన ఏమియు ప్రయోజనము లేదనియు చెప్పుచున్నారు. శక్తి ద్విపక్షకమనియు, ఆత్మీయమైన సున్నితతత్వ మొకవంకను, భౌతికమగు స్థూలతత్వ మొకవంకను, నుండినంతవరకే శక్తికి స్వరూపము గలదనియు; ఇందులో ఏది లేకున్నను శక్తియే లేకపోవుటయును కలుగుననియు మనమెరుగుదుము. ఈ శక్తితత్వము తెలియకపోవుటవలననే ఇట్టి విరుద్ధమును అసత్యమును నగు రెండుసిద్ధాంతము లేర్పడినవి. కత్తిదెబ్బ, విషము తినుట, మెదటికి దెబ్బ తగులుట, మొద

లగు భౌతిక ఆపదలవలన మనస్సు చెడిపోవుటయు స్నేహితుడు చనిపోయిన దుఃఖము, ఆశాభంగము మతోద్రేకము మొదలగు మానసికపరిస్థితులవలన దేహము రోగగ్రస్తమగుటయు జరుగవచ్చును. మనకు దైహిక మానసిక చికిత్సకులు కావలసియున్నారు. మనస్సునకు కావలసిన సున్నిత తత్వమును, దేహమునకు కావలసిన స్థూలతత్వమును అమర్చి దేహమునందు సామరస్యమును ఆరోగ్యమును గలిగింపవలసియున్నారు.

5 బాధ:– ఆపద ఆసన్నమై యున్నదనియు దానిని సాధ్యమైనంత త్వరలో నివారింపవలసియున్నదనియు దయామయి అయిన ప్రకృతి చేయు హెచ్చరికయే బాధ. అగ్నిహోత్రము వంటి తీవ్రమగువానితోడి పొత్తువలన గలిగినదైనయెడల బాధయును అధికముగనే యుండును. కొన్ని విషసంబంధమగు మత్తు పదార్థములవలన బాధయొక్క తీవ్రత తక్కువగానుండి ఎక్కువకాలము బాధించును. లేదా నాడులు మొద్దుబారి పోవును.

6. సూక్ష్మజీవులు - రోగములు:– జీవశాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనాఫలితముల వలనను శక్తిని గురించిన నా పరిశోధనల వలనను నే నీ క్రింది సిద్ధాంతములను చేసికొంటిని.

(1) ఆరోగ్యమైన దేహమునందంతటను కొద్దిగనో గొప్పగనో శాకసంబంధమైనట్టియు జంతుసంబంధమైనట్టియు, పరాన్నభుక్కులను పేరుగల సూక్ష్మజీవు లుండును. (2) సూర్యకిరణము

లందలి తీక్ష్ణతను ఎక్కువజేయునట్టి సూక్ష్మజీవులు వాతావరణమునందున్నవి. అట్లనే ఈజీవులు దేహమునందు తగుమాత్రముగా నున్నయెడల ఉజ్జీవనమును గలిగించి మేలుజేయును. (3) దేహములో నెచ్చటనైనను వేడిమి ఎక్కువయైనప్పుడు ఈ సూక్ష్మజీవులును అసంఖ్యాకములుగా వృద్ధిబొంది మండము వృద్ధియై మంటలు గలిగి అందే యవి మిక్కిలిగ మరణించుటచే కుళ్ళు పుట్టును. (4) దేహమునందలి ధాతుశక్తి తగ్గిపోయి వేడి తగ్గియున్నప్పు డివి తక్కువసంఖ్య గలవై వేడిమి, యింకను తగ్గుట కుపయోగించును. (5) పండ్లు ధాన్యములు కూరగాయలు, మొదలగు వానితో జేరిన ఆహారములు వాడుట వలన దేహరక్షకములగు సూక్ష్మజీవులు జేరును. స్థూలాహారములవలన స్థూలజీవులు జేరును. అందువలననే మాంసాహారులయిన అమెరికా, ఇంగ్లండు వాసులకన్న * శాకాహారులగు వారియందు పొంగు కుళ్లు మొదలగు వ్యాధులు తక్కువ ప్రబలముగా నుండును. శాక పదార్థములకన్న మాంస

---

* శాన్‌ఫ్రాంసిస్కోలో నున్న చైనాదేశీయులు శాకాహారులు. వారికి క్రుళ్ళు సంబంధమైన జ్వరములు రాకుండును. శీతజ్వరమును వారికి రాదు. క్షీణముతో కూడుకొని కుళ్ళుగల (క్షయాదులు) జ్వరములు వారికి రానేరావు. పొంగుజ్వరములు ఏరకమును వారికి కలుగవు. న్యూయార్కులో ఒకచిత్రలేఖకుడు మాంసాహారమును మాన్పించి తన పిల్లలను పెంచెను కోరింత దగ్గు, వగర్పు ఆటలమ్మ మాంససంతానిక మొదలగు శిశువ్యాధులు వారికి గలుగలేదు. ఆఫ్రికాయడవులలో పదునేడు సంవత్సరములు సంచారము జేసిన డాక్టరు లివింగ్‌స్టన్ యిట్లు వ్రాయుచున్నాడు. "జాంజిబార్ నదీ సమీపవాసులైన దరు అను తెగవారు అకుకుళ్ళు మొదలగునవి గలచోట

పదార్థములందు త్వరగా కుళ్లు పుట్టును గదా! (6) వీనిలో కొన్ని ఎక్కువ తీవ్రమైనవి. ఇవి రోగియొక్క శ్వాసమునుండి బయటికి వెడలి దేహమునందు రోగపదార్థము దివరకే యుండి తయారుగా నున్న క్షేత్రమునందు ఈ సూక్ష్మజీవులు బీజములుగా జేరి మశూచికము శీతజ్వరము మొదలగువానిని కలిగించును. (7) ఆ రోగసంబంధమైన సూక్ష్మజీవులను, మురుగు కాల్వలలోనుండి వెడలిన విషవాయువులను, మురుగునీరు పడు గుంటలనుండియు మురికి బజారులనుండియు గ్రుళ్లు నీటినుండి వెడలిన దుష్టవాయువులను గాలి స్వీకరించును. సమీపములో నివసించువారును ఆత్రోవను పోవువారును ఆగాలిని పీల్తురు. (8) ఎవరిదేహమునందలి విద్యుదాదిశక్తులు సున్నితమును దృఢమును చురుకును గల్గియుండునో వారివిషయముల వలన గలుగు అధికవృద్ధిని నిరోధించెదరు. వాతావరణము నుండి వారిదేహములలోనికి జేరిన విషముల నన్నిటిని గాకు

---

నివసింతురు. వారు పాలను శాకములను నాహారముగ నుపయోగింతురు. వారికి శీతజ్వరము గలుగును. కాని మశూచికము ఆటలమ్మ మొదలగు పొంగు జ్వరములును, పిచ్చి సంధివాతము ఆమవాతము రక్తగ్రహణి మనోవైకల్యము మనశ్చాంచల్యము మొదలగు వ్యాధులు వారియందు కాన్పింపవు. వారికి దేవతలందు నమ్మకము. వారి దేవదేవుడు ఉమెరూరా. ఒక్కొక్క తెగవారికి రక్షకు డగు ఒక్కొక్క దేవత యుండును. వారి దేహములపై వ్యాధులను నిరాకరించుటకు, వారు తక్కువ వస్తులతో దాదాపు వస్త్రవిహీనముగా దిరుగుటయు, సూర్యకాంతిని, వాయువు లందలి ఉజ్జీవక శక్తులను స్వీకరించుటయు కారణమైయున్నది.”

న్నను చాలభాగము నిరోధింపగలుగుచున్నారు. ఈ సూక్ష్మజీవులను సంహారించుటకు అన్నిరకముల శీతశక్తుల నుపయోగింపవచ్చును. నీలి, ఊదా కాంతి కిరణములనుగాని ఆ కిరణములచే ఆరోపితము చేయబడిన వస్తువులనుగాని సున్నితములగు ద్రావకములను (పండ్లయందలి పులుపువంటి) ప్రాణవాయువుగాని ఓజోన్‌గాని నిశితమగుచల్లదనముగాని స్పిరిట్సు ఆఫ్ అమోనియావంటి తీక్ష్ణమగు క్షారమును పీల్చుటనుగాని ఉపయోగించవచ్చును. తీవ్రమగు వేడిమివలన సైతమివి నశించునుగాని ఈ వేడితో మానవజీవమే నశింపజేయబడును. ఈసిద్ధాంతములు ఆరోగ్యమునుగూర్చిన నా రాసాయనికసామరస్యసూత్రములకు భిన్నముగా నున్నదని చెప్పగలమా! * లేదు. ఈ సూక్ష్మజీవులయొక్క గమనములకు భిన్నముగా రాసాయనికానురాగ గమనము ఉండి సూక్ష్మజీవులను కలిగించుటకే యుపయోగపడి వీనివలన కీడుకు బదులు మేలునే కలిగించుచున్నవి. మరణాంతమందు రాసాయనికశక్తులను

---

* రోగనివారకములును బాధారహితములును నగు జలప్రక్రియలు జ్వరము, మంటలు, మొదలగు వానియందు ప్రయోగించినప్పుడు దేహమునందు రాసాయనికానురాగవశమున మార్పులు జరుగును. జీర్ణక్రియ, తినిన పదార్థము రక్తములోనికి నింకుట, దేహపోషణ, రక్తములోను నాడులలోను ప్రాణవాయువు చేరుట, మానసిక మండలము మొదలగునవియును ఈ ప్రతిక్రియవలన మార్పులు బొందును. వైద్యులు కొన్ని రోగములు సూక్ష్మజీవులవలన కలుగుచున్న వని చెప్పుచున్నారు. కాని, ఆసూక్ష్మజీవులే అధికమై దేహ అభివృద్ధికి భిన్నముగా నున్నప్పుడు కలుగునవే వ్యాధులన్నియును.

అదుపులో నుంచగలిగిన జీవుడు లేకుండుటచే దేహమునందలి సూక్ష్మజీవులు ప్రచండవేగముతో వృద్ధిబొంది కుళ్ళును నాశమును గలిగించును.

7 విషములు:—వీనివలన జీవకోటికి వినాశనమును మరణమును సంభవించును. ఏలయన వీనియందు ఏకపక్షమునందే అనగా వేడియో, శీతమో అత్యధికముగా నుండి దానికి సమానమగు రెండవశక్తి లేకుండినప్పుడు దేహము భరించలేకపోవుట వలన మరణము కలుగును. అల్కాహాల్ (Alcohol C 2 H. 6 O) ఇందు రెండుభాగములు పచ్చనిధాతువగు అంగారమును ఎర్రనిధాతువగు హైడ్రోజము 6 భాగములును ఉండి వానియందలి యుష్ణమును ప్రతీకారవశమును ఇంకను వృద్ధి జేయగల ఒక్కభాగముమాత్రము ప్రాణవాయు వుండుట వలన నది అత్యుష్ణకరమగు విషమై యున్నది. క్లోరోఫారం (Chloroform C H C L 3) యిందు అత్యంతశీతలమైన క్లోరైన్ ప్రధానముగా నుండును. క్లోరైన్‌యొక్క వర్ణములు నీలము-ఆకుపసుపు, నీలము-ఊదావర్ణములు ఇందు అంగారము హైడ్రోజములు ఒక్కొక్కభాగమే యుండుటవలన క్లోరైన్ లోని యీాడ్పుగలిగించు స్వభావమును రాసాయనిక ప్రతీకార వశమున వృద్ధిచేయును. కనుక ఇది ప్రయోగించినపుడు హృదయమును స్తంభింపజేసి ప్రాణమును తీయును. ప్రస్సికామ్లము (Prussic acid C N H) ఇందు జేరిన అంగారము హైడ్రోజము నత్రజము మూడును ఉష్ణకరములే. అత్యుష్ణమగు తీవ్ర విషముగా నేర్పడును. ఇందు అంగారమునందును నత్రజము

నందును సూక్ష్మము కాగలకొలది శీతమువలన ప్రతీకార వశమున తీక్ష్ణమగు విషమేర్పడును. ఇది ఒక బిందువే మానవ జీవమును హరింప సమర్థమైయుండును. నికోటిన్ (Nicotine $C_{10}H_{14}N_2$): ఇది పొగాకులో నున్న విషముయొక్క సారము. ఈవిషమున్న పాత్రి సమీపముగా పోయినంత మాత్రమున పక్షులు చనిపోవును. ఇది యంత ఉష్ణకరమగు విషము! మృదువగు ఆమ్లములు చల్లదనమును, మృదువగు క్షారములు ఉష్ణమును కలిగియుండును. కాని ఆ పదార్థములే కేంద్రీకరింపబడినపుడు ప్రతీకారవశమున తీవ్రాతితీవ్రమగు విషములుగా నేర్పడి స్వధర్మమునకు వ్యతిరేకమగు గుణము నిచ్చును. అమ్మోనియా: ఇందు వేడిధాతువులైన నత్రజము ఒక భాగమును, హైడ్రజము 3 భాగములు నుండును. ఇది క్షారము. పొటాష్ (K H O): ఇందు ముతుక ఎరుపువర్ణము గల పొటాసియం సూక్ష్మరక్తవర్ణమైన హైడ్రజమును వీని యందలి యుష్ణమును ప్రతీకారవశమున నుద్రేకింపజేయగల ప్రాణవాయువును సమభాగములుగా నుండును. అగ్నితుల్యమగు తీవ్రవిషము. ఇది క్షారము. ద్రావకములన్నియు అత్యంత శీతలమగునవి. గంధకితామ్లము: ($H_2SO_4$): ఇందు నీలి ఊదారంగులు గల ప్రాణవాయువు 4 భాగము లున్నవి. నత్రకితామ్లము ($HNO_3$): ఇందు ప్రాణవాయువునందును నత్రజమునందును నున్న శీతము ప్రధానము.

పైన పేర్కొనబడిన విషములయందు శీతాధిక్యముగా నున్న విషములందెల్ల వాని శైత్యమును వృద్ధిజేయగల తగు

మాత్రపు ఉష్ణత్వము సయితము చేరియేయుండుచున్నది. ఇట్లే ఉష్ణాధిక్యమగు విషములందును నుండును.

9 విషప్రతీకారములు:— యాసిటిక్ యాసిడ్, గంధకితామ్లము, ఉదజహారితామ్లము, ఆక్సాలిక్ ఆమ్లము, నత్రితామ్లము, మొదలగు ద్రావక సంబంధమైన విషములకు ప్రతీకారముగా క్షారములు వాడవలయును. అందులో సాధారణముగా లభించు సోడా, మెగ్నీషియా, సీమసున్నము, తడిసిన సున్నము, పగిలిపోయినసున్నపు గోడముక్కలు మొదలగునవి పని చేయును. క్షారములు వాడబడినప్పుడు వాని విషప్రతీకారము చేయగలవి ఆమ్లములు. పొటాష్, సలిశేటస్, సోడా, తార్తారిక క్షారములు మొదలగువానికి వినిగర్ పుల్లని నిమ్మనీరు; కరోసీవ్ సబ్లిమేట్, పాషాణము, రాగి చిలుము, గంధకితామ్లము మొదలగువానికి కోడిగ్రుడ్డులోని తెల్లని సొన, పాలతోకలిపిన పిండి ప్రతీకారము లగును. తీవ్రవిషముల యందు జీర్ణకోశమును కడుగు పనిముట్టు (Stomach pump) తో కడుగుటయో వాంతిని కలిగించుటయో చేయవలసినది.

10 అసమగ్రస్థితులు:— దేహములో వేడిగా నున్న భాగములు సహజముగా శీతముగా నుండు భాగములలోనున్న కొలది పాటి వేడిమిని సయితము లాగుకొని వానిని చల్లగా నుండునట్లు చేయును. అప్పుడు వేడిప్రదేశములలో మంటలును శీతమగు ప్రదేశములలో కాలిక వ్యాధులును గలుగును. మెదడు, జీర్ణకోశము, మూలకందము, జననేంద్రియములు, గర్భాశయము, నడ్డివూస, ఇవి సహజముగా వేడిగా నుండు భాగములు;

మలుగులు, తుదలన్నియును, కాలివేళ్ళు, చీలమండలు, పిత్తకోశము, శ్వాసాశయములు, అప్పాడప్పుడు ముచ్చిలగుంట మొదలగునవి సహజముగ శీతలముగానుండు భాగములు. స్త్రీలలోమాత్రి మీా ముచ్చిలిగుంట వేడిగా నుండి, ఆ వేడి ఎక్కువ కాను కాను, వెన్నుపాములోమంట Spinal meningetis) కలుగును. ఒకభాగమందు మంట గలిగించి వేరొకభాగమందలి మంటలు తగ్గించుటకు చిత్రిమూలమువంటి పదార్థములును, మంటలుగలిగించు పట్లును, కోతలును, (ఆ పుండులో నుంచి సంతతము చీము కారించుట ద్వారా ఆప్రదేమునందలి మురికిని తీసివేయుటకు జేయు ప్రియత్నము) జలగలు పట్టించుటయును, అల్లోపతి వైద్యమితు్రిలు చేయుచున్నారు. ఇట్లు ఒకవ్యాధి తగ్గించుట కింకొక వ్యాధిని గలిగించెదరు. ఇట్టి తీవ్రిములును, అపాయకరములును నగు ప్రిక్రియలు చేయుట అవసరము లేదు. 'కాంతిమర్దన' మను శీర్షిక క్రింద తడిచేతివేళ్ళతో వేడిప్రిదేశమునుండి శీతప్రిదేశమునకు వేడిమిని లాగివేయుట ఎట్లో వివరించియున్నాను. 'వర్ణచికిత్స' యను శీర్షికక్రింద వేడిమిని నీలి, ఊదా కాంతులను పైన ప్రసరింపజేయుటద్వారా ఎట్లు సమరసపరుపవచ్చునో అదియును నీలివర్ణారోపితము చేసిన పదార్థములను లోని కిచ్చుటవలనను, కుదురు నని వ్రాసియున్నాను. శీతప్రదేశములకు పచ్చని ఎఱ్ఱని కాంతిప్రిసారమువలనను ఆయా వర్ణారోపితము చేసిన పదార్థ స్వీకరణమువలనను సామరస్య మేర్పడునని వ్రాసియున్నాను. 'జలచికిత్స' యను శీర్షికక్రింద వేడినీళ్లతోను చన్నీళ్లతోను

దేహమునందు సామరస్యము కలిగించుటను వ్రాసియున్నాను. 'విద్యుచ్చికిత్స' యను శీర్షికక్రింద విద్యుద్యంత్రముయొక్క సవ్యపుకొన వేడిప్రదేశము వైపునకును, అపసవ్యపు కొన చల్లని ప్రదేశము వైపునకును ప్రయోగించిన సామరస్యమేర్పడు ననియు వ్రాసితిని.

ఆ అవకిరణము

# శక్తితత్త్వము.

స్థూలతత్త్వములకన్న సున్నితతత్త్వములు అత్యంతగుణతరములుగా నుండును. సున్నితతత్త్వములయొక్క ఆధిక్యము ఈక్రింది విధమున నుండును:—

1. అవి వడిగనుండి ఎక్కువబలముగా లోపలికి ప్రసరించును. 2. వానితో చేయు చికిత్సలయందవి నాడీమండలమును ఆత్మ శక్తులను సమీపించి, దేహమునకేగాక మానసిక ఉన్నతికి సైతము తోడ్పడును. మరియును శక్తికి మూలమగు తత్త్వములతో సమ్మేళనము నొందును. 3. అట్లగుటవలన వానివలన కలిగిన సుగుణము శాశ్వతముగా నిలిచియుండును. 4. అవి నిరుపద్రవమైనవి. 5. అవి ఆనందదాయక మయినవి. ప్రకృతి లోని సునిశితతత్త్వము లన్నియు సహజముగనే మంచి సుగుణములు గలిగియుండు నని రస్కిన్‌గారి అభిప్రాయము.

1. సునిశితశక్తులయొక్క వడి లోపలికిచొచ్చు శక్తి నీక్రిందివానిచే గుర్తింపవచ్చును:— నీరుగను మంచుగడ్డగను నున్న పదార్థమే ప్రవాహమగునెడ మిక్కిలి శక్తివంతమగును. అందలి శైత్య మింకను అధికముగనే యుండును. సూర్యకాంతి జంతుసంతతి నంతయు నుజ్జీవింపజేయును. ప్రపంచముల నన్నిటిని నిలిపియుంచినది గురుత్వాకర్షణ శక్తియే. ఈ సృష్టియంతకును ఆధారము సూక్ష్మాతిసూక్ష్మమగు

నాత్మతత్త్వమే. ఖనిజములు మొదలగుసూలతత్త్వములు మిక్కిలి తక్కువ శక్తిగలవి.

2. సున్నిత తత్త్వము వలన నాడీమండలమును ఆత్మశక్తులును సమస్థితిలో నుంచబడును. ఒకవంక మానసిక నైతిక శక్తులును మరియొకవంక నాడీమండలము, రక్తమండలమును చురుకు గలిగిన వగును. ఎక్కువ ఉద్రిక్తముగా నున్నప్పుడు శాంతిని బొందును. అందువలననే మానసికరోగము లున్నప్పుడీ సూక్ష్మశక్తులు గుణతరముగా బనిచేయును. ఉదాహరణము:— మానసికశక్తి న్యూయార్కునగరములో సుప్రసిద్ధ మతబోధకుడైన రెవరెండు, డబ్లియు. సి. వాన్ మీటరు అను వానికి పక్షవాతము గలిగి కాళ్ళు పడిపోయి చేతికర్రిలమీద తప్ప నడువలేని స్థితి గలిగెను. యూరపులోను, అమెరికాలోను నున్న సుప్రసిద్ధవైద్యు లనేకులు మందులచే వానికి రోగము గుదుర్పబ్రియత్నించిరి. కాని ప్రయోజనము గలుగలేదు. జె. ఆర్. న్యూటన్ అను నాయన అతని వెన్నుపాముయొక్క క్రిందిభాగమున తన (కాంత శక్తిగల) చేతి నుంచినంతనే అతనికి నడుచుశక్తి గలిగెను. ఆ వైద్యు డిట్లే అనేకుల కత్యద్భుతముగా గుదుర్పగలిగెను. చికాగోలో ఒక యామెకు పిచ్చి. ఆమెను పట్టుకొనుటకు నలుగురు మనుష్యు లవసర మగుచుండిరి. గ్రీన్ వీనర్ శ్యాన్ అను వైద్యురాలు ఆమెపై తన చేతి నుంచినంతనే ఉద్రేకము తగ్గి శాంతి ఏర్పడెను. ఇట్టివింకను అనేకము పేర్కొనవచ్చును.

**వర్ణచికిత్స:**— వర్జీనియాలో ఒక స్త్రీకి నాడి సంబంధమైన పార్శ్వ పుతలనొప్పి (పిచ్చితలనొప్పి). తెరలు కట్టిన ఇంటిలో తప్ప ఆమె వెల్తురును చూడజాలదు. రాత్రిం బవళ్లు ఆమెకు నిద్దురలేదు. పిచ్చి వచ్చుటకు సిద్ధముగా నుండెను. కేంద్రీకృత నీలపుకుప్పె నామె నుదుటిపై ప్రసరింపజేసిన 5,10, శెకనులలో నామెకు నిద్దుర గలిగెను. నిద్దుర లేచిన తరువాత ఆమెకు ఒక చల్లని ప్రవాహము నుదుటిలో ప్రవేశించి లోనిమంటలను తగ్గించి దూసుకొని పోయినట్లును దివ్య శాంతి కలిగినట్లును చెప్పెను. ఇటలీలో పిచ్చివాండ్ర శరణాలయమునకు ప్రధానాధికారియైన డాక్టర్ పూంజా, మాటలాడకుండ నుండురోగి (మానవ్యాధి)ని ఎఱ్ఱని గదిలో పరుండబెట్టి ఆ గదికిటికీలకు సైతము ఎఱ్ఱని అద్దముల నుంచెను. మూడుగంటల తరువాత నాతని స్తబ్ధత వదలి రోగనివారణ మైనది. తీవ్రమగు పిచ్చిగలవాండ్రకు నీలము, ఊదాశక్తుల వలన నాత డనేకులకు రోగములు కుదిర్చెను.

**మానసికారోగ్య చికిత్స:**—అనేక వేల రోగులకు సముచితాహారము, సూర్యకాంతి, జలము, కాంతశక్తితో గూడినమర్దన, వీనితో రోగములను గుదుర్చుచుండిన న్యూయార్కులోని డాంస్ విల్లాలోనున్న జాన్.సి. జాక్సన్ అను వైద్యవేత్త ఇట్లు చెప్పుచున్నాడు:— "మందువైద్యమునకు మానసికారోగ్య చికిత్స నిర్వివాదముగా పైచేయియై యున్నది. ఎవరు సదా నీడయం దుందురో వారు బలహీను లగుదురు. ఎవరు సదా ఎండయం దుందురో వారు బలవంతు లయ్యెదరు. సూర్యకిర

ణములు ఉత్తమమైన మద్యసాగములకన్న 500 రెట్లు మానసికశక్తుల నుజ్జీవింప సమర్థములు.” శుక్లపాతము, స్త్రీ వ్యాధులు కుదుర్చుటలోను ఈ చికిత్స అద్వితీయముగానే పనిచేయుచున్నది. సున్నితతత్త్వములను చికిత్సాప్రక్రియలుగా గ్రహించిన అనేక ఇతరసంస్థలయొక్క జయమును సైతము స్థలసంకోచమువలన ఇచ్చట చేర్చుటకు వీలులేక పోయినది.

3. స్థూలతత్త్వములతో చేసిన చికిత్సయందు కలిగినసుగుణములకన్న సున్నితతత్త్వములతో చేసిన చికిత్సయందు గలిగిన సుగుణములు శాశ్వతతరమై యుండును. ఏలనన నవి ఇతరశక్తుల నన్నిటిని అదుపులో నుంచునట్టి నరములు, ఆత్మశక్తి, మొదలగువానిపైననే సూటిగా పనిచేయును. స్థూలతత్త్వము లన్ననో రక్తమాంసములు కాకున్న రెండవరకపు నరముల మీాద మాత్రమే పనిచేయును. దానికి ఋజువుగా ఈ క్రింది విషయమును జేర్కొనుచున్నాను.

ధాతుకాంతశక్తి:-(చల్లని చేతుల నిప్పుమీాద కాచుము. అవి కొలదికాలముననే చల్లబడును. చేతులు జోడించియో, ఒకదానిపై నొకటుంచియో, రుద్దియో కలిగించిన సున్నితమగు ధాతుసంబంధమగు ఉష్ణము అధికకాలము నిలిచియుండును.) న్యూయార్కులో ఒకామెకు పాదములు చల్లగా చిరకాల ముండెననియు డాక్టర్ బ్రియాన్ కాంతశక్తి గల తనచేతిని ఆమెపాదములపై నుంచి వేడిమిని గలిగించెననియు, అనేక

సంవత్సరములు గతించినను ఆ వేడిమి యట్లనే నిలిచియున్న దనియు నాతో చెప్పెను.

(వర్ణ చికిత్స:—ప్రేగులయందు కదలిక తగ్గి మలబద్ధక మేర్పడి నప్పుడు వాడునట్టి భేదికౌషధములు చాలభాగము చాల మోటుగా పనిచేసి నీరసమును గలిగించును. తరువాత ఆ ప్రేగులు ఎప్పటివలెనే పనిచేయమానును. పసుపు, నారింజ వర్ణారోపితము చేసిన పదార్థస్వీకరణమువలన ప్రేగులయందు మృదువగు చలనము గలిగి తరువాత అనేకవారములును, నెలలును, మలబద్ధకము గలుగకుండ నుండును.)

4. స్థూలతత్వముల కన్న సున్నిత తత్వములు అధికతరమగు వడిగలవై యుండును. వానివలన సాధారణముగా ఎట్టి అపకారమును జరుగదు. మందు వైద్యగ్రంథములలో 51 రోగములు పాదరసమువలన గలుచున్న వని వ్రాయుచున్నారు. మాక్లిన్‌టాక్ అను డాక్టరుగారు ప్రపంచములోని యుద్ధములవలన కన్న ఈ పాదరసమువలన ఎక్కువమంది వికలాంగులగుచున్నా రని చెప్పినారు. 70 వ్యాధులు మద్యసారమువలన గలుగు ననుచున్నారు. 'డిజిటాలిన్ అను మందు వేలకొలది రోగులను రుద్రభూమికి త్వరబెట్టుచున్నది.' అని డాక్టరు హుస్సాకుగారు చెప్పిరి. చిన్నపిల్లలకు పెట్టు మందు (Blister) వాడుటవలన దాదాపుగా మరణమే కలుగుచున్నదని ప్రొఫెసర్ గిల్మర్‌గారు చెప్పుచున్నారు. మందు వైద్యుల జ్ఞానమును ఆపత్కరములగు మందులను మనస్సులో నుంచుకొని వైద్య

లుండుటకన్న దాదాపుగా నన్ని విషయములందును లేకుండు టయే క్షేమకరమని ప్రొఫెసరు రామేచ్ ఎం.డి., ఎఫ్. ఆర్. యస్.గారు స్థిరీకరించుచున్నారు. డాక్టర్ జాన్, మేసన్ గుడ్ గా రిట్లు చెప్పుచున్నారు. "మందువైద్యము మూర్ఖమైనట్టియు తికమకమైనట్టియు శాస్త్రము. మానవదేహమందు మందుల యొక్క పని సర్వదా నిర్ధారణమైనదిగాదు. కాని, యుద్ధము కరువు, మహామారి మొదలగు వానికన్న మందువల్లనే ఎక్కువమంది మరణించిరన్నమాట నిజము." ఈ పాతమందుల యొక్క తీవ్రభయోత్పాదకగుణములవలన సంస్కరణము గలుగుచున్నది. కలముతో వ్రాయుటకును నోటితో చెప్పు టకును సాధ్యముగానంతగా ఈ తప్పుడు మందుపద్ధతివలన ఎందరు రోగగ్రస్తులై మరణింపలేదు? ఎన్ని సుందరతనువులు జీవితధర్మములను అవలంబింపదగిన వయస్సు రాకపూర్వమే నేలపాలు చేయబడలేదు. ఆకాశమునుండి మనపై దివ్యతేజ ములో ప్రకాశించు సూర్యకాంతి, జలము, పృథ్వియందలి సుందరమగు ఫలములు ప్రధానచికిత్సాప్రక్రియలుగా గ్రహిం చిన మన దివ్యవైద్యమునకై మనము గర్వించెదము గాక.

5. సునిశితతత్త్వముల ప్రయోగము స్థూలతత్త్వముల ప్రయోగముకన్న సుఖతరమైయుండును. మాంద్యమును బొం దిన మానవదేహమునందలి మాంసమును ఉద్దీపింపజేయుటకు ఎర్రగాను తెల్లగాను కాల్చిన ఇనుపకడ్డీ నుపయోగించుటయు పొక్కు పలాస్త్రీ వేయుటయు దేహములో నుండి కృత్రిమ

మగు రంధ్రము లేర్పరచుటయు మొదలగు మూర్ఖపువను లు చాల అన్యాయమైనవి. కాంతశక్తి గల చేతిని చర్మముపై మెత్తగా జార్చినచో లోపలనున్న కండరములందు చైతన్యము గలిగి సుఖానందములు గలుగును. సూర్యకాంతివలన చర్మము ఎర్రబడును. పుండుసహితము మిక్కిలి బాధ లేకుండ కలిగింప వచ్చును. ఆపుండు మచ్చయైనను లేకుండపోవును. అదే పాశ్చా త్యశాస్త్ర కత్తిపోటు, కాల్చుమందులు వాడినప్పుడు మచ్చ లు శాశ్వతముగా నుండును. పుండు కలిగించుటలో సహితము తీవ్రమగు బాధ యుండును. పూర్వ సాంప్రదాయిక వైద్య ములో కంతులు (రోగమూలమును వదలివేసి) పైభాగమును మాత్రము శస్త్రము చేయుదురు. మన వైద్యమునందో, సూర్య కిరణమును భూతద్దముద్వారా కంతిపై ప్రయోగించుటచే అది నశించిపోవును. లేదా కాంతశక్తిచే దానిని స్వాభావిక మార్గములద్వారా వెలువరించివేయవచ్చును.

స్థూలవైద్యమునందు విరేచనమాత్రలు వాడుట, వాంతిమం దులు వాడుట, ఇన్‌జక్షన్‌లు చేయుట, కత్తికోతలు మొదలగు నవి చేతురు. సునిశితవైద్యమునందో రుచికరములగు ఫల ముల నిచ్చుట, ఆహారపదార్థములయందు మార్పు జేయుట స్నానములు మర్దన సుఖకరమైన రంగులను ప్రయోగించుట మొదలగునవి చేతుము. ఈ రెండువిధానములను ఈ క్రిందివిధ ముగా వివేచన చేయవచ్చును. ఒక గొడ్డలితో కొట్టినప్పుడు మిక్కిలి బాధతో గూడిన పుండు కలుగును. మంగలికత్తితో అంతేలోతు పుండుచేయునపుడు మిక్కిలి తక్కువ బాధయే

గలుగును. ఇంకను సున్నితమగు విద్యుచ్ఛక్తి బాధ లేకుండనే దేహములోనికి ప్రవేశించును. మానసికశక్తి రోగియొక్క ఎఱుక లేకయే సుఖప్రీతికరముగా దేహమంతటిని వ్యాపించును.

6. స్థూలమగు మందులకన్న ఈ సునిశితశక్తులు విశ్వమునందంతటను వ్యాపించియున్నవిగాన సులభసాధ్యములు, వ్యయరహితములు. మందువైద్యులు వారిమందులు, వ్యయకరములును, కష్టసాధ్యములును. ఆకాశమునుండి దివ్యతరముగా ప్రకాశించు వెలుతురును, గాలియు, చల్లదనముతో గూడిన జలమును అనేకుల దేహమునందు కాంతశక్తియుండును గాన వారి స్పర్శయు సులభాతిసులభసాధ్యములు. అనగా దివ్యతరములైన పదార్థము లన్నియు మానవాభ్యుదయమునకై విశ్వములో సంపూర్ణముగా నున్నవి. కాని మానవజాతియందు అధికభాగ మింకను వ్యయకరములును, అపాయకరములును, కష్టసాధ్యములు నగు వానికొఱకే మిక్కిలి శ్రమపడుచున్నది.

ఏడవ కిరణము

# మానసికశక్తుల పరస్పరసంబంధము

సృష్టియందలి ఇతర పదార్థములందు వలెనే శక్తియును క్రిమాభివృద్ధి గలిగియుండును. అనగా ఒక సున్నితతత్త్వము ఒక స్థూల పదార్థమును నడుపునదిగా నుండును. ఇట్లే ఆ సునిశిత తత్త్వము తిరిగి ఇంకను సున్నితమయిన ఇంకొక శక్తిని నడపును. ఇట్లు అత్యంతసునిశితమైన శక్తి మూలశక్తియైయుండును. దీనినే జీవ మందురు.

1. ఉదాహరణములు: విశ్వమందలి పదార్థములు ఘనపదార్థములు ద్రవపదార్థములు వాయుపదార్థములు, వైహాయసములు, జీవము అనువరుసలో నుండును. మిక్కిలి స్థూల మయిన తత్త్వముపై మిక్కిలి సునిశితమైన తత్త్వము పనిచేయదు ముతుకజల్లెడతో మెత్తని పిండిజల్లింపబడ జాలనట్లు సోపానక్రమముగ ఒకదాని తర్వాత నొకటి దాటియే పోవలయును మానవదేహమందును నెముకలను అర్థభాగము ఘనపదార్థములగు కండరములు కదలించును. ఆ కండరములందు రక్తము చైతన్యమును గలిగించును. ఆ రక్తమాంసమును ధాతుశక్తియు నాడుల సంబంధమగు వైహాయసములును ఉజ్జీవింపజేయును. వానినేతిరిగి ఆత్మీయశక్తులు (జీవతత్త్వము) నడపుచుండును. మనస్సు దేహముపై పనిచేయువలనడు సంకల్పశక్తి క్రియాశక్తిని గలిగించును క్రియాశక్తినప్పు నాడులును రక్తవాహి

కలును ఉజ్జీవింపజేయును. అవి తిరిగి రక్తమాంసధాతువులను ఉజ్జీవింప జేసి చైతన్యమును గలిగించును. ఇట్లు ప్రాణకర్మ జరుగుచుండును.

2. మానసికశక్తులు: డాక్టరు బ్రౌన్ సిక్వార్డు*జాన్,హాగ్సు బెనెట్ ఇంకను నూరుమంది వైద్యవిధానవేత్తలు చెప్పిన దేమన జాంతవశక్తి యను పేరుగల సునిశిత వైహాయసద్రావము లేదనియు భావనాసంకల్పము వీనివలననే వాంతిరోగము, ముఖమునకు రక్తము వచ్చుట మొదలగు స్పష్టమగు కర్మలు జరుగుచుండుననియు చెప్పుచున్నారు. శక్తి సంబంధమగు విజ్ఞానములో మన వైద్యవేత్తలు ఇంకను బాల్యావస్థలోనే యున్నారనియు వారికి మానసికశక్తి యనునది గలదనియు ఆత్మశక్తినుండి దానికి ఉజ్జీవనము గలిగి దేహమునందన్ని భాగములకును వ్యాపించుచున్నదనియు వారికి తెలియదని గ్రహింపవలెను.

దృఢమైన మానసికశక్తివలన దేహమున కంతటికిని ఉజ్జీవనము గలుగును. దానివలన ప్రాణము నాడీసంబంధములగు వైహాయసములు రక్తము వీనియందు చైతన్యమును నూతనోజ్జీవమును గలిగి దేహమునందు మాలిన్యము నిలిచి మరుగెత్తి రోగమును గలిగింపకుండ వెలుపలికి నెట్టివేయును. హృదయపూర్వకమగు నవ్వు ఆనందమును ధాతుశక్తియందు

---

*డాక్టరు బ్రౌన్ సిక్వార్డు తనకు రోగము గలుగుటకు ముందు ఒకింత సరియైన అభిప్రాయములోనికి వచ్చినట్లు తెలిసినది.

సామరస్యమును గలిగించును. అందువలననే తరచు ఆనంద మును కలుగజేయు సంఘములోను, తనకు అనుకూలమగు పరిసరములలోను నుండవలసిన ఆవశ్యకత యేర్పడినది. తన కుంటికాలికి ఎన్నిదినములు మర్దనచేసినను ప్రయోజన ము కలుగలేదనియు మానసికశక్తిని మోకాటిపై కేంద్రీ కరించి మర్దనచేసినప్పుడు త్వరగను రూఢిగను అభివృద్ధి గలిగె నని ఒక కాంతశక్తిని ప్రయోగించు వైద్యుడు నాతో చెప్పెను.

4. శక్తి క్రమాంతరమును గలదిగనుక ఒకస్థితినుండి మరియొక స్థితికి అకస్మాత్తుగను అత్యంత ఆపత్కాలములోతప్ప మార కూడదు. కనుక నల్లమందు, పొగాకు, సారాయిత్రాగుట మొదలగు ఉద్రేకపదార్థములను పుచ్చుకొను చెడ్డయలవాటు లున్నవారు దానినుండి తప్పించుకొనుటకు ప్రారంభము ఎండలో కూర్చుండుట ఆతపస్నానముచేయుట కాంతశక్తిప్రయోజనము పొంది శరీరములోనికి చొప్పించుకొని ఆ యలవాటునుండిమాను కొనుట యుచితము. (Epigastrium) చల్లబరచి ఈయుద్రేక స్వభావములను నెమ్మది పరుచుకొనుచుండవలయును. వీనికి చికిత్స ఇదే గ్రంథమున వేరొక భాగమున చూడగలరు.

5. మానసిక శాస్త్రము:— ఇది యితరులను తనను ఆత్మశక్తి చేలోబరచుకొనుటను తెల్పును. ఎక్కువ కాంతశక్తియు దృఢ మగు సంకల్పశక్తియు కలిగినవారు తమశక్తులను బహుదూ రము వ్యాపింపజేయవచ్చును. అనేకమైళ్ళదూరములోనున్న

వారైనను సునిశిత తత్త్వముగలవారి చర్యలు వీనిచే మార్చబడును. మరియును వారి మెదటిలోని కా శక్తులు ప్రవేశించి వారి సంకల్పమునే తాత్కాలికముగా మార్చివేయును. ఈ శక్తికలిగిన ఘనులగు స్త్రీపురుషు లితరుల యందలి దుస్సంకల్పములను, చెడ్డయలవాటులను పోగొట్ట సమర్థులైయున్నారు. న్యూయార్కులో నొక ఘనుడుకలడు. ఆతడు సాహచర్యమాత్రముననే అనేకులకు త్రాగుడు అలవాటును మాన్పివేసెను. వారితో నాతడొక్క మాటయేని ఆ సంబంధమున మందలించియుండలేదు. వారికి త్రాగు నలవాటు పోవుచున్నదనియు తెలియదు. అతనికి త్రాగుడునందుగల అసూయయే వారినట్లు మార్చినదనుట నిజము. జైలులో నుంచబడిన నేరస్థులును రోగగ్రస్తులై పిచ్చివాండ్ర శరణాలయములలో నుంచబడిన పిచ్చివాండ్రును పోగరుబోతుదనము గలిగి పోగరుబోతుల పాఠశాల (Borstal school) కళాశాలలలో నుంచబడిన విద్యార్థులును నానాటికి భ్రష్టులే యగుదు రనుట సునిశితతత్త్వముల స్వభావ మెరిగినవారికి సుబోధమే. అందువలననే ఇతరకాలములలో వారు చెప్పుటకును చేయుటకును రోతపడు పనులనే అప్పుడు పలుకుదురు; చేయుదురు కూడను. కాంతశక్తి గలిగి ఆరోగ్యవంతుడగువానినుండి ఆనందకరమును, రోగనివారకమును నగు శక్తి చుట్టుపట్ల నున్నవారిపై బ్రసరించును. తన తత్త్వమునకు విలక్షణమైన తత్త్వముగలవారి యందిది తప్పక వ్యాపించును. బోస్టన్ నగరమున నొక వర్తకుడు తన కాంతశక్తితో ఏబది మందిని లోబరచికొని యుండెను.

5

వా రెన్నడును అతనిమాట జవదాటి యెరుగరు. న్యూయా ర్కులో నొక వర్తకుడు ఫలాని గుమాస్తా తన వద్దకు రావలె ననియు ఫలానివాడు ఫలానిపని చేయవలెననియు మనసులో వాంఛించినంతనే వారట్లే చేయుదురు. కాంతశక్తి గల వారితో సాహచర్యమును సూర్యకాంతిని ప్రాణవాయువును నెక్కువగా లోగొనుటయు పరిశుద్ధాహారమును స్వీకరించు టయు, యమనియమములును, ప్రేమ దయ అనురాగములు గలిగియుండుటయు మానసికశక్తిని వృద్ధిచేయును.

6. మానసికశక్తివలని ప్రమాదములు:— ఒకరి మానసికశక్తివలన తన మనస్సులోనున్నదానికి వ్యతిరేకముగా చేయుట అన్యోన్య తత్త్వములకు అనుకూలముగా లేకున్నను ఒకరి మానసికశక్తివలన నొకరు వివాహము చేసికొనుట, తల్లిదండ్రులు ఒక మతసంబంధమైన రాజకీయ సంబంధమైన వైద్యసంబంధమైన త్రోవలనే తమ పిల్లలను నిర్బంధముగా పెంచుట, కాముకుడైనవాని దేహమునుండి వెడలిన శక్తిచే విముఖురాలైన స్త్రీ భ్రాంతివశమున లోబడుట. ఇట్లే పురుషు డును లోబడుట. ఇట్టి యాపత్తులు కలుగకుండుటకుగాను అత్యంత ఆరోగ్యకరమును దృఢతరమును నగునట్లు తత్త్వ మును బాగుచేసికొనవలయును. (తాను లోబడి పోవలసినట్లు తోచుట తోడనే ఆ చోటునుండి లేచిపోవలయును.) దృఢ సంకల్పముతో నుండవలయును. దురుద్దేశము లేశమైనను లేకుండినను ఒకరి మనశ్శక్తి ఇంకొకరిపై రాజ్యము చేయు చుండుటయు కలదని జ్ఞాపక ముంచుకొనవలయును.

7. ఆత్మశక్తి, ఇంద్రియజయము:— రోగనివారణమును చేయుటలో శక్తిమంతములైనవి. ఇంద్రియజయము గలిగిన యెడల ఇతరులును లోబడుదురు. మనము లోకశ్రేయస్కరుల మగుదుము. ఆత్మశక్తి యను శీర్షికక్రింద నీ విషయమింకను వివరింపబడును.

ఎనిమిదవ కిరణము

# అత్యుష్ణమువలన గలుగు వ్యాధులు

ఇవి నాడులయందు మంటలు మొదలగు నాడీవ్యాధులు, వ్రణగ్రంధులు, జ్వరములు మొదలగునవి. ఒకరకపు ఉష్ణ వ్యాధులయందు ఎరుపువర్ణమును, ఇంకొకరకపు వ్యాధుల యందు పసుపువర్ణమును ప్రధానములు.

1. నాడీదాహము, ఇతరనాడీసంబంధమగు తరుణ వ్యాధులు:— నాడులయందు ప్రవహించు ధాతుశక్తి నాడుల యందలి క్రమభిన్నతవలన చెడి, నాడుల సంబంధమగు ద్రావములు నాడులయందు సక్రమముగా ప్రవహింపక అరికట్టబడి సమముగను దృఢముగను ప్రవహింపవలసి నవి తెంపులు తెంపులుగను అమితమగు వడితోను ప్రవ హించుటవలన తీవ్రమగు నొప్పి గలుగును. ఇతరతరుణము లగు నాడీవ్యాధులును దాదాపు ఈ కారణమువలననే గలుగు చుండును. లేదా నాడులయం దుండవలసిన నాడీద్రావములు తగ్గుట సహితము తగ్గవచ్చును. న్యూయార్కు నగరవాసి యగు డాక్టర్, జార్జి హెచ్. టెలర్ "అంగమర్దన" యను తన గ్రంథమున "నాడులయం దున్న అధికమగు శక్తియే బాధ" అని చెప్పుచున్నాడు. కాని అదితప్పు. నాడులయందు శక్తి తగ్గుటవలననే బాధకలుగును. మనుష్యునియందు సమగ్రమగు ప్రాణశక్తి యున్నయెడల వాని నాడీద్రావములు నాడుల యందలి అడ్డంకుల నన్నిటిని త్రోసివేసి యెల్లప్పుడును ప్రవ

హించును. ఈ నాడీశక్తి లోపించుటకు కారణములు:— దేహపోషకమును సముచితమును నగు ఆహారము లేకుండుట. ఆపదార్థమును జీర్ణింపజేయు వ్యాయామము లేకపోవుట, ఆరుబయట గాలియు, వెలుగును అనుభవింపకుండుట, ఒక చోటనే చలనములేక కూర్చుండు నలవాటు, తనచుట్టునున్న వారికి తనశక్తిని వదలివేయుట. మిక్కిలి విభిన్నమయినట్టి కాని అత్యంత సన్నిహితమైనట్టికాని ప్రకృతులు గలవారి సాహచర్యమువలన వ్యాధివలనగలిగిన అక్రిమమగు ధాతు కర్మ, మంటలుమొదలగు వానియందు నాడీమండలముపై రక్తముయొక్క యొత్తిడి, భూమియొక్క విద్యుద్గతి ననుసరించి పరుండుటలో తప్పుదిక్కుగా తలయుంచి పరుండుట మనో వ్యాధి, అనుకొన్నపనులు అనుకొన్నట్లు జరుగక పోవుటవలన గలిగిన ఆశాభంగము, దారిద్ర్యము, బాధ్యతలు, మెదటి యందును వెన్నుపామునందును నాడులయందును స్వయముగా మంటలు గలుగుట మొదలగు దుస్థితులు గలుగును.

2. నాడీ వ్యాధులకు నివారణోపాయములు:—పై పేర్కొనినవానిలో నున్న లోపములను సవరించుకొనుట-అనగా ప్రాణవాయువును, సూర్యకాంతిని ధారాళముగా స్వీకరించుట; ప్రేమగల మిత్రుల సమావేశము; గుహ్యేంద్రియములను స్వాధీనములో నుంచుట; తల ను త్తరవు దిక్కుగా నుంచుట; నీలి కాంతిలోగాని, ఊదా కాంతిలోగాని కూర్చుండుట; శాంత్యానందములు గల మహనీయులనుండి వారి యనుగ్రహమును సంపాదించుట; తల దగ్గరనుండి వెన్నుపాము

చివరవరకును, పాదములు హస్తముల వరకును కాంత శక్తి గల వారి చేతులతో నిమిరించుకొనుట, కుడిచెయ్యి ముచ్చిలిగుంట పైనను, ఎడమచేయి మలుగులపైనను నుంచునట్లు చేయుట; నీలి- ఊదా కాంతులను స్వీకరించుట; అదేకాంతిని ఆరోపించిన నీటిని త్రాగుట; దేహతత్వము బాగుచేసుకొనుట చాల అవసరము. పొట్టపైభాగము (Epigastrium) నందు, జీర్ణకోశములందు ఉద్రేకము, జననేంద్రియములందు ఆవేశము, లోపలి అవయవములందు వైరళ్యము, వెన్నుపాము నందు వ్యాధి - వీనిని మొదట పోగొట్టుకొనవలయును. అప్పటికిగాని నాడులయందు సామరస్యము స్థిరపడదు. నాడులయందు మంట మొదలగు నాడీసంబంధమగు తరుణవ్యాధులందెల్ల శీతలోదకముకంటె ఉష్ణోదకమే గుణతరముగా నుండును. ఈ వ్యాధులకు నీలము-ఊదా కాంతి మొదలగు శీతతత్వము గల ధాతువులే గుణతరముగా నుండును. చన్నీటిలో చేతులు ముంచి కణతలు తరచుగా తడుపుచుండుటచే ముఖనాడులయందలి మంటలు తగ్గును. అచ్చటినుండియే ముఖసంబంధమైన నాడులు వ్యాపించును. దీనిని గురించిన విశేషవివరణము యీ గ్రంథములో వేరొక చోట చూడదగును.

3. మంటలు :— రక్తమునందు జీర్ణముకాక నిలిచియున్న ముతుకధాతువులలో కూడిన శుద్ధరక్తము వానిని వెలుపలికి నెట్టివేసినప్పుడు ఎర్రని పుండ్లును, పొక్కులును, వ్రణములును, మంటలును గలుగును. పిత్తరసము రక్తములో ఎక్కు

వగా చేరియున్నప్పుడు కలుగు పొక్కులనుండి పచ్చని రంగు గల చీము వచ్చుచుండును. ఈ వ్యాధి పిత్తకోశమునందు మాంద్య మేర్పడినప్పుడు గలుగును. జీర్ణక్రియ అడ్డగింపబడినప్పుడు సయిత మిది గలుగును.

4. శుద్ధరక్తము అధికమైనప్పుడు గల్గు మంటలకు చికిత్స :— నీలము లేదా చల్లని ధాతువులు. నీలమునకు ఎరుపుతో రాసాయనికానురాగము గలిగియుండుటవలన నీలి యద్దమునుండి ప్రసరింపజేయబడిన కాంతిని మంటలు గల భాగమున ప్రసరింపజేయుట, నీలిసీసాలో పోసి ఎండలో నుంచిననీటితో తడిపినవస్త్రము మంటలు గలభాగమున కట్టుట; ఆ ఎండలోనుంచిన నీటిని త్రాగుటచే గొంతు, జీర్ణాశయము, ప్రేగులు—వీనియందుగలిగిన మంటలు అత్యద్భుతముగా గారడీ వలె గుదురును. నీలిసీసాలో నీరు లేనప్పుడు మామూలు చన్నీ ఁరైనను పనికివచ్చునుగాని గుణము ఆలస్యముగా గలఁగును. నీలివర్ణోదకము వాడినప్పటివలె సుగుణము స్థిరముగా నుండదు. వేడిమిని చల్లదనముతో సమరసపరచుట విధి. కాని దేహామునందు రక్తము క్షీణించియున్నప్పుడు ఇతరభాగములందు వేడి నీటిని, మంటలు గల భాగమున చన్నీటిని ప్రయోగించుటవలన మంటలుగల భాగమునందలి వేడిమి ఇతరభాగములకు లాగి వేయబడును. మిక్కిలి సునిశితమైన నేత్రములు, జననేంద్రియములు, హృదయకోశము, ఊపిరితిత్తులు, ఉద్రేకించియున్నప్పుడు మిక్కిలి శీతలమైన ప్రయోగములు చేయగూడదు. మిక్కిలి చల్లనినీరు గాల్వానిజం యంత్రమునందలి శీతము,

క్లోరోఫారము మొదలగు అత్యంత శీతలమైన ధాతువులను ప్రయోగించిన ఉద్రిక్తమగు హృదయకోశము, ఊపిరితిత్తుల యందలి రక్తము, సంకోచశక్తి ప్రచండముగా లోనికి ప్రవే శించును గాన స్థూలమగు శీతమును ప్రయోగింపరాదు. సూర్యకాంతియందలి నీలకిరణము ఊదాకిరణము తగినంత సునిశితమైన వనియే నా నమ్మకము. నేత్రములు చెవులు హృదయకోశము మొదలగువానియందలి మంటలును, రక్త ప్రదరము మొదలగు రక్తము వెడలిపోవు వ్యాధులును పై కాంతిచే గారడీవలె కుదురును. పుల్లనిపండ్లు చల్లదనము జేయు నాహారములు పుచ్చుకొనవలయును. మాంసము, గ్రుడ్లు, చేపలు మిరియాలు మొదలగు వేడిజేయు పదార్థములను వర్జింపవల యును. మశూచికము, పొంగు, ఆటలమ్మ, మాంససంతానిక, ఉదర్దము మొదలగు పొంగుజ్వరము లన్నిటియందును చీము సంబంధముండును: గనుక శీతోదకముగాని చల్లనిగాలిగాని తగు లుటవలన ఆ పొక్కులయందలి చీము అణగిపోయి లోపలి ప్రాణావయవములను చెఱచి ప్రమాదము గల్గించుననుట జ్ఞప్తి యం దుంచుకొనవలెను. వడదెబ్బ, అంగవికృతి, స్మృతితప్పుట, శిరస్సునకు నెత్తురు వడిగా నెక్కుట, మొదలగు వ్యాధులయందు మంచుగడ్డగాని, చల్లనినీరుగాని, ముచ్చిలిగుంటకును తల వెనుకభాగమునకును వేసికట్టుట చాల ప్రమాదకరమైనది. ఈ పదార్థములు సదుటికిని ముఖమునకును, కణతలకును కట్టినయెడ మెదటియందలి రక్తమునందు ప్రతీకార మేర్ప డును. తలకు వెనుకభాగముమీదను ముచ్చిలిగుంటమీదను,

భరింపగలిగినంత వేడినీటిని పోసినయెడల నుదుటియందలి రక్తము లాగివేయబడును. విశేషవివరములు వేరొకచోట కలవు.

5. పైత్యకోశ వ్యాధులకు చికిత్స :—కాలేయము మాంద్య మునుబొందిజీర్ణక్రియయందు అందుండి ఊరవలసిన ద్రావములు రాక ఆపైత్యరసము రక్తమునందంతటను వ్యాపించియున్నప్పు డు దేహముపై పచ్చనికాంతి ప్రసరింపజేసి శీతోదకమును త్రాగవలెను. అంగారము గల క్రొవ్వు పదార్థములను, వేడి చేయు పదార్థములను మానుట హితకరము. పైత్యోద్రేక ముచే కలిగిన పచ్చ కామిలావ్యాధికి ఆసిటిక్ యాసిడ్ 6-10 రెట్లు నీటితో పలుచన చేసికాని, పలుచని నిమ్మరస మునుగాని చేతికి రాచుకొని దేహమంతయు రుద్దవలయును. క్షారస్వభావము గల పిత్తరసము ఆమ్లస్వభావము గల పైర సములతో వెలువరించి వేయబడును. కాలేయము- ప్లీహము సరిగా పనిచేయుచుండిన వ్రణములు, చీము మొదలగునవి రాకుండును. సూర్యకాంతి, ప్రాణవాయువులను ధారాళ ముగా స్వీకరించిన శుద్ధమగు రక్తకణము లేర్పడును.

6. జ్వరములు :— హృదయకోశమునందలి కండరముల యొక్క అమితచలనమువలన అమితమగు సంకోచమును కలుగును. అందువలన ఎర్రని రక్తము దేహమునందంత టను వ్యాపించి దేహమునకు మంటలు గలిగించును. జ్వరము యొక్క నిజతత్వమును హృదయకోశముయొక్క స్పందన

మును సరిగా ఇంతవరకు వివరించినవారు లేరు. ఆగి ఆగి వచ్చు జ్వరములయందు హృదయకోశచలనమునందు హెచ్చు తగ్గులను ముందు వివరింతును. రక్తము మాలిన్యయుత మైనప్పుడందు ఎక్కువ బొగ్గుపులుసు చేరును. అప్పుడది మిక్కిలి శీతస్వభావమును నీలికాంతియు గలదగును. కాన నది హృదయకోశముయొక్క కుడికర్ణికను ప్రవేశించినప్పుడు శీతస్వభావము గలదగుటవలన సంకోచపరచును. అప్పుడు సంకోచపరచు శక్తులు విజృంభించి హృదయస్పందనము తీవ్రమగును. ఈ అధికచలనము లేని రక్తము దేహభాగములందెల్ల ప్రచండవేగముతో ప్రవేశించినప్పుడు అధికోష్ణము గలుగును. దానినే జ్వర మందుము. అత్యధిక మగు పని చేయుటవలన హృదయకండరములు అలసిపోయి దేహమున కంతకును బలహీనత తోచును. అప్పుడుసహితము కాలేయమునందు అంగారమును వెలువరింపగలిగినంత గ్లూకోజ్ (glucose) తయారు కాకుండుటవలన ఆందలి అంగారామ్లము (బొగ్గు పులుసు) హృదయకోశమునకే పోయి అందది నిలిచి రక్తమును మాలిన్యయుతము చేయును. రక్తప్రచారమునందెల్ల ఈకాలేయము ప్రధానస్థానము నాక్రమించియున్నదని గ్రహింపవలెను. జ్వరము లన్నియు స్వభావమునందు వేడితోగూడినవే యైనను వీనికి మూలకారణముమాత్రము శీతమే యైయున్నది.

7. ఇదే గ్రంథములో 5 వ భాగమున ఆహికజ్వరముల యందు గలుగునట్టి ఆగి ఆగివచ్చు చలియు జ్వరమును, వీనికి

కారణములను వివరింతుము. అందు ఒకే సూదంటురాతి యందలి రెండుకొనలువలె ఒకటి వేడిమిని ఒకటి చల్లదనమును గలిగించుచు కాలేయము- ప్లీహము అను రెండుకోశములును ఉన్నవనియు వానియందలి ఊపువలన అస్వతంత్రనాడుల యందలి గమనికవలన చర్మతలమున చలియు అంతరంగమున దహించు ఉష్ణమును ఒకతూరియు, అంతరంగమున శీతమును చర్మతలమున దహించు మంటలు ఒకతూరియును కలుగు చుండునని వ్రాసితిని.

తొమ్మిదవకిరణము.

# శీతాధిక్యమువలన కలుగు వ్యాధులు.

పక్షవాతసంబంధ మగు స్థితులలో నాడీమండలమునందును, రక్తశోషణవాహికలయందును ఈ చల్లదనమువలన నిరోధ మేర్పడి అందు మాలిన్యము నిలిచిపోయి నాడీవ్యాధులు అనగా వాతవ్యాధులు కలుగును.

1. నాడీసంబంధమగు శీతాధిక్యము:-నాడీశక్తులయందు తగినంత యుద్దీపన కలిగించి శక్తిమంతముగా నుంచగల వేడిమి లోపించియున్నపుడు చలననాడీవాహికలయందు మాలిన్యము నిలిచిపోయి పక్షవాతము కలుగును. రక్తవాహికలు వాచి అవి నాడులమీద పడి నొక్కినప్పుడు మార్గనిరోధ మేర్పడును. మెదటియందలి నెత్తురుకుదపలవలనను ఇట్టిది కలుగును.

2. రక్తసంబంధమయినట్టియు, నితరసంబంధమయినట్టియు శీతాధిక్యము:— సరియయిన చలనములేని మలినరక్తమునందు ఇది కాన్పించును. మలినరక్తమునకు సరియయిన చలనము లేనందువలన దేహము పాలిపోయి కాంతిహీనమైపోవును. అందలి కేశనాడికలు తిన్నగా పని చేయలేక మాలిన్యమును చేర్చుకొని గట్టిపడి చలియు పిత్తశోషమాంద్యము తద్ద్వారా హృదయస్పందనాధిక్యమును జ్వరమును మూత్రపిండములయందు ఉరేమియా యను వ్యాధియు చివరకు

నంజును గలుగును. యకృత్తు తిన్నగా పనిచేయనియెడల చలి జ్వరము కలుగును. జీర్ణకోశము పనిచేయదు. ఆంత్రమూలము, ఆమత్వచము మొదలగునవి పనిచేయవు. కనుక జీర్ణక్రియ సరిగా నుండదు. కేశనాడికలయందు నిరోధ మేర్పడును. దానివలన ఆమవాత మేర్పడును. పైత్యరసము తిన్నగా ఊరకుండుటవలన మలము గట్టిపడి మలబద్ధక మేర్పడును. మూత్రపిండములును పనిచేయవు. మూత్రమునందలి మూత్రికామ్లము సరిగా వెలువరింపబడక అందు శిలామేహ మేర్పడును. రక్తమునందు ఎర్రకణముల కన్న తెల్లకణములు ఎక్కువగా నున్నపుడు రక్తక్షయము, పాండువు, గండమాల, శోషరసము రక్తముగా మారక నిలిచిపోవుట, శ్వాసాశయములు పనిచేయకుండుట, రక్తవాహికలయందు మురికి రక్తము నిలిచిపోవుట, కలిగి రోగకారణము లని చెప్పబడు సూక్ష్మజీవులకు తగిన నివాసస్థానముగా నేర్పడును. శ్వాసాశయ వ్యాధులయం దెల్ల వినాశకరములగు నీ సూక్ష్మజీవులు కాన్పించుచుండును. ఇంతయేల ? దేహమునకు వ్యతిరేకమయిన యీ శీతాధిక్యమువలన కాలమునందును ఋతువునందును గాలిపాటునందును మార్పు గలిగినప్పుడెల్ల రోగము కలుగు స్వభావ మేర్పడును.

3. చచ్చుపడిన నాడులకు చికిత్స :— నాడులయందలి వైహాయసములందు చలనము నుద్దీపింప చేయుటకును నాడీవాహికలయందలి నిరోధముల దొలగించి సరియయినవ్యవస్థ నేర్పఱచుటకును తెలిసినంతవరకు మూడు విధములగు శక్తి

మిక్కిలి గుణతర మయినది. ప్రధానములగు నాడీకేంద్రము లందును అవయవములందును వెచ్చని కాంతశక్తి గల చేతి నుంచుట మొదటిది. ఈ నాడీకేంద్రములందే పసుపు-తేనె రంగు కాంతిని కేంద్రీకరించుట రెండవది. ఆ ప్రదేశము లపై వేడినీటినిగాని వేడిపదార్థములుగాని ప్రయోగించుట మూడవది.

ధాతుకాంతశక్తిని ప్రయోగించుటలో మెదటి వెనుక భాగము, ముచ్చిలిగుంట, వెన్నుపాముక్రింది భాగము - వీనిపై చేతి నుంచి వెచ్చపరుచుటయేగాక చలననాడులగతి కనుగుణ ముగా చేతిని పైనుండి క్రిందికి మంత్రించినట్లు జరుపవలయును. ఏఅవయవమునందైనను స్పర్శజ్ఞానముగాని కదలించుశక్తి గాని లేకుండినప్పుడు ఉద్రిక్తమగు రక్తము ఆయానాడులను పీడించుచున్నదనియు ఇచ్ఛానాడులు అనిచ్ఛానాడులయం దలి నాడీశక్తి అరికట్టబడినదనియు గ్రహింపవలెను. ఈస్థితిని మార్చి నాడీవాహికలయందలి నిరోధములను తీసివేయుటకు చేతిని క్రిందినుండి మెదటివైపునకు అనగా పైకి జరుపవలసి యుండును. ఇంక కొన్నిటియందు చేతిని క్రిందికి చాలనము చేయవలయును. హృదయకోశమువంకకు కేశనాడికలయందలి ద్రావములు వ్యాపించును. చలనపు నాడీవైహాయసములు మెదటివంకకును వెన్నుపామువంకకును వ్యాపించును. కనుక అప్పుడప్పుడు చేతిని పైభాగమునకే చాలనము చేయవలసి యుండును. (ఇతర వివరములకు "ధాతుకాంతశక్తి" చూడుడు) వెన్నుపాముయొక్క పైభాగమునందును మధ్యభాగము

నందును చివరభాగమునందును పసుపు-నారింజ కాంతిని కేంద్రీకరించుటకు వర్ణకేంద్రీకరోపకరణముగాని రంగుకుప్పెగాని ఉపయోగించును. వర్ణచికిత్స చూడుడు. ఆదిత్యపేటికయందు మామూలు పచ్చని అద్దము వేసి కూర్చుండినను పైఫలమే కలుగును. మెడటి వెనుకభాగము, ముచ్చిలిగుంట - వీనిపై వేడినీటిని పోయుట, వెన్నుపాముక్రిందిభాగమును వెచ్చన జేయునట్టి కటిస్నానములవివరణము - జలవైద్యము అను భాగమున చూడుడు. పక్షవాతము మొదలగు నాడీవ్యాధుల చికిత్స ఈ గ్రంథముయొక్క నాల్గవభాగమున చూడుడు.

4. చల్లని కాలిక వ్యాధుల చికిత్స :— చల్లని మాంద్యస్థితులు, పాలిపోవుట, కండరములయందలి బలహీనత, నీలివర్ణాధిక్యము, అపరిశుద్ధరక్తమునందలి చలనము లేకుండుట, శుద్ధరక్తమునందు తగిన ఎరుపు లేకుండుట, ఉదరమునందలి అవయవములు పనిచేయకుండుట, వీనికి వెచ్చదనముచేయుట వలనను ఉజ్జీవనమువలనను చైతన్యమును కలిగింపవలెను. అనగా నాడీమండలము మిక్కిలిగా నుద్రిక్తమైన తప్ప వెచ్చనికాంతి శక్తిగల చేతితో ఎగువకును అడ్డముగను చాలనము చేసిన యెడల కేశనాడికలయందు చైతన్యము కలుగును. తలనువదలి ఇతరభాగములపై వస్త్రము లేకుండ సూర్యకాంతిని ప్రసరింపజేయుట, ఎర్రని అద్దముగాని ఎరుపు-ఊదారంగుగల అద్దమునుండిగాని కాంతిని ప్రసరింపజేయుట, చర్మమునకు అనుకుని ఎర్రనివస్త్రమును ధరించుట; ఆరుబయటగాలిలో ధారాళముగా ప్రాణవాయువును నోటితోగాక సాధ్యమయినంత

వరకు ముక్కుతోనే పీల్చుట; ఆవిరిపట్టుట; వేడినీటిస్నానము జేసినతరువాత చన్నీటితో కడుగుట; వేడికట్లు కట్టుట; వేడినీటికాపు; మొద్దుబారి చల్లగానున్న భాగములకు వేడినీటి సీసాలతో కాచుట; టర్కీస్నానము లేక రష్యాస్నానము, అంతకన్న గుణకరమైన ఆదిత్యపేటికాస్నానము; చలనము చేయుచికిత్స; ఒంటిని పిసుకుట, చఱచుట, రక్తోద్దీపన గలిగించు వ్యాయామము; ఆనందము నవ్వు విహారము నృత్యము ప్రేమ గలవారితో చేతులు గలుపుకొని అల్లిబిల్లిగా దిరుగుట; ప్రాణ ధారకమైనట్టియు వెచ్చనైనట్టియు పదార్థమును పుచ్చుకొనుట; ప్రేగులయందు ఉద్రేకము లేనియెడల మిక్కిలి కొద్దిగా కారముగాని, ఆవగాని వాడుకొనుట; మనఃస్థైర్యము గలిగి యుండుట; భావమును తనయందుగాక ఎదుటివారియొక్క క్షేమమునందు ప్రయోగించుట; తత్వము మిక్కిలి యుద్రిక్త స్వభావము గలదికానిచో విద్యుద్యంత్రముయొక్క సవ్యమగు భాగము దేహముయొక్క క్రిందిభాగమునకును అపసవ్య భాగము పైభాగమునకును ప్రయోగించుట; భార్యాభర్తృ సంబంధమును మితిలో నుంచుట; దురలవాటులను మానుట; సాధ్యమైనంతవఱకు సంతోషకరములగు విషయములను చదువుట, చర్చించుట.

మద్యసారము మొదలగువానిని వేడిచేయుటకుగాను వాడుట తప్పు. ఇందలి వేడిమి విషముతో కలిసియుండును. త్రాగుడుచే ఎచ్చోట వేడిమి అనవసరమో అట్టిమెదడునందు ఉద్దీపనము, వేడిమియు గలుగును. తరువాత విధిగా మెదటియందు నిరోధ

మేర్పడి మొద్దువారిపోవును. ఒకసంగీతపు జట్టులో ఒసియన్. ఇ. డాడ్జి అను నతనికి తాగు డలవాటులేదు. మిగతవారు త్రాగుటవలన ఉల్లాసమును పొందెడివారు. వాషింగ్టన్కొండ మీాది చలిని వారందరికన్నను ఇ. డాడ్జి ఎక్కువ తేలికగా భరింపగలిగెను. డాక్టర్ విల్లియం. బి. కార్పెంటర్ అను నతడు శారీరశాస్త్రమును వ్రాయుచు నందు అత్యంతశీతలప్రదేశమైన గ్రీన్లెండులో జేసిన పరిశోధనలయందు మనుష్యులు శీతమును భరించు శక్తిని సారాయి ఏ మాత్రము వృద్ధిచేయదని వ్రాయుచున్నాడు.

పదియవ కిరణము

# ఆకర్షణశక్తులు

మానవదేహమునందు వివిధములగు నాకర్షణ శక్తులున్నవి. గాల్వనిజపు యంత్రములును విద్యుత్సమ్మేళనములును నున్నవి. అవి దేహమునందంతటను సవ్యాపసవ్యాగ్రములుగా నేర్పడి. ఆత్మీయరాసాయనికశక్తులచే నడుపబడుచుండును.

1. మానవాకర్షణము:— చేతులు గుఱ్ఱపు నాడారూపము గలిగిన అయస్కాంతమువలె నేర్పడియున్నవి. అందు కుడిచెయ్యి ఉత్తరపుకొన, ఎడమచెయ్యి దక్షిణపుకొన, చేతుల వ్రేళ్లు అసంఖ్యాకములగు ఆకర్షకములు, తల సమ్మేళన అయస్కాంత (Compound Magnet) సదృశము. ఇందు నుదురు ఉత్తరపు కొన, ముచ్చిలగుంట దక్షిణపు కొనగాను గలిగి యున్నది. నాడులు రక్తవాహికలతోడను గూడిన పైత్యకోశములు Spleen రెండును బారుగానున్న అయస్కాంతమును పోలియున్నది. Spleen ఉత్తరపుకొన, పైత్యకోశము దక్షిణపు కొనగా నున్నది. అనగా మామూలుగా అయస్కాంతమునందలి విద్యుద్వ్యాపనమునకు భిన్నముగా బలముగల విద్యుద్వాహికలు కుడినుండి ఎడమవైపునకు నడచును. దేహము వెలుపల అయస్కాంతమునందలి విద్యుత్తు కుడినుండి ఎడమవైపునకు నడచును. మూత్రపిండము, జననేంద్రియనిర్మాణమునందలిభాగముల జంటయు, దాని నంటి ప్రవహించునాడులు, రక్తవాహికలు, విద్యుత్సంబంధమగు కాంతముగా నేర్పడినవి.

ఇది విద్యుదయస్కాంత (Electro Magnet) సదృశముగా నున్నది. ఈక్రింద వివరింపబడునట్లు రాసాయనికధాతుచలనమువలనను గాల్వనిజం వలనను నివి పనిచేయుచుండును.

2. మానవదేహమునందలి గాల్వనిజపు విద్యుద్దీపన యంత్రస్థానములు మెదడునాడుల సంబంధమగు ప్రధాన గాల్వనిజపు యంత్రము, (విద్యుద్దీపనస్థానము) అందలి విద్యుత్తు అసంఖ్యాకములగు కోశములవలనను కణములవలనను ఉద్భవింప జేయబడును. అందు ప్రధానకోశము వెన్నుపాము. అందలి పెద్ద కణములు మెదటియందలి గ్రంథులు, చిన్న కణములు చలననాడులయందును జ్ఞాననాడులయందును నుండు ముడులు. వీనియందలి తంతువులు నాడులును అందలి సూక్ష్మతరమగు నాడులును అయియున్నవి. రక్తమండలముల కెల్ల హృదయముప్రధానగాల్వనిజపు విద్యుద్దీపకస్థానము. ఇందు స్థూలమగుశక్తి చలనమునం ధుంచబడును. ఇందు విద్యుత్కోశములు రక్తవాహికలు. మెదడు, శ్వాసాశయములు, పిత్తకోశము, జీర్ణాశయము, ప్లీహము, మూత్రపిండములు మొదలగు వానియందలి రక్తకేంద్రములు ఇందలి కణములు. సూక్ష్మములగు రక్తవాహికలును కేశనాళికలును ఇందలి తంతువులు అయియున్నవి. అన్నినాళికలనుండియు విద్యుత్తుతో గూడిన ప్రాణవైహాయసములు ధారాళముగా నాకర్షింపబడవలయుచో చైతన్యము గలిగినట్టి రక్తము ధారాళముగా నుండుట అత్యంతావసరమయినది.

3. దేహమునందంతటను రాసాయనికసమ్మేళన నియమములు వర్తించును. ఎఱ్ఱని వేడిధాతువులను నీలిరంగుగల శీతధాతువును సమ్మేళనము నొందుటవలన రాసాయనిక శక్తులయొక్క పరిధానవ్యవస్థ కలుగుచున్నదని మన మిది వఱకు గ్రహించి యున్నాము. హృదయ కోశముయొక్క కుడివైపున నల్లని రక్తనాళమును ఎడమభాగమున ఎఱ్ఱని రక్తనాళమును కలిసి పనిచేయించుట యిందుకు సాదృశ్యము. పెద్దమెదటిలోని లోపలి భాగమున శ్వేతనీలవర్ణమైనపీచుపదార్థము అందు వెలుపటిభాగమునందలి ఎరుపు బూడిదరంగు గలిగి వెలుపలి పదార్థమునకు వ్యతిరేక స్వభావము గలిగియు దానితో కలసి పనిజేయుచుండును. అందువలననే ఇచ్చట మిక్కిలి చుఱుకయిన వ్యాపారము జరుగుచుండును. మెదటి నుండియు దేహమునుండియు జ్ఞాననాడుల శక్తులన్నియు ఆ కేంద్రముననే వచ్చిచేరును. కనుక అది పెద్ద జ్ఞానవ్యవస్థా కేంద్రమై యున్నది. అట్లనుటవలన సంకల్పము, స్పర్శ, అంతర్వాణి మొదలగునవి రాసాయనిక క్రియచేతనే కలుగుచున్నవని భావింపరాదు. అవి రాసాయనిక సమ్మేళనమువలన అనగా ఆ రాసాయనికక్రియ చైతన్యముచే ప్రేరేపింప బడినవై ఆత్మతత్త్వముయొక్క సమ్మేళనము వలన గలుగును.



బృహన్మస్తిష్కము, దీనినే పెద్దమెదడు అందురు. M చిన్న మెదడు. L మజ్జాముఖము. A నాడీ ముడుల సంబంధమగు కుటికలు.

1 వ పటము.



2 వ పటము,

ఉరమునకు సంబంధించిన స్వతంత్ర నాడీ మండలమును దానిసంబంధమగు ముడులును. 1. ఉదరమునకు సంబంధించిన మొదటి ముడి. 2. చివరముడి. U మొదటి ప్రక్కఎముక. A బృహద్ధమని, 3, 4, 5, ఉదర సంబంధమగు నాడులు. 6. బాహువుల సంబంధమగు నాడులలో భాగము.

2 వ పటమునందలి A నాడుల సంబంధమగు ముడుల సంబంధమగు కుటికలుగల భాగము. అది తెలుపుతోఁగూడిన నీలి రంగుగా నుండును. నాడులయందలి పైభాగమున నున్న ముడి కిది యెదురుగా నుండును. ఆ ముడికి F ఉపరినాడీగ్రంథియని (Superior Ganglion) పేరు. అది E దిగువనున్న నాడీగ్రంథిని అనుకొనియుండును. పెద్దమెదడునందును, చిన్నమెదడు నందునుగూడ నెరుపుతోఁగూడిన బూడిదరంగుగలకుటికలు (cells) వెలుపలనుండును. లోపల తెలుపుతోఁ గూడిన నీలిరంగుగల పదార్థముండును. అందు సన్నని యెరుపు తోఁగూడిన బూడిదరంగుగల జీరలంతటను నిండియుండును. A వెన్నుపామునకు పైచివర మజ్జాముఖమున్నది. ఇది చిన్నమెదడుతో ఒకసంధి (Pons Varoli B) వలన కలుపఁబడుచున్నది. ఈ సంధి మజ్జాముఖములందు మూఁటి యందును మెదడునందలి క్రమతకు వ్యతిరేకముగా తెలుపుతోఁ గూడిన నీలిరంగు వెలుపలను, ఎరుపుతోఁ గూడిన బూడిద రంగులోపలను ఉండును. స్వతంత్రనాడీమండలమునందలి ప్రతి ముడినుండియును, వెన్నుపామునందుండి బయలుదేరు నాడులలోనికి ఒక తెలుపుతోఁగూడిన నీలిరంగుగల నాడి యును, ఎరుపుతోఁగూడిన బూడిదరంగుగల నాడియును వ్యాపించియుండును.

నీలము, తెలుపువర్ణముగల నాడులు ప్రత్యేకముగా చలన నాడులు ఎరుపు, బూడిదరంగు గలిగిన నాడులు జ్ఞాననాడులు స్వతంత్రనాడుల సంబంధమగు ముడులలోని భాగము సహా

జముగ పసుపు బూడిదరంగు గలిగియుండును. రాసాయనిక నియమముల ననుసరించి దానితో కలియు పదార్థములు ఊదావర్ణముగా నుండునని భావింపవచ్చును. విద్యుద్దీపన యంత్రమునందు తుత్తునాగము. రాగిరేకులు సమ్మేళనము చేయబడును. మన దేహమునందును తుత్తునాగ సదృశమగు శ్వేత నీలిధాతువులును రాగితామ్రసదృశమగు ఎరుపులేక పచ్చనిరంగుగల ధాతువులును వ్యాపించియున్నవి. రాసాయనికక్రియవలన వైహాయసముల యందు తీవ్రవ్యాపారము గలిగి దేహమునం దంతటను సంపూర్ణమగు ప్రాణమును ఉష్ణమును నిండియుండును. చర్మము, లోపలి తడిపొర వీని యందు సయితము ఆమ్లపదార్థమున్నది. దానినంటి యున్న ఆమ్లత్వచము క్షార స్వభావముగలది. వీని సమ్మేళనము వలన దేహమునం దంతటను చలనాధిక్యము కలుగును.

4. జ్ఞానతత్వము:—నాడులు రక్తవాహికలు, కండరములు, మొదలగువానియం దంతటను ఈ శీతోష్ణశక్తులే యున్నట్లు తెలిసికొనినాము. కనుక మిగిలినదాని నంతటిని నడుపునట్టి ఆత్మీయ శక్తులును ఈ నియమానుసారములే అయియున్నవి. ఇందును శీతోష్ణము లవసరమే. కాని మన తత్వశాస్త్రజ్ఞులు నాడీశక్తి విద్యుచ్ఛక్తి కాదనుచున్నారు. ఏలయన దీనిని గాల్వనోమీటరుతో కొలుచుటకు వీలులేదు. అనగా వారికి విద్యుచ్ఛక్తియొక్క తత్వమే తెలియదన్నమాట. విద్యుచ్ఛక్తియం దనేక తరగతు లున్నవి. అందు స్థూలరకమగు విద్యుచ్ఛక్తియే గాల్వనిజమునందును, ఘర్షణ విద్యుత్తు

నందును వినియోగింపబడును. అయస్కాంతపు కడ్డీయొక్క దక్షిణపు కొనయందలి వేడిమిని, వేడిమిని గొలుచు యంత్రముతో నెట్లు గొలువలేమో సునిశితమును ధాతుసంబంధము నగు మానసిక విద్యుత్తులను సయితము అట్లు గాల్వనోమీటరుతో గొలువలేము.

స్పర్శజ్ఞానముతోడి చలనము కలుగవలసిన యెడల నాడుల సంబంధమగు వైహాయసములు బాధ కలిగిన భాగమున జ్ఞాననాడులగుండ బయలుదేరి మెదటికి బోయి చలననాడుల గుండ తిరిగి ఆ భాగమునకు వచ్చి చేరవలయును. మామూలు వ్యవస్థలో చలననాడులు మెదటినుండి వైహాయసములను మోయుచుండును. జ్ఞాననాడులు మెదటికి బోవుచుండును. చలననాడులగుండ వ్యాపించునెడల జ్ఞానమును కలిగించిన వైహాయసములు ఏల సంకోచమును గలిగింపవని అడుగ వచ్చును. ఏలయనగా జ్ఞాననాడులయందు శీతముకన్న ఎక్కువ బలమైన ఉష్ణతత్వ ముండును. వేడివలన సంకోచము కలుగదు గదా! జ్ఞాననాడులు సయితము చలననాడులవలెనే శీతోష్ణశక్తులకు వివిధములగు వాహికలను గలిగియున్నవి. పై చెప్పిన దానిని ఉదాహరణపూర్వకముగ చెప్పుచున్నాను. ఒక వేలిచివర దేనితోనైన గుచ్చితి మనుకొనుము. రెండు కారణముల చేత ఇతరచోట్లకన్న ఆ చోటున బాధ ఎక్కువగ గలుగ నున్నది. ఎందుకనగా—చురుకుతన మెక్కువగా నుండును.

1 అచ్చట నల్లుకొనియుండు రక్తకణము లధికముగా నుండుట చేతను వేళ్లకొనల స్పర్శాపరికారము లధిక మగును. 2 కొణ

ములందు విద్యుత్తులు బిఱ్ఱబిగిసికొనియుండుటచేతను వ్యాకోచము అధికముగా నుండును. ఆ పొడిచిన చోటునుండి వైహాయసములు అత్యుద్రేకముతో చేతియొక్క జ్ఞాననాడుల వెంటను అచ్చుటనుండి వెన్నుపామువరకును పోవును. వెన్నుపాము లోనికి జొరబడునప్పుడు అచ్చుటనున్న నాడియందలి ముడిలో నుండి పోవునుగాన మిక్కిలి చురుకుదనమును బొందును. అచ్చుటనుండి కొన్ని జ్ఞాననాడుల సంబంధమైన తంతువులు మెదడునకు బోవుననియు, కొన్ని అచ్చుటినుండియే పొడిచినచోటికి తిరిగివచ్చి చేరుననియు అందువలన మెదడునగాక కుట్టిన చోటనే నొప్పిగలుగుచున్నదనియు శారీరశాస్త్రజ్ఞులు కొందరు కనుగొనిరి. మామూలుగా కొందరనుకొనినట్లు మెదటి లోని బూడిదెరంగుగల పదార్థమువద్దనే జ్ఞాననాడుల సంచార మాగిపోయినయెడల వ్రణాదులయందలి బాధ మెదటిలోనే తోచి వ్రణము గలిగినచోటు ఏర్పఱుపనసాధ్యమై యుండెడిది. అట్లుగాక జ్ఞాననాడుల సంచారము వెన్నుపాములో నాగిపోయి యుండినను మనకు బాధానుభవము అగమ్యగోచరముగానే యుండెడిది. లేదా? అవ్యక్తమయిన ఫలమయినను కలిగి యుండెడిది.

**2.** శబ్దస్పర్శరూపరసగంధముల అనుభవములు:- దేహము నందంతటను రాసాయనికనియమానుసారిణులైవర్తించు శీతోష్ణవాహికల గమనమువలన కలుగుచున్నవి. అన్నిటికన్నను మిక్కిలి సునిశితమైనది నేత్రము. ఇతరవస్తువుల గమనమువలన నేత్రమునందు రూప మేర్పడుచున్నది. అంతకన్నతక్కువ

సున్నితమైన చెవి వైహాయసములయందును వాతావరణము నందలి వాయువునందును శబ్దము గలుగుచున్నది. వాయువు లందుగల గంధమును నాసిక గ్రహించుచున్నది. జలమునం దును అర్ధఘన పదార్థములందునుగల రుచిని జిహ్వ గ్రహించు చున్నది. ఘనపదార్థములు, ద్రవపదార్థములు వాయువులై వైహాయసములయందలి స్పర్శను చర్మము గ్రహించుచున్నది. రంగు వెల్తురు వీనివలన ఈ ప్రపంచమంతయు మానవునకు వ్యక్తమగుచున్నది. తేజస్సంబంధమగు వైహాయసములనే దృష్టి గ్రహించుచున్నది. నేత్రములందలి అంతఃపటలము (Retina) నందు శీతోష్ణతత్వము లున్నవి. అందు శీత శక్తులు వెలుగులోని ఉష్ణవర్ణములను, ఉష్ణశక్తులు శీతవర్ణము లను గ్రహించును. నేత్రమునందలి ఎరుపుధాతువు నీలికిరణ ములను ఆకర్షించును. అందలి ఊదాతత్వము పచ్చనికిరణ ములను, ఇశ్లే ఇతరవర్ణములను ఆకర్షించును. జ్ఞానవ్యవస్థా కేంద్రమునకు వెలుగునందలి వైహాయసములు తమరూప మును పంపును. అచ్చట నది బింబితమై రూపమేర్పడుచున్నది. అదియే మనకు చూపైనది. మానవుని నేత్రమునందు 438000 నాడీతంతువులును 3630000 అంతఃపటలసంబంధమైన కోణ ములును తంతువులును గలవని వియన్నాలో అకాడమీ యెదుట హోర్ సాల్వాజర్ అనువారు లెక్కించియున్నారు.

గాలిలోని తరంగములు గూబకు తగిలి శీతోష్ణవైహాయసముల వలన చెవిలోపలిభాగమునకు బోయి కర్ణావృత్తి (Cochlea) కి తగులును. అదియే శబ్దవిషయమున ప్రధానభాగము.

అచ్చుటనుండి కర్ణనాడికిని దానినుండి జ్ఞానవ్యవస్థాకేంద్రము నకు జేరును. కర్ణావృత్తియందు 3500 వెలుపలను, 5200 లోపలను, మొత్తము 8000 పైసంఖ్యగల వీణాతంతువులవంటి తంతువులు సంతతమును వృద్ధిని బొందుచు ప్రతిధ్వనిని బహు సునిశితముగా స్థూలసూక్ష్మతరతమభేదములతో మెదటికి జేర్చును. నీటిలోనున్న చెవికి ధ్వనిని జేర్చుట సాధ్యమగును. మఱియు నందలాది మైళ్లదూరమున నున్నవారికి టెలిఫోను ద్వారా వార్తను బంపవచ్చును. దీనివలన మనము గ్రహింప వలసిన దేమనిన ధ్వనియందలి ప్రధానతత్త్వము వాయుతరంగ ములు గాక అంతకన్నను వడియు నైశిత్యమునుగల వైహాయస సంబంధమైన ద్రావమై యున్నదని గ్రహింపవలెను. ధ్వని ప్రసారమునకు వాయు వొక అవసరపదార్థమే యగును. గాన సంబంధమగు మృదుధ్వనులను అది సమరసపరచగలదు.

ఘ్రాణేంద్రియము వాయువునందలి సూక్ష్మరేణువులలోని వాసనలను గ్రహించును. పువ్వులయందలి వాసనకు కారణమైనట్టియు అమ్మోనియావాసనకు కారణమైనట్టియు, ఇంక నితరములగు సుగంధవృక్షములనుండి వచ్చు వాసనకు కారణమైనట్టియు రోగులదేహమునుండివచ్చు వాసనకును, గారణమైనట్టి రేణువులు వాతావరణమునందలి తరంగముల యందుండును. నాసికయందలి ఆమత్వచమునందు ఒకానొక భాగమున ఈ వాసనను రాసాయనికముగా స్వీకరించునవి యుండును. ఘ్రాణనాడిచే లోనికీవాసన వహింపబడును. ఈ ఘ్రాణనాడికి మూడుమూలము లుండును. ఇందలి మధ్య

మూలము ఎరుపు బూడిదరంగు గలిగియుండును. వెలుపలివి శ్వేతనీలవర్ణముగా నుండును.

నాలుకయొక్క పైభాగమునందున్న అసంఖ్యాకములగు గుట్టల వంటి పదార్థము తోడి సమ్మేళనమువలన పదార్థములకు రుచి గలుగుచున్నదని భావింపబడుచుండెను. కాని పరిశోధనల వలన పదార్థములు బాగుగా ద్రవరూపమును పొందించి నాలుకయొక్క పైభాగము నోటిలోని పైభాగపు కప్పునకును మధ్యనుండి రెండును సమావేశపరచినప్పుడే రుచి తెలియును. ఒక ద్రాక్షపండుగాని రేగుపండుగాని కొద్దిగా చర్మముతీసి ఆ భాగము నాలుకమీదను, చెక్కుతీయనిభాగము అంగిలికిని తగులునట్లుంచినయెడల నోటి కాపండుయొక్కరుచి తెలియదు. ఏలయనగా రుచిని గ్రహించునట్టి శక్తియొక్క గమనము మొదట నాలుకనుండి మెదటికిని, తదుపరి మెదటినుండి నాలుకకును రావలసియుండగా చెక్కుతీయని భాగము ఆ సంచారమును అరికట్టుచున్నది. ఘనపదార్థములకన్న ద్రవ పదార్థములవలన ఈశక్తి యెక్కువ ధారాళముగా వ్యాపించును గాన పదార్థములందలి రుచి దానిని బాగుగా నీరగునట్లు నమలినపుడే తెలియుచున్నది. విద్యుచ్ఛక్తివలన రుచి వహింపబడుచున్నది. నాలుకపై ఒక రాగినాణెమును, అంచులు కలియునట్లు ఒక వెండినాణెము నొకదానిపైనను ఉంచి నోరు మూసినయెడల ఒకవిధమగు సంచలనము కాన్పించును. నాలుకపైన మూడు రకములగు కండకము (గుట్ట) లున్నవి. మిక్కిలి కొద్దిసంఖ్యగల గుండ్రని పెద్దకండకములు ఒకరకము,

రెండవరకము నూగువలె నుండును. మూడవ రకము కోణము తేలి దారమువలె నుండును. నాలుకపైనుండు నీ కండకము లందు కొన్ని యెఱ్ఱధూళిగా నుండి మనము తినిన చల్లని స్వభావముగల పుల్లని పదార్థములను ఆకర్షించును. నీలిధూళిగా నుండునవి వేడిస్వభావముగల ఊరాదులను చక్కెర పదార్థములను ఆకర్షించును.

ఉద్దీపకములగు పదార్థములను, మసాలాలను తినుట కలవాటు పడుటవలన జిహ్వా చెడిపోనియెడల దేహమున కవసరమగు వస్తువులను స్వీకరించుటకే నాలుక తయారుగా నుండును. కనుక నాలుకచేయు హెచ్చరికను గమనింపవలసియుండును.
జిహ్వాకు నే మాత్రము రుచిగానుండని పదార్థము సరిగా జీర్ణము కానేరదు. అది నములునప్పుడు లాలాజలము సరిగా ఊరదు. జాఠరాదిరసములును సరిగా ఊరవు. రోగములను గలిగించు పదార్థములయందలి ప్రీతిని క్రమముగా తగ్గించు కొనవలెను.

ఇచ్ఛను గురించి వ్రాసినప్పుడు స్పర్శ యెట్లు గలుగుచున్నదో వివరించితిని.

6. దృష్టి:—ఇదియును అన్ని జ్ఞానేంద్రియమువలెనే రాసాయనిక క్రియలవలననే గలుగుచున్నది, అనగా శీతోష్ణ శక్తులు దేహమునం దెట్టి ఆటంకములు లేక ప్రవహించినప్పుడే సరిగా నవి పనిచేయును. అందువలన మన దేహమునకు సూర్యకాంతియు, శీతోష్ణములగు జలమును, వ్యాయా

మము, కాంతశక్తి, బ్రహ్మచర్యము, హితమితాహారములును చాల అవసరమైయున్నవని గ్రహింపవలెను. వీనిని సంపాదించుటకు అవసరమగు మానసికశక్తిని అలవరచుకొనవలెను.

7. శారీరక శాస్త్ర వేత్తలు:—రాసాయనిక శాస్త్రమునందలి సునిశితభాగమువారి కింకను అగోచరముగనే యున్నది. వారికి దృశ్యమగు స్థూలపదార్థములుమాత్రమే గోచరించును. వారు సునిశితములగు అదృశ్యశక్తులగురించి ఆలోచింపనైన బ్రయత్నింపరు. వారికన్న కొంచెము ముందుపోయి అదృశ్య శక్తులను వివరించినట్టివారిని మోసగండ్రనియు, అతివాదులనియు, నిందింతురు. సర్వమునకు మూలకారణ మగు అనిశితశక్తులను గుర్తించినప్పుడే నిజమగు వస్తుస్వభావము తెలియును. ఇప్పటికే ఎక్సురే - అను దానిద్వారా మానవ దేహములలోపలనున్నదానిని చూచుటకు సాధ్య మగుచున్నది. ఇట్టిఅతీంద్రియశక్తి మానవులకుసయితముండుట సాధ్యమనియు, దానిద్వారా అగోచరవిషయముల నెఱుంగుట సాధ్యమేననియు తెలిసికొనవలయును. మున్ముందు అతీంద్రియదృష్టియు, అతీంద్రియశ్రవణమును వాడుకలోనికి రాగలవు.

పదునొకండవ కిరణము

# మానవులలోని వివిధ తత్వ్వములు.

మానవదేహములను తత్వ్వముల ననుసరించి 5 విధములుగా భాగింపవచ్చును. 1 మానసికతత్వ్వము. 2 దృఢతత్వ్వము. 3 కండరతత్వ్వము. 4 పోషకతత్వ్వము. 5 ఎముకపుష్టిగలతత్వ్వము. వీనిని తెలుసుకొనుటవలన ప్రాణముయొక్క తత్వ్వము బోధపడును. వీనియొక్క వివిధస్వభావములనుగురించి యిదివరకెచ్చటను వివరింపబడియుండలేదు. నేనిచ్చట కొంతవరకు వివరింప బ్రియత్నించెదను.

1 మానసికతత్వ్వము. దీనినే నాడీతత్వ్వ మనవచ్చును. ఈ తత్వ్వము గలవారియందు నరములు పటుత్వ్వము గలిగియుండును. మెదడునందలి బూడిదరంగుగల పదార్థమునుండి జ్ఞాననాడుల వెంట వ్యాపించునట్టి నాడులయందలి వైహాయసములు మిక్కిలి వేగముగా ప్రవహించుచుండును. అందువలన బృహన్మస్తిష్కమునందు జరుగు వ్యాపారము మిక్కిలి చురుకుగా జరుగుచుండును. ఈ తత్వ్వము మిక్కిలిగా పరిపక్వమైనవారియందలి, జ్ఞాననాడులయందలి వైహాయసములు మిక్కిలి చురుకుగను, సునిశితముగను నుండును. ఈ వైహాయసములు, మెదడునందలి ముందుభాగమునందు చురుకుగా పనిచేయును. నెమ్మదిగా పనిజరుగుచుండు లావుమెదడునకన్న చురుకుగా పనిజరుగుచుండినయెడల చిన్నమెదడైనను నెక్కువసమర్థమగును. ఇతరవిషయములు సమముగా నున్నయెడల చిన్నమెదడు కన్న గొప్పమెదడు ఎక్కువ శక్తి

వంతమై యుండును. ఈ తత్వము ప్రధానముగా నున్నవారికి



3 వ పటము. కెలోరైన్ గిల్మన్.

ముఖమునందలి క్రిందిభాగమును కంఠముకన్న, నుదురు, శిరస్సుయొక్క పైభాగ మెక్కువ యున్నతముగా నుండును. 4 వ పటములోని కవయిత్రియగు శ్రీమతి కెలోరైన్ గిల్మన్‌యొక్క పటమును జూడుము. ఇట్టితత్వము లందు దేహశక్తులు మెదడు వంకకు లాగివేయబడి దేహతత్వము బలహీనము గానుండును. ఈతత్వములందు చర్మము పాలిపోయి పలుచగానుండును. నాడులన్నియు మిక్కిలి సునిశితముగా నుండును. అధికమగు చదువువలనను, మానసిక వ్యాపారమువలనను, మనిషి చిక్కి శల్యావశిష్టముగా నుండి, చూడ నసహ్యముగా నుండును. 5 వ పటము చూడుము. ఫౌలర్ అండ్ వెల్స (Fowler and Wells) వారి ప్రచురణమునుండి యీ పటము గైకొంటిని. అటువంటివారు చిన్నతనమున చదువుట తగ్గించి వీలైనయెడల పాఠశాలకుకూడ పోకుండనాపి గాలిలోనుఎండలోను ఆడుకొనవలయును. లేనియెడల నెచ్చోటను సూర్యకాంతి కాన్పించదో అట్టి సమాధులయందు వారిని బూడ్చిపెట్టవలసి వచ్చును.



4 వ పటము.

ఫౌలర్ అండ్ వెల్స్.

మానసికతత్వమును రెండువిధముల గుర్తింపవచ్చును. 1 శిరస్సుయొక్క పైభాగ మెత్తై యుండుట, 2 నుదురుయొక్క ప్రాధాన్యము. మానసికసంబంధములగు, సునిశితములును, విశాలములును నగు వైహాయసములు గల తత్వము గలవారి శిరస్సు మిక్కిలి యెత్తుగా నేర్పడి యాకర్షవంతముగా నుండును. ఇంకను కొందరియందా వైహాయసములే తక్కువ సునిశితములును, సంకుచితములునునై యుండినయెడల నేత్రములమీద నుండుభాగము ముందునకు పెరిగియుండును. కారణము వేరొకచో వివరించెదను. విశాలమగు నుదురును, నెత్తైన శిరస్సును గలవారిది మత సంబంధమైన మానసికతత్వము. అనగా ప్రపంచమునందలి వస్తువులయొక్క పరమార్థము వారికి సులభముగా గోచరమగు చుండును. చిరకాలముక్రిందట జీవించి యుండిన సర్ యిసాక్ న్యూటన్ (Sir Isac Newton) అను వారియందీస్వభావ ముండెను. వారి పటమువలన దానినే గుర్తింపగలము. ప్రతివస్తువుయొక్కయు కేవల బహిరంగరూపమునకన్న



5 వ పటము.
సర్ యిసాక్ న్యూటన్.

వాని కాంతర్యమగునట్టి తత్వము నాతడు గ్రహింపగలిగి యుండెను. అతీంద్రియమగు నతని మానసికశక్తివలన

నాత డనేక నూతన విషయములఁ గనుఁగొనఁ గలిగెను. నుదురు వెడల్పుగ నుండి కన్నులకన్న నుదురు ముందునకు నెక్కువగా వచ్చియున్నయెడల వానికి దీర్ఘదర్శిత్వమును, వివేచనయు నుండును. ఇందు ఎత్తుగా అనగా నిలువుగా పెంపక ముండదు. ఏలయనగా నిట్టివారియం దున్నతములగు జీవము, ఆత్మ వీనియొక్క వివేచన గాక భౌతికపదార్థముల యొక్క బహిరంగస్వభావమునందలి వివేచనయు, దీర్ఘదర్శిత్వమునే యుండును. వారికి సునిశితమగు ఆత్మయొక్క నిత్యత్వము మనస్సులోనికే రాదు. వారు భావింపజాలరు. నేటి ప్రకృతిశాస్త్రవిజ్ఞానుల రక మిట్టిది. ఫారడే, హక్స్లే, హెకేల్, టిండాల్, మేయర్ మొదలగువా రిట్టివారు. భౌతికపదార్థములయొక్క దృశ్యమైనట్టియు, మితమైనట్టియు, స్వభావమునుగురించిన, వివేచనయందు వారు దక్షులే యగుదురు. వారావిధముగ నుపయోగమైనపనినే జేయుచున్నారు. కావి వారిమనస్సు అంతకన్న పైకి పోఁజాలదు. వారు పదార్థములయొక్క అంతర్యమగు ఆత్మతత్వమును గురింపఁజాలరు. కనుక వారికి శక్తియొక్క నిజమగు స్వభావము బోధపడదు. భౌతికపదార్థములయొక్క అంతర్యమును సులభముగా గ్రహింపఁగల యిత



6 వ పటము. ప్రొఫెసర్ టిండాల్

రులను పిచ్చివారనియు, మిథ్యావాదులనియు, వారు చెప్పు దురు. ఇది ఈ కాలమునందలి ప్రకృతిశాస్త్రవిజ్ఞానులలో నొకరగు ప్రొఫిసర్ టిండాల్ గారి శిరస్సు 6 వ పటము. భవిష్యమునందలి సత్యవిజ్ఞానులశిరస్సు పైననేగాక ప్రక్కలను, వెనుకను, క్రిందిభాగముననునయితము వృద్ధిబొంది సౌష్ఠవముగా నుండును. వానికి నిహపరములు రెండును సమముగా ప్రీతిదాయకములే యగును. సత్యము తెలిసికొనుటయందు అతఁడు ఒక కాలమునందే అనేకపతుసిద్ధాంతములను, కార్య కారణముల నెఱిగియుండుటయందును సమర్థుఁడై యుండును. స్విట్జర్ లెండులో పండితుఁడగు డాక్టర్ రీన్స్టెడ్ (Dr. Reinstadt.) ప్రవాసిగా నున్నాడు. వాని యందలి తర్క, వేదాంతశక్తుల నత్యధికముగా నతఁడు వృద్ధిపఱచుకొనియున్నాడు. దానివలన వాని భౌతికకాయమంతయు శుష్కించిపోయినది. ఇం దతని ముఖమునందలిదిగువభాగము శుష్కించి కాన్పించును. కన్నులపైభాగములోనికీడ్చుకొనిపోయినది. అనగా నతనికి బయటిప్రపంచముతో సంబంధము లేదనియు, వానికి దీర్ఘదర్శిత్వము లేదనియు తెలియునది. కన్నులపైభాగమున కింకను పైగా నుండెడి వివేచనభాగము నుదురులో నెత్తుగా నున్నది. అనగా నతనికి సిద్ధాంతములు బాగుగా తెలియునుగాని అనుభవము చాలలోపించియున్నదనియర్థము. ఇతఁడు శాస్త్రజ్ఞానియేగాని అనుభవజ్ఞాని గాడు. ఈ తత్వము



7 వ పటము.
రీన్స్టెడ్.

అత్యధికముగా వృద్ధినొందినవారు నడచుట. ఆరుబయట శరీరపరిశ్రమచేయుట, శిరస్సు నుత్తరముగా నుంచి నిద్రించుట చేయదగినది. నాడీవ్యాధికి చికిత్సను ఈ గ్రంథమునందలి 8 వ కిరణములో చూచునది.

2. దృఢతత్వము :— శుద్ధరక్తముయొక్క తీవ్రగమనమునుబట్టి యీ తత్వ మేర్పడును. నాడీతత్వమునందు జ్ఞాననాడులు చురుకుగా నుండి, వేడిమిని గలిగించును. ఇందన్ననో శుద్ధరక్తముయొక్క గమనమునందు చురుకుదనమువలన వేడిమి గలుగును. మెదడునందు ముందుభాగమున వివేచనశక్తి యుండును. రాసాయనికానురాగవశమున దానికిని మెదటి యొక్క వెనుకభాగమునకును సంబంధ మేర్పడి అటనుండి మెడనరములకును, శ్వాసాశయములకును సంబంధ మేర్పడియుండును. ఎవరియందు వివేచనశక్తి యెక్కువగా నుండునో వారి శ్వాసాశయములలోని బలము పైజెప్పిన మార్గమున మెదడుయొక్క ముందుభాగమునకు లాగివేయబడును. కనుక బాగుగ వివేచన చేయగలవారు బిగ్గరగా మాట్లాడ జాలరు. గొప్ప ఉపన్యాసకులుగా నయితె ముండఁజాలరు. ఈ దృఢతత్వము రక్త సంబంధమైనది యగుటవలన హృదయముతోడి ప్రధానమైన సంబంధము గలిగియుండును. అందుండి మెడగుండ శిరస్సులోనికి ఒక పెద్ద శుద్ధరక్తవాహిక వ్యాపించియుండును. దానికి 'మన్య' (Carotid) అని పేరు. కనుక దృఢమైనహృదయము గలవారియందీ ధమని బలముగా శిరస్సులోనికి రక్తమును వహించుచుండుటవలన కపాలమునందును

గొన్ని మార్పులు గలిగియుండును. దృఢతత్వము గలవారికి చెవులకు పై భాగమునను, ఎదుటను ముఖము బలిసి వెడల్పు అయి యుండును.

ఈ దృఢతత్వమునందు ఎఱ్ఱని శుద్ధరక్తముయొక్క వ్యాప్తి యెక్కువగా నుండుటవలన దేహమంతయు నెఱ్ఱగ నుండి ఉష్ణముగానుండును. ఎఱ్ఱనైనట్టిగాని, గోధుమరంగైనట్టిగాని, తేలిక ధూమవర్ణమైనట్టిగాని వెంట్రుకలుండును. కండరములు దృఢముగా నుండును. కణతలవద్ద వెడలుపుగా నుండును. నాడి దృఢముగా నుండును. భావము ఉద్రేకముతో గూడియుండును. కోర్కెలును తీవ్రముగనే యుండును. ముఖముయొక్క దిగువ భాగమును, మెడయును అచటికి శుద్ధమగు రక్తము అధికముగా బ్రవహించుచుండుటవలన, బలసి యెఱ్ఱగా నుండును.




8 వ పటము. విక్టోరియా రాణి.

ఈ తత్వమునందు కన్నులు తప్ప మిగతభాగము లన్నియు నెర్రగనే యుండును. రాసాయనికానురాగవశమున నేత్రములు మాత్రము, నీలిధూళిగాగాని తెల్లగాగాని యుండును. ఊదారంగు పుష్పములనేకము లందు వ్యతిరేకవర్ణమగు పసుపు

రంగు పుష్పొడి, కేసరములుగా నేర్పడుట కలదుగద. విక్టోరియామహారాణిగారి తత్వ మీాదృశతత్వములోనిది. 8 వ పటము చూడుడు.

కపాలమునందు గలుగు అభివృద్ధిని గురించి కొంచెము చెప్పవలసియున్నది. దేహక్రియలను బట్టియే కపాలమునందు మార్పులు గలుగును. చెవులకు సమీాపమునను, వెనుకవైపునను వెడలుపు ఎక్కువగా నున్నవారు ఉద్రేకస్వభావులును కామాధిక్యతాదినాశకస్వభావము గలవారుగను నుందురని కపాలశాస్త్రజ్ఞులు చెప్పెదరు. దేహమునందలి యెట్టిని వేడియైన, ధమనులలోని రక్తము, ముందునుండియు వెనుకనుండియు మెదడులోనికి అత్యంతముగా ధమనులవెంటఁ బ్రవహించుచున్నయెడల మెదడునందుద్రేకము గలుగును. అందునా మనుజుడు భావోద్రేకస్వభావుడును, చులుకైనవాడును నగుట సహజమేగదా. అట్లు మెదడునకు చేరు రక్తముయొక్క పరిమితి వృద్ధియైన కొలఁదిని చెవుల కావలనీవలను దిగువను, ముఖమును, కంఠమును లావెక్కుటయును సహజమేగద. రక్తమును, నాడుల సంబంధమగు వైహాయసములును, మెదటియొక్క వెనుకభాగమునకు చేరి అందునుండి కామశక్తులను నెట్లు చేరునదియు; మెదడుయొక్క వెనుకభాగము తన వ్యవస్థను బలపఱచుకొనుటకై మెదటియొక్క ముందుభాగముతో నెట్లు కలిసి పనిచేయునదియును; వైహాయసములందలి సునిశితతమము లగునవి తేలిక యగుటవలన

నెట్లు శిరస్సుయొక్క పైభాగమునకు చేరునదియును; దాన వివేచనాశక్తియు, ఆత్మవివేకమును, విజ్ఞానమును ఎట్లు వృద్ధి బొందునదియును వివరించుట కిచట తావు లేదు. దైహిక మానసికమగు నీక్రియాకలాపమంతయు భౌతిక మగు క్రియలవలన మాత్రమే గలుగుచున్నదని నేను చెప్ప దలచుకొనలేదు. మనస్సు, అంతరాత్మ, వీనియొక్క స్థితి కంతకును, వానియందలి గమనమునకును, సామరస్యము నకును ఏదో అతీంద్రియమును, అవ్యక్తమును నగు తత్త్వ మొకటి యుండవలెను. దానినే జీవమని గాని ఆత్మయని గాని మన మందుము.

8వ కిరణమునందు వివరించినట్లు, దృఢతత్త్వము అత్యంత మగునేని దేహతత్త్వమంతయు ఉద్రేకత్తియుండును. కామ క్రోధాదులు అతివేగవంతముగ వారియందుండును. ఈ తత్త్వ మత్యంతము లోపించియుండిన యెడల దేహమునందు చైతన్య ము గలిగించి, ఉజ్జీవింప జేయవలసియుండును. ఆరుబయటి గాలిలోని ప్రాణవాయువును, సూర్యకాంతియు, తతాత్రిపి అందలి యెఱ్ఱని కిరణములును, కాంతశక్తితోగూడిన మర్దన, ఉష్ణకరములగు నాహారములు అట్టివారికి నుపయోగకర ములుగా నుండును. ఇంగ్లండునందువలె తేమతోగూడిన గాలి యందును సముద్రప్రాంతమునను నివసించినయెడల, అచటనుండు ప్రాణవాయువువలన దేహమునందలి హైడ్రజము అత్యంతముగా వృద్ధిబొంది, దేహముయొక్క రంగు గులాబివర్ణముగా నుండును. ఆంగ్లోశాక్సనులు, ట్యూటను

లును అతులపరాక్రములుగా నుండుట కిదియే హేతువు. ఇంగ్లండుదేశపు రాజులలో నొకరగు 8 వ హెన్రీపటమిది. అతనికి బాగుగా వృద్ధి బొందిన దృఢతత్వమును, ఇకముందు వర్ణింపబడనున్న పోషకతత్వమును గలిసి యున్నవి. ఇతడు పరాక్రమవంతుడు, భోగపరాయణుడును. ఇతనికిగలపరాక్రమము



9 వ పటము: 8 వ హెన్రీరాజు.

నవ్యమార్గమున నడువకుండుటవలన రాక్షస కృత్యముల కుపయోగపడినవి. ఇట్టివారియందు మతసంబంధమగు విజ్ఞాన మధికముగా వృద్ధిబొందవలసి యున్నది. ఈతత్వమునే రక్త తత్వమనియు బిలుచుట కలదు. ఇకముందు వర్ణింపబోవుచున్న కండరతత్వమునందును రక్తముయొక్క గమనమే ప్రధానమై యుండుటవలన దృఢతత్వము కండరతత్వములు అను నేనుంచిన పేర్లే న్యాయమైనవని గుర్తింపఁగలరు.

3. కండరతత్త్వము :— మానసికతత్త్వమునందు వేడియగు జ్ఞాననాడులును దృఢతత్త్వమునందు వేడిగల శుద్ధరక్తమును ప్రధానములు. ఇఁక కండరతత్త్వమునందో చల్లని చలననాడులును, చల్లనిసిరలయందలి రక్తమును ప్రధానములు.

పూర్ణమగు కండరతత్త్వమునందు ముఖము పసుపు ధూళిగాగాని, నల్లగాగాని యుండును. నల్లని నలుపుగాగాని, బిరుసుదనముతో గూడిన నలుపురంగుగాగాని వెండ్రుక లుండును. దేహభాగములు విస్పష్టముగా ఉన్నతములై యుండును. స్థిరమును, దృఢమును నగు నాసిక యుండును. కండరములు దృఢములును, కఠినము లై యుండును. ఇందు మానసికతత్త్వము కన్న చురుకుతనము తగ్గియుండును. దృఢతత్త్వమునందు కన్న ఇందు దేహముయొక్క సౌకుమార్యము ను, మార్దవమును తగ్గియుండును. నెమ్మదియు, నిశ్చయము, బలము — ఇందలి ప్రధానలక్షణములు. 10 వ పటము చూడుడు. జనరల్ జాక్సన్ అను సేనాధిపతియం (Gen Jackson) దీకండరతత్త్వము బాగుగా వృద్ధినొందినది. మరియు నిందు మానసికోన్నతియు గాన్పించును.



10 వ పటము. జనరల్ జాక్సన్.

అయితే, మలినరక్తముయొక్క ప్రాధాన్యమువలన కండర ములు వృద్ధిబొందుట యెట్లు సాధ్యమగును ? మలినరక్తము నందు అంగారాది ఆమ్లములుండును. ఆమ్లములు శీతవీర్యము గలవి. రాసాయనికానురాగవశమున నివి కండరములకు కారణమగు ఉష్ణతత్వములను, శుద్ధరక్తమునందుండి లాగి కండర పుష్టినిగలిగించును. దేహముయొక్క పైభాగము పసుపుధూళిగ న్నునలుపుగను నుండుట కేమి హేతువు? ఈతత్వమునందు పైత్య కోశము తిన్నగా పనిచేయదు. అందువలన జీర్ణక్రియ కుప యోగపడవలసిన పైత్యరసము జీర్ణాదిరసములతో చేరదు. అదిరక్తములో గలియును. అందువలన నది చర్మగతమై దేహ మున కారంగుల గలిగించును. ఇందువలననే పూర్వులీతత్వ మును పైత్యతత్వమని పిలిచిరి. ఇందు మలినరక్తమెక్కువగా నుండునా? లేదు. అంగారాది ఆమ్లములు రక్తములో నధిక ముగా నుండుటవలన, మలినరక్తవాహికలు చిక్కని నీలిరంగు గల వగును.

చిక్కని కాఫీని అధికముగా వాడుటవలన చర్మము నలు పెక్కును. పొగాకు నయిత మట్టిదే. మాంద్యముగల కార్జ మును, మలినరక్తమునే, దేహమునకు నలుపురంగు గలుగుటకు ప్రధానకారణములు గావు. సూర్యకాంతిలో నధికముగా నివ సించువారియందు నలుపురంగును గలిగించు అంగారము ఎక్కువగా జేరును గాన దాన నయిత మది గలుగును. వారే యింగ్లండు మొదలగు సూర్యకిరణప్రసారము తక్కువగా గల ప్రదేశములకుఁబోయినయెడల వారిదేహము తిరిగి తెల్లబడును.

4 పోషకతత్వము :— జీర్ణమండలమునకును, మేదస్సునకు ను నిది సంబంధించియుండును. దీనినే తప్పుగా మేద స్తత్వమని పిలుచుటయునుగలదు. మనము భుజించు నాహారపదార్థములను అన్నరసముగను, శోషరసముగను, క్రొవ్వుగను, రక్తముగను కండరములుగను, ఎముకలు మొదలగువానిగను మార్చున దీ తత్వమే. మానసికతత్వమునందు జ్ఞాననాడులు ప్రధాన ములు. దృఢతత్వమునందు వ్యాయోగాస్ట్రిక నాడులు ప్రధానములు. శ్వాసాశయములు, జీర్ణక్రియ- వీనికర్మలు సక్రమముగా జరిగించు నాడులకు న్యూమోగాస్ట్రికనాడు లని పేరు. కండరతత్వమునందు చలననాడులు ప్రధానములు. న్యూమోగాస్ట్రికనాడులు, రక్తగమనమును జరిపించునట్టి నాడులు, స్వతంత్రనాడులు - పోషకతత్వమున కివి ప్రధా నములు. మేదస్సంబంధ మగునట్టియు, పోషకమగు నట్టియు నీ తత్వము ప్రధానముగా నున్నయెడల, దేహమునకు వర్తులతయును, మృదుత్వమును గలుగును. దేహము వ్రేలాడు చుండు స్వభావము గలదియు నగును. ముక్కు వెడల్పుగను, గుండ్రముగను గాని చట్టిముక్కుగ గాని యుండును. కదలిక చాల నెమ్మదిగ జరుగుచుండును. కండరములు బల హీనముగ నుండును. ముఖము, ఇరుప్రక్కల నుండు బుగ్గ లును వ్రేలాడుచుండును. గడ్డము లావెక్కి ముఖ సీమ కాన్పింపకుండ చెవిదిగువనుండి కండ వ్రేలాడుచుండును. దేహముయొక్క రంగు నలుపుగా నుండక కొంచెము పాలి యుండును. ఇందు దేహ, మనఃక్రియలు మాంద్యముగలవై జరు

గుచుండును. ముఖము అండాకారముగా నుండి నుదురువైపున సన్నముగను గడ్డము లావుగ నుండును. 11 వ పటముచూడుడు.



11 వ పటము.
రష్యారాణియగు కేథరైన్.



12 వ పటము.
జార్జి వైట్‌ఫీల్డ్.

రష్యారాణియగు కేథరైన్ (Empress Catherine of Russia) పోషకతత్వమును, దృఢతత్వమును గలది.

12 వ పటము జార్జి వైట్ ఫీల్డ్ (George White field)గారిది. పోషకతత్వము హెచ్చుగా గలదు. శక్తివంతమగు దృఢతత్వమును మతసంబంధమగు విజ్ఞానమును బాగుగవృద్ధినొందియున్నది. ఇతనియందు దైవికజాంతవ కాంతిశక్తుల సమ్మేళనమున్నది. అందువలన నతఁడు వేలకొలది శిష్యులను తన బోధనలచే సంతోషపెట్టుచుండువాఁడు.

13 వ పటము హానోరియా (Honoria) అను నామెది. ఇందు మనస్తత్వముప్రధానము. పోషక దృఢతత్వములును తగు మా

త్రముగలవు. ముఖము అండాకారముగ నున్నది. మానసికతత్వ ము ప్రధానముగా నుండుటవలన అండాకారమున పై భాగము వెడలువుగా నున్నది. రషియారాణియగు కేథరైన్ పటము కన్న నీమె పటము ఆకర్షవంతముగ నున్నది. ఇందు మానసిక, ఆత్మీయశక్తుల సన్నివేశ మున్నది. 14 వ పటము అమెరికా లోని వలనదేశములో పూర్వమందు గవర్నరుగానున్న వాన్ ట్విల్లరు (Vontwiller) గారిది. వాషింగ్టన్ ఇర్వింగుగా రత



13 వ పటము, హానోరియా

14 వ పటము. వాన్ట్విల్లరు

నిని హాస్యముగా దినమునకు 4 గంటలు తినుననియు, 12 గంట లు నిద్రించుననియు, వ్రాసి యున్నాడు. ఇతని తత్వము ప్రశ యముగా వృద్ధిబొందినపోషక మేదస్తత్వము. ఇందును ముఖము

అండాకారముగనే యుండును. ఇందు వెడలువు భాగము దిగువను, సన్ననిభాగము ఎగువను నుండును. అనగా మెదటియొక్క శక్తులు జీర్ణమండలమువంకకు లాగివేయబడి పొట్ట పెరిగినదని యర్థము. అట్టివారు విషయలోలత, గండమాలరోగప్రవణత, కలిగి పిప్పళ్లబస్తాలవలె నుందురు. ఆకర్షణంతమగు హానోరియా పటము ప్రక్కను యీ పటము చేర్చుటవలన వాట్స్లరు పటమెంత రోతగా నున్నదో గుర్తింప నగును.

మేద స్తత్వమందు ముఖముయొక్క క్రిందిభాగము వెడల్పై వ్రేలాడుచుండుట విషయలోలతకు చిహ్నముగా చెప్పెదరు. కాని అది యట్లుండియే తీరవలెనని యనలేము. ఎట్టిని ధాతువుగల దృఢతత్వముయొక్క తోడ్పాటువలననే యది గలుగును. వైట్ఫీల్డ్ (White field) నందువలె మతవిజ్ఞానము బాగుగ వృద్ధినందినవారియం దది తగ్గియు నుండును.

క్రొవ్వుగల దేహభాగములు చలివేడుములను వ్యాపింపఁజేయు స్వభావముగానుండవు. కనుక దేహమునందలి ప్రాణవంతపు లగువైహాయసములు దేహమునం దేఅణచివేయబడును. అందువలన వెలుపలనుండెడి చల్లదనమును సమరసపరుపదు. కనుక కండరతత్వమునందుకంటెను, దృఢతత్వమునందు కంటెను పోషకతత్వమునందు దేహముయొక్క చర్మతల మెక్కువ చల్లగానుండును. అమెరికా దేశమునందు సూర్యుడు ప్రకాశమానముగా నుండును. శీతకాలము మిక్కిలి చలిగానుండును. కనుక నా దేశస్థులు చులుకుగానుందురు. దానికి శీతోష్ణ

ములు తోడుకాగా మన స్తత్వము అత్యంతము చుఱుకుగల దగును. మేద స్తత్వము తక్కువ క్రియావంత మగును. దేహమునం దెక్కువగా కండ చేరునట్లు చేసికొనియెడ రేని (1) మంచి నిద్రపోవుశక్తి వృద్ధియగును. (2) నాడులను స్వాధీనములో నుంచు కొనఁగలుగుఁదురు. (3) సౌందర్యమున కవసరమైన బహిరంగ సౌష్ఠవ మేర్పడును. ఇది అమెరికాదేశపు స్త్రీలకు ప్రత్యేకముగా వర్తించును. చురుకుదనము వివేచనాశక్తి, భావవ్యక్తీకరణము, గమన సౌకుమార్యము విదేశీయులచే మెప్పుగొనునంతగా వారియం దుండనే యున్నది.

స్వతంత్రనాడులద్వారా మేదస్సు, పోషకతత్వములు, చైతన్యవంతము లగును. రక్తగమనమును గలిగించు నాడులు (Vaso-motor nerves) వలన దేహమునందలి రక్తవాహికలు చేతోవంతములగును. న్యూమోగాస్ట్రిక నాడులవలన జీర్ణక్రియ బాగుపడును. ఈ మూడుతత్వములును బాగుగాపనిచేసిన యెడల వారి సన్నని దేహములు రక్తవంతములు, కండరవంతములునై లావెక్కి బలియుదురు. ఆ వివరములు ఈగ్రంథమునందే వేరొకచో వివరింపఁబడినవి. నవీనములు, ఫలవంతములును నగు సాధనములద్వారా లంబోదరత్వమును, మేదోవృద్ధిని తగ్గించు విధానములును ఇందచ్చోటనే వర్ణింపఁబడును.

5 ఎముకపుష్టిగలతత్వము :— ఇందును కండరతత్వమందువలెనే మలినరక్తమే ప్రధానకారణమైయున్నది. కండరతత్వములందెల్ల నెముకలును బాగుగ బలసియేయుండును. జా

కాల్హాన్, డేనియల్ వెబ్స్టర్, జనరల్ జాక్సన్, అమెరికా ప్రెసిడెంటగు లింకన్ మొదలగువారియందెల్ల నీరెండుతత్వములును వృద్ధినందియేయున్నవి. కార్యకారణములు సముల యందు సమముగనేయుండును గాన దృఢతత్వమునకుఁ గారణ మగు మలినరక్తమే ఎముకల పుష్టికినిఁ గారణమైయున్నది. మజ్జయు యితరప్రధానములగు నెముకలును ఉపాస్థులును నందు ఉష్ణతత్వములకు సంబంధించినవి. ఎముకలలోని పదార్థము మూడింట రెండుపాళ్ళు క్షారసున్నపుసంబంధమగు, ఫాస్ఫేటు కార్బనేటుల (Phosphate and carbonate of lime) తోను నేర్పడి యున్నది. రసాయనశాస్త్ర నియమముల ననుసరించి, అట్టివాని నాకర్షించి వేఱుచేయుటకు శీతతత్వములు కావలసియున్నవి. అమ్లాదిశీతపదార్థములందు శుద్ధరక్తమున కన్న శీతపదార్థమే యుండును గాన యెముకల యొక్క నిర్మాణమునకును శుద్ధరక్తమునకన్న మలినరక్తమునే ప్రధానకారణముగా బేర్కొనియున్నాను. ఇందును మలిన రక్తమునందలి శీతశక్తులు శుద్ధరక్తమునందలి ఉష్ణతత్వముల నాకర్షించి యెముకలను బలుపు జెందించుచుండును. కేవలము ఎముకలే లావగుచు కండపెట్టని పిల్లలను ఆరుబయట గాలి లో ఆడుకొనునట్లు చేయుటకు, శుద్ధవాయుప్రసారముగల గదులలోనే పరుండునట్లు చేసినవారికి ప్రాణవాయు వధికముగ చేకూరి, కండ బెట్టెదరు. తియ్యని నీరును వారికి మేలేచేయును. క్షారములుచేరియున్న నీటిని త్రాగుటవలన నెముకలు ఎక్కువగా బలుపు జెందును. పైత్యాశ్మరి, శిలామేహమును

వారియందు గలుగుటయు గలదు. మలిన రక్తమునందలి ఆమ్లములే శైత్యాశ్మరి మొదలగు వ్యాధులకు ప్రారంభ కారణములై యున్నవి. ఎముకలు పెళుసుగా నుండకుండుటకు పొట్టుతో తయారైన గోధుమపిండి, యవలు, గంజి వాడుక జేయవలెను.

6. తత్వములన్నియు సమముగా పరిపక్వదశ నందుట యుక్తమైయున్నది. 15వ పటము చూడుడు. అమెరికాసంయుక్తరాష్ట్రముల కధిపతి యగు ఆడమ్స్(President Adams) పటమిది. ఇందన్నితత్వములును పరిపక్వము నందినవి. వాషింగ్టన్ (Washington) గారియందును నిట్టే తత్వము




15 వ పటము.

రాష్ట్రాధిపతియగు ఆడమ్స్.

లన్నియు పరిపక్వ మైయున్నవి. ఒకేతత్వము మితిమీరి నొందిన ఉన్మాదము గలుగ వీలయి యుండును. దృఢకందర

తత్వము లే మాత్రిమును లేక కేవల మతవిజ్ఞానమే అతి మాత్రిముగా వృద్ధినందినయెడల వానియందలి భౌతిక శక్తులన్నియు నిగురుకొనిపోవుటవలన ప్రపంచజీవితము నందతఁడు నిరర్థకుఁ డగును. మతవిజ్ఞానములేని దృఢపోషకతత్వముల అతిమాత్రివృద్ధివలన మానవులకు పశుస్వభావమేర్పడును. ఉన్నతములగు విజ్ఞానసంపాదనయం దతని కిచ్ఛయే యుండదు. అతిమాత్రమగు మతవిజ్ఞానము వృద్ధియైనదానికన్న, నీస్థితియే మిక్కిలిదుఃఖకరమై యుండును. ఏలన సునిశితతత్వములు స్థూలతత్వములకన్న నెక్కువ మోహకైనవగుట నెక్కువ దుఃఖపదములై యుండును. భార్యాభర్తలఁ యొక్కతత్వములు కేవలము భిన్నముగా నుండినయెడల దాంపత్యము సమరసముగా నుండదు. కనుక వారితత్వములు భిన్నములైనను, సమీపస్వభావము గలవై యుండవలెను.

# వర్ణవైద్యము.

## వెలుతురుతోను రంగులతోను చేయు చికిత్స.

ఒక్కొక్కవస్తువునం దొక్కొక్క వర్ణము ప్రధానముగా నుండును. అందలి రంగేదియో మనము కనిపెట్టఁగలిఁగిన యెడల నే వస్తువుయొక్క స్వభావ మెట్టిదో, శక్తి యెట్టిదో మనము గుర్తింపగలము. సూర్యకాంతియందున్న వివిధములగు వర్ణము లన్నియుఁ గలిసి స్వచ్ఛమగు తెల్లని సూర్యకాంతి యగు చున్నది. సూర్యకిరణప్రసారమువలననే స్థావర జంగమాత్మక మగు సృష్టి యంత యు చైతన్యవంతమును, శక్తిమంతము నగు



16 వ పటము. దిననాథుడగు సూర్యుడు.

చున్నది. సృష్టియం దింత శక్తిమంతముగా నున్న సూర్యకాంతి, రోగనివారణమందును శక్తిమంతముగా నుండక! మానదని తీర్మానించుకొంటిని. సూర్యకాంతియందలి వర్ణములయొక్క

రాసాయనికతత్త్వమును శాస్త్రీయముగా చేయ వచ్చుననియు భావించితిని. 1876 వ సంవత్సరములో నే నా విషయమును ప్రకటన జేసితిని. వైహాయసములు అందలి అణువులు శక్తితత్త్వమునుగూర్చియు సూర్యకాంతియందలి రంగులు మొదలగు సునిశితతత్త్వములకును వానికినిగల సంబంధమును ప్రచురించితిని. 1878వ సంవత్సరమున నాయొక్కయు యింక యితరుల యొక్కయు పరిశోధనాఫలితముగా "తేజోవర్ణశాస్త్రము" అను శాస్త్రీయమగు సద్గ్రంథమును ప్రచురించితిని. రాసాయనికశక్తి, విద్యుచ్ఛక్తి, కాంతశక్తి, మానసికశక్తి, ఆత్మశక్తి, తేజశ్శక్తి, వర్ణశక్తి-వీనినిగురించిన విపులవివరణ మందుగలదు. అందు వివరింపఁబడిన సిద్ధాంతములను మనదేశమునం దంతటను, విదేశములందును అనేకులు శోధించి వందలాది అనుభవములను నాకు దెలియఁజేసి అందలి సిద్ధాంతములందలి సత్యత్వమును వెల్లడించియున్నారు. నవీనమగు నీవిధమగు చికిత్సాపద్ధతియొక్క ప్రాధాన్యమును వెల్లడించియున్నారు. వర్ణవైద్యమునకు సంబంధించిన కొన్ని నియమముల నిట చేర్కొనుచున్నాను.

1. ఇతర వస్తువులవలెనే వెలుతురును భౌతికమగు సత్యపదార్థమే. అణువులయందు ఒకవిధమగు గమనక్రమము వలన వెలుతురు గలుగును. ఆ కాంతియందు వివిధములగు వర్ణములున్నవి. ఆ వర్ణములందు ఒక్కొక్కదానియం దొక్కొక విధమగు శక్తి యున్నది. మానవతత్త్వములోనికి సున్నితతత్త్వముగల ఒక్కొక్కవర్ణమునే సూటిగా ప్రయోగింప

వచ్చును. ఆ వర్ణమునే నీరు మొదలగువానియం దారోపించి లోనికి త్రాగుటకును పైన రుద్దుటకును ఉపయోగింపవచ్చును. ఈ గ్రంథము మొదట నున్న రంగులపటమువలన నేరంగునం దేస్వభావము గలదో బోధపడును.

2. నేను శీతవర్ణములుగా జేర్చినరాసాయనికవర్ణములుగా నాకంటెపూర్వులచే జేర్చబడుచుండెను. ఉష్ణవర్ణములును రాసాయనికవర్ణములే. వాని తోడ్పాటు లేనిదే శీతవర్ణములును పనిచేయవు. ఆ సంగతి పూర్వులకుఁ దెలియక పొరఁబడిరి. ఏ వస్తువులయందు నీలము, నీలిమందువర్ణము, ఊదా మొదలగునవి ప్రధానములుగా నుండునో, అవి రాసాయనికముగా కలియవలయునెడల ఎఱుపు, నారింజపండు వర్ణము, పసుపు వర్ణములతోడ్పాటు కావలెను. ఎరుపునకు, నీలమునకును; నారింజపండు వర్ణమునకును నీలిమందువర్ణమునకును, ఊదా పసుపు వర్ణములకును రాసాయనికానురాగము గలదు. (ఈ గ్రంథమునందలి 3 వ కిరణము చూడుము.)

3. సూర్యకిరణమునందలి వర్ణపటము (Solar Spectrum) లో మిక్కిలి దిగువ భాగమున అత్యంతోష్ణస్థానమున్నది. అది యెఱుపురంగునకు దిగువగా నుండి కాన్పింపదు.

4. ఎఱుపు, పసుపు, నీలవర్ణములు సూర్యకిరణమునందలి ప్రధానవర్ణములు. ఎఱుపు పసుపువర్ణములు సమముగా కలిసిన నారింజపండువర్ణ మగును. అందే, యెరుపు ప్రధానముగా నున్న నెరుపు నారింజపండు వర్ణమును పసుపు ప్రధాన

ముగా నున్నయెడల పసుపు-నారింజపండు వర్ణమును నగును. ఎఱుపు, నీలము గలిసిన ధూమ్రవర్ణ మగును. ఇదే దాదాపు ఊదా వర్ణమును బోలియుండును. పసుపు ఎక్కువగను నీలమును గలసిన ఆకుపసరువర్ణ మగును. మామూలు ధూమ్రవర్ణముకన్న సూర్యకాంతియందలి ఊదావర్ణము ఎక్కువ నున్నితమైనది. అద్దములవలన కేవలము శుద్ధ మగు ఊదావర్ణము లభింపదు. అద్దములలో, ఊదారంగు అద్దమువలన ఎక్కువ ఊదారంగు ప్రసరించును. 'నీలము-ఊదా' రంగు 'యెరుపు-ఊదారంగు' కన్న మృదువైనది గాని; 'యెరుపు-ఊదా' రంగు ఎక్కువ ఉద్దీపక మైనది.

5. రాసాయనికానురాగమువలన శీతోష్ణశక్తుల సమావేశము గలుగును. రాసాయనిక ప్రతీకారమువలన రంగు తత్వము లన్యోన్య ముద్దీపనమును, ప్రతీకారమును గల్గించును. (4 వ కిరణము - 1 సె.) ఎఱుపురంగువలన ఎర్రని రంగు గల శుద్ధరక్తమునం దుద్దీపనము గలుగును. పసుపురంగువలన నాడులయందు ఉద్దీపన గలుగును. రాసాయనికానురాగము వలన నేకపక్షమగు ఉద్రేకమును సమరసపఱచును. రాసాయనికప్రతీకారమువలన తగ్గియున్న తత్వము వృద్ధి బొందును. ఎఱుపురంగు ప్రధానముగా నున్న నాడులు మెదడు మొదలగువానియందలి యుద్రేకమును దగ్గించుటకు నీలి వర్ణము అవసరమై యుండును. దేహముయొక్క తుదలగు కాళ్ళు చేతులు - వీనిపైన నెరుపురంగును బ్రయోగింపవలసి యుండును. ఎదురురొమ్ము, జీర్ణాశయము-వీనిపైన ఊదారంగు

యొక్క ప్రయోగ మవసరము. యకృత్ (పైత్యకోశము) ప్రేవులు - వీనియందలిమాంద్యమును బోగొట్టుటకు పసుపు నారింజపండువర్ణము లవసరము. ఋతుధర్మముయొక్క లోప మునకు యోనిపై నెరుపురంగును వాడవలయును. ఋతు స్రావ మధికమగు నెడల నీలివర్ణము అవసరము. తెల్లబడిన, చల్లనితత్వములకు నాడులయం దుద్రేకము మిక్కిలి యెక్కు వగా నుండకున్న నెరుపురంగు మంచిది. శుద్ధరక్తమునందలి మంటలు గలిగించు తత్వములకు నీలముగాని, నీలిమందు వర్ణముగాని మంచిది. వివిధరోగములకు వివిధములగు చికిత్సల జేర్కొనిన ఈ గ్రంథముయొక్క వేరొక భాగమున నీ వర్ణ ములప్రయోగమునుగురించిన విశేషవివరణములు గలవు.

6. మందులు, రసాయనములయం దేవిధముగా శక్తినియ మము లున్నవో అట్లే కాంతి - రంగులు నుండును. మిరెప కాయ, ఎర్రదేవదారు/ బోర్రమిన్, ఇనుముయొక్క తుప్పు, మొదలగు ఎర్రని పదార్థములును, ఈథరు ద్రావకము ($C_4H_6O$) మద్యసారము ($C_2H_6O$) - ఇందు ప్రధాన మైన హైడ్రజము ఆరేసి భాగము లున్నది. అది యెర్రని రంగైనది. అమ్మోనియా, పొటాసా - యీ రెంటి యందలి రంగులలో నెరుపు ప్రధానమైనది. మందువైద్యమునం దివి కందునట్లు జేయునవిగను, రక్తోద్దీపనకారులుగను ధాతు వృద్ధికరములుగను వివరింపబడినవి.

కుంకుమపువ్వు, జటామాంసి, ఆవాలు, దాండిలియన్ అను నది, సునాముఖి, మేయాపిల్, కొలిసింత్, (colocynth)

గంధకము, అత్తిపండ్లు, గోధుమజిగురు (gluten), ఆముద ము, అల్లము మొదలగునవి యన్నియు పసుపురంగుగా గాని, నారింజపండువర్ణముగాగాని యుండును. వీనియందు వర్ణవివేచనయంత్రము (spectroscope) తో చూచినయెడల పసుపు ప్రధానముగా నున్నట్లు తెలియగలదు. మెదడు, జీర్ణా శయము, కాలేజము, ప్రేగులు మొదలగువాని సంబంధమగు నాడులు పసుపు, ఎరుపురంగువలన నుద్దీపనము నొందును. భేదికరములగు మందు లన్నియు ప్రేగుసంబంధమగు నాడుల నుద్రిక్తపఱచును. ఆమందులయందలి ప్రధానవర్ణము పసుపు. బలమైనభేదిమందులును, వాంతికరములును, మూత్రకరము లును నగు మందులందెల్ల నెరుపు ప్రధానవర్ణముగా నుండును. అందువలన రక్తమునందును ఉద్దీపన గలుగును. భేదిని గలిగించు స్వభావము గల కాలేజములోని పైత్యరసము పసుపురంగువలన ఉద్దీపనబొంది భేదులను గలిగించును.

నాభి, నీలిమందు, గోరోచనము, మైలతుత్తము, వీనియందు నీలముగాని నీలిమందువర్ణముగాని, ప్రధానముగా నుండును. గంధకితామ్లము, భాస్వారికామ్లము, నైత్రికామ్లము మొద లగువానియందెల్ల ప్రాణవాయువునందలి నీలివర్ణము ప్రధా నముగా నుండును. ఈ ద్రావకము లన్నియు గ్రాహిణిని తగ్గించునవియు, వేడిని తగ్గించునవియు, కుళ్లు నాపునవియు, రక్తాభిష్యందముల నాపునవియు, మత్తును గలిగించునవియు, ఈడ్పును గలిగించునవిగను పేర్కొనబడుచున్నది. క్లోరో ఫారము (C H C L) నందు, నీలముతో గూడిన ఆకుపసపు

రంగు, నీలముతోఁగూడిన నీలిమందువర్ణము, ఊదారంగు - ఇవి ప్రధానవర్ణములు. ఇది నాడులను నూటిగా నిద్రబుచ్చుశక్తిమందు. టానికామ్లము (Tannic acid) నందు వెలుపల నీలము పసుపు ప్రధానవర్ణములు. ఇందు ప్రాణవాయువు మిక్కిలి బలముగా నుండును. ఇందు హైడ్రోజనము గూడ కొలదిగా నుండుటవలన ప్రాణవాయువు ఎక్కువ యుద్దీపనం బొంది అత్యంతము బలము గలదిగా నున్నది. కనుక నిది గ్రాహణి తగ్గించుగుణము నెక్కువగాఁ గలదైయున్నది. నాభిపూలు నల్లని యూదారంగుగా నుండును. బాధోపశమనకర మైనవి. తీపును తగ్గించును. నల్లమందునందు పసుపు వర్ణము ప్రధానమైనది అయినను భేదులను తగ్గించును. నల్లమందు మత్తుమందు. అందువలన మెదటినాడుల నుద్రేకపఱచి, మలినయుతముగా జేయును. అప్పుడు ప్రేగుల యందలి వైహాయసములు సయితము మెదటివంకకు లాగి వేయబడును. దాన ప్రేగులు బలహీనమై మలబద్ధకము గలుగును.

7. రంగులయొక్క రోగనివారకశక్తి:— ఎఱుపు వేడి జేయును, శుద్ధరక్తమునం దుద్దీపనఁ గలిగించును. చల్లగా నుండి, పాలిపోయి, తెల్లగానున్నవారి కిది యుపయోగించును. మంటలు, ఉద్రేకముగలవారి కిది యపకారము చేయును.

పసుపు:— కొద్ది యెరుపుకలసిన యెడల నాడులయం దుద్దీపనఁ గలిగించును. భేదులను గలిగించును. మూత్రమును

జారీచేయును. మెదడు, కారిజములను దీపింపఁ జేయును. మలబద్ధకము, చచ్చువాతము, మాంద్యము వీనియందీ వర్ణముపయోగించును. సన్నిపాతము, అతిసారము మొదలగు వానియం దిది యుపకారము జేయును.

నీలిమందురంగు, ఊదారంగు :— ఇది చల్లబఱచును. సంకోచము జేయును. నాడులయందలి యుద్రేకమును తగ్గించును. భేదులను తగ్గించును. వేడిమిని తగ్గించును. క్రుళ్లునాపును. జ్వరములను పోగొట్టును. మంటలను పోకార్చును. మత్తును గలిగించును. ఈడ్పును గలిగించును. చల్లగాను, నీలిరంగుగను నున్న కాలిక వ్యాధులందు, తగినంత యుద్రేకము లేనియెడల నీ రంగుయొక్క వాడుక అపకారమునుజేయును.

ఆకుపసుపు :— వేడిమిని తగ్గించును. ఇదియును నీలము వలెనే పనిజేయునుగాని యిందలి పసుపువర్ణము నాడులయందుద్దీపనము గలిగించును. పోషకతత్త్వములందు గలిగిన మంటల నిది బోగొట్టును. కామోద్రేకములందును, శుక్లపాత వ్యాధియందును నీ రంగును నాభికి సూటిగా వెనుకనున్న నడ్డిపూసపైఁ బ్రసరింపఁజేసిన జాల మేలగును.

ఊదారంగు :—ఇందు రక్తవృద్ధికరమగు ఎరుపును, క్రుళ్లునాపి వేడిని తగ్గించునట్టి నీలమును గలిసియున్నవి. ఊపిరితిత్తులు, జీర్ణాశయము, మూత్రపిండములు వీనియందుద్రేకము గలుగరాదు. తగుమాత్రపు టుజ్జీవన మవసరము. అందువల్లనంతయెక్కువ శీతముగాని, అంత యెక్కువ ఉష్ణముగాని లేని యీ

రంగు వానియందు బాగుగాఁబనిచేయును. ఎఱుపుతోఁగూడిన ఊదావర్ణమువలన జీర్ణాశయమునందలి మాంద్యము పోవును. జీర్ణాశయమునందు వేడిమియు నుద్రేకమును నున్నయెడల నీలముతోఁగూడిన యూదారంగు బాగుగఁ బనిచేయును.

నారింజపండురంగు:— నారింజరంగని వాడుకపేరు. రక్తమునందును, నాడులయందును ఉద్దీపన గలుగును. ఈ రంగు, రంగుఅద్దములద్వారాగాని, వర్ణకేంద్రీకరోపకరణము ద్వారా గాని, రంగుకుప్పెలద్వారా గాని ప్రసరింపఁ జేయవలెను.

8. సూర్యకాంతియందలి బలవర్ధకశక్తి:— సూర్యకాంతియందుగల యీ అద్భుతశక్తి మందువైద్యులచే మిక్కిలిగా విస్మరింపఁబడుచున్నది. అందువలన విపులముగా జరిగిన వృత్తాంతముల బ్రదర్శించి మా పాఠకులచే సూర్యకాంతియందలి యీ అద్భుతశక్తి గ్రహింపఁ జేయబడవలసియున్నది. నల్లని మందమగు దుస్తులు ధరించువారియం దీ సూర్యకాంతి దేహమువరకును చేరకమునుపే వస్త్రములు పీల్చివేయును. అట్టి వారికి సూర్యకాంతియొక్క ప్రభావమును గురించి యిదివరకే ఆరోగ్యపత్రికద్వారా వెలువరించియుంటిని.

బోర్నియో ద్వీపమునందు 'దయ్యలు' అను తెగవారు గలరు. దాదాపు దిగంబరముగా నుందురు. తెల్లవానికంటె వడిగా నడతురు. నడచిన తరువాత నొక తెల్లవానిని భుజము మీద నెక్కించుకొని నడచు దార్ఢ్యము గలిగి యుందురు.

"ఒక తెల్ల పటాలము పోవుచుండెను. అప్పుడొక దయ్యోడు తన బలమును అత్యద్భుతముగా బ్రదర్శించెను. త్రోవ భయంకరముగా నుండెను. నిలువైనట్టియు, జారునట్టియు కొండమీద ప్రయాణము. ఆ పటాలము వెంటపోవుచున్న చీనాదేశపు కూలీలు కొండమీదికి నెక్కజాలక సామానులు పారవైచి, కూర్చుండి, పిల్లలవలె నేడువ నారంభించిరి. ఆ పటాలమునకు దీర్ఘానుభవముగల ఒక నాయకుఁడు (sergeant) గలడు. ఇతఁడు ఇండియాలోను, చైనాలోను కూడ కఠినప్రయాణముల కలవాటు పడినవాడే. ఆ నిలువైన కొండదగ్గరకు వచ్చునప్పటి కాతఁడు నడువఁజాలక పోయెను. అమితమగు భారముతో నొక అడుగైనను నడువజాలనని వెల్లడించెను. ఆసేనకు సర్వాధిపతి (బ్రూక్సు (Mr. Brooks). దయ్యాలలోనొకనిని బిలచి ఆ నాయకుని(sergeant) సామాను మోసినయెడల పొగాకుతుంపు నిచ్చెద ననెను. ఈ బహుమతి కతడు సంతోషముతో నొప్పుకొనెను. అప్పటికే యతని వద్ద మూడువారములకు సరిపోయిన యాహార పదార్థములు గలవు. దుస్తులు గలవు. 12 పౌనులు తుపాకిగుండ్లు గలవు. 12 పౌనులు తూటాలుగలవు. జంటనల్లి తుపాకి యున్నది. 100 పౌనులు గుండ్లబారులు గలవు. బరువైన తన కత్తియు ఈటెయును గలవు. ఈ బరువు మామూలు రోడ్లమీదనే మిక్కిలి భారమై యుండగా నతఁ డీ బరువును నెత్తుకొని యవలీలగా కొండలు ఎక్కుచు, దిగుచు, మోయ నారంభించెను. ఈ త్రోవలో విదేశములకు దాటుటకేని దుర్భరమై

యుండగా దివ్యబలముగల ఆదయ్యుడు ఆ సార్జంటుసామాను సయితము వీపునకు గట్టుకొని, తన వెంట వచ్చుచున్న తెల్లవారికి అందనంత వడిగను, లాఘవముగను నడచుచుండెను. అతని దేహముమీఁది దుస్తులన్నో ఒక కుడితిని, ఎలుకలవాండ్రు ధరించునట్టి ఒకగోచియును మాత్రమే.*

"బంగాళాఖాతములో హిందూదేశమునకు ఒకింత తూర్పుభాగమున అండమానుదీవులు గలవు. అందలి జనులు దాదాపుగా దిగంబరులుగా నుందురు. వారు పొట్టివారేకాని చాల శక్తిమంతులు. వీరు చెట్ల స్కంధములను తొలిచి దోనెలుగా జేసికొందురు. ఆ దోనెలను నడపుటకు చిన్న తెడ్లుండును. అవి ఆ దోనెలను నడుపదగినంత పెద్దవైనను కావు. అయినను ఆ తెడ్లతోనే అండమానుదీవులయందలి 'మిఁకొపీ' వారు, తెల్లనివారిలో మిక్కిలి చుఱుకైన పడవవాండ్రకన్న వడిగా తమ దోనెలను నడపుదురు. కెప్టెన్ మోనాట్ అను నాతఁడు తనవద్ద దోనెలు నడపుటయందు మొనగాండ్రైనవారికిని, మిఁకొపీలకును పందెములు పెట్టుచుండెను. మిఁకొపీలు ప్రత్యేకముగా పందెములకొఱకై గాక తమ మామూలు విధముగనే దోనెలను నడుపుచుండినను, సాధారణముగా మిఁకొపీలే జయించి బహుమతుల నందుచుండిరి. ఎట్లయినను మిఁకొపీలను జయింపవలయునని తమ శక్తినంతయు ధారపోసినను తెల్లవారికి జయము కలుగకుండెను. పడిన శ్రమవలన వారు చాలకాలమువరకును మిక్కిలి బాధ పడుచుండిరి.

వాన్ కోవర్ ద్వీపవాసులు 'ఆహాట్'లను పేర బరగుదురు. వీరికిని ఎస్క్విమోలకును ఆచారములందు పోలికగలదు. దాదాపుగా దిగంబరముగను, కేవలము దిగంబరముగానుండి యెండలోను, గాలిలోను తిరుగు స్వభావము వీరికి గలదు. అందువలన ఎస్క్విమోలకన్న చాల బలవంతులు. తెల్లవానిని అతడు గట్టిగా పట్టుకొనుట తటస్థపడునెడల, ఆ పట్టు వదలించుకొనవలయు నెడల, చేతిని కోసి తప్పించుకొనవలసినదే! పెనుగులాడి తప్పించుకొన సాధ్యముగానుండదని చెప్పుదురు. చాపిన వ్రేళ్లమీద, ఒక తెల్లవాడు 2 చేతులతోను పైకెత్తజాలనంత బరువును వీరు నిలుపగలరు. వారిపట్టు (Grip) మనుష్యుల పట్టువలెగాక యంత్రముయొక్క పట్టువలె దృఢముగా నుండును.

పాలినీసియా దేశస్థులు పసుపుతోగూడిన నలుపురంగుగాగాని, ఎరుపుతోగూడిన బూడిదరంగుగా గాని యుందురు. ఎండలో నుండుటవలన మిక్కిలి నల్లబడినవారు అత్యంతబలులని వారి నిశ్చయము. ఉలులు, బరమాలు, చేపగాలము తయారుచేయుటకు పిడులకుగాను చచ్చినమనుష్యులయొక్క యెముక నుపయోగింతురు. మిక్కిలి నల్లగా నుండి చనిపోయినవారి దేహములందలి యెముకలు మిక్కిలి దృఢముగా నుండుటవలన వారట్టివానినే యేరుకొందురు. దక్షిణ అమెరికాకు దక్షిణపువైపున ఫ్యూజీదీవులు గలవు. ఎస్క్విమోలు ధ్రువప్రాంతములవారు. ఎస్క్విమోల దేహములు బొచ్చుతో గూడిన చర్మములతో కప్పియుండబడును. ఫ్యూజీవాసులు దేహముమీద పడిన ధూళి తప్ప వేరు ఆచ్ఛాదన లేక తిరుగు

వారు. ఎస్క్వైమోలకు యూరపియనుల బలములో సగము బల ముండును. ఫ్యూజీవాసులు యూరపియన్ వారికన్న రెట్టింపు బలశాలురు. అక్కడకు పోయిన యూరపియనులు వేసగి యందైనను దుస్తులు ధరించినను అచ్చటి చలికి గడ్డకట్టుకొని పోవుదురు. ఫ్యూజీవాసులయొక్క అత్యద్భుత బలమేమో! ఆ బీదగుడిసెలలో వస్త్రములైనను లేక చిరకాలము వారు జీవింపగలుగుచున్నారు! చేపలఁ బట్టిన తరువాత ఆ దేశపు స్త్రీలు మంచుగడ్డతో గూడిన ఆ నీటియందు ఈదులాడు దురు. తరువాత చేయువ్యాయామమువలనను వారు పురుషు లంత బలవంతులుగనే యుందురు. తుపాకీగుండు పారదగిన దూరముకన్నను నెక్కువ దూరమునందున్న వారినైనను వారు రాలను విసరగలిగిరి.

ఒకచోటనే నివసించు రెండు దేశములవారి బలతారతమ్యము నిచట వివరించెదను. సముద్రప్రాంతములందు యూరపి యనులకు దటుచుగా గాన్పించు చీనావారు దట్టముగా దుస్తు లను ధరించియుందురు. జపానువారో సాధ్యమైనంత తక్కువ దుస్తులను ధరించి చాలకాలము దాదాపు దిగంబరముగా నుందురు. చైనావారు సాధారణమగు నెత్తుకన్న తగ్గి యుందురు. మిక్కిలి బలశాలురుగాని, ధైర్యశాలురుగాని కారు. ఇక జపానీయులసంగతి, చీనావారికన్న మిక్కిలి ఎత్తుగా నుందురు. మిక్కిలి శక్తిమంతులు - యోగ్యమైన ప్రవర్తనగలవారు. మిక్కిలి తెలివితేటలు గలవారు. చైనీ యులుగాని, అమెరికనులుగాని, యూరపియనులుగాని భరింప

జాలక చనిపోదగినంత శీతోష్ణములను భరింపగల ధాతుశక్తి గలిగియుందురు. ఔన్సీ అనునామె 'ప్రపంచ యాత్ర' (Around the world) అను గ్రంథమునందు జపానీయులను గురించి యిట్లు వ్రాసినది. "ఒక పర్వతము ప్రక్కనున్న క్వారీలో 70 మంది పురుషులు రాళ్ళు పగులగొట్టుచుండిరి. అప్పుడు ఉష్ణతామాపకయంత్రము నీరు ఘనీభవింపదగిన స్థితికన్నను తక్కువనే చూపుచుండెను. వారిదేహముల యందప్పుడు దుస్తులైనను లేవు." జపానీయులు మిాతి వేడలుపాటి నీటికాగులో కూర్చుండగా ఆ నీరు క్రాగుచుండును. నీరు తెర్లింతలైనను వారందే చిరునవ్వుతో కూర్చుండియుందురు. అంత వేడిమిని వారిదేహములు భరింపగలవు. ఈ సంగతియు నిర్ధారణగా సత్యమైన వృత్తాంతమే. జపానీయులకు గలిగిన యీధాతుశక్తి తఱచుగా వారుచేయు వేడినీటి స్నానమువలన, వ్యాయామమువలనను గలిగినదే. వేడినీటి స్నానానంతరము చన్నీటిలో ఒక్కతూరి మునుగుచుందురేని వారధాతుశక్తి యింకను నెక్కువగును. ఇదివరకే ఉల్లేఖించిన గ్రంథమునందు ఉడ్ అను నాత డిట్లు వ్రాయుచున్నాడు: "సామాన్యుడగు యూరపియనంతయే జపానీయుఁడుండును. అవయవములు మిక్కిలిపెద్దవిగా నుండకున్నను మిక్కిలిదృఢముగా నుండును. బలహీనుఁడగు జపానీయుఁడు, మిక్కిలి బలముగల యూరపియనుఁడు మోయజాలని బరువులను మిక్కిలి తేలికగా వహించును. జపాన్ దేశపు దొమ్మరులు (acrobats) ఇతర దేశపు దొమ్మరులు చేయుచున్న అత్యంతాద్భుతమగు పను

లను బహు సులువుగా చేయగలరు. మరియు అపాయము కలుగకుండుటకు అవసరమైన చాకచక్యమును వారియం దుండును."

న్యూయార్కునగరమున జపానీయుల తత్త్వమును మేము గుర్తింపఁ గలిగితిమి. 'మాకినొడా సారాకిచీ' అను జపాను వీరుఁడు 150 పౌనుల బరువుగల దండమును 19 తూరులు పైకెత్తెను. న్యూయార్కువీరుడు 13 తూరు లెత్తెను. జర్మనీ దేశపు రాక్షసుఁడను పేరుగల 'ఎమ్స్' యింకను తక్కువ తూరులే యెత్తెను. పొట్టివాడైన 'సారాకిచీతోనే' అమెరికను వీరుఁడు దీటురాకపోయినయెడల, జపానుదేశమునుండి నిజ మగు వీరులు వచ్చి ప్రదర్శించినయెడల అమెరికనులు వారి యెదుటనెంత బలహీనులుగ గాన్పింతురో ఊహింపవచ్చును.

న్యూయార్కులో మిక్కిలి విఖ్యాతిగల యఫ్. జి. వెల్చ్ అను డాక్టరుగారున్నారు. ఆఫ్రికాలో ఆగ్నేయ భాగమం దున్న కాఫరులు బాగుగా ఉన్నతిని బొందియున్నారని చెప్పుచు వారిశక్తి నిట్లు వర్ణించియున్నాడు:—

" 90-100 మైళ్ళు ఒక్కబిగువున వారు పరుగెత్తగలరు. వారు 600 పౌనుల బరువుగల సంచులను నెత్తిన మోయుదురు. అందు కొంతమంది బలశాలురు 1200 పౌనుల బరువు పైకెత్త గలరు. 120 పౌనుల బరువుగల 2 గంపల గోధుమలు యూరో పియనుల భుజములమీఁద మోయఁదగిన బరువు డాక్టరు

వెల్చిగారు వ్యాయామమును గూర్చి బోధించువారిలో నగ్రిగణ్యుఁడు. అయినను కాఫరుల శక్తికి వారు సూర్యకాంతిలోను, గాలిలోను తిరుగుటవలన గల్గిన నరముల పటుత్వమే కారణముగా పేర్కొనుచున్నారు. వారి స్త్రీలే పని నంతయు చేయుదురట. మగవారు పనిచేయరట.

కాలిఫోర్నియా, శాండియాగోవాసియగు డాక్టరు పీబిల్స ప్రఖ్యాతుఁడగు దేశసంచారి. అతడు రోములో నున్న హెర్క్యాలియనియం (Herculeaneum) ను, పాంపేనున్నూ దర్శించియున్నాఁడు. రాతి జలాశయములను, వంట కుపయోగించు రాతి 'పొయ్యి' లను, రాతి స్నానమందిరములను దర్శించియున్నాడు. స్నానమందిరములు 2, 3 అంతస్తులుగలవి. 3 వ అంతస్తునకు పైన కప్పులేదు. రోమనులు, పాంపేయులు సాయంకాలములయందు వేడినీటి స్నానములను, మధ్యాహ్నకాలమున ఆతపస్నానములను చేయుదురు. వస్త్రములనువిడచి, నెత్తిన తడివస్త్రమును వేసికొని ఒక అరగంట మధ్యాహ్నపు తీక్ష్ణమైన యెండలో తిరుగుదురు. లేదా కూర్చుందురు. అందువలన వారి యారోగ్య మభివృద్ధియగును. పరాక్రమము, కండరశక్తియును వృద్ధి యగును. రోమను లిందుకు పూర్వము ప్రసిద్ధులైయుండిరి.

జోసెఫ్ సిమ్స్, యం. డి. సుప్రసిద్ధ గ్రంథకర్త, దేశసంచారి, ఉపన్యాసకుఁడును. అతనివద్దనుండి యీ క్రింది జాబు నాకిప్పుడే చేరినది. బలము, తెలివితేటలు, సూర్యకాంతివలన

వృద్ధిబొందుననుట కిది నిదర్శనముగా నుండగలదు. అచట అరబ్బులు పిల్లలుగా నున్నప్పుడు దిగంబరముగా పెంచఁబడుదురు. కొంచెము పెద్దవారైనతరువాత వదులైన పలుచని తెల్లని అంగరఖా ధరించెదరు. అందుండి సూర్యకాంతి సులువుగా దేహములోనికిఁ జొచ్చును. గుఱ్ఱపు సైసు (నౌకరు)గా నుండువాడు దినమంతయు గుఱ్ఱముకన్న ముందు వడిగా నడచుచుండును. మొదట మొదట యీ సంగతి ఆశ్చర్యముగా దోచవచ్చును. ఈ క్రింది జాబు దానిని బలపఱచును.

డాక్టరు బాబిట్ గారికి,

ప్రియమైన అయ్యా, సూర్యకాంతి బాగుగ బ్రసరించు నీ దేశములందు నివసించువారు మిక్కిలి స్వల్పమగు దుస్తులను ధరింతురు. వారి దైహిక, మానసికములగు నద్భుతచర్యల జూచిన నా కత్యంతమగు నాశ్చర్యము గలుఁగును. సూర్యకాంతి, వర్ణములను గురించి సుబోధకమును ఉపయోగకరమును నగు తమ యుపన్యాసములను వినియున్న నేను ఈజిప్టు దేశములోను, పాలస్టైన్ లోను నివసించు అరబ్బులను గురించిన కొన్ని నిజస్థితులను తమకు నెఱుకపఱచుట కనుమతింపఁగోరెదను. ఇక్కడ సూర్యుడు ప్రకాశించు పగళ్ళు విధిగను, మబ్బుగానుండు పగళ్ళు చాల అరుదుగను నుండును. నేను జరూసలేమునుండి బయలుదేరి డెడ్ సముద్రము మీదుగా బెథనీ మొదలగు ప్రదేశములవరకు పోయి తిరిగి జరూసలేము రావలసియుంటిని. బెడోలియా దేశస్థుఁడగు అరబ్బీవాని మార్గదర్శిగా తీసుకొని అరబ్బీగుఱ్ఱము నెక్కి ప్రయాణ

మైతిని. నా మార్గదర్శి గుఱ్ఱమువెంట నడచు చుండెను. కొంతదూరము పోయినతరువాత వెడల్పైన భాగమునకు వచ్చితిమి. అచ్చట ఆ గడపలు లేక చదరముగా నుండెను. అచ్చట నా మార్గదర్శికిని, చుఱుకైన నా అరేబియా గుఱ్ఱమునకు పందెము గలిగెను. నా మార్గదర్శికి నడుమునకు కట్టిన సన్నని తెల్లని వస్త్రములు తప్ప నింకేమియును దేహముమీఁద లేవు. ఆ మనిషియు, గుఱ్ఱమును పరుగెత్త నారంభించిరి. నా కొరడా సలిపితిని. నాగుఱ్ఱము జయేచ్ఛతోవలె పరుగెత్త నారంభించెను. విల్లును వదలిన బాణమువలె ఆ మనిషి పరుగెత్త నారంభించెను, నా గుఱ్ఱమునకంటె చాలముందుగనే యాతఁడు పరుగెత్తుచుండెను. ఒక పర్వత పాదమువద్ద పందె మాగిపోయెను.అచ్చటకు పరుగెత్తినది 5 ఫర్లాంగులుండెను. అందులో అరఫర్లాంగు అతఁడు మిగిలియుండెను. ఆ జయమున కాతఁడు సంతోషింపలేదు సరిగదా, ప్రశంసార్హమైన పనియనియైన నాతఁడు దలంపలేదు. అట్లు జరిగిన 3 దినముల ప్రయాణములో అతఁడే ముందుగా పరుగెత్తుచుండెను. నేను నా గుఱ్ఱమును అదలింపవలసియే వచ్చుచుండెను. వేడిగల దేశములలో నందఱివలెనే యతఁడును సరళ స్వభావియు, హాస్య ప్రియుడును అయియుండెను.

మబ్బులతోటి శీతోష్ణస్థితియును, వెలుతురులేనిచోట నివసించుటయు గలిగెనేని మనస్సునందు విచారముతోఁగూడిన భావములు గలుగుచుండును. దేహమునందు రోగము వృద్ధిబొందుచుండును. ఈజిప్టుదేశమునందలి నిరంకుశప్రభువుల

గుఱ్ఱపుబగ్గీలవెంట 'సైస్' (నౌకరులు) నడచుచుందురు. వడిగా నడచు గుఱ్ఱమునకంటె వా రెప్పుడును ఒక ఫర్లాంగు దూరము ముందుగనే నడచుచుందురు. సూర్యకాంతితో గూడిన ప్రకృతిమాతబిడ్డలగు నీ అరబ్బులు, అమెరికనులు కంటెను, ఇంగ్లీషుమొదలగు నితర యూరోపీయనుల కన్నను దృఢతరులైయున్నారు. లాఘవమునందును వారే గొప్పవారై యున్నారు. మిక్కిలి స్వల్పకాలములో ఈజిప్టులోని అనేక పిరమిడ్ శిఖరములను ఆరోహించిన ఒక అరబ్బీవాఁడు నన్నుకు స్త్రీకి రమ్మనియు తాను నన్ను పీటుమన్ను చేయలేనియెడల తనకున్నదంతయు ఓడెదననియు చెప్పెను నేను 200 పౌనుల తూకముగల్గి బాగుగా మల్లయుద్ధములం దారితేరియున్నాను. ఈడులేని మల్లుడనే యగుదును. మిక్కిలి యౌన్నత్యము వహించిన అతని భుజములును పిక్కలును చూచినతోడనే అతడు నాకన్న గొప్పవాడని తెలిసికొంటిని. కాన అతనిపై చేయి వేయలేదు.

కెయిరోలోనున్న అరబ్బులు రాతికట్టుడుపని చేతురు. వారు పనిచేయుటలో విపరీతమగు బరువుగల రాలను కదలించుచుందురు. ఇద్దరు తెల్లవారు మిక్కిలి శ్రమతో కదలించు బరువును వారొక్కొక్కరే సులువుగా కదలింపఁగలరు. ఈజిప్టు, పాలస్టైన్, సిరియా, ఆల్జర్స్, మొరాకో దేశములందలి అరబ్బులపిల్లలు, అదే వయసుగల తెల్లవారిపిల్లలకంటె రెట్టింపు వడిగా విద్యను గ్రహింతురు. పై దేశములందలి మిషనులలో పనిచేయుచున్న విట్లీకన్య, విలియంకన్య మొదలగువారిని విచా

రించిన, నేను వ్రాసినవిషయమునందలి సత్యము ధ్రువపడును. 10 మొదలు 13 సంవత్సరములవయస్సుగల 12 మంది అరబ్బీ పిల్లలకు 4 సంవత్సరములు ఒకఅమెరికను ఉపాధ్యాయుఁడు బోధింపఁగా వారు 4 భాషలు నేర్వఁగలిగిరి. అరబ్బీనుండి ఫ్రెంచిభాషలోనికి; ఫ్రెంచిభాషనుండి జర్మన్ భాషలోనికిని, జర్మన్ భాషలోనుండి ఆంగ్లేయభాషలోనికిని వారు పద్యము లను తర్జుమా చేయఁగలిగిరి. 10-12 సంవత్సరముల అమెరికా పిల్లవాఁడు యింగ్లీషును ఎంతవడిగా చదువగలఁడో వారి తర్జుమా అంతవడిగా నడచుచుండెను. 4 సంవత్సరములకు పూర్వ మం దొక్కరికేని ఒక్కభాషయందలి అక్షరమైనను తెలియ దు. నేను యూక్లిడ్ రచితమగు రేఖాగణితమునందలి మిక్కిలి చిక్కైనప్రశ్న నీయగా వారు సులువుగా విడదీయఁగలిగిరి. అనేకమాసములు అరబ్బులతో తిరిగితిని. వారిగృహములం దనేకతూరులు నిద్రించితిని. నన్నొకరేని మోసగింపలేదు. నా తాలూకు వస్తువులను దొంగిలింపను లేదు. అసత్యమాడను లేదు. క్రైస్తవదేశములవారు అరబ్బులవద్దనే నిష్కాపట్య మును, నీతిని నేర్చుకొనదగినంత నీతివంతులై యున్నారు.

మీకు విశ్వాసపాత్రుఁడును, సూర్యకాంతిని
గురించి తాముచేయుచున్న ప్రచారమునందు
హృదయపూర్వకమగు సానుభూతియును గల

జోసెఫ్ సిమ్స్, యం. డి.''

9. సూర్యకాంతివలన సౌందర్యము వృద్ధిగాంచును.

ప్రపంచమునందలి ముఖముమెరుగులు, చూర్ణములు అన్నిటి

కన్నను సూర్యకాంతియందును, గాలిలోను దేహమును సౌందర్యతరముగా జేయుశక్తి యున్నది. అందు చర్మమును పట్టువలె మృదువుగా జేయుశక్తి యున్నది. 2 వికారమగు పాండువర్ణమును బోగొట్టి దేహమునకు ఎఱుపుతోగూడిన చామనచాయ నొసంగుశక్తి యున్నది. 3 నేత్రములకు దీప్తి నిచ్చునట్టియు, గమనమునకు లాఘవము నిచ్చునట్టియు, ఆకారమునకు స్వాభావికతను, సౌజన్యమును నొసంగునట్టియు శక్తిగలదు. 4 ముఖమునం దెట్టికంతులుగాని, మొటిమలు మొదలగునవిగాని లేకుండజేసి ముఖవర్చస్సును శుద్ధముగా జేయు శక్తి గలదు. కేవలము ముఖమునకే సూర్యకాంతి తగులుచుండినయెడల ముఖము కందిపోయి, రామణీయకముగా నుండకపోవచ్చునుగాని దేహమంతటను సూర్యకిరణప్రసారము తగిలినయెడల ఆరక్తము దేహమునం దంతటను సమముగా నభినరించును. కేవలము పాలిపోయినట్లుండుట సౌందర్యముగాదు. మీదుమిక్కిలి ఆ రంగు భయావహమై యుండును. కీ॥ శే॥ డాక్టరు డిమో. లూయీ యిట్లు వ్రాయుచున్నారు:

"విక్రయశాలలయందు, రక్తహీనములును, అపక్వములు నగు ముఖములతో కళాకాంతులు లేకుండనుండు బాలికలను మీరు చూచియుందురు. ఆ బాలికలు ఆకుపచ్చని (అపరిపక్వమగు) స్థితిలో నుందురు. వారి చెక్కిళ్లు, పెదవులు చూడుము. వారు అర్ధభాగమైనను పక్వముగాని స్థితిలో నుందురు. వారిని పల్లెటూళ్ళకు పంపుడు. గొడుగులను వదలి సూర్యకాంతి

ననుభవింపనిండు. 3 మాసములతరువాత చల్లమాటుననుండి పాలిపోయిన 12 మందికన్నను అల్లెండ ననుభవించిన బాలిక యొక్కటైనను నెక్కువ రుసుము నీయగలను. అప్పుడామె యేపనినైనను చాకచక్యముతో నిర్వహింపఁగలదు. సూర్య కాంతియందు స్వేచ్ఛగా విహరింపఁగలిగినబాలికయే సర్వాంగ సౌష్ఠవముగలదై మెరసినిచెక్కిళ్ళు నిరాటంకమును మధుర మును నగు శ్వాసయు గలదగును.

బలహీనమై శుష్కించిన శిశువులకు సూర్యకాంతి ప్రయోజనకరమైనదని చేసనేకసంవత్సరములుగా నుపదేశించు చున్నాను. దుర్బలులును, పాలిపోయియు నుండువారు రక్త క్షయమువలన మరణింతురు. సూర్యకాంతియందు నెక్కువ కాలము నీ శిశువుల నుంచుటవలన వందలాదిశిశువులు రోగమునుండి విముక్తులై ఆరోగ్యమును గాంతురు. దుర్బ లులై పాలిపోయి, పిశాచములవలె చూడ ననహ్యముగానుండు శిశువు లనేకులు దినమునకు 2, 3 గంటలు సూర్యకాంతియం దుండుటవలన, ఇంద్రజాలమునందువలె మిక్కిలి వడిగా నారోగ్యభాగ్యమును గాంతురు. ప్రపంచమునందు దిగం బరులుగా నున్నారని చెప్పఁబడుజాతులు సర్వాంగసౌష్ఠవము గలవారై యున్నారు. జీవితనియమములను వీరెఱిఁగియుండు లేని యీ సౌష్ఠవము మరింత అధికమగును.

ఉడ్ అనువారు అనాగరికజాతులను గురించి, అందును కాఫీర్ లను గురించి వ్రాసిన వ్రాతల నిచట నుల్లేఖించుచున్నాను. "అవివాహితలగు యువతులు, యువకులు బాగుగా సౌష్ఠవ

ముగా నున్నప్పుడు ప్రపంచమునం దెచ్చటను జూడని సౌంద ర్యము వారియందు గాన్పించును. వారి యవయవములకును దుస్తులవలనగలుగు వికారములు గలుగవు. అమెరికాయం దును, సమీపదేశములందును, ఏ అతిబిగువైన దుస్తులవలన అందవికారము మొన్న మొన్నటివరకు గలుగుచుండెనో అట్టి నాశనకరమగు నలవాటు వారియందు లేదు. ప్రతి కండరమును, ప్రతినరమును పరిశ్రమాదులవలన బాగుగా వాడుక గలిగియుండును. శ్వాసాశయములు పరిశుద్ధమగు వాయువునే పీల్చును. చాకచక్యముతో గూడిన అభ్యాసముల వలన వారి దేహసౌష్ఠవమునకుఁ గారణమగు వర్తులతయును జేయును గలుగును. ఇట్టి యభ్యాసములులేని వారియం దిట్టి సౌష్ఠవమును గలుగదు. పురాతనమగు శిల్పమునందు కాన్పించ నట్టి, మానవప్రతిమలయొక్క అప్రతిమాన సౌందర్యమును మన మందఱమును మెచ్చుకొందుము. కాని మనము దక్షిణ ఆఫ్రికాకే పోయితిమా, చలువ రాతితో చెక్కఁబడిన సౌందర్యవంతమగు 'ప్రతిమలను గాక సచలన సౌందర్యవం తములగు చామనఛాయగల సజీవప్రతిమల జూడగలము.' అసమానమగు నీ సర్వాంగసౌష్ఠవమునకు కండరముల యొక్క చలనమును, శుద్ధవాయుశ్వసనమునే కారణముగా ఊడ్‌గారు ఊహించుచున్నారు. ఎక్కువ దుస్తులను ధరించి సూర్యకాంతిని దేహమునకు తగులకుండ చేయువారున్నారు. వారును ఎక్కువ శాస్త్రీయములగు వ్యాయామములనే చేయుచున్నారు. కాని వారికేల సర్వాంగసౌష్ఠవములేదు?

వ్యాయామము మంచిదే, కాని కాఫిరుస్త్రీలు మిక్కిలి మెక్కువ పరిశ్రమవలనను, మితిమాలిన చాకిరివలనను, పెద్ద వారైనకొలదిని సౌందర్యమును గోలుపోవుచున్నారు. ఉష్ణ దేశీయ సౌష్ఠవమునకు కంతటికిని సూర్యకాంతియే కారణ మని గ్రహించు నేర్పరితనము లేకపోయెను. సూర్యకాంతి తగులుదేహమునందలి వారిరక్తము చేతోవంతమైయుండును. అందువలన అతిమాత్రముగు క్రొవ్వు వృద్ధి నందదు. కనుక లంబోదరులవలెనుండు ఆకారము వారికి గలుగదు. సూర్య కిరణములు పోషకశక్తులను వృద్ధిజేయునుగాన సన్నదనమును గూడ పోగొట్టి అనురూపతను (Symmetry) గలిగించును. వీనివలనను, అనేక ఇతరసత్యవిషయములవలనను సూర్య కాంతి సౌందర్యమును వృద్ధిజేయునని చెప్పవచ్చును.

### 10. సూర్యకాంతివలన రోగనివారణమగును :—

సూర్యకాంతి తమదేహముపై బాగుగ తగులునట్లు జేసికొను జాతులు రోగమనున దేమియో యెఱుఁగరు. ఇదివరకు వర్ణింపఁబడినట్లు జనులు మిక్కిలి బలముగా నుండునట్లు జేయు సూర్యకిరణప్రభావమువలన అసంఖ్యాకములగు దురల వాటు లున్నను వారి యారోగ్యమును అప్రతిమానముగా నుండుననియే మనము గ్రహింపఁగలము. నాగరక దేశములందు వ్యాపించి వైద్యవరులకు నిర్మూలింప సాధ్యముగాక నిలిచి యున్న నవాయివ్యాధి, నాగరకతగలవారివలన ప్రవేశపెట్టఁ బడినతప్ప దిగంబరముగా నుండు జాతులవారియందు లేనే లేదు. మధ్యఆఫ్రికాలోను, జపాను, శాండ్‌విచ్ ద్వీపములు

మొదలగువానియందును స్థితి యిట్టిదే నని లివింగ్‌స్టన్ (Livingston) సర్ సామ్యూయెల్, డబ్లియు. బేకరు మొదలగు వారిచే వివరింపఁబడినది. దిగంబరులగు నాఫ్రికా దేశీయు లనుగూర్చి వ్రాయుచు, వారి సహాయవ్యాధు లెక్కించినను, వారియందది వృద్ధిఁబొందక నశించునని లివింగ్‌స్టన్ వివరించియున్నాఁడు. ఉక్కకాలువలన గలుగు పిచ్చి, ఉష్ణమండలములందు లేదనియు; పిచ్చి, మూర్ఛ మధ్యాఫ్రికాయందరుదుగా నుండుననియు చెప్పిన లివింగ్‌స్టన్ వాక్యములు యథార్థములేయని సర్ శామ్యుయల్ బేకరు వచించెను. అతఁ డిట్లు వ్రాసెను:—

"దాదాపు దిగంబరులై తిరుగు బాక్ వెయిను జాతివారియందు కన్పించువ్యాధుల సంఖ్య చాల తక్కువ. క్షయ, గండమాల, ఉన్మాదము, శిరస్సంబంధమగు నంజు, వారియం దరుదు. కలరా, రాచపుండు వారియందు లేనేలేదు. దుర్భరమగు వ్యాధులైనను ఆఫ్రికా లోపలిభాగములందు మందు లేకనే నయమగును. అచ్చటి నీటియందు క్షారసంబంధమగు గంధకము(Sulphate of lime) గలదు. ఆనీరు కాచినచో కాగుల యడుగున త్వరలో అది పేరుకొనును. అట్టినీరు త్రాగినను అచటి వారికి మూత్రాశ్మరి, పైత్యాశ్మరి గాని కలుగుట లేదు.

కృత్రిమమగు మననాగరకతవలన వారియం దనేకదుర్భర వ్యాధులు ప్రవేశపెట్టఁబడినవి. మనవలన బలవంతముగా ప్రవేశపెట్టఁబడిన వస్త్రధారణమువలన వారి దేహములు దివ్య

మగు సూర్యకిరణసౌభాగ్యమును గోల్పోయినవి. వారియం దలి శక్తి నానాటికి దిగ నాశిల్లుచున్నది. వారు పూర్వపు శక్తిలో 10 వ వంతు శక్తినిమాత్రమే యిప్పుడు కలిగి యున్నారు. జపానీయులును, మనవలెనే దేహము నంటి యుండు దుస్తులను ధరించనియెడల సిగ్గుపడు స్థితికి వారిని మనము తెచ్చినాము. మనవలెనే మోటుమందులు వాడు టను నేర్పితిమి. మనవలెనే వారును నానాటికి బలహీనులును రోగగ్రస్తులును అగుచున్నారు."

"గ్వయానాదేశపు పూర్వనివాసులగు స్త్రీపురుషులు దాదాపు దిగంబరముగా నుందురు. ప్రసవమునుగురించి వారు తలవనే తలవరు. యూరపియనుస్త్రీ లన్ననో అనేకవారములవరకు రోగగ్రస్తులుగానే యుందురు." అని జె. జి. ఉడ్గా రనిరి. ఒక వారుస్త్రీ ప్రసవించిన రెండుగంటలకే తన శిశువును ఒడిలో నుంచుకొని ఒకయింటినుండి వేరొకయింటికి పోవలుగుట శౌంట్ అను నతడు చూచెను." అట్టి వారిని మనతో పోల్చి చూడుడు. ఎస్కిమోలు సూర్యకాంతి తమదేహములకే తగులకుండునట్లు చర్మములు మొదలగువానిచే కప్పియుం దురు. వారు ప్రసవించుట కలిగనేని అనేకమాసములు మంచముపై పరుండవలసినట్లుగనే యుందురు.

ఎలిజబెత్ ఓక్సు స్మిత్ అనునామె నాకీవిషయమును తెలి పెను:— "ఆతపస్నానములందు చాలకాలమునుండి విశ్వా సము గలదానను, ఒకశిశువు 5 వత్సరములుగ రోగగ్రస్తురాలు.

ఆపిల్లపక్క యెండలో నుంచి దానిపై ప్రతిదినము కొంత కాలము పరుండబెట్టునట్లు నేను చేయించితిని. దాని కారోగ్యము తిరిగి కలిగినది.

వాల్ట్ హిట్‌మన్ అను కవీశ్వరుం డిట్లు వ్రాసెను:

"12 సంవత్సరములకిత్రము చచ్చుటకు యీ కేమ్‌డన్ అను చోటికి వచ్చితిని. ప్రతిదినమును నీపల్లెలోనికి పోయి, దిగంబరముగ ఆతపస్నానములు చేయుచు, పక్షులతో విహారించుచు, ఉడుతలతో తిరుగుచు, జలచరములతోపాటు నీటిలో నాడుకొనుచుండుటవలన నాయారోగ్యము దినదినాభివృద్ధి గాంచినది. రోగమును బోగొట్టి యారోగ్యమును, స్వేచ్ఛను గలిగించుట యందు ప్రకృతిశక్తి యద్వితీయమును, ఆశ్చర్యకరమునుగదా!"

డాక్టరు డియో. లూయిస్ అనునతఁడు చెట్లనీడనున్న గదులలో నివసించుచుండిన యువతులను గూర్చియు యువకులను గూర్చియు చెప్పుచున్నాడు. వారు చిక్కి శల్యావశిష్టులై, పీనుగుకళపడి పాలిపోయి, అగ్నిమాంద్యము, తలనొప్పి, నిరుత్సాహము మొదలగువానిచే బాధపడుచుండిరి. ఆముందున్న చెట్లు నరకి 8 అడుగులయెత్తుగల అలవ నేర్పాటు చేయునట్లు వారి పెద్దవారితో చెప్పి అట్లు చేయించెను. ప్రతిరోగియు వివస్త్రముగా తనగదిలో సూర్యకాంతిలో ప్రతిదినము ఒకటి రెండేసి గంటలు పరుండుచుండెను. కొన్నివారములతరువాత వ్యాధులుపోయి వారు నూతన యువతీయువకులైరి.

న్యూయార్కునగరవాసి, డాక్టరు ఇ. సి. ఎంజల్ యిట్లు వ్రాయుచున్నాడు:—

"అగ్నిమాంద్యముగల స్థితిలో దీర్ఘములగు ఎలిక్ట్రిక్ లైట్ వెలుతురు స్నానమునలన అత్యంతోత్కృష్టమగు సత్ఫలితముల గాంచితిని. ఒక ఆంగ్లేయయువకుఁడు అగ్నిమాంద్యవ్యాధిచే మిక్కిలి పీడింపఁబడుచుండెను. సామాన్యచికిత్స చిరకాలము చేసినను కొద్ది ఫలితమే గలిగెను. ఆతపస్నానములవలన త్వరగనే పరిపూర్ణారోగ్యము గలిగి, వస్త్రాదుల కుండదగినంత ఉత్సాహము, తేజము మొదలగునవి గలిగెను. అట్లే శల్యావశిష్టముగా నున్న యింకొక అగ్నిమాంద్యపురోగి 6 వారములలో అదేచికిత్సవలన తూకములో 20 పౌనులు వృద్ధిగాంచెను. ఉపకరణములతో చేయు సూర్యకిరణచికిత్సవలన రోగములు నివారణమగుటనుగురించి ముందు వివరింపఁబడును. (ప్రౌఢ ప్రిబాకరము చూ.)

11. సూర్యకాంతిమాంసిరశక్తులనుజ్జీవింపజేయును. శిశువులను చీకటిలో పెంచుట బుద్ధిమాంద్యమును, రోగమును ఆహ్వానించుటయే యగును. సూర్యకిరణములందలి వైహాయసములు దేహములోనికెల్ల వ్యాపించి, అందలినరములను, పెండటిని సజ్జీవింపఁజేసి, అవి మెక్కువ చాకచక్యముగా పనిచేయునట్లు చేయును. తుపానుతోగూడిన మేఘములందుండి సూర్యభగవానుఁడు వెలుపలికి కాన్పించినప్పుడు ప్రతివారికిని మాతనోత్సాహము అనుభూత మగును.

హ్రోడ్ ద్వీపమునం దొకఫ్యాక్టరీలో 200 మంది ఆడు వాండ్రు పనిచేయుచుండిరి. సూర్యకాంతి తగులువైపున కొంతమందియు, సూర్యకాంతి తగులనిచోట కొంతమందియు పనిచేయుచుండిరి, కాంతి తగులువైపు పనిచేయువా రుత్సాహవంతులై, ఆడుచు పాడుచు నుండిరి. కాంతిలేనివైపు పని చేయువారు నిశ్శబ్దముగా స్తబ్ధులై యుండిరి. అకస్మాత్తుగా వారు పనిచేయు చోట్లయందు మార్పు గలిగెను. అదివరకు నిశ్శబ్దముగా నుండువా రప్పుడు పాడ నారంభింపఁగా, అది వరకు పాడుచుండువా రప్పుడు నిశ్శబ్దమును భజించిరి.

సూర్యకాంతి తమ దేహముపైఁ బ్రసరింప జేసికొను హిందూ శిశువులు, ఆంగ్లేయ శిశువులకన్న రెండు సంవత్సరములు తక్కువకాలములో తమవిద్యను ముగింతురని ఒక ఇంగ్లీషు పెద్దమనిషి నాతో చెప్పెను.

అభినయమునందు చాకచక్యములేని యిద్దరు నటకులను ఆరు వారములు సూర్యకాంతియం దుంచునట్లు ఫ్రెంచికవియగు వోల్టేరు (Voltair) సలహా నిచ్చెను. (ఇదే అధ్యాయమున 8 వ శీర్షిక చూ.)

ఇటాలియా దేశమునందలి పిచ్చివాండ్ర ఆసుపత్రిలో డాక్టరు పోంజాగారు రంగువెలుతురుచేత పిచ్చిని కుదిర్చినవిషయ మిది వరకే పేర్కొనఁబడినది.

"మందు లేకుండ రోగములు కుదుర్చు టెట్లు" అనుపేరుగల డాక్టరు జేమ్స్. సి. జాక్సన్ గారి గ్రంథమునుండి యీక్రింది భాగము నెత్తి వ్రాయుచున్నాను.

"ఇతరవిషయములు సమానముగా నున్నయెడల నెంత యెక్కువ సూర్యకాంతియం దుండిన అంత మేధాశక్తి సూర్య కాంతియం దున్నవానికి ఎక్కువయగును. సూర్యకాంతి మనుజుని కాంతశక్తి (magretism) గలదానినిగా జేయును. కాంతశక్తి మానసికమగుశక్తి. కాంతశక్తిగల మేధావి, మెదడు చిన్నదైనను, పెద్దదైన మెదడుగలవానికంటె అత్యధికమగు కేంద్రశక్తి గలదిగా నుండును."

12. సూర్యకాంతి లేనందున గలుగు దుష్పరిస్థితులు:—



17వ పటము- నగదేవత.

డాక్టరు ఫోర్బ్సు విన్స్లో గారిట్లు వ్రాయుచున్నారు. సూర్యకిరణములు తగులకుండ నిరాకరించుటవలన రక్తక్షయము, పాండువు, చర్మతలము ఆకుపచ్చగా నుండుట మొదలగు రక్తహీనతవలన గలుగు వ్యాధులు గలుగును. ముఖము శవమునకువలె కళాహీనమై యుండును. నేత్రములందు రక్తము లేకుండును. చర్మము నందలి కాంతి నశించి, చమురు కారుచు, మైనపు బొమ్మవలె నుండును. పాలి

పోవును. బలహీనమును, ఎండిపోవుటయు కండరములయందు పటుత్వము లేకుండుటయు, దిగనాశిల్లుటయు, సంజను, ఎముకలు మెత్తబడుటయు, నాడీసంబంధమగు చిరాకును, హృదయమునందు ద్రేకమును, ఆకలిలేమియు, రక్తాభిష్యందసంబంధమగు పరిణతయు, క్షయ, దేహసౌష్ఠవము చెడుటయు, మరుగుజ్జుతనమును, మానసికదౌర్బల్యమును, అకాలవార్ధక్యమును కలుగును."

లండననగరమునందలి డాక్టరు వింటర్‌గారిట్లు వ్రాయుచున్నారు:—"శిశువులకు వెలుతు రెంత యవసరమో అందు నగమైనను మనకు తెలియదు. నగరములందు పెంచఁబడి జీవచ్ఛవములవలె నుండు శిశువులందు గలుగు నన్ని వ్యాధులును దాదాపుగా సూర్యకాంతియు, వాయుప్రసారము లేకుండుటవలననే గలుగుచున్నవని చెప్పదగియున్నవి. సూర్యకాంతియు, ప్రాణవాయువును వారిదేహములకు తగులకుండునట్లు శిశుదేహములు దుస్తులతో చుట్టబడుచున్నవి. సూర్యకాంతి దేహమున కవసరమను విషయము తల్లులకు బాగుగా తెలిసియున్నయెడల ఆ దుస్తులను తొలగించి, శిశువులను నెండలోను గాలిలోను బాగుగ తిరుగ నిచ్చెదరు. గండమాలరోగపరిణత గలవారి కిది మిక్కిలి మేలు చేయును. శిశువులు, అద్దపుటిండ్లలోను, సూర్యకాంతిప్రసారముగల శిశుమందిరములందును స్వేచ్ఛగా తిరిగి, ఆడుకొనునట్లేర్పాటు చేయవలెను."

పత్రికలయందు సూర్యకాంతి రోగములను గుణపర్చుటయం దెంతసమర్థమైనదో పరిశోధించియున్నాఁడు. చీకటిగదులయం దున్నవారికంటె వెలుతురు బాగుగా నున్నగదులలో నుండి రోగనివారణము బొందినవారి సంఖ్య మూఁడింతలుగా నున్న దని యాతఁడు పర్యవసానము తేల్చియున్నాఁడు. దీనివలన దక్షిణాయందలి అనుపత్రులయందు మంచి సంస్కరణము జరిగి రోగుల గదులయందు బాగుగా వెలుతురుండునట్లు ఏర్పాటు జరిగినది. అందువలన మంచిఫలము గలిగెను.

డాక్టరు ఇ. బి. ఫ్రాటిగా రిట్లు వ్రాయుచున్నారు:

"ఈ నగరమునందు నాసాహజారునందు ఒక ఆఫీసున్నది. ఇది యింకొక మేడకు చేరికగా నుండుటవలన ఆఫీసుయొక్క కిటికీలు వెలుతురు లోనికి రాకుండునట్లు మూసివేయఁబడుచుండెను. 10, 15 సంవత్సరములుగా అందు నివసించుచుండిన వా రందఱును క్షయచేతనే మరణించిరి ఎవరి చెక్కిళ్ళు సూర్యకిరణ ప్రసారమువలన నలుపెక్కుచుండెనో వారి చెక్కిళ్ళు 'యకృద్వ్యాధి'వలన పసిమిని బొందవు. యకృత్ వ్యాధి=పైత్యకోశ సంబంధమగు (Morbid liver) వ్యాధి.

ఒకకొండ గలదు. దానికి ఉత్తరమునను, పశ్చిమోత్తర భాగమునను కొందఱు నివసించుచుండిరి. అచట సూర్యకాంతి చాల తగ్గియుండును. ఆ కొండకే దక్షిణమునగాని, ఆగ్నేయ దిశయందుగాని కొందఱు నివసించుచుండిరి. అచట సూర్య కాంతి యెక్కువ సూటిగను తీక్ష్ణముగను ప్రకాశించు

చుండును. ఇందు మొదటిజట్టుకుటుంబములు కొంతకాల మచట నివసించిన తరువాత రోగగ్రస్తమై, నానాటికి కృశించి, క్షయచే నశించిరి. రెండవజట్టు అదేకాలములో, నితర స్థితులలో మార్పులేమియు లేకున్నను, బలారోగ్యములును నిలుపుకొని యుండగలిగిరి.

అసంఖ్యాకులకు చెట్లనీడను ఇండ్లుండును. తలుపులు మూసి యుండును. తెరలు వేయబడియుండును. కిటికీలును మూయఁ బడియే యుండును. లోపలనున్న గాలి చెడి, మురికియై నివసింప ననువుగాక యుండును. అందు నివసించువారి చెక్కిళ్లు రంగుచెడి, దయ్యములవలె నగుదురు. దృష్టులు మాంద్యముగలవగును. వారిగమనమును చైతన్యరహితమై యుండును. లోపల నున్న తివాసీలు చెడిపోకుండ కాపాడగల వీరికి ఆరోగ్యమును బలియిచ్చుటయం దెంతవైరాగ్యమున్నదబ్బా! ఫ్రాన్సు దేశమునందు పాశ్చర్ (Pasteur) అను నతఁడు సూర్యకాంతి రాకుండ నీడ గలిగించినగదులలో శిలీంధ్రములు వృద్ధిబొందునని ఋజువుచేసి యున్నాడు. జలము మొదలగునవి సూర్యకాంతి తగులనిచో చెడిపోవుననుట తెలిసిన విషయమే. నిలువ నీరుగల చెరువులు వేసంగియం దేల చెడిపోవుచున్నవని యూహింగవచ్చును. మబ్బుగా నున్న దివారాత్రులయందును సూర్యకాంతి తగులకపోవుటవలననే అవి చెడిపోవుచున్నవి.

సూర్యకాంతి లేకుండుటవలన గలుగు అసంఖ్యాకములగు వికారకరములగు స్థితులను గూర్చి యిచట సమగ్రముగా వివరింప

సావకాశము లేదు. వెలుతురు మూసివేసిన రోగియొక్క గదిని గురించియు దట్టమైన దుస్తులచే దేహమును కప్పియుంచుట వలన మైనపుబొమ్మలవలె నుండు జీవచ్ఛవములను గూర్చియు, గైలులోను కిటికీలను మూయుటను గురించియు, ఖనిజములను త్రవ్వుపనివాండ్రయొక్క బలహీనత, అంగవికృతిని గురించియు, వారు సేనలో చేరదగియుండకుండుటను గురించియు నిచట విపులముగా చర్చింప సావకాశము లేదు.

సూర్యకాంతి తగ్గియున్నయెడల జంతువులును మిక్కిలి బాధ నొందును. కుందేలును 3 వారములు చీకటిగదిలో నుంచిన క్షయచే మరణించును. జాతీయజంతుసంబంధమగు పత్రిక యీ క్రిందిపరిశోధనాఫలితమును ప్రచురించునది. 180, 182 పౌనులతూకముగల 2 ఎఱ్ఱని ఆవుదూడలను ఒకదానిని చీకటింటను, రెండవదానిని సూర్యకాంతియందును నుంచి పెంచిరి. 3 మాసముల తరువాత చీకటింట పెరిగిన దూడ 360 పౌనులు తూగినది. బొంతు రేగినది. వెలుతురులో పెరిగి నది 430 పౌనులు తూగినది. రంగు మారలేదు. తరువాత రెండును వెలుతురులోనే పెరిగినవి. కాని చీకటింట పెరిగిన దూడ తిరిగి మామూలురంగునకు రానేరాలేదు. శక్తిలోను పరిపూర్ణస్థితికి రాలేదు.

**13. పరిపూర్ణశక్తికి కావలసిన సూర్యకాంతి:—** వ్యతిరేకశక్తుల యొక్క సమతవలన సామరస్య మేర్పడు నని మనకు తెలియును. ఒకవైపున అత్యంతమగు సూక్ష్మశక్తియు వేరొకవై

వున అతిశీతశక్తియు నుండి సమత యేర్పడినప్పుడు సామరస్య మేర్పడును. భూమధ్యరేఖనుండి ఉత్తరమునను దక్షిణమునను 20 అంశల ($20^0$ North & South of equator) వరకును నుండు భూభాగమునందు శీతశక్తి చాల లోపించి యుండుటవలన సామరస్య మేర్పడుటకు వీలులేదు. అందువలన 20–45 డిగ్రీలమధ్య నుండువారియందువలె 20 డిగ్రీలలోపల నుండు భాగమునం దుండు వారిదేహములందలి నాడులును, కండరములును చేవదేలుటకు సావకాశములు తక్కువగా నుండుటవలన స్త్రీపురుషులు సర్వాంగసౌష్ఠవము గలవారై యుండుటకు అనుకూలపరిస్థితులు తక్కువగా నున్నవి. అతిశీతలమండలములందు (Frigid zone) అత్యంతశీతలముగా నుండుటవలన అచట ఎక్కువచలనమునకు సావకాశములు తక్కువగా నుండును.

అతివస్త్రములు ధరించుటవలన వేడిమి గలుగును. వస్త్రములు ధరింపనిచో అంత వేడి గలుగదు. కనుక నెక్కువగా దుస్తులు ధరించువారికి ఆ వేడిని ప్రతీకారము చేయుటకు వారుండుప్రదేశము ఎక్కువచల్లనిదై యుండవలెను. భూమధ్యరేఖ కావల నీవల 35–55 డిగ్రీలమధ్య నుండుభాగము అత్యధికశక్తికి వీలగు ప్రదేశమైయున్నది. నేడు ఎక్కువగా దుస్తులను ధరించి బలహీనులైన గ్రీసు, ఈజిప్టు, యిటలీ, స్పెయిన్, దక్షిణఫ్రాన్సు, అమెరికాదేశపు యునైటెడ్‌స్టేట్సు దేశములందు అతిబలవంతులకొఱకుగాని, అతిమేధావంతులకొఱకుగాని పోనక్కరలేదు. ప్రకృతియందు అత్యంతశక్తికర

మగు సూర్యకాంతి, వస్త్రధారుల దేహములలోనికి ప్రసరింపక వారిని బలహీనులనుగను, మేధాహీనులుగనే చేయును, చేసివే యును. ఆ వస్త్రధారణమువలననే ఆయాదేశములలోనివారు అన్నివిధముల శక్తిహీనులే అయిరి. ఏ ప్రదేశములు వేడిదేశము లనియు, అత్యంతబలహీనదేశము లనియు తలచుచున్నామో, అట్టి గ్రీసు, రోము, ఈజిప్టు, మొదలగుదేశములు ఒకానొకప్పుడు మిక్కిలి బలశాలురకును, మేధాశాలురకును, విజ్ఞానులకును ఆవాసమైయుండెను. దీని కంతకును కారణ మేమి? (1) ఆ దినములలో శిశువులు మిక్కిలి తక్కువదుస్తులను ధరించుచుండిరి. ధరింపకుండుటయు గలదు. (2) ప్రకృతియందలి దివ్యశక్తి వారికి సూటిగ జేరుచుండెను. (3) పెద్దలు మిక్కిలి వదులైన దుస్తుల ధరించుచుండిరి. అందువలన గాలియు, సూర్యకాంతియు, దేహమున కందుండి వ్యాపించుచుండెను. 4 ఆ దేశములందు ఆటలు, వ్యాయామములు, పందెములు జరుగుచుండెను. అందువలన కండరములు శక్తివంతము లగుచుండెను. సూర్యకిరణప్రసారమువలన నాడులు బలపడుచుండెను. అందువలన వారికి కండరశక్తియు, నాడీశక్తి, అనగా మానసికశక్తియు గలుగుచుండెను.

అమెరికాయందును నేటి జీవితసరళివలన దక్షిణభాగముల కంటె ఉత్తరభాగములు శక్తికి నిలయములై యున్నవి. మానసిక, దైహిక, వైజ్ఞానికశక్తికి న్యూఇంగ్లండ్ కంటె బోస్టన్ ఎన్నికకుఁ దగియున్నది. నడచుట, పడవను తెడ్లతో నడుపు

శక్తిగలవారికొఱకు అమెరికాసంయుక్త రాష్ట్రములయొక్క ఉత్తరభాగమునకును, కనడా దిగువభాగమునకును బోవలెను.

దైహిక, మానసిక శక్తులను వృద్ధిసందించు సూర్యకాంతి అమెరికాయందుకన్న ఇంగ్లండునందు చాలతక్కువ. అట్లయినను, దైహిక మానసికశక్తులు, అమెరికనులకంటె ఆంగ్లేయులకు అత్యంత మధికముగా నుండును. ఏలన, వారు ఆరుబయట తిరుగుటయందు ఎక్కువప్రీతి గలవారై వారాశక్తులను వృద్ధిచేసికొనినారు. సముద్రసంబంధమగు ప్రాణవాయువు (Ozone) వారి ఘనతకుఁ గారణమై యున్నది. ఆతపస్నానములను బాగుగా చేయనారంభించినయెడల ఆంగ్లేయులందు అనన్యపూర్వమగు అధికశక్తి గోచరించును. తడితోగూడిన ఆదేశపు వాయువునందలి హైడ్రోజన్‌వలన వారిచెక్కిళ్లయందు గలుగుచున్న గులాబిరంగువలన వారు అమెరికనులకన్న బలారోగ్యములయందును, శక్తియందు నధికతము లని భావింపరాదు. అనేక దురలవాటులతో గూడియుండియును, అమెరికనులే యూరపియనులకంటె దీర్ఘకాలము జీవించుచున్నారని డాక్టరు బ్రౌన్‌సిక్వర్డుగారు ఒప్పుకొనుచున్నారు. అమెరికా దేశము సత్యమగు జీవితనియమముల ననుసరించుచున్నది. బాగుగ సూర్యకాంతి ననుభవించుచు శీతకాలమునందు గాలియందలి నిశితమగు శీతమును అనుభవించుచుండి, వేడికుంపట్లచుట్టు కూర్చుండుట మానుచు రేని అమెరికనులు ఆంగ్లేయులకంటెను శక్తిమంతులు కాగలరు.

శీత మనునదే నిజమగు శీతముగాదు. సూర్యకాంతియందలి నీలము, ఊదాకిరణములు - శీతముకన్నను శీతతరములై యున్నవి. అవి సూటిగా చర్మమునకే తగిలినయెడల దేహమునకు, శీతదేశవాసులకును వలెనే ధాతికబలము నొసంగ సమర్థమై యున్నవి. ఇబ్లై, కాఫిరులు, దయ్యాలు మొదలగువారు బలవంతు లగుచున్నారు. మెక్సికో ఉత్తరభాగమునను, పసిఫిక్ సముద్రమునందలి పర్వతములతో గూడిన అమెరికనుమండలములందును, సూర్యకాంతి దివ్యప్రకాశము గలదై యుండును. అట్టి మహత్తరశక్తిని వారు యుక్తముగా నుపయోగించుకొనునెడల వారియందును సర్వాంగసౌష్ఠవము గల స్త్రీపురుషు లుండగలరు.

14. సింహావలోకనము. సూర్యమండలమునుండి బయలుదేరిన కాంతి ఆకాశమునందలి అనేక వైహాయసప్రవాహములలోనుండి వచ్చుటకు బహు నిశితమగు తత్త్వములను భూమిమీదకు తీసికొనివచ్చును. ఒక్క సూర్యకిరణమునందలి శక్తిని వివరించు యంత్రమునందు చూచిన 4000 తరగతులశక్తి యున్నట్లు సర్. డేవిడ్ బ్రూస్టర్ చూచియున్నాడు. అందు దహించుట మొదలుగా నెరుపు, వేడినీలి, ఊదారంగులయందలి శీతము - ఇంకను దిగువవరకును 4000 తరగతుల శక్తిని చూచియున్నాడు.

అన్నిరకములయందును వివిధతరగతుల శక్తి గలదు. లోహము, కాంతశక్తి, సోడియము, అంగారము మొదలగునవి సూర్య

కాంతియందు గలవు. అట్లైన ఆ వస్తువులనే నూటిగ మందుల దుకాణములోనే సంపాదించుకొనవచ్చునుగదా? ఈ ఆతప స్నానము లేల? అని యడుగవచ్చును. ఏలయన నీ పదార్థములే స్థూలపదార్థములుగా నిచ్చుటకంటె, సూర్యకాంతియందలి సునిశితతత్త్వముగా స్వీకరింపఁబడినప్పుడా తత్త్వములు చొఱబారు స్వభావముగలిగి, ఫలము శాశ్వతమై, నిరపాయకరమై, సుఖప్రదమై, సౌమ్యమై, సరళమై, బలవర్ధకములై మానసికోన్నతిని గలిగింపగలిగియుండును. (ఇందే 6 వ కిరణము చూ.)

సూర్యకాంతి నూటిగ దేహములకు తగులనిచ్చిన జాతులయందు బలము, ఆరోగ్యము, ధాతుశక్తి, ఓర్పు, రోగమును నిరాకరించుశక్తి, పునరారోగ్యప్రాప్తికి కావలసినశక్తియు నుండును. సూర్యకాంతిని నిరాకరించినవారు ఇందలి పైవారికి పై విషయములయం దీడు రాకయుందురు. ప్రకృతియందు వైహాయసరూపమున వ్యాప్తమైయున్న ప్రవాహములలోని శక్తిని స్వీకరించి తెచ్చుటయే సూర్యకాంతియందలి దివ్యశక్తికి కారణమై యున్నది.

ప్రపంచమునందలి జాతులవారినిగురించి విచారించునప్పుడు వస్త్రధారణ మెంత ఎక్కువయైన, శక్తి యంత తగ్గియుండుననియు వస్త్రధారణ మెంత తగ్గియున్న, శక్తి అంత హెచ్చియుండు ననియు మనకు గోచరించును. ఇతర విషయము

లన్నియు నుభయ తెగలయందును సమముగ నున్నప్పుడే యిది చెల్లును.

సన్నని దుస్తులను ధరించుటవలన దేహభాగములు పరిస్ఫుటమగునేమోయని యెవరును అవినీతిగా భావింపరాదు. ఏలయన, చెడుపనులు చేయుటయే అవినీతిగాని, సన్ననిదుస్తులు ధరించుటయందవినీతిలేదు. తమభార్యలయొక్క ముఖములైనను బయటివారికి కాన్పింపకుండు నంతఃపురములుండుచోట నవినీతి ప్రబలముగా నున్నది. దిగంబరులగు కాఫిరులందును, జోర్ని యోనివాసులగు దయ్యులయందును, నాగరకు లనబడువారియందుకన్న నీతి యెక్కువగనె యున్నది. వారే యెక్కువ శుద్ధులును అయియున్నారు. కాఫిరులమధ్య నివసించి వారి పవిత్రతను గమనించిన తెల్లవారు తమదేశముల కేగినప్పుడచ్చటివిషయలోలతం గాంచి సిగ్గుపడవలసినవారే యగుచున్నారు.

తమ దేహములపై సూర్యకాంతియు, వాయువును తగులుటవలన దేహాంతర్భాగము లుజ్జీవములై మాలిన్యములు వెడలిపోవుటవలన దేహమునందు కామాది ఉద్రేకములు గలుగక సహజమగు శాంతిని గలిగియుండును. కనుక వారికి దుస్సంకల్పములు కలుగనే కలుగవు.

నీడయందే యెడతెగక నివసించువారు అక్రమమును, గిడసబారినట్టియు పెంపు గలవారగుదురు. గండమాల, క్షయ, రక్తక్షయము, పాండువును గలుగును. నాడీదౌర్బల్యము మానసిక

సికదార్బల్యమును గలిగి, సత్యమగు పురుషత్వమునకుపయుక్త మగు తత్వములు నశించుననియు మనము గ్రహించితిమి.

వైద్యులకును, విద్యావంతులకును, సామాన్యజనులకును మహత్తరమగు శక్తిగల యీ సూర్యకాంతిప్రభావము తెలియ నిదిగనే యున్నది. వీరందఱిని మేలుకొలిపి యీ విషయమును వారికి బోధింపవలసినకాల మిదివరకే చాల గడచిపోయినది. అందువలన నీ విషయమునుగురించి యింత విపులముగా వ్రాయవలసివచ్చినది. కొంతకాలముక్రిందట నీపై పేర్కొనబడినవిషయములనే సంక్షేపించి, అమెరికాయందలి అనేక వార్తాపత్రికలకు పంపితిని. బుద్ధిమంతులకును, త్యాగులకును మిక్కిలి యుత్సాహమును, అభిరుచిని పెంపొందింపఁగల ఆ విషయములను ప్రచురించుటకు సాహసముగాని నూతనములగు నీ విషయములను ప్రచురించుటకు తగినదూరదృష్టిగాని వారికి లేకపోయినది. ఈ విషయముల ప్రాధాన్యమైనను వారికి గోచరింపలేదు. వార్తాపత్రికలు అంటువ్యాధులను గురించియు, కలరా మొదలగువానిని గురించియు, వానివలన మరణించినవారిని గురించియు వ్రాయునేగాని, వానిని తగ్గించుటకును, సౌమ్యపఱచుటకును, లేకుండ జేయుటకు జేయుసూచనలను ప్రచురింపవు. రోగగ్రస్తులగు బ్రజల యభిరుచులును, పత్రికలయం దంతటను హత్యలు, ఆత్మహత్యలు, దెబ్బలాటలు, త్రాగుబోతులు మొదలగు వృత్తాంతములే నిండియుండుటను కోరెదరు. బాధితులగు మనజాతి యున్నతికై యేదైన ప్రచురింపఁదలచినను అందు కొద్ది

భాగమే మిగులును. కపాలశాస్త్రసంబంధమగు నొకమాస పత్రిక వెలుగుమొదలగు భౌతికశక్తులనుగూర్చిన యీ కథ నొకదానిని ప్రకటించెను. న్యూయార్కులోని (Herald of Health) 'ఆరోగ్యసందేశి' వర్ణశక్తులను గురించిన శాస్త్ర సంబంధమగు నా వ్యాసము నొకదానిని ప్రచురించెను. ఆ వ్యాసము వెంటనే లండనులోని 'పారిశుద్ధ్య ప్రపంచము' (Sanitary World) నందును, హాలుగారి ఆరోగ్యపత్రికయందును (Hall's Journal of Health) ఎత్తి ప్రకటింప బడినది. ఈపత్రిక లెప్పుడును సత్యమును, నూతనమును నగు విషయములను ప్రచురింపనుత్సుకములై యుండి సూర్యకాంతి మొదలగు సునిశిత తత్త్వములను గురించిన నా వ్యాసముల ననేకములను ప్రచురించుచుండెను. ఇతరపత్రికలలో నయిత మివి అనువదింపఁబడెను. స్వర్గీయమగు ఈ అమూల్యవరమైన సూర్యకాంతిప్రభావ మెఱుఁగక ప్రజలు ఆసన్నమరణులై యున్నారు. ఈవిషయముల తోడనే ముందు గ్రంథములన్నియుఁ బ్రకాశింపఁగలవు. పత్రికలు ఈ విషయమునే ప్రధానముగా స్వీకరింపగలవు. ప్రతిదినమును ప్రకృతియందలి యీ అద్వితీయుఁడగు రసాయనకర్త ఆకాశమునందలి జాజ్వల్యమానుడై ప్రయాణము చేయుచునే యున్నాడు. తన అద్భుత జీవవాహినియందు మనలను ముంచుచునే యున్నాడు. సర్వపదార్థములను తన దివ్యకిరణములచే సౌందర్యవంతముల జేయుచునే యున్నాడు. తన దివ్యకరములతో మనలను తనదివ్యశక్తిని తలపై కెత్తి గ్రహింపవలసినదని ఆహ్వా

నించుచునేయున్నాడు. ప్రపంచమునందలి యైంద్రజాలమును విమర్శింపఁగల మహాశక్తి అది.

ఎచటనో దిగంబరులై తిరిగినవారికి సదా సూర్యకాంతి శక్తికరమైనది. నాగరకదేశములలో నివసించి సదా దుస్తులలో నుండవలసిన మాకా విషయము లేమి యుపయోగించు నని మీరడుగవచ్చును. ఏలయన,(1)తమ గృహములలోగాని, యే దైన రహస్యస్థలమునగాని సూర్యకిరణములను తమ దేహములకు తగులునట్లుగా నివసింప సావకాశము గలవారు కొందఱుందురు. (2) నేను ఆదిత్యపేటిక అను దానిని కనిపెట్టితిని. దానికి లోపలను వెలుపలను ప్రతీఫలీకరణపక్షము లున్నవి. అందులో 40 నిమిషములు కూర్చుండినను, సూర్యకాంతిలో గంట కూర్చుండుటవలన నెంత మేలుగలుగునో అంత మేలు గలుగును. కొందఱు దాని నుపయోగించి బాగుపడవచ్చును. ఈ రెండు ఉద్దేశ్యములతోను ఇది యిట్లు వ్రాసితిని.

# వర్ణవైద్యము.

1. సూర్యకిరణములయందలి శక్తి: సూటిగ స్వీకరించి దివ్యమగు వైద్యము నేర్పాటు చేయవచ్చును. ఇందలి మందులు రూఢియగు ఫలము గలిగి అత్యంత గుణతమములై యున్నవి. సూర్యకిరణమును విభజించు యంత్రమునందు (Spectrum) సూర్యకిరణమునందలి వర్ణములన్నియు గోచరించునుగద. అందత్యంతశీతోష్ణశక్తులు తరతమములుగా నున్నవి. అత్యంతప్రతిభావంత మగు నీ శక్తిసాగరమగు సూర్యుని నుండి, యీశక్తులను మనము విడదీసి జాగ్రత్త చేసికొనుటెట్లు?

2. సూర్యకిరణములును పదార్థములే:—వెలుతురు గమనముగల పదార్థమని మనకు దెలియును. అందున్న ప్రతి కిరణమును రాసాయనికశక్తి గలిగి రోగనివారకమగు శక్తి గలిగి, ఆరోగ్యవర్ధకమై యున్నది. ఈ కిరణములను రంగుటద్దములతో సులువుగా విడదీయవచ్చును. ఈ అద్దములు కొన్నిరంగులను మ్రింగివేసి కొన్నిరంగుల కిరణములనే లోనికి రానిచ్చును. వివరము లిదివరకే యీయఁబడినవి.

పచ్చని అద్దము:— అందు కొలదిగా నెరుపురంగు కలసియే యుండుటవలన నారింజపండురంగుతో గూడిన పసుపువర్ణము నది విడదీయును. ఎరుపుఅద్ద మెఱుపును స్వీకరించి మిగత

రంగులను మిఁగి వేయును. నీలపు అద్దము నందు తగు మాత్రము ఊదారంగు గలసియుండుటవలన అందు నీలము ప్రధానముగను, చాలకొద్దిగా ఊదావర్ణమును స్వీకరింపఁబడి మిగతవర్ణములు మిఁగి వేయబడును. నీలముయొక్క రంగును నిర్ణయించుటకు ఒకదీపముగాని, వెలిగించిన అగ్గిపుడకగాని ఆ అద్దము వెనుకవైపున నుంచి చూచిన అందు కొద్దిగా ఊదారంగు గోచరించును. అట్లుగాక అప్పుడును కేవలము నీలమే కాన్పించిన అది యింకను శీతలతరమైన వర్ణముగా నుండును. నీలిఅద్దము నెండలో నుంచినప్పు డది యితరవర్ణములను మిఁగును. వేడియెక్కను గాని, దానినుండి వచ్చుకిరణములు మాత్రము శీతస్వభావము గలిగియుండును.

3. నిండైన కేవలసూర్యకిరణముల నాపాదించిన పదార్థముల యందు ధాతువర్ధకమగు శక్తి గలుగును. సుకుమారులు కొందఱు కేవలమగు చన్నీటిని త్రాగఁజాలరు. ఎంతబలహీనులైనను, ఆ నీటిని కొలదికాలము ఎండలో నుంచిన త్రాగ వచ్చును. (Baron Reichenbach) రేచిన్‌బాక్ అను ఫ్రెంచి పరిశోధకుఁడు, మిక్కిలి సున్నితతత్వములు గలవారితో కొన్ని పరిశోధనలు చేసెను. తెల్లనిసీసాలో పోసి యెండలో నుంచిన నీటిని తెచ్చి అందొక సున్నితతత్వము గలవానికి త్రాగించెను. ఆ నీరు పోయినంతదూరము గొంతునుండి నాభివరకును త్రాగిన యామెకు మంటగా నుండెనట. ఇంకొకయామె తనచేయి స్పృశించెను. తరువాత వెలుపలకు వచ్చి దేహమంతటను సూర్యకాంతి తగులునట్లు 10 నిమిషము లుండి తరువాత ఆమె

తనచేతిని స్పృశించి తనయందు శక్తి యెక్కువగా వృద్ధియైన దని చెప్పెను. ఆమెకు రేచిల్ బాక్ యెండలోనుండి, వచ్చిన సంగతి తెలియదు. సూర్యకాంతిలో నెక్కువకాల ముండుట వలన కాంతశక్తి మిక్కిలి వృద్ధియగును.

4. రంగులయొక్క శక్తి నీటియందెక్కువ సులువుగా వ్యాపించును :—నీటియందు స్వయముగా వేడిమిగాని, చల్లదనముగాని చేయు స్వభావము లేదు. అట్లు తయారైన నీటిని లోని కీయవచ్చును. పైన రుద్దవచ్చును. పాలపంచదార (Sugar of milk) అను నొకపదార్థము గలదు. అది కాని సన్ననిరకపుమందు కలియని హోమోపతిమాత్రలు గాని, మకిలి లేని తుమ్మజిగురుయొక్క యెండించిన చూర్ణము గాని జాగ్రత్తచేసి వానియందును సూర్యకాంతియందలి రంగులను ప్రసరింప జేయవచ్చును. పాలచూర్ణము సన్నగా నున్న యెడల గడ్డకట్టిపోవును గాన నది గండ్రయినుకవలె నుండవలెను.

5. నీటియందు సూర్యకాంతిని ఆరోపించువిధము : *రంగుగాజుకుప్పె (Chromo lense)లో నీటిని పోసి యెండలో 1-2 గంట లుంచవలెను. ఎక్కువకాలము ఎండలో నుంచిన యెడల ఆ నీటియందలి శక్తియును వృద్ధియగును. శీతమువలన నీరు ఘనీభవించి మంచుగడ్డయై గాజుకుప్పె పగిలి పోవును.

*ఇప్పు డవి హిందూదేశమున లభింపవు. అందువలన మామూలుసీసాల లోనే నిర్మలమైన రంగుగలవానిని వాడుచున్నాము. (ప్ర. ౩౦.)

(ఈ భయము తెనుగుదేశములో లేదు. దేశము వేడిదేశ మగుటవలన.) సెలివర్ణము కుళ్లు పుట్టనీయని (Antiseptic) దగుటవలన అందు నీరెంతకాలముంచినను చెడిపోదు. పసుపు ఎరుపు రంగుల సీసాలలో నుంచిన నీరు త్వరగా చెడిపోవును. కాన శీతలదేశములందు 2, 3 వారముల కొకతూరి మార్చవలెను. వేడిదేశములందు 3, 4 దినముల కొకతూరి మార్చుకొనవలెను. ఊదారంగుసీసాలోని నీరు ఇంకను ఎక్కువకాలము శుద్ధముగనే యుండును.

6. పంచదారమాత్రలు - పాలపంచదార - వీనియందు సూర్యకాంతిని ఆరోపించువిధము :— రంగుగల గాజుకుప్పెలో పైపదార్థములను పలుచగా నుంచవలెను- అది లభింపనప్పుడు రంగుగల సీసాలో నుంచవలెను. లేదా ఆరంగుగల కాగితములోగాని వస్త్రములోగాని కట్టి యెండలో నుంచవలెను. ఎండలోనుండి సూటిగాతీసి వాడిన నవి యెక్కువ శక్తిమంతములై యుండును. నిలువయుంచినవానియందైనను చాలకాలమువఱకు శక్తి వారములాది, మాసములైనను నిలచియే యుండును.

7. ఈ దిగువ వివరింపఁబడిన విధముగా వానివానిని పేరులు పెట్టుకొనుటచే మనకును ఒకవైద్యశాస్త్రమును మందుల పేరులును ఏర్పడుచున్నది. ఈ మందులన్నియు కేవలము ఆకాశమునుండి వచ్చు సూర్యకాంతినుండి తయారైనవగుటవలన శుద్ధమైనవి; చౌకయైనవి, గుణయుతమైనవియును. ఇంతెట్టి

విషముల సంబంధమును లేదు. ఇట్లు తయారైన మందులు రంగుయొక్కయు, ఆరోపణచేయఁబడిన పదార్థముయొక్కయు పేరును గలిగియుండును.

8. మందుయొక్క పేరునందలి పూర్వభాగము:— రక్త - ఎరుపునకును; పీత - పసుపురంగునకును; విపీతరక్త - నారింజపండు (Orange) రంగునకును; ధూమ్ర - ఊదా రంగునకును; నీల - నీలివర్ణమునకును - హరిత ఆకుపసుపు రంగునకును; దృఢనీల - నీలిమందురంగునకును వాడఁబడినవి.

9. మందుయొక్క పేరునందలి ఉత్తరభాగము:— జలమైనప్పుడు 'ఉదకమని' వాడితిని. అప్పుడు ఎర్రనిరంగు ఆరోపించిననీటికి రక్తోదకమని పేరు. ఊదారంగు ఆరోపించిన నీటికి ధూమ్రోదకమని పేరు. నీలిరంగు ఆరోపించిన నీటికి నీలియుదకమని పేరు. పసుపురంగు ఆరోపించిననీటికి - పీతోదక పేరు. నీలిమందురంగు ఆరోపించిననీటికి - దృఢనీలఉదకమని పేరు. ఊదారంగు అద్దములు శుద్ధమైనవి దొరుకుటలేదు. అందువలన మిక్కిలి చిక్కనైనను నీలిరంగుసీసాలోని నీరు వాడుకొనిన అదేగుణము గలుగునుగాని అది ఊదారంగు కంటె యెక్కువచల్లబఱచుగుణము గలిగియుండును.

10. పాలపంచదార వాడినప్పుడు 'క్షీర' అని వాడితిని. రక్తక్షీర అనిన, రక్తవర్ణ మారోపించిన పాలపంచదార అని యర్థము. ఇట్లే పీతక్షీర యనిన పసుపువర్ణ మారోపించిన పాల పంచదార యని యర్థము. ఇట్లే విపీతరక్తక్షీర, హరితక్షీర,

ధూమ్రక్షీర, నీలక్షీర, దృఢనీలక్షీర యని పేరు లేర్పడు చున్నవి.

11. పంచదార వాడినప్పుడు 'మధుర' అని వాడితిని. ధూమ్రమధుర, దృఢనీలమధుర, నీలమధుర, హారితమధుర, పీతమధుర, విపీతరక్తమధుర, రక్తమధుర, అను పేరులుగల మందు లేర్పడుచున్నవి.

12. తుమ్మజిగురుచూర్ణము ఆరోపింపబడినప్పుడు 'చూర్ణ' అని వాడితిని. అప్పుడు ధూమ్రచూర్ణ; దృఢనీలచూర్ణ; నీలిచూర్ణ; హారితచూర్ణ, పీతచూర్ణ; విపీతరక్తచూర్ణ; రక్తచూర్ణ; అను పేరులుగల మందు లేర్పడుచున్నవి.

13. మోతాదు:- వర్ణారోపితము చేయఁబడిన నీరు 2 మొదలు 4 గుక్కలు అనగా 3 పెద్దచంచాల నీటిని నివ్వవలెను. పిల్లలకు 2 చంచాలు చాలును. పాలపంచదార, పంచదార, చూర్ణమునైనయెడల, తేపకు ఒకపెద్ద బఠాణీగింజంత వాడవలెను. పీతోదకము నిద్రలేచుటతోడనే వాడుట మంచిది. ధూమ్ర, రక్తోదకముల మధ్యాహ్నభోజనమునకు పూర్వ మందుగాని తరువాతగాని వాడవలెను. నీలఉదకము పరుండ బోవునప్పుడు త్రాగవలెను. మధురాదిపొడిపదార్థములను నిత్యే వాడవలెను. తీవ్రవ్యాధులకు ప్రతిగంటకును వాడ వలెను.)

14. సూర్యకాంతి నారోపించిన పదార్థముల యొక్క రోగనివారకశక్తి అనేకవందలతూరులు పరీక్షింపఁబడి, యే

మందుగాని, ఓషధిగాని పనిచేయని సందర్భములో నివి మిక్కిలి యద్భుతముగా నుపయోగకరములుగా నున్నట్లు కనుగొనఁబడినవి. అవి మృదువై, నిరపాయకరమై, చౌకబారువై, గుణము స్థిరమైనవై యుండును.

**15. నీలోదకము:** మిక్కిలి యద్భుతమగు మందులలో నొకటి. లోనికి పుచ్చుకొనినయెడల అతిసారము, గ్రహణి, కడుపులో మంట, పోట్లు, ఆమత్వచమునందలి పుండ్లు, సర్పి మొదలగునవి. నిద్రలేకుండుట మొదలగువ్యాధులు నివారణమగును. <u>నోటిపూత</u>, చిగుళ్ళవాపు, సర్పి మొదలగు వ్యాధులకు నీ నీటిని నోటితో పుక్కిలించినయెడల, నే మందులు పనిచేయని స్థితిలోనైనను కుదిర్చితీరును. కంటి కలక, మంటలు, మెరుపులు మొదలగువానియం దిది యద్వితీయమైనది. చేతులు పగులుట, చుండు, మొదలగువానిని ఈ ఉదకముతో కడిగినయెడల నవి కుదురును. కాలుపులకు నీ ఉదకముతో తడిపొత్తి వేసిన నయమగును. ఎఱ్ఱని పొక్కులకు నీ నీటి నుపయోగించిన నవి మానిపోయి చర్మము పట్టువలె మృదువుగా నగును. పుండ్లను కుదుర్చును. రక్తస్రావముల నాపును. సూర్యకాంతిలోనుండి వేడిగానున్న నీలఉదకమును యెనీమాద్వారా భగవస్తి చేసినయెడల స్త్రీజననేంద్రియములందలి మంటలను పోగొట్టును. ఇట్లే ఆసనముద్వారా నీలవర్ణోదకము నెక్కించినయెడల ప్రేగులయందలి ఉద్రేకమును, మంటలను తగ్గించును. అవయవములు చల్లగా

నుండి మాంద్యము కలవిగా నున్నవు డిది అపకారము చేయును. వాడరాదు.

16. పీతోదకము :— నాడులయందు చైతన్యమును గలిగించును. పేగులు, పైత్యకోశము వీనిని చైతన్యవంతముగా జేయును. అనేకసంవత్సరములనుండి ప్రపంచమునం దంతటను పరిశోధించిరి. ఈ పీతోదకము భేదులను గలిగించుటలో నిరుపమానమైనది. న్యూయార్కులో నొక ఉత్పత్తిదారు ఈయుదకము అనేకడాలర్ల విలువగల మేలును చేసినదని చెప్పినాడు. ఇంకొకయామె దేహతత్త్వమంతయు దీనివలన యుత్తేజితమైనది. 'ప్రాణదాయిని' అని యామె దీనికిఁ బేరిడెను.

17. ధూమ్రోదకము :—జీర్ణమునకు మిక్కిలి సహాయకారి. శ్వేతకుసుమవ్యాధికిని, గర్భాశయవ్యాధులకును నీ యుదకముతో భగవస్తి చేసిన నెక్కువగా సుగుణము నిచ్చును. ఆసనముద్వారా ఎనీమా చేసిన మలదోషముల బోగొట్టును. ముక్కుతో పీల్చిన జలుబును పోగొట్టును. చుండు, బట్టతల వీని కీనీటిని రుద్దిన నయ మగును. చుండు, బట్టతల వీనికీ నీ నీటిని లోని కింకునట్లు తలయం దంతటను మునివ్రేళ్ళతో తటచుగా రుద్దుచుండవలెను.

18. రక్తోదకము :— పీతోదకమునందు వలెనే యిందును నుత్తేజకములగు లోహధాతువు లుండి రక్తమునకు త్తేజనము గలిగించును. మాంద్యము కలదిగనుండి, క్రిమములు నడకలేని జీర్ణాశయమున కిది చాలమంచిది. జీర్ణాశయ ముద్రేకించి

యున్నప్పుడుమాత్రము ధూమ్రోదకము మంచిది. ఆ యుద్రేకమే యింకను నెక్కువగా నున్నప్పుడు నీలోదకము మంచిది. చర్మము మాంద్యము కలదిగా నున్నప్పుడు రక్తోదకము రుద్దిన నది చైతన్యవంతమగును.

19. కృత్రిమ కాంతి :— గ్యాసులైటునందు వేడిధాతువులు ఎక్కువగా నుండినను ఈ వెలుతురులో పయితము ఉదకాదులకు వర్ణారోపముఁ జేయవచ్చును.

20. పారిభాషికపదములు :— ఈ మందు లన్నియు సూక్ష్మమైన గుణముగలవి; చౌకమైనవి సులభమైనవి అతుల గుణవంతములు. మున్ముందివియే మిక్కిలి వాడుకలోనికి రాగలవు. ఇట్టివానికి వాడుకకొరకై కొన్ని పారిభాషికపదములను ఏర్పఱచుకొనినయెడల అనేకపదములతో చెప్పఁదానినొకమాటతోనే చెప్పవీలగును. కనుక కొన్ని పారిభాషిక పదములను ఏర్పఱచుకొందము. నీలవర్ణారోపితము అనుపదమునకు 'నీలిరంగుకాంతి ఒకవస్తువునకు ఆరోపించబడినది లేదా రంగుకాంతి యెక్కించబడినది, అని అర్థము. పీతరక్త వర్ణారోపితము అనగా 'పసుపురంగుకాంతి యెక్కించబడినది' అని యర్థము. ఇట్లే ధూమ్రవర్ణారోపితము, పీతవర్ణారోపితము రక్తవర్ణారోపితము, శ్యామలవర్ణారోపితము దృఢనీలవర్ణారోపితము మొదలగు క్రియ లేర్పడుచున్నవి.

ఒకకుటుంబమునం దందఱికిని మలబద్ధక మున్నయెడల తమ యాహారమును కొన్నినిమిషములు పసుపురంగుఅద్దమునుండి

వచ్చు సూర్యకాంతిలోనుంచి ఆహారమును దినిన మేలగును. జీర్ణాశయము, ప్రేవులు మిక్కిలి యుద్రేకించి యున్నవారు తమయాహారమును సూర్యకాంతిలో నీలియద్దముక్రింద నుంచి తినిన నాయుద్రేకము తగ్గిపోవును. ద్రాక్షసారాయమును పసుపుపచ్చని సీసాలలో జాగ్రత్తచేయుట వాడుక. అందువలన నది మరింత యుద్రేకముజేయు స్వభావము గలదై యుండును. రక్తవర్ణారోపితమగు ద్రావములను మామూలు పరిమితిలో త్రాగుట మేలు గాదు.

21. వాయువులు :— సూర్యశక్తిని ఘనపదార్థములందును, ద్రవపదార్థములందును ఆరోపించుటను గురించి యిదివరకు వ్రాయుటయైనది. వాతావరణములందలి వాయువును సయితము వర్ణారోపణము జేసి పీల్చవచ్చును. సూర్యకాంతిలో కొన్నిక్షణములు బిరడాతో నుంచఁబడిన ఖాళీఎర్రసీసాలోని వాయువు రక్తవర్ణారోపితమగును. బిరడా తీయుటతోడనే అందలిగాలిని పీల్చినయెడల ఆ గాలి శ్వాసాశయములను, వాయునాళమును చైతన్యవంతము జేయును. అట్లే నీలివర్ణారోపితమగు గాలిని బీల్చిన శ్వాసాశయములందలి యుద్రేకమును, రక్తాభివ్యందమును, క్షయను నయము జేయును. ఇట్లు తయారైనగాలిని, రక్తవాయువు నీలవాయువు, దృఢనీలవాయువు, ధూమ్రవాయువు, హరితవాయువు, పీతవాయువు, విపీతరక్త వాయువు అను పేరుల బిలువవచ్చును.

పదునాల్గవప్రకరణము.

# చికిత్సా పరికరములు.

1. తగినపరికరములు లేకపోవుటవలన నీ వైద్యశాస్త్రము కుంటుపడి యుండెను. ఆ లోపమును నివారించుటకై యీ శాస్త్రకర్త కొన్ని పరికరముల గనిపెట్టవలసివచ్చెను. వానితో సూర్యకాంతిని, వివిధవర్ణములద్వారా రోగులకు బ్రసరింపజేసి చికిత్సచేయుట కనువేర్పడినది. అవి యీ క్రింద వర్ణింపఁబడినవి.

2. వర్ణకేంద్రీకరణోపకరణము:– (19 పటముచూ.) గరాటు (Funnel) వంటి ఆకారముగల ఒక సనువుచేయఁబడిన రాగిపనిముట్టు. దీనిలోపల సూర్యకాంతి బాగుగ బ్రతిఫలించునట్లు, నికిల్ పూత పెట్టబడినది. ఈ తరువాత నిదేపనిముట్టు అల్యూమినియముతో చేయఁబడుచుండెను. లావుమూతిగలవైపు సూర్యునకు నెదురుగా నుంచి, రెండవవైపు రోగగ్రస్తమగు దేహమున కెగువగా నుంచవలెను. సూర్యకాంతి, గొట్టముమధ్యగా సూటిగా వచ్చునట్లు చూడవలెను. సూర్యకాంతి కేంద్రీకరింపఁబడి అత్యంతఫలవంత మగునట్లుచేయు



19 వ పటము.
వర్ణకేంద్రీకరోపకరణము.

టకు క్రమమగు పరిశోధనయు ననుభవమును గావలసి యున్నది. కేవలము సూర్యకాంతినేగాక రంగుకాంతిని కేంద్రీకరించుటయు నవసరమే. అందులకును రంగద్దము లీ పనిముట్టుతో గలిపి యుపయోగించుటకును నేరర్పితనము కావలయును. మొదటమొదట గుండ్రగానుండు రంగద్దములు, మూతి. సన్నగానున్నవైపున నుంచగా కేంద్రీకృతమగు తీక్ష్ణమగు సూర్యకాంతివలన నవి బ్రద్దలగుచుండెను. అందువలన నవి ఇప్పుడు పై యుపకరణముయొక్క మూతి వెడల్పుగా నున్న వైపున నుంచి చిన్న కొక్కెములతో బిగించుచున్నారు. అత్యంతమగు శక్తి గలుగుటకీ పనిముట్టు, తెరచియుండిన కిటికీలో నుంచి సూర్యకాంతి సూటిగా వచ్చునట్లు చేసి, యే రంగద్దము కావలెనో దానిని వాడుకోనవలెను. సూర్యకాంతి తీక్ష్ణముగా నున్నప్పుడు సన్ననివైపు క్రిందగా ఒక నిమిష ముంచినయెడల చర్మము కందిపోవును. 3 నిమిషములుంచిన యెడల బొబ్బ లెక్కును. ఎఱ్ఱనిఅద్దము జోడించి యీ పరికరము నుపయోగించినప్పుడు రక్తకేంద్రీకరణమనియు, నీలి అద్దము జోడించినప్పుడు నీలకేంద్రీకరణమనియు నందుము. అద్దములు లేకుండవాడినప్పుడు కాంతి కేంద్రీకరణ మందుము. ఈ పనిముట్టు పైకిని, క్రిందికిని జరుపుటకును, సరిపోయిన యేటవాలులో నుంచుటకును నిందు మరలు (Screws) ఉన్నవి. అందువలన దీనిని అవసరమువెంట, పైకిని క్రిందికిని నేటవాలుగను తేలికగా జరుపుకొన వీలై యుండును.

ఈ యుపకరణమువలన నసంఖ్యాకములగు రోగములు చిత్రముగా గుదుర్పఁబడినవి. మిఛిగాన్‌లో అనేకసంవత్సరముల నుండి యున్న కుంటితనము రక్తకేంద్రీకరణమువలన 15 నిమిషములలో గుదుర్పఁబడినది. డాక్టరులు కుదుర్ప నసాధ్యమని వదలివేసిన నాంతర్యమగు రక్తాభిష్యందము నీలకేంద్రీకరణముచేఁ గుదుర్పఁబడినది. ఇంకను అనేకరోగనివారకవృత్తాంతముల జేర్పఁగవచ్చును. చికాగోనగరిలో నొక పెద్దమనిషి ప్రతిదినము ఉదయము దుస్తుల ధరించుటకుముందు కొలఁది నిమిషములు కాంతి కేంద్రీకరణము దేహముపై జేసికొనుచుండెను. అందువలన దినమంతయు పందెపుగుఱ్ఱమువలె చలాకిగా నుండుచుంటినని వ్రాసెను. దైశికముగా నుపయోగించిన నది యత్యంతమగు శక్తి నిచ్చును. ముచ్చిలిగుంటమీఁదను, మలుగులమీఁదను పీత కేంద్రీకరణమువలన పక్షవాతపు రోగమును గుదుర్పవచ్చును. ఇట్లే మలబద్ధకమునకు ప్రేగులమీఁదుగ పీత కేంద్రీకరణ ముపయోగకరము. జీర్ణాశయము, శ్వాసాశయములు, మూత్రపిండములు, మొదలగువానిపై ధూమ్ర కేంద్రీకరణము మిక్కిలి సుతారమైనది. తరుణమగు మంటలకు నీలికేంద్రీకరణము తగును. రక్తప్రదరమునకు యోనిపై 15, 20 నిమిషములు నీలకేంద్రీకరణము జేసిన కుదురును.

3. రంగు కుప్పె: (A double convex hollow lens) తాబేటికాయవలె 2 వైపులను నుబ్బెత్తుగానుండి లోపల ఖాళీగా నుండును. దీనిని నీటితో నింపినపుడు దీనితో సూర్యకాంతిని కేంద్రీకరింపవచ్చును. ఇదియును పెద్దభూతద్దమువలె నేర్పడును.

కేంద్రీకరోపకరణమునకంటె నిది మేలైనది. ఇది కేంద్రీకరణమున కుపయోగింపవీలగును. లోపలినీరు త్రాగుటకు వీలగు మందుగా నేర్పడును. ఈ మందు సునిశితమై, నిరపాయకరమై, చోటబారు స్వభావము గలిగియుండును. వాడుకలో నున్న యే యితరమందులకంటెను ఈ దివ్య ఔషధము గుణతరమైయుండును.

ఈ కుప్పెల వర్ణములు పారదర్శకము (Transparent) లయి యుండును. సూర్యకాంతి నంతటిని స్వీకరించి రంగును దేహముపై కేంద్రీకరింపవీలై యుండును. విపీతరక్తవర్ణము నాడులకు త్తేజముం గలిగించును. మలమోచకమైనది. యకృత్, ప్లీవులు, మొదలగునవి మాంద్యముగా నున్నపుడీకాంతిని కేంద్రీకరింప వచ్చును. రక్తవర్ణము రక్తమున కుత్తేజనము గలిగించును. కాలికమగువాతపునొప్పులు, ఆమవాతము, రొమ్ముపడిసెము, ఋతుధర్మ మాగిపోవుట మొదలగు వానియం దీవర్ణ ముపయోగించును. పాలిపోవుటకు సయితమిది యుపయోగించును.



20 వ పటము.
రంగుగాజుకుప్పె.

నీలము నాడుల యుద్రేకమును తగ్గించును. వేడిమిని తగ్గించును. ధూమ్రవర్ణము శ్వాసాశయములు, జీర్ణాశయము, మూత్రపిండములు మొదలగు వానికి మిక్కిలి యుపయోగకరమైనది. ఇది 7 అంగుళములు మధ్యరేఖ గలిగి గుండ్రముగా నుండును. ఇది 2 శేరుల నీరు భరించును. వర్ణము కేంద్రీకరించునప్పుడు కుప్పెయొక్క మెడ పట్టుకొనవలెను. నీరు వర్ణారోపితము చేయునపుడు మెడకు కొక్కెము (అది పటములో కనుపడదు.) నకు త్రాడుకట్టి వ్రేలాడదీయవలెను. రంగు కుప్పెలతో కాంతిని చర్మతలమున కేంద్రీకరింపవచ్చును. లోపలి ఆమత్వచములోగుండ నీరు లోనికి దిగును. చర్మము నందలి సన్నని పొరలపై కాంతి సూటిగ దగులుటవలన వర్ణశక్తి లోపలి నుండియు, వెలుపలినుండియు రోగగ్రస్త భాగములకు జేరి రోగనివారణము జేయును. ఈ కుప్పెల యందు తయారైన మందులయొక్క ప్రభావము వందలాది విషయములలో శోధింపబడి ఋజువై యున్నది.

వివిధావయవములపై నీ కుప్పెలను కేంద్రీకరించుటవలనను, అందలి నీరు త్రాగుటవలనను, గొప్ప స్వాస్థ్యములు గలిగింపబడినవి. మాంద్యముచే గలిగిన చెవుడున కీ కుప్పెద్వారా పసుపు కాంతిని చెవిలోనికి బ్రసరింపజేయవలెను. గ్రుడ్డితనమునకు కంటిలోనికి కీ కాంతిని బ్రసరింపజేయవలెను. మలబద్ధకమునకు ప్రేగులమీదను బ్రసరింపజేయవలెను. నీలము ఉద్రేకములను, మంటలను తగ్గింపగలదు. ఈ కుప్పెలద్వారా కాంతిని పైన కేంద్రీకరించుటవలనను, లోపలకు నీటిని యుప

యోగించుటవలనను జీర్ణాశయములోని కంతులు, వ్రణములు గుదుర్పఁబడినవి. మలబద్ధకము, అతిసారము, అందు కొన్ని మొండిజాతివి గూడను వందలాదిగా గుదుర్పఁబడినవి. కాళ్ళు, చేతులు పగులుట, మొటిమలు, కండ్ల మంటలు, చుండు మొదలగునవి యిందలి నీటితో కడుగుటవలన మిక్కిలి వడిగా గుదుర్పఁబడినవి. నిద్రలేమి జ్వరము, జీర్ణాశయవ్రణము, నోటిపూత, రక్తప్రదరము, చెవుడు, కలరా, మొదలగునవి నివారింపఁబడినవి.

4. ఆదిత్య పేటిక :— ఇంతవరకు ప్రజల కొసంగఁబడినపరికరములలోనెల్ల అత్యంతగుణతమమైన దీ ఆదిత్యపేటిక. సూర్యకిరణములతో స్వేదమును గలిగించు పరికర మిది. స్వేదమును గలిగించి దేహమును ఉత్తేజితముజేయ నిది యుపయోగపడును. ప్రకృతియందలి సర్వజీవకోటికిని సుత్తేజము గలిగించునట్టియు, దేహమునందలి మెదడు నాడులు, కండరములు, రక్తము మొలగు ధాతువులను తేజోవంతములుగా నుంచిన సూర్యశక్తిని మన రథమునకు పూన్చుట అత్యధికమగుశక్తిని స్వాధీనపఱచుకొనుట యే యగును. ఆదిత్యపేటిక యనినప్పు డిది పెట్టెవంటిపనిముట్టనియు దీనితో ఆదిత్యు డనగా సూర్యభగవానునియందలి వేడిమి, వెలుతురు మన కుపయోగకరమగునట్లు స్వీకరించుట కనువగునట్లు తయారై యున్నదనియు స్ఫురించునట్లు ప్రయోగింపబడినది. సూర్యకిరణములతో బోల్చిన వెలుతురుతో సంబంధము లేని వేడిమి మృతప్రాయమైనది. సునిశిత మైనదగుటవలన వెలుగుతో గూడిన వేడిమి శక్తి నియమము ననుసరించి, చొఱబా

రునదై, శాశ్వతమైన గుణము గలిగియుండును. నిరపాయమై, సది. మానసికశక్తుల నుత్తేజింపఁజేయును. మానసోల్లాసము గలిగించును. నగ్నమగు దేహముపై బ్రసరించుటవలన




**21** వ పటము. ఆదిత్య పేటిక.

**1.** ఎనామిల్ వేసిననీలిఅద్దము మెదటికి ఎండతగులకుండకాపాడి చల్లబఱచును.
**2,6.** క్రిందికిమీదకు జరుపుటకు వీలగునట్లు ఏర్పాటుగల రంగుఅద్దములు.
**3.** మందమైన బిల్లోరి అద్దము. **4.** కాంతిని ప్రతిఫలింపజేయు రేకులు.
**5.** ముందు చట్రము. **7.** ముడువ వీలైన అసలు చట్రము.

నిన్ని మేళ్ళ నిచ్చును. విద్యావంతురాలగు నొకయామె ఆదిత్యపేటికలో కూర్చున్నంతకాలమును తనకు నందనవనము నందువలె ఆనందదాయకమై యుండినట్లు గుర్తించినది. వేడి గాలియందుగాని, నీటి ఆవిరి తగులునట్లుగాని కూర్చుండుటకు ఆదిత్యపేటికలో కూర్చుండుటకును గలభేదమును ఆమె

వివరించెను. ఆమెప్రాణ మద్దానిచే రక్షింపఁబడినది. మేహ వాతము, క్షయ, నంజు, గండమాల, నాడులయందు మంట-వీనికి ఆదిత్యపేటిక చికిత్స జరిగినప్పుడెల్ల, తప్పక కుదురుచునేయున్నది. సమాయివ్యాధిని నిర్మూలముచేయుట కీ ఆదిత్యపేటికతో చేయు చికిత్స యొక్కటియే గుణవంతమై యున్నది. రక్తము, నాడులు, చర్మము - వీనికి సంబంధించిన చికిత్సలయందెల్ల అన్నిపరికరములలోనికిని నీ ఆదిత్యపేటికయే గుణతమమైనది.

వర్జీనియా, విశ్వవిద్యాలయ సంబంధులును, కాలిఫోర్నియా లాస్ ఏంజలిస్‌లోని న్యూయీారాక్రైస్తవప్రార్థన మందిరాధిపతులునగు డబ్లియు. జి. బోవర్ గారు చికాచినాతీలో తాము గావించిన స్వాస్థ్యములగురించి వివరించిరి. ఇంతకన్న సత్యద్భుతతరములగు స్వాస్థ్యములు ప్రపంచమున నితరభాగములందు గలిగినవి. వాని నటుంచి వీనిని మాత్రమిచట వివరించెదను. ఈశాస్త్రకర్త ఆరోగ్యసంఘము నేర్పఱచుటకు 3 సంవత్సరములు చికాచినాతీలో పనిజేసెను.

"నవీనమును, ప్రతిభావంతము నగు నీ పద్ధతినిగురించి కొంత చెప్పవలసియున్నది. రోగగ్రస్తుల కిది అత్యంతోపయోగకరమైనవిధానము. అత్యద్భుతానందముతో నేనీశాస్త్రమును పఠించితిని. ప్రత్యక్షముగా దీనిప్రభావమువలన గలిగిన స్వాస్థ్యములను దెలిసికొంటిని.

"నేనీ క్రిందివృత్తాంతమును స్వయముగా శ్రద్ధతో కనిపెట్టి యుంటిని. 'సిలియా డబ్లియు. హార్ట్' అను నామె ఇండియానానుండి చికాచినాతీకి వచ్చెను. వచ్చునప్పటి కామె దేహమంతయు నంజుతో పెనుభూతమువలె నుబ్బి యుండెను. దేహ మంతయు కంతు లుండెను. ఒక మోకాలు మేహవాతముతో బిగిసి వంగనిస్థితిలో నుండెను. ఈ లక్షణము లన్నియు 8 మాసములలో క్రమక్రమముగా వృద్ధి జెంది రోగియొక్కస్థితి నానాటికి ధ్వంసమై యుండెను. ఇట్టి నిరాశా కరమగు స్థితిలో ఆసన్నమరణయై వచ్చెను. ఆమె డాక్టరు బాబిట్‌గారి చికిత్సలో నుండెను. 3 మాసము లగునప్పటి కామె మంచి స్థితిలోనికి వచ్చెను. వంగి బిగిసికొనిపోయిన మోకాలు ఆదిత్యపేటికను రెండవపర్యాయ ముపయోగించుట తోడనే చాచుటకు వీలాయెను. ఆమెతూకము ప్రారంభమున 271 పౌనులు. కొలదివారములలోనే 50 పౌనులు తగ్గినది. అత్యంతానందముతో నామె ఆదిత్యపేటిక 19 వ శతాబ్దములో మానవుల కీశ్వరదత్తమగు నుత్తమవర మని సన్నుతించెను. ఆ పట్టనములోనే నాకు స్వయముగా దెలిసిన స్వాస్థ్యము లింకను గలవు. మిక్కిలి నమ్మదగిన పెద్దమనుష్యులవలన నెఱిగినవి యీ క్రింద పేర్కొనబడినవి:—

"సి. డబ్లియు. క్లేర్క్ అనువారిభార్య, డాక్టరు బాబిట్‌గారి చికిత్సలో క్షయవ్యాధినుండి విముక్తిని గాంచినది."

"ఇట్లే యింకొక క్షయవ్యాధికూడ కుదుర్చబడినది. ఆదిత్యపేటిక నమర్చినవారు జె. యం. బ్లాక్ అనువారు. ఈ బ్లాక్

గారే 10 సంవత్సరములనుండి జలుబుతో గూడిన జ్వరము (Hay fever) తో బాధపడుచుండి ఆదిత్యపేటికతో నొక్క తూరి చికిత్స బొంది రోగనివారణము బొందుట నే నెఱుగుదును."

"వంశపారంపర్యముగా వచ్చుచుండిన అగ్నిమాంద్యవ్యాధి మిక్కిలి తీవ్రదశ నందినట్లు వెల్లడింపబడిన రాబర్టు ఇ. క్లేర్కు అను నతనికి సంపూర్ణారోగ్య మిద్దానిచే గలిగినది."

"గ్లోయిన్ దంపతుల కిద్దఱికి పార్శ్వపు తలనొప్పి వారింటివద్దనే ఆదిత్యపేటికతో 3 తూరులు చికిత్స చేయగా రోగనివారణ మైనది."

"నవీనమును ప్రీతిభావంతమును నగు ఈచికిత్సయందు నాకు గల యత్యంత విశ్వాసమువలనను, ఈ విధానమును విసుగు లేకయు, విరామము లేకయు ప్రచారము జేయుచున్నట్టియు, కనిపెట్టినట్టియు, డాక్టరు బాబిట్ గారియందు నాకు హృదయ పూర్వకమగు గౌరవమువలనను మాత్రమే బుద్ధిపూర్వకముగా నీకొలది ప్రశంసావాక్యములను వెల్లడించితిని."

ఆదిత్యపేటికయందు రోగి కూర్చున్నప్పుడు తల, చల్లని గాలి లోను, ఆదిత్యపేటికలో 1 నెంబరుగల ఎనామిల్ చేసిన నీలి యద్దముయొక్క నీడను నుండును. ముందు చత్రమునకు వెనుక వైపున గల కొక్కెములకు ఒక మైనపుగుడ్డ తగిలింపబడి యుండును. అది రోగియొక్క మెడను చుట్టుకొని వెనుకవైపునకు వాలియుండును. ప్రక్కలకును దిగియుండును. అందువలన

వెలుపటిగాలి లోనికి చొరకుండును. క్రొయ్యతో జేసినయెడల నీపై మూత పీలుగా నుండదు. మైనపుగుడ్డయే పీలుగా నుండును. రోగి లోపల ఎత్తుపీటమీద కూర్చుండును. పాదములు క్రింద నుండును. మోకాళ్లు అద్దములు వేయు ముందు చట్రమునకు సమీపముగా నుండును. అప్పుడు వెలుపల నింకొకరు ఏభాగమునకు నేరంగు తగులవలెనో ఎరిగియుండి రంగద్దములు సర్దుబాటులు చేయవలయును. ఏ ప్రదేశమునకే రంగు వాడవలయునో తెలియనియెడల శుద్ధమగుకాంతిని తెల్ల అద్దములద్వారా బ్రసరింపజేయుట మేలు. ఊదా రంగుకాంతి జీర్ణాశయముపై పడునట్లు చేయుట సదా నిరపాయమైనది. మలబద్ధమునకు పసుపుకాంతి ప్రేగులపై బ్రసరించునట్లు అద్దముల నమర్చవలెను. అసృగ్ధరకు నీలకాంతియు, ఋతురక్తము తగ్గి స్రవించునప్పుడు ఎఱ్ఱని కాంతియు, యోనిపై ప్రసరింపనీయవలెను. సంధులయందలి వాతమున కాప్రదేశముల నెఱ్ఱనికాంతి ప్రసరింపనీయవలెను. ఊదారంగుతో గలిసిన యెరుపురంగునైనను బ్రసరింపనీయవచ్చును. రొమ్ముపడిసెము, ఉబ్బసము నున్నప్పుడు ఎరుపుగాని యెరుపుతో గలిసిన ఊదారంగుకాంతిగాని యెదురు రొమ్ముపై బడునట్లు ఏర్పాటుచేయవలెను. శ్వాసాశయ వ్రణము క్షయతో గూడి రక్తాభిష్యందము లేనియెడల దీనికిని పైవిధముగనే చేయునది. రక్తాభిష్యంద మున్నయెడల అది తగ్గువరకును నీలికాంతిని బ్రసరింపజేయవలయును. తరువాత ఊదాకాంతిని బ్రసరించునట్లు చేయుచుండవలెను. లేదా

కేవలము సూర్యకాంతినే ప్రసరింపజేయవలెను. వెన్నుపామునందు మంటలు మొదలగునవి యున్నప్పుడు నీలముతో గూడిన ఆకుపసుపుగాని నీలముతో గూడిన ఊదాకాంతిగాని బ్రసరింపజేయవలెను. శుక్లనష్టవ్యాధికి ఆకుపసుపుకాంతి నాభికి ఎదురుగా నున్న నడ్డిపూసలపై బడునట్లు జేయవలెను. జననేంద్రియములయందు మాంద్య మున్నయెడల నెర్రనికాంతిని వెన్నుపాము దిగువభాగమునను, జననేంద్రియములపైనను బ్రసరింపజేయవలెను. మూత్రపిండములు బాగుగా బనిచేయనియెడల ఊదారంగును, ప్రతితడవయును కేవలకాంతితో మార్చి యుపయోగింపవలెను. వేడి తగ్గియున్న భాగములకు ఎరుపు, ఎరుపుతో కూడిన ఊదా, ఎరుపుతో గూడిన నారింజపండు రంగుకాంతి యుపయోగకరము. ప్రేగులయందలి వ్రణమునకు ప్రేగులపై నీలకాంతినిగాని, ఊదారంగుతో గూడిన నీలకాంతినిగాని బ్రసరింపజేయవలెను. వేడిమియు, మంటలును గల స్థితు లన్నిటియందును నీలవర్ణ ముపయోగకరము.

అయిన కేవల సూర్యకాంతిలో గూర్చుండరాదా? ఈ పరికరము లేల? అనుప్రశ్న రావచ్చును. ఏలయన (1) వెలుపలనున్న ప్రతిఫలింపజేయు రేకులవలన సూర్యకాంతి యొక్కువ శక్తిమంత మగును. అప్పుడు కొలదికాలములోనే కోరిన ఫలము గలుగును. (2) లోపలిభాగమునందున్న చెక్కలవలన సూర్యకాంతియందలి శక్తి నిలువజేయబడి అది సూటిగా దేహమునకే చేరును. (3) ఆదిత్యపేటికయందు మెదడు చల్లని నీలికాం

తిచే కాపాడబడుచుండును. ఏ భాగమునం దే రంగు లోపించు టచే రోగగ్రస్తమైనదో ఆ రంగుకాంతినే ప్రసరింపజేయు సావకాశము గలదు. (4) కొంతమంది నగ్నమగు తమ దేహములను సూర్యకాంతిలో నుండునట్లు కూర్చుండ వెఱతురు. ఒకటి, యెండతీక్ష్ణతను భరింపజాలక; రెండు వెలుపటి చల్ల గాలిని భరింపజాలక. తీక్ష్ణమగు ఎండలో కూర్చుండుట వలన చర్మము మాడిపోవచ్చును, నాడు లుద్రేకింపవచ్చును. రంగు అద్దములద్వారా వచ్చినకాంతియం దట్టి యిబ్బందులు గలుగక సౌమ్యమై, సుకరమై యుండును. ప్రపంచమునందు ఆదిత్యపేటికవంటి సౌఖ్యమై, ఉత్తేజకమైన స్వేదోపకరణము లేదు. సూర్యకాంతివలన రక్తమునందలి మాలిన్యముల (Impure germs) ను సంహరించును. మిగిలిన మాలిన్యములు స్వేదమువెంట వెడలిపోవును. మిక్కిలి బలహీనులు నయిత మిందు సుఖముగనే దుర్గుణములు లేకుండగను సౌమ్యమగు నట్టియు, బలవర్ధకము లగునట్టియు సుగుణముల నందగలరు. నీరసము గలుగదు. రోగి మిక్కిలి పలుచబడి యున్నప్పుడు స్వేదము ఎక్కువగా రాగూడదు. కాన పైనవేసిన మైనపు గుడ్డను తొలగించి చల్లనిగాలి లోనికి రానీయవలెను. మిక్కిలి నీరసించిన దేహము గలవారికి మొదటి ఆదిత్యపేటికాస్నానము న నీరసముగాని, నిస్త్రాణగాని గలుగవచ్చును. కాన వారికి నెత్తిపైన తడిగుడ్డగాని, స్పాంజిగాని పెట్టియుంచవలెను. ఈ ఆదిత్యపేటికాస్నానములను జేసినకొలది వడదెబ్బ తగులు స్వభావము తగ్గిపోవుచుండును.

22 వ పటమునందలి ఆదిత్యపేటికకు దిగువ చట్రము లేదు. 5 వ నెంబరు ముందు చట్రమునందలి ప్రతిఫలకములు సులువుగా నూడదీయవచ్చును. చట్రము లన్నియు మడిచి చిన్న అరలో నుంచి వాడుకలేనప్పుడు దాచ ననువై యుండును. ఎగుమతి చేయుటకును వీలుగా నుండును.

5. వైద్యుల ఆదిత్యపేటిక :— దీనిపటము ప్రౌఢప్రభాకరము 25 వ కిరణము 46 వ పుటలో చూడనగును. దీనియందలి ప్రతిఫలకములు వెండికన్న తక్కువ ప్రతిఫలీకరణస్వభావము గల ఎల్యూమినియముతో చేయబడినవి. పై భాగమునందున్న ప్రతిఫలకము ఎంత యేటవాలుగా నుంచవలెనో అంత యేటవాలుగా నుంచుటకు ననువుగా నమర్చబడియున్నది. సూర్యకాంతి ఎదురురొమ్మునకు తగులవలసి నప్పటికన్న పాదములకు తగులవలసినప్పుడే పై ప్రతిఫలకము నెక్కువ యెత్తుగా నెత్తి యుంచవలెను.

6. సూర్యకాంతి లేనప్పుడు ఆవిరిదీపము (Gas light) వాడుకొనవచ్చును. ఎక్కువ ఖరీదుగల ఆదిత్యపేటికల యొక్క అడుగుభాగమున కుర్చీదిగువ స్పిరిట్ దీపమును, దానిపైన కొద్దిగా నీరుంచిన గిన్నెయు నుంచబడును. అందువలన ఆదిత్యపేటికయందు దున్నప్పుడు నీటి యావిరియును వచ్చుచుండును.

ఉత్తమ ఆదిత్యపేటికావివరణము :— 1. ఎనామిల్ చేసిన నీలిఅద్దము. మెదటికి నెండవేడి తగులకుండునట్లు

చల్లబఱచును. 2 - పైభాగమునందు నునుపుజేసిన ఎల్యూమినియముతో తయారుచేసి యెంత యేటవాలుగా నుండవలెనో అంత యేటవాలుగ నుండునట్లు ఏర్పాటుగలది. దీనికి 9 అను అంకెగల చోటు నుండి గొలుసుతో కట్టియుంచు నేర్పాటు గలదు. 3, 4- పక్కనున్న పెద్ద ప్రతిఫలకములు. ఇవియును అల్యూమినియముతో తయారైనవే. ఇవి 45 డిగ్రీలు పక్కకు వంచిన సూర్యకాంతిని లోనికి ప్రసరింపజేయుచుండును. అంతకంటె నెక్కువ తక్కువలు చేయరాదు. 5- క్రిందినుండి మీాదికి సరిపోవునట్లమర్పబడిన మందమైన బిలోరి




22 వ పటము
ఉత్తమ ఆదిత్య పేటిక.

అద్దము. దానిపైన రంగద్దములు అమర్పబడును. 6- త్రికోణాకారముగ నుండి మడచుటకు వీలుగల ముందుచట్రము. 7- ఆదిత్యపేటికయం దడుగుభాగమున వేసిన మైనపుగుడ్డ అద్దములోనుండి కాన్పించుచున్నది. 8- వెనుకచక్రమునందమర్పబడిన తలుపు. ఈపనిముట్టు అంతటిని మడచి యొగుమతిచేయ వీలుగలదు. అద్దము వేయదగిన ముందుచట్రమునందలి తెరపి, ఎక్కువ వెడలుపుగా నుండును. రంగద్ద

ములు ఎక్కువగా నుండును. పనితన మెక్కువ గలది. ఇతర పనిముట్లకు ఇన్ని అద్దములుగాని యింతపనితనముగాని లేదు.

7. పండుకొను ఆదిత్యపేటిక (23 వ పటము): —రోగగ్రస్తులై పరుండవలసినవారి కిది యుపయోగించును. పరున్నప్పుడు దేహము ప్రకృతియందలిసునిశితతత్త్వములను స్వీకరింపదగినంత ప్రతిక్రియాశూన్యముగా నుండును. మడచినజముఖానా దిగువ 7 నెంబరుగల తీగఅల్లికమీద పరచవలెను. సూర్యకాంతినుండి తగినంత వేడి రానియెడల దిగువ నున్న చేడిమివలన ఏభాగము వెచ్చబఱచవలెనో అచ్చట వెచ్చబఱచ వీలగును. లేదా వెనుక వర్ణింపబడినట్లు ఆవిరియైనను గలిగింపదగును. శ్వాసాశయములు బలహీనముగా నున్నప్పుడు కాంతి నెక్కువచేయుట అవసరము. 6 నెంబరు గల తలుపులోపలిభాగము ప్రతిఫలస్వభావము గలిగి శ్వాసాశయములకును నెక్కువ కాంతినిచ్చును. ఆ తలుపునకు వెలుపల ఒక తుండుగుడ్డ యున్నది. అది మెడకు దిగువగా వచ్చును. లోపలివేడిగాలి ముఖమునకును, తలకును తగులకుండ గాపాడును. పాదములు, చల్లగానుండు ప్రదేశముగనుక అచ్చట వేడి కలుగుటకుగాను, 9 అంకె గలచోట ఒక యెఱ్ఱని అద్దము నుంచిన మేలగును. ఎరుపుతోగూడిన నారింజపండు రంగద్దమైనను మంచిదే. రోగి మిక్కిలి యుద్రేకస్వభావము గలిగి యున్నయెడల ఊదాఅద్దముగాని, తెల్ల అద్దముగాని, యుంచదగును. ఇదియును ఎగుమతికి అనుకూలముగనే తయారు చేయబడినది. 2-2 చట్రములోనుండి ప్రతిఫలకముల నూడ

దీయవచ్చును. 10 - కాళ్ళు మడచవచ్చును. 1-1 స్తంభములు మరత్రిప్పవచ్చును. 5-5 ప్రక్కతలుపు వానిఁకొక్కెములనుండి విడదీయవచ్చును.




23 వ పటము.
పండుకొను ఆదిత్యపేటిక.

1-1 చట్రమును నిలువబెట్టు స్తంభములు. 2-2 క్రింద నున్న గాటిలో మర బిగించియున్నది. 3-చట్రములో నున్న మందమైన అద్దపురేకు. 14 × 46 అంగుళముల వైశాల్యము గలది. 4-క్రింద పరున్నరోగికి మెదటికి ఎండ తగులకుండ చల్లబఱచునట్టి యెనామిల్ చేసిన నీలఅద్దము. 5-ప్రక్క తలుపులలో నొకటి. ఇందలి లోపలివైపు మెరుగుపెట్టియున్నది. 6-ముందు తలుపు. 7-ఉక్కుతీగతో నల్లికపడక. 8-వేడిగాలి అర. 9-పాదములు వేడిచేయుటకు ఎఱ్ఱఅద్దముగాని, మెరుపుతో గూడిన ఊదారంగు అద్దమునుగాని నిలుపుటకు వీలైన

గాజు. 10- కార్క్- 11. ప్రతిఫలకములో నొకటి. పైభాగమున నయితేము ఒక ప్రతిఫలకము నిమిడ్చినయెడల ఆదిత్యపేటి కాస్నానముయొక్క శక్తి యింకను నెక్కువగును.

8. చోటు తక్కువగా నున్నప్పుడు కుటుంబోపయోగమునకు 21 పటములో జూపినఆదిత్యపేటిక చాలును. అట్టి కుటుంబవైద్య డింటనుండి రోగవిమోచనము జేయుచు దేహము నుజ్జీవింప జేయుచుండును, కాన జీవితము ఏమాత్రము నియమవంతము జేసినను రోగము దూరమై పోవును.

విద్యుదాదిత్యపేటిక :—దీనిలో సూర్యకాంతివంటి కాంతిగలగుండ్రని విద్యుద్దీపము అమర్చబడును. దీనిని మబ్బుగా నున్న దినములలోను, రాత్రులయందును నుపయోగింపవీలగును. ఆవిరిదీపముగాని బొగ్గుగాలిదీపముగాని పచ్చగా నుండును గాన నవి తెల్లని దీపములంత రోగనివారకములు గావు.



24 వ పటము. విద్యుదాదిత్యపేటిక.

ప దు నే న వ కి ర ణ ము.

# ఈ చికిత్సను బలపఱచు విషయములు.

స్థలాభావమువలన సూర్యకిరణచికిత్సాప్రభావమును బోధించు కథనముల నిచ్చుట వదలివేయవలసి వచ్చినది. చికిత్సాస్థానమున చాల స్వాస్థ్యకథనములు జేర్పబడినవి. చికిత్సాసంబంధమైన యీ శాఖలో వివేచన చేయునట్టియు, పని చేయునట్టియు వారియొక్క భావముల నిచ్చుట బేర్కొనుట యుక్తముగా నుండును.

1. అభిప్రాయములు: రైట్ రెవరెండ్ జాన్. టి. హాల్లీ హేయిటీ, దేవస్థానముమీద అధికారి; మతాధిపతులపెద్ద; స్వకుటుంబమున సూర్యకిరణచికిత్స ప్రవేశపెట్టినాడు. అతని నుండి:

"తాము రచించిన తేజోవర్ణశాస్త్రము మొదలగు వానిని చదువుటయందు శ్రద్ధ గలిగియున్నాను. ఐహిక జీవితము ధన్యము కావలయునెడల సూర్యకాంతి యెక్కువ ఫలకారిణియైయున్నది. ఎంత స్వల్పశాస్త్రజ్ఞానము కలవారైనను ఈవిషయమును ఒప్పుకొనవలసినదే. నిర్వివాదమగు ప్రాతిపదికపై తమరీ సిద్ధాంతములను వైద్యశాస్త్రమునందు బ్రవేశపెట్టితిరి."

రెవరెండ్ షైర్‌లీ, డబ్లియు. బేకర్, డి. ఎచ్. ఎల్. ఎల్. డి. గారు న్యూజీలండునందలి ఆక్లండు పట్టణవాసి. అతనినుండి: "ప్రతిదినమును నీ సిద్ధాంతములు నాకు ప్రీతిపాత్రమై యున్నవి. దైవికమగు నీవిధానమును తమరు

ప్రపంచమునకుఁ బ్రసాదించితిరి. వైద్యశాస్త్రము నంతయు తా ముజ్జ్వింపజేసితి రను నావిశ్వాసము పూర్వముకంటె నెక్కువమైనది.

వైద్యకళాశాలలందు పండితుడుగా నిరువదిసంవత్సరములు పనిచేసినట్టియు సుప్రసిద్ధ రాసాయనికవేత్తయు నగు కీ॥ శే॥ ఆర్. యఫ్. హ్యాంమిస్టర్ గారివద్దనుండి:

“వర్ణముతో వైద్యము (Therapeutic Chromology) చేయు విధానమునుగురించి తాము వ్రాసిన గ్రంథమును చదువుట వలన, నా కా శాస్త్రమునం దభినివేశ మధిక మగుచున్నట్లు కన్పించుచున్నది.”

‘రాబర్ట్ యఫ్. రాకసం’ అను వారికి విద్యావతియగు ‘సి. డబ్లియు. హంట్’ అను నామె యిట్లు వ్రాసెను:—

“వర్ణములయొక్క రాసాయనిక శక్తులద్వారా అత్యుత్తమ మగు వైద్యశాస్త్రము మనకు లభించినది. మందులచే నింప బడుటకుమాత్రమే తమ దేహములు నిర్మింపబడలేదని నమ్మ నారంభించిన కోట్లాది జనముచే నిది యానందముగా సంభావింపబడుచున్నది. నిర్వివాద మగు సత్యముపై నీ వర్ణవైద్యశాస్త్ర మాధారపడియున్నది.

ఈశాస్త్రకర్తకు న్యూయార్కువాసియగు రెవరెండ్ జాన్ ఎచ్. హాల్‌గా రిట్లు వ్రాయుచున్నారు:

"తమరు వృద్ధిపఱచిన స్వాస్థ్యశాస్త్రము జయప్రదమైన దని నా విశ్వాసము. నేటికాలమున నిది యనుత్తమమగు శాస్త్ర దృష్టృత్వమే యగును."

సుప్రసిద్ధగ్రంథ సంపాదకుఁడు, గ్రంథకర్తయగు యం. యల్. హాల్ బ్రూక్, యం. డి. గారివద్దనుండి :

"తమ యుద్యమము ఘనమైనది. తమ యుద్యమమునందు దేవతలు తమ నాశీర్వదించి, దారి చూపెదరుగాక !"

జియో ఎచ్. బెక్లే, యం. డి. గారివద్దనుండి :

"తాము రచించిన గ్రంథములు, అందు ప్రధానము తేజో వర్ణశాస్త్రము, మానవబుద్ధికి కేవలము నూతనమే యగును. నిష్కపటుఁడగు వైద్యున కిది కేవల మమూల్యమైనది. దీని నుపయోగించుటవలన నాయనుభవము వృద్ధినందినది. సంపాదన పెరిగినది. దీనివలన ఇంద్రజాలమునందువలె రోగములు లోఁబడిపోవును."

ఫ్రాన్సులోని 'లీలోటస్' అను సమర్థమగు వేదాంతపత్రిక యందు నా 'తేజోవర్ణశాస్త్రమును' గురించి యిచ్చిన అభిప్రాయ మిచట తర్జుమా చేయబడుచున్నది :

"స్వభావముచేతను, అందలి విషయముచేతను,విధానముచేతను సిద్ధాంతములచేతను నత్యంతము నసాధారణమగు నీ యుద్గ్రంథము శాస్త్రమునందును నభిరుచి గల యెల్లవారి దృష్టి నాకర్షింప సమర్థమైయున్నది. వెలుగు - విద్యుచ్ఛక్తి, వీనికి గల

సంబంధమును స్థిరపఱచి ప్రపంచమునందలి శక్తియొక్క యేకత్వమును బోధించిన క్లాసియస్ (Clausius)యొక్క తర్క నైపుణ్యమును జ్ఞాపకమునకు దెచ్చుచున్న దీ గ్రంథము. కాంతి తత్త్వము పదార్థములయొక్క నిజతత్త్వమును దెలిసికొనుటకు సూత్రమైయున్నది. పండితునకు సహజమగు వినయమును, ధైర్యముతోడి పరిశ్రమను, దివ్యమగు విషయప్రవేశమును గల్గియుండుటవలన నీ గ్రంథము మాస్తుతికి నర్హ మయ్యెను. శాస్త్రకర్త గ్రంథమునందు కవిత్వవికాసమును పూర్తిగా విసర్జించియున్నాడు. అట్లయ్యును, నిందుగల ఉత్తమమగు విషయ గౌరవమువలనను, అచంచలమగు విజ్ఞానముతో విషయములను తీక్ష్ణముగా చర్చించిన నేర్పువలనను, ఈగ్రంథము మనల బరవశుల జేయుచున్నది. కేవలము ఊహావశమునగాక అప్రతిమానప్రతిజ్ఞ చేతనే శాస్త్రనిర్మాణము జేసెను. పండితుడు డాక్టరు బ్యాబిట్ గారు అణుస్వరూప నిర్మాణమునుగురించి సంవత్సరములాది పరిశోధనలందు గడిపితినని చెప్పెను. అతని యారోపణ లన్నియు మొదటితూరి చదివినవానికి అప్రతిమానమగు 'నూహాలు'గా దోచును. వెంటనే పరమాణు యంత్రములను గురించి యత డిచ్చిన వివరణములవలనను సుప్రసిద్ధమైనట్టియు, అజ్ఞాతములైనట్టియు శాస్త్రీయసత్యములవలనను, సంపూర్ణమగు నతనిశాస్త్రము ధ్రువపడుచున్నది. ప్రకృతియం దీ ఘనమగు సిద్ధాంతముల వివరణతో నారంభించి నిస్తుల్యమగు సిద్ధాంతములతో పరిసమాప్తమగుచున్న దీ గ్రంథము.

పార్వతీపరమేశ్వరుల ఒకేదేహమునందలి సమ్మేళన మన నేమో యీ గ్రంథము వివరించినది. ప్రకృతి పురుషుల యొక్క సమ్మేళనము నీ గ్రంథము విపులముగా చర్చించినది. కనుక డాక్టరుగారిని మా హృదయపూర్వకముగా సంభావించుచున్నాము. త్వరగా తేజోవర్ణశాస్త్రము తెలుగు భాషలోని కనువదింపబడి మన యెదుట ప్రకాశించుగాక యని కోరెదము."

2. ఉద్యమము యొక్క యభివృద్ధి:- సూర్యకిరణచికిత్సా పరికరములు ప్రథమమున కనిపెట్టినపుడు అసంపూర్ణములుగా నున్నను, సూర్యకిరణచికిత్సను వ్యాపనము జేయు మార్గములు సంకుచితముగా నున్నను, సూర్యకిరణచికిత్సాసంబంధ మగు సిద్ధాంతములయొక్క ప్రాముఖ్యమువలనను ఈయుద్యమము విశ్వవ్యాప్తమైనది. ఆస్ట్రేలియా, న్యూజిలాండు, హిందూదేశము, యూరోపుఖండలి దేశము లనేకములు, అమెరికాలోని యనేకభాగములనుండియు నాగ్రంథములను, పరికరములను పంపుమని వ్రాయుచున్నారు.

3. బోధనవిధానములు:—న్యూయార్కు నగరమున కాంతశక్తిని బోధించుటకొక కళాశాల 1883 సంవత్సరములో స్థాపింపబడినది. అది 1887 సంవత్సరమున జనవరి 28 వ తేదిన రిజిష్టరు చేయబడినది. వెలుగు, వర్ణము, కాంతశక్తులు, మర్దన, జలము, వాయువు, విద్యుచ్ఛక్తి, మానసిక చికిత్స-వీనిస్వభావము, రోగనివారణమునందును, మానవాభివృద్ధి

యందును వీనిని ప్రయోగించు రీతులును అందు బోధింప నేర్పడినవి. 1893 సంవత్సరములో న్యూయార్కునకు 10 మైళ్ళ దూరములోనున్న ఈస్టు ఆరెంజి అను చిన్నపట్టణమునకు మార్చితిమి. అప్పుడు 'సునిశితశక్తుల కళాశాల' (College of Fine Forces) అను పేరుతో న్యూజెర్సీశాసనముల ననుసరించి రిజిష్టరు చేయబడినది. 1896 సంవత్సరములో కాలిఫోర్నియాయందలి లాస్ ఏంజలీస్ అను పట్టణమునకీ సంస్థను మార్చితిమి. సూర్యకాంతిప్రసారము విశేషముగా గల యీ సుందరప్రదేశము ప్రకృతియందలి యీ యుత్తమశక్తులతో పరిశోధనల సలుపుటకు మిక్కిలి యోగ్యమై యున్నది.

ఈసంస్థకీ దిగువ పేర్కొనబడిన పెద్దమనుష్యులు వరుసగా అధ్యక్షులై యున్నారు. వీరందరును వారివారి శాఖలయందు సుప్రసిద్ధులై యున్నారు. న్యూయార్కునందలి పాఠశాలల పరిశోధకు (Superintendent) డగు హెన్రీ కిడ్డిల్ అను పండితుడు, న్యూయార్కునందలి డాక్టరు యఫ్. జి. వెల్చ్ గారు, న్యూయార్కు న్యూజెర్సీయందలి అలగ్జాండర్ వైల్డర్ పండితులు.

వర్జీనియా విశ్వవిద్యాలయమునకు సంబంధియును, సుప్రసిద్ధోపన్యాసకుడును అగు డబ్లియు సి. బోవర్ గారు కాంతశక్తులకు సంబంధించిన ప్రథమబోధన తరగతిలోని విద్యార్థులచే నీ క్రింది ప్రశంసాపత్రము నేకగ్రీవముగా సంతకములు చేయించి యిచ్చియున్నాడు:—

"డాక్టరు బాబిట్ గారిచేస్థాపింపఁబడిన కాంతశక్తులను బోధించు సర్వకళాశాలయందు మేము విద్యార్థులముగాన నతనిచే కనిపెట్టఁబడిన యీ గుణవంతమును, నవీనమును నగు వైద్య శాస్త్రము యొక్క యోగ్యతాయోగ్యతలను గురించి ప్రజలకు మా యభిప్రాయములను వెల్లడించుటకు అర్హులమై యున్నాము. మాకు విధియును నై యున్నది. అతనిచే బోధింపఁబడిన, పరీక్షలో కృతార్థులమైన మేము, ప్రకృతి యందలి సునిశితశక్తులతో వైద్యము చేయు విధానమును ప్రపంచమున ప్రచారము జేయఁబోవుచున్నాము. మేము పొందిన యుత్తమ బోధనలకు మేము మిక్కిలి సంప్రీతులై యున్నాము. ప్రపంచమునకు తెలిసియున్న వైద్యవిధానము లలో నెల్ల నిది సత్యతమమును, ఉత్తమమును, అమూల్య తమము నగు విధాన మని నమ్ముచున్నాము. కాన సాధ్యమై నంత త్వరగా నీవిధానమును ప్రజలకు పరిచయము జేయు టకు మిక్కిలి యుత్సుకులై యున్నాము.

"నవీనమగు నీవిధానమునం దంతర్గతమగు సూత్ర మిది: శక్తులు సునిశితములైనకొలఁదిని, వాని సామర్థ్యమును వృద్ధి బొందుచుండును. కనుక స్థూలమునుండి సూక్ష్మమువంకకు జరు గుటయే న్యాయమగు నభివృద్ధి. ఇది వివేచనాపరులగు నుత్తము లందఱును ఒప్పుకొనిన విషయమే యగును. వైద్యశాస్త్రము యొక్క పూర్వచరిత్రయం దెల్ల నీ సిద్ధాంతము ఋజువు పడియే యున్నది. మోటై వికారపెట్టునట్టియు, వినుగుఁ కలిగించునట్టి, మందు వైద్యపు మోతాదుల స్థానమున తియ్యనై నట్టియు

సునిశితస్వభావము గలిగినట్టియు పంచదారమాత్రలను హోమోపతివైద్యము ప్రవేశపెట్టినది.

"మందునందుగాక సృష్టియందలి కేవలతత్త్వములందే నిజమగు రోగనివారకశక్తి గల దని నవీనము నుత్తమమును నగు సీశాస్త్రమువలనఁ గుర్తింపఁబడినది. ఆ తత్త్వములు ఇదివరకే తయారైన సారములు. అవి నిశితమయియే యున్నవి. విశ్వము నం దంతటను తరుగుపోనంత అపరిమితముగా లభించునవై యున్నవి. ప్రాణదాయియగు వాయువును, తేజోదాయిని యగు సూర్యకాంతియు, అందలి సప్తవర్ణములును, విద్యుత్ప్రవాహమును, కాంతశక్తి గల చేయియు, విశ్వమునం దపరిమితముగా లభించును గద. మానవుడుగాక పరమేశ్వరుఁడే స్వయముగా, స్వహస్తములతో మందును తయారుచేసి మనకు లభింపఁజేయుచున్నట్లు మన కనుభూత మగుచున్నది. వినిర్మలమై, సున్నితమైన యీ మందు మానసిక ఆత్మీయవ్యాధులగు కామక్రోధాదులను జననమరణప్రవాహరూప మగు సంసారసాగరమును తరింపఁజేయను సమర్థమై యున్నది."

ఇట్లు విధేయులు.

డబ్లియు - సి. బోవర్ ; శ్రీమతులు జె. ఆర్. సాండ్‌ఫోర్డు ; సిలియా డబ్లియు. హార్ట్ ; జియో. విల్‌హేమ్ ; ఎ ఇ. కిచ్చి ; యస్. ఎ. బోవర్లుస్సూ ; ఏ. ఎర్. రాగసం ; యూలాలీ గ్లీసర్ కన్య ; పాలిర్. యం. పిల్స్‌బరై సతి ; ఎర్. ఎస్. క్రిస్లీసతి ; డాక్టరు మేరి ; ఏ. పవెల్‌సతి.

హడ్సన్ టట్లె వ్రాసి అను సుప్రసిద్ధగ్రంథకర్తనుండి:
"డాక్టరు బాబిట్‌గారు సునిశితశక్తుల కళాశాల యని యిప్పుడు పిలువఁబడుచున్న న్యూయార్కులోని కాంతశక్తుల కళాశాలకు సర్వాధిపతి. తీవ్రముగ జగద్విఖ్యాతిని బొందుచున్న సునిశితవైద్యసంబంధమైన సంస్థ యిది. వివిధ దేశముల యందలి విద్యార్థుల నిది యాకర్షించుచున్నది. సర్వమునకును మూలకారణమగు విద్యుచ్ఛక్తి, కాంతశక్తి, రాసాయనికశక్తి, సూర్యకిరణశక్తి, ఆత్మశక్తి, -వీని నుపయోగించి వైద్యశాస్త్రమును సత్యసిద్ధాంతములపై నాధారపరచుచున్నది. ఈ విద్య యింటియందుండియే నేర్చుకొనవచ్చును. కాంతశక్తుల పండితుడు D. M. (Doctor of Magnetics) అను బిరుదున కర్హుఁడగును. డాక్టరు బాబిట్‌గారి విషయమున ననేక అమూల్యగ్రంథములకు కర్త."

ప దు నా ఱ వ కి ర ణ ము.

# సౌరగృహనిర్మాణము.

1. మానవప్రపంచమునకు లభించిన యీ నవీనము గు శాస్త్రము అనన్యమైనది. ఈ శాస్త్రానుగుణముగా గృహనిర్మాణముఁ జేసికొనదగిన సమయము ఆసన్నమైనది. ఈ సూర్యకిరణముల యద్భుతప్రభావము బోధపడిన కొలఁదిని గృహనిర్మాణశాస్త్ర (వాస్తుశాస్త్ర) మునందును నూతన మార్గముల ననుసరింపగలరు.

2. కిటికీల సంఖ్య పెంచవలెను. పెద్దవిగా నుండవలెను. కిటికీలకు వేయు అద్దపుచట్రములలో కొయ్యభాగము తక్కువగను, అద్ద మెక్కువగను నుండవలెను. తెఱచుటకు మూయుటకు వీలుగా నుండి గాలి, వెలుతురు లోనికి ధారాళముగా రానను వై యుండవలెను. సూక్ష్మజీవులు నాశనము కావలయు నెడలను ఇండ్లలోని గాలి యందలి మాలిన్యములు నశింపవలయునెడలను, సూర్యకాంతి అనన్యగతివై యున్నదిగదా. కనుక ప్రతిదినమును సూర్యకాంతి నిండ్లలోనికి నెక్కువగాఁ బ్రసరించునట్లు జేయవలెను. వాతావరణమునందు వేడి మిక్కుటముగా నున్నయెడల గదిలోనికి తగినంత సూర్యకాంతిని రానిచ్చి తరువాత వెలుతురు నాపవచ్చును.

3. క్రింద వెడల్పుగా నుండి పై భాగమున వెడల్పు తగ్గియుండునట్లు కట్టబడిన డాబా 'సౌర గృహ' మనఁబడును. డాబాగోడలవలెనే కిటికీలును ఏటవాలుగనే యుండును. ఇందు

వలన సూర్యకాంతి గృహములోనికి నెక్కువగా జొచ్చు వీల గును. గృహమును అందముగనే యుండును.

4. మేడమీద పిట్టగోడ యెక్కువ ప్రముఖమును, ప్రధాన మును నగు విషయము. ఇది లోపల నున్న మధ్యగృహమునకు చుట్టు 4½ అడుగుల యెత్తున కట్టఁబడును. దాని పైన దిగంబ రముగా తిరుగుచుండినను వెలుపల నున్నవారి కెవరికిని లోపల వారు కాన్పింపరు. అప్పు డతనికి గాలియు, సూర్యకాం తియు ధారాళముగ లభించును. రోమనులు, నెత్తికి తడిగుడ్డ మాత్రము చుట్టుకొని మధ్యాహ్నపువేళ నెండలో తమ మిద్దెలపై నిట్టి యేర్పాటుగల ఆవరణలో విహరించుచుండిరి. వీనికి తోడు ఇతరప్రకృతివిధానముల నవలంబించిన వారికి నత్యుత్తమమగు దైహిక మానసిక శక్తి గలుగుచుండెడిది.

5. గృహనిర్మాణము:—ఈవిషయములో కొన్ని సులభ మైన నమోనాలను నిచ్చుచున్నాను. చుట్టునున్న పిట్టగోడను వివిధములగు వర్ణములతో చిత్రించిన అందముగా నుండును. ఇష్టమైనయెడల నింకను బాగుగా దాని నలంకరింపఁజనును. 25 వ పటములోని భవనముయొక్క కొలత 28 × 36 అడు గులు. 2వ అంతస్తు వెడల్పు 20 అడుగులు. అనగా ప్రక్క గోడ లొక్కొక్కటి 4 అడుగులు ఏటవాలుగా నుండుట వలన 8 అడుగుల క్రిందిభాగమునకంటె పైభాగమున తగ్గిపోయి నది. 2 వ అంతస్తు పైభాగమున నాలుగు వైపులను తెరచి యుంచిన మంటప మున్నది. దానిని మధ్యగా నుంచి చుట్టును

20 × 36 వైశాల్యమును మూయుచు చుట్టును పిట్టగోడయున్నది. ఇదంతయు నాతపస్నానాదుల కుపయోగింపఁదగియున్నది. మంటపము 8 × 12 అడుగుల వైశాల్యముగలది. ఈ మంటపము లోనికి దిగువనుండి వచ్చు మెట్లవరుస కాపుడల గలిగి, పైకి వచ్చునప్పుడు, క్రిందికి దిగునప్పుడు చలిగాలినుండి



25 వ పటము.

మిద్దె - మంటపము, పిట్టగోడ గల భవనము.

కాపాడును. మంటపము యొక్క కిటికీ 4 × 5 అడుగుల పరిమితి గలవి. వానిని వేసఁగియందు దించుటకు వీలున్నది. వాతాతపముల కప్పుడైనను నిరోధ ముండదు. దానిలోపల నాదిత్యపేటిక నుంచుకొని సుఖముగను, ఆనందముగను ఆతపస్నానముల జేయవచ్చును. వేసవియందు సాయంకాలముల

నిచ్చట నింటివా రందఱును విశ్రాంతి తీసికొనవచ్చును. గాలి తగులును. మఱుగుగా సయితముండును. ఇందులో పగటి వేళ నుండుటవలన రోగనివారణమగుటయేగాక ఆరోగ్యవర్ధన మగును. ఇది మిక్కిలి శక్తిమంతమైనది.

26 వ పటమునందు లోపలికొలత లున్నవి. చావడిలోనికి వెలుతురు, గాలి రెండువైపులను నున్న కిటికీలలో నుండియే గాక మధ్య నున్న మండువానుండి సయితము వచ్చుచున్నది. వంటసాల ఆహ్వానశాలగా మార్చుకొని వంటశాల వేరే నిర్మించుకొనవచ్చును. అది భోజనశాలకు సమీపముగా నుండవలెను.




26 వ పటము.
మొదటి అంతస్తు




27 వ పటము.
రెండవ అంతస్తు

27 వ పటమున 4 పడకగదులు, గుండ్రని కిటికీయును గల స్నానపుగదియును గలవు. ఇందలి కొలతలు గోడలయొక్క వెడల్పుతో కలిసి యిందు వేయఁబడినవి. ఇందలి మెట్లవరుస

పైనున్న ఆదిత్యమంటపమునకుఁ బోవును. ఇల్లు పడమట ముఖముగాని, దక్షిణముఖముగా గాని నిర్మింపఁబడినయెడల, పక్కమీఁద పరున్నవారి తలలు ఉత్తరపుదిక్కుగా నుండు నట్లు ఏర్పఱచఁబడినవి.



**28** వ పటము.

ఒకే ఆవరణలో నిముడ్పఁబడిన 2 భవనములు.

6. **28** వ పటమునందలి భవనములు రెండును మధ్యనొక **8,9** అడుగులగోడచే వేరుచేయఁబడియున్నవి. ఒక యింటి వారికి వేరొక యింటివారితో సంబంధము లేదుగాని, పైనున్న ఆదిత్యమంటపములు రెండును ఒకే పిట్టగోడగల ఆవరణలో నుండునట్లు నిర్మింపఁబడినవి. మంటపశిఖరములు రెండును

ఆకాశమువంకకు చూపుచుండుటవలన నుత్సాహజనకముగా నుండును. ఔన్నత్యము నది సూచించుచుండును. చుట్టునున్న పిట్టగోడ తక్కువ విలువగల కొయ్యతో నమర్చి దానిని మంచి రంగులు వేసినను బాగుండును. ప్రతిభవనము 25 x 32 అడుగుల వైశాల్యము గలిగియున్నది. పైమంటపములు 15 అడుగుల ముందుభాగమును 9 అడుగుల లోతును గలిగి యున్నవి. ఆదిత్యమంటపముగా నుండుటవలన తీవ్రమగు సూర్యకాంతి యిందు బ్రవేశించును.

29, 30 పటములు పైభవనముయొక్క రెండంతస్తులయొక్క నమూనాలై యున్నవి. వంటశాల వాకిలికి లోపలివైపున




29వ పటము.
మొదటి అంతస్తు.




30వ పటము.
రెండవ అంతస్తు.

నొక తెఱ వేసికొనవచ్చును. మిగత కిటికీలకు చట్రములలో నుంచి అద్దపుతలుపుల నమర్చవలెను. కుటుంబములు ఇంకను పెద్దవగు నెడల ఇంకొక అంతస్తు వేసికొనవచ్చును. పైనున్న

ఆదిత్య మంటపములోనికి వెలుపలనుండి మెట్లమర్చుకొన వచ్చును. ముందు పడకగదికి అంటి మెట్లకు దిగువగా నొక అర నమర్చుకొనవలెను.

7. మనస్సుకలసి అన్యోన్యసహాకారముగల 6 కుటుంబముల వారు నివసించుటకు వీలయినభవనము 32 వ పటములో చూపఁబడినది. దాని వైశాల్యము 84 × 40 అ. అందరికిని కలిపి



31 వ పటము.

సహాకారముతో జీవించువారు నివసింపదగిన భవనము.

యొకటే వంటసాల, ఒకటే వస్త్రములు ఉదుకుకొను చోటు, ఒకటే సరుకులకొట్టు, ఈ భవనమున కావల నిర్మించుకొనవలెను. అందే తంత్రీభాషణము (Telephone) నకు ఏర్పాటుండవలెను. అందుండి ఆహారపువళ్ళెరములు, వస్త్రములకట్టలు

మోసికొనుపోవు విద్యుత్తంతువుల నేర్పరచుకొనవలెను. 12 అడుగుల చతురస్రమైన గాలిగోపుర మీ భవనమం దెదురుగా కాన్పించుచున్నది. అందు మెట్లవరుస లున్నవి. ఇందు వెంటవెళ్ళిన ప్రతి అంతస్తులోనికిని, ఆదిత్యమంటపములోనికి పోవీలున్నది. ప్రతివారికిని ప్రత్యేకచావడు (Halls) లున్నవి. సహకారశాలలుగాక ప్రతికుటుంబమునకును 8 గదులున్నవి. స్నానపుగదియు, సామానుగదియు ప్రతికుటుంబమునకు గలవు. అడుగుభాగమున ఆవిరితో వేడి కలిగించుట కేర్పాటు గలదు. భవనమున కెగువభాగమున అద్దాలమంటప మున్నది. పటము వ్రాసినవా రాభాగము నెత్తు తక్కువగా గీచియున్నారు. ఆమంటపముయొక్క పై కప్పు అనేక అద్దములచే కప్పఁబడియున్నది. అందే పరిశ్రమచేయదగియు నున్నవి. ఈ మంటపములోనికి గాలిగోపురములోనుండియే ప్రవేశింప తగును. ఈమంటపమున, పిట్టగోడ ఆవరణలోను దిగువనున్న గృహములోనివా రుపయోగించుకొనుటకు వివిధములగు దేహపరిశ్రమకు సంబంధించిన పరికరము లుండవలెను. దిగంబరముగనే వానితో కసరత్తులు చేయవలెను. (దిగంబర మనగా కౌపీనముసయితము లేకుండ నని గాదు. అమెరికాయందు బనియను చెడ్డీ యున్నను దానికి దిగంబర మనియే పేరు. ఆ దేశమున వీనిపైన కుడితినీ, లాగు, లంగా, వేష్టుకోటు, కోటు, నుండుట సామాన్యమగు వస్త్రధారణము) అందువలన కప్పునందలి అద్దములలోనుండి వచ్చునట్టి మృదువును, ప్రాణదాయకమునగు సూర్యకాంతి దేహములపై బడుచున్నది. కప్పు

నకు వేసిన అద్దములు సూర్యకాంతిని నిరాఘాటముగా రాని చ్చునవి (పారదర్శకములుగా) నుండనక్కరలేదు. అద్దములు మందముగా నుండి కొంచెము వెలుతురును నిరోధించునవిగనే మృదువగుకాంతిని మాత్రమే క్రిందికి వదలునవిగను నుండవలెను. నాత్యుష్ణమగు జలము సయితమిచ్చట నుండవలెను. వ్యాయామానంతర మా నీటిని స్నానము చేసిన మురికిపోవుటయేగాక ప్రాణము తెప్పిఱిల్లినట్లు తోచును. ఇదే యెక్కువ కాలము చేసిన సూర్యకాంతియందు సంపాదింపఁబడిన కాంత శక్తి హరించిపోవును.

దినమునం దొక కాలమున స్త్రీలును, శిశువులును; వేరొక కాలమున పురుషులును నీ భాగమును వాడుకొనవలెను. పిల్లలకు శనివారము లేర్పాటు చేయవలెను. ఇందువలన ఆనందమేగాక సౌఖ్యము, శక్తియును నేకకాలమున ననుభూతమగును. తీక్ష్ణమగు వేసఁగియందు సాయంకాలములు భూమికి సమీపముగా నున్న భాగములకన్న నిచ్చటివాయువు సౌఖ్యదాయకమై యుండును. ఇచ్చటి కందరు చేరుకొని సుఖింపవచ్చును.

8. 32 వ పటమున రెండుగా నున్న భవనములయొక్క సమ్మేళనము గాన్పించుచున్నది. ఇట్టివి నాలుగు భవనము లుండి, మధ్యభాగమున వంటసాల, వస్త్రము లుదుకుశాల, సరకుల కొట్టు కలిసియుండి, కావలసినవస్తువు లన్నియు సహాకారపద్ధతిమీఁద అందరిమేలుకొరకై, మొత్తముగా కొనవలయును.

ప్రతికుటుంబమువారును తమకు వలయు ఆహారపదార్థములకై అచ్చటికి టెలిఫోను చేసి తెప్పించుకొనవచ్చును. వస్తువులు బాగుగా పచనము చేయఁబడి ముడివస్తువుల ఖరీదునకే వండిన పదార్థములు గిట్టునంత చౌకగా నుండును. మొత్తముమీద,




32 వ పటము.

సహకారభవనముయొక్క లోపలికొలతల తెలుపు పటము.

ఉమ్మడిగా పనులు జరుగుచుండుటవలన, ఉతుకుట, ఆర వేయుట మొదలగు శ్రమలు లేక యీ పనులు యంత్రముల వలననే చేయించవీలై యుండును. విడిగా స్వయముగా నుతుకుట, ఆరవేయుట మొదలగునవి స్త్రీలు జేయుటకంటె నిది చౌకగా గిట్టును. (ఇది అమెరికనుజీవితమున కనుగుణమైననడక) భవనములు ఉత్తరదక్షిణములుగా నుండిన ప్రాతఃకాలమునందును సాయంకాలమునందును భవనములోనికి సూర్యకాంతి ప్రసరింప వీలైయుండును. ఈ భవనముల మధ్యభాగమున కొద్ది మూల్యమునకే పూలతోట, కూరగాయలు పెంచు

టయు చేసికొనవచ్చును. అప్పుడది యంతయు పూలతోట పలెనే యుండును. ఆ కుటుంబములవారందు తిరుగ్వాటయు, దోకుటయు చేయుచుండవచ్చును.

3 వ అంతస్తుపై 11 అడుగులయెత్తుండి గట్టికప్పు గలిగియుండును. అప్పుడు ఆదిత్యమంటపమునందును ఆవరణలోను జరుగు పరిశ్రమాదులవలన గలిగిన ధ్వని 3 వ అంతస్తువారికి ఇబ్బందిగా నుండకుండును. ఆదిత్యమంటపమునకు సమీపముగానున్న చిన్న జలాశయము కప్పులో దిగఁబడియుండినను 3 వ అంతస్థులో నున్నవారి నెత్తికి తగులకుండును.

9 సౌరవనము :— వాతాతపస్నానములు, సైకతస్నానమును వీలగు నేటి జలస్నానములు కలిపిచేయుటకు అనుకూలముగా భూమిపైన ఆవరణ మేర్పఱచిన నది సౌరవనమనబడును. స్నానము జేయుచున్న దిగంబరులను చూడదగినంత సమీపములలో గృహాదికము లుండరాదు. 26 వ పటమునందు చెప్పఁబడిన మంటపమును 7, 8 అడుగుల యెత్తుగల పిట్టగోడ గల ఆవరణము నుండవలెను. వీలయినను ఇంకను ఎత్తున్నను మంచిది. ఈతోటలో నీటికొలనుకు సమీపముగా 5, 6 బండ్ల యిసుక పోగుపోసియుండవలెను. ఇంకొకచోట బల్ దండి మొదలగు వ్యాయామోపకరణము లుండవలెను. ఆదిత్యమంటపమున ఆదిత్యపేటిక గాని వర్ణకేంద్రిక రోపకరణముగాని రెండునుగాని యుండవలెను. అందువలన ఆతపస్నానముయొక్క ఫల మింకను శక్తిమంతమై

యుండును. సూర్యకాంతి తగిలిన సైకతము (ఇసుకపై దిగంబరులగు పిల్లలు ఆడుటకు, పొర్లాడుటకును ఇష్టపడెదరు. ఈ నీటిలో నీదులాడెదరు. కొలది వారములలో వారి దేహము జిగిదేలి ధాతుబలము వృద్ధియై, జీవితాంతము వరకును వారికది శక్తిదాయకమై యుండును. ఇచ్చటనే కుటుంబములోని డస్సిన పెద్దలు సేదతీర్చుకొనదగునట్టి శక్తిగలవారగుదురు; రోగవిముక్తులగుదురు. జీవిత మప్పుడు భారభూతము గాక ఆనందదాయక మగును. కాని ఒకలోపముమాత్రి మిందు గలుగును. సౌరవనములును, ఆదిత్య మంటపములును, ఆతపస్నానములును ధారాళముగా వాడుకలోనికి వచ్చిన యెడల మంచి వైద్యులు, మందులను తయారుజేయువారును తమ రుసుములను దాదాపుగా గోల్పోవవలసినవారగుదురు.




33 వ పటము

ఆతపస్నానమునకు వీలగు కట్టడము.

10. సార్వజనిక ఆతపస్నానసంస్థలు :— సమానమైన మెత్తుగల మిద్దెల వరుసపై వీనిని నిర్మింపవచ్చును. దక్షిణపువైపు ఏటవాలుగ నుండవలయును. అందువలన వేసంగియందైనను సూర్యకాంతి సూటిగ ఆదిత్యమంటపములోనికివచ్చును.

(ఇది అమెరికాలోని స్థితి.) **33** వ పటమున **25 × 44** అడుగుల యెత్తుగలిగియుండును. ఎదురుగా నున్న అద్దములు ఆఱును మందమై **4 × 5** అడుగుల సైజు గలవిగా నున్నవి. వీనిని కొక్కెములతో పై భాగమునుండి వ్రేలదీసియుంచి అవసరమైనప్పుడు, వాతాతపములు సమగ్రముగా పడుటకు వీనిని ఎగదీసి కట్టవచ్చును. తూర్పువైపునను, పడమటవైపునను విశాలమగు కిటికీ లుండిన ప్రాతస్సాయంకాలములయందు సూర్యకాంతి లోనికిఁ బ్రసరింప వీలైయుండును. ఉదయపుపూట ప్రొద్దెక్కక పూర్వమునను, సాయంత్రము ప్రొద్దుక్రుంకక పూర్వమునను అంగాతపస్నానము జేయ వీలగును. **34** వ పటము పై పటముయొక్క లోపలి కొలతలు గలది. స్త్రీ పురుషులు, ఏక కాలమున ఆతపస్నానము




**34** పటము

లోపలి యేర్పాటులు.

జేయు నేర్పాటిందు గలదు. ఇందలి యొకభాగము స్త్రీలకును, రెండవభాగము పురుషులకును. ఇంతవఱకును బహిరంగపఱచిన సౌఖ్యకరమును, బలవర్ధకమునునగు విషయమునం

డలి నా యభిప్రాయ మిది. 5 అను గుర్తు గలచోట రోగి గోడ్డుమీఁదనుండి పైకివచ్చును. అటనుండి స్త్రీలోకవైపునను పురుషులోకవైపునను తిరుగవలెను. సబ్బునీళ్లతో స్నానముచేయుట, ధారాస్నానము కొలదికాలములోనే ముగింపవచ్చును. కాన స్త్రీపురుషులు ఆ గదులనే వాడుకొనిన తక్కువఖర్చులో నిముడును. పురుషుడు చుస్తులు ధరించుగదిలో వస్త్రములు విడలివేసి తాను స్నానపుగదిలో బ్రవేశించి, స్త్రీలు వచ్చువైపున ఆ గదికిగల తలుపు మూసివేయవలెను. తరువాత స్నానము జేసి, అచటనుండి సౌరావరణము (Solarium) లోనికి వచ్చి చేరును. అందరచే డాదిశ్యపెట్టెయందుఁ బ్రవేశించును. సౌరావరణమున కడ్డముగా, జరుపుటకు వీలగు నొక తెర స్త్రీపురుషులు ఒకరికొకరు కనబడకుండున ట్లడ్డము కట్టవచ్చును. స్త్రీపురుషులలో నెవ రెక్కువమంది యున్న, నా వైపున సౌరావరణము పెద్దదిగా నుండున ట్లీ తెర జరుపఁబడును. తరువాత అద్దములను అమర్చు నతఁడు రోగియొక్క స్థితి ననుసరించి అద్దముల నమర్చును. రోగి చెమట గలుగువఱకు నందు కూర్చుండును. తరువాత ధారాస్నానపుగదిలోనికి వచ్చును. సుగంధయుక్తమై నీలికాంతియం దుంచఁబడి వాయుపీడనముగల ఉదకము ధారగా మీఁదపడునట్లు చేసికొనును. దానివలన దేహము చల్లఁబడి, రోమకూపములు మూసికొని, స్నానమంతయుఁ దొలఁగింపఁబడును.

ఎక్కువకాలపు స్నానమువలన సూర్యకాంతియందు సంపాదింపఁబడిన కాంతశక్తి తగ్గిపోవును. కాననీ ధారాస్నానము

స్వల్పకాలమె చేయఁదగును. తరువాత పురుషులకొరకేర్పడిన మర్దనగదిలోనికిఁ బ్రవేశించును. శీతకాలమైన కంబళిమీదను, వేసగియైన జముఖానామీదను పరుండును. కాంతశక్తిగల మర్దనజేయు స్త్రీ యతనికి కొన్ని చాలనముల జేయును. తరువాత నవజీవముతో నతఁడు వెలుపలికి వచ్చివేయును.

ధారాస్నానముగురించి యింకను కొంచెము విపులముగా చెప్పెదను. ధారాస్నానపు గదికి పైకప్పు నీలిఅద్దములతో కప్పియుండవలెను. దానికి దిగువగా నీరుండు తొట్టి యుండవలెను. నీలివర్ణారోపితమగు నా జలమునందు వేడి తగ్గించు స్వభావమున్నది. కాన రోమకూపములు వెంటనే ముడుచుకొనును. కాన జలుబు చేయకుండును. చర్మము పట్టువలె మృదువుగా నుండును. బలహీనులపై నీ జలము పడునపుడీ తుంపర, మంచు కురియుటవలె మృదువుగా నుండవలయును.

**11.** విద్యుద్దీపస్నానములు :— ఒక చిన్న కుటుంబమునకు ఆదిత్యపేటిక యున్నయెడల కుటుంబములోని వారందఱి యారోగ్యము కాపాడుటకు మామూలు సూర్యకాంతియే చాలియుండును. సార్వజనికమగు నాతపస్నానసంస్థలయందు రోగులయొక్క ఒత్తిడి యెక్కువగా నుండవచ్చును. లేదా సూర్యుడు బాగుగాఁ బ్రకాశింపక మబ్బులోనికి బోవుటయు జరుగవచ్చును. రాత్రులయందు తప్ప తీరికలేక సూర్యకాంతికి బదులు కాంతిమంతమై, ధాతువర్ధకమగు స్నానము కోరువారికిని సూర్యకాంతివలన పనిపడదు. అందుల కుపయోగముగా

విద్యుద్దీపముతోఁగూడిన ఆదిత్యపేటిక నొకదానిని తయారు చేసితిని. (24 వ పటము చూ.) దీని వలన లవణాదులు సూర్యకాంతియందు వలెనే. నల్లఁబడును. సైయిమోన్ అను పండితుఁ డింగ్లండునం దీ విద్యుద్దీపము (Arc light) చే శీత కాలమునందు పండ్లను పండునట్లు చేసెను. వేసగియందలి యెండలోఁకంటెను, నీ దీపపుకాంతిలోనే యెక్కువత్వరగా చెట్లు ఫలించినవి. రాచఉసిరిక, స్ట్రాబెరి యను చెట్లు ఈ దీపపు కాంతిలో, 2 మాసములలో పండ్ల నిచ్చినవి. 74 దినములలో, దాౣక్ష ఫలించినది. పండ్లు ఎండలో ఫలించినవాని కంటె నివి రుచికరముగను నుండెను.

పదునేడవ కిరణము.

# వర్ణము - శక్తుల పరిమితి

1. సౌలభ్యము:— రంగు సృష్టియందలి ప్రతివిభాగము యొక్క స్వభావమును దెలుపును. శక్తియొక్క పరిమితిని సయితము నిది నిర్ణయించును. అగ్నియందలి యెరుపురంగు వేడిమిని గలిగించునదై యున్నది. సూర్యకాంతియందలి యెరుపునకును నిదే స్వభావము. మిరెపకాయ వేడిని కలిగించును. ఎఱ్ఱగానుండును. ఇట్టి పింకను గలవు. ప్రేమ, కామము మొదలగునవి యుద్రేకించిన వారియం దీ వర్ణము ప్రత్యక్షమగుచునే యుండును. వారి యాంతరంగికశక్తి పైకుబుకును గద. అందువలన, నీలమన్ననో చల్లదనముయొక్క పరిమితిని దెలుపును. కాంతియందలి నీలికిరణములు చల్లనివి. సిరలయందలి రక్తము చల్లనిది, అస్థులందలి నీలిధాతువులు చల్లనివే. ఇట్లే ఇతరములు - అతీంద్రియ దృష్టిగలవానికి చల్లని వివేచనస్వభావముగల మెదటియందలి ముందుభాగము నీలముగాను; మెదటియొక్క వెనుకభాగము, దిగువభాగము, ఎఱ్ఱగాను గాన్పించును. మనస్సునందును, పదార్థములందును వ్యాప్తమగు నేకత్వము నివి రుజువుపఱచు సత్యములై యున్నవి.

2. అణుశక్తి, రాసాయనికశక్తి:— సృష్టియందలి ప్రతిపదార్థమునకు మూలమగు నణువులు గలవని యీ గ్రంథమునందును, "తేజోవర్ణశాస్త్రము"నందు ప్రధానము

గను చర్చించిన 'అణుసిద్ధాంతమున' వివరింపఁబడినది. వర్ణములయొక్క న్యాయమును పరిదర్శించినప్పు డది వివరింపఁబడినది. హైడ్రొజము, కొరలోహములు, సాధారణముగా తెల్లగా నుండును. వేడివలన వానియందలి యణువులు వ్యాకోచము నందును. శీతస్వభావముగల్గి సంకోచమునొందిన యణువులు అందు గర్భితమై పోవును. అందువలన నవి కాన్పింపకుండ బోవును.

రెండు అణువులు కలసినప్పు డందలి యొక అణువు మఱుగై పోవుటకు హేతువు తెలియక చిరకాలమునుండియు రసాయన శాస్త్రజ్ఞులు భ్రమయుచున్నారు. శీతాణువులును, ఉష్ణాణువులును సమ్మేళనము నొందినప్పు డందు అస్పృశ్యమగునది ఉష్ణాణువులయొక్క వర్ణము గాదనియు, శీతాణువుల వర్ణమే లోపించుచున్నదనియు ఋజువైనయెడల మన సూత్రము సిద్ధాంతమగును. అప్పు డది వివాదరహిత మగును. ఒక స్థిరమగు పరిమాణముగలిగి నియమానుసారము వర్తించు కణములు గలవు. వానికి అణువులని పేరు. శీతాణువులును ఉష్ణాణువులును కలిసినపుడు వానియం దేర్పడు రంగును రసాయనిక శాస్త్రజ్ఞులు గుర్తించియున్నారు. వాని నిట పేర్కొని మన సిద్ధాంతము ఎట్లు నిర్వివాదముగా సరిపోవుచున్నదో చూపెదను.

**1.** కాల్షియం క్లోరైడ్ (Calcium Chloride) ఇందు రెండు భాగములు సున్నము, 2 భాగములు క్లోరైడ్ ($C._2$ C. $L._2$)

కలిసియుండును. ఉష్ణస్వభావముగల సున్నముయొక్క తెలుపు వర్ణమే యిందు గలదు. క్లోరైనుయొక్క పసుపుకలసిన ఆకుపసపువర్ణ మిందు లేదు.

2. మెగ్నిషియంక్లోరైడ్ (Magnesium Chloride $Mg. Cl._2$) మెగ్నిషియంయొక్క తెలుపురంగే యిందును.

3. పొటాసియం క్లోరైడ్ ((K. C. L.) వేడిస్వభావముగల పొటాసియంయొక్క తెలుపురంగే యిందును.

4. అర్జెంటిక్ క్లోరైడ్ (వెండి క్లోరిన్ (Ag. CL) వెండివంటి తెలుపురంగే యిందును.

5. పాదరసము క్లోరైడ్ ($Hg_2 Cl_2$) ఇదియు తెలుపే.

6. ఆన్టిమొనీత్రి క్లోరైడ్ ($S. B Cl_3$) ఇదియు తెలుపే.

7. హైడ్రోక్లోరికామ్లము (H. C. L.) హైడ్రిజమువలె పారదర్శకముగా నుండును.

8. హైడ్రోజన్ అయోడిన్ (H. L) అయోడిన్ నీలి వలుపుకలసిన రంగుగలిగినదైనను దీని రంగుమాత్రము వేడియైన హైడ్రిజముయొక్క పారదర్శకతయే.

9. హైడ్రిజన్ బ్రోమిడ్ (H B) బ్రోమిన్‌యొక్క మెరుపు రంగుగాక హైడ్రిజముయొక్క పారదర్శకతయే యిందును.

10. మెగ్నిషియంద్విక్లోరైడ్ ($Mg. C L_2$) మెగ్నిషియం యొక్క మెరుపురంగే యిందును.

**11.** ఆరస్ ఆక్సైడ్. బంగారము, ప్రాణవాయువు, దీని సంక్షిప్తలేఖనము (A Uo) ఇందు బంగారముయొక్క పసుపును ప్రాణవాయువుయొక్క నీలమును గలసి ఆకుపసుపు రం గేర్పడును. కాన వాని కలయికయు జంటలుగానే యుండును. ($A U_2 O_2$)

12. పొటాసియం ద్విసల్ఫేటు ($K_2 S_2$) నారింజపండు రంగుగ నుండును. పొటాసియం నందలి మెరుపురంగును సల్ఫేటు యొక్క పసుపురంగును గలసి పై రంగేర్పడిన ట్లున్నది.

13. పొటాసియంకార్బొనేటు ($Co_3 K_2$) పొటాసియం వలెనే తెల్లగా నుండును. కార్బన్ (అంగారము) నందలి నలుపును, ప్రాణవాయువు పొటాసియంలోనికి తరిమినట్లున్నది.

**14.** సోడియంకార్బొనేటు ($Co._3 N A_2$) ఇందును పైవలెనే తెల్లని సోడియపు టణువులే దృశ్యమగు చున్నవి. వాడుకలో నున్న లవణము సోడియం క్లోరైడ్ మొదలగు ననేకముల జూపింపవచ్చును; మన సిద్ధాంతమును స్థాపించుట కివి చాలును. ‘ తేజోవర్ణ శాస్త్రము ’ నం దిది విపులముగా చర్చింపబడినది.

పదునెనిమిదవ కిరణము.

# కాంతశక్తితోడిమర్దనము

మర్దన మనిన తోడనే సాధారాణముగా నుపకరణములతో ఘర్షణతోఁగూడిన రుద్దుట, రాయుట అను దానికి వాడబడుచున్నది. కాని పిసుకుటచేతను చఱచుటచేతను తత్త్వమును త్తేజింపఁజేయుటకు మర్దనయని పిలుచుట లెస్స. అజ్ఞానయుతమగు పూర్వాభిప్రాయమునందు ఈ పదమునకు కేవలము ఘర్షణయు రుద్దుటయు ననియే అర్థముగా గ్రహింపఁబడుచున్నది. దీనిని కొయ్యతో చేయవచ్చును. ఉత్తేజితమగు మానవహస్తముతోను చేయవచ్చును. చలనచికిత్సాప్రవీణ్యము గలిగి సుప్రసిద్ధుడగు డాక్టరు జార్జి. ఎచ్, టెయిలర్ గారిట్లు తన మర్దన చికిత్సాగ్రంథమున వ్రాసిరి. నాడీమండలమునకు మర్దనవలని ప్రయోజనమునుగూర్చి యందిట్లు వ్రాసిరి. "ఏ జాతియొక్క భయమైనను, అభివృద్ధియైనను అది తిను నాహారముపై నాధారపడియున్నది. నాడులయొక్కయు, కండరములయొక్కయు, నితర అవయవములయొక్కయు ముఖ్యగమనములన్నియు కణజీవమునుండియే గలుగుచున్నవి. కనుక మర్దనయందు గలుగుచున్న చలనమంతయు కేవలము యాంత్రికమే; కనుక అది యెట్లు గలిగింపఁబడినది అను విషయమంత ప్రధానవిషయముగాదు"

ముఖ్యమగు కాంతశక్తియొక్క అభ్యాసమునందు గలుగుచున్న వందలు వేలకొలదిఅనుభవములకు భిన్నముగా నీ

పైవివరము మనేక పదములతో నిరాకరింపఁబడినది. ఇదియును అసత్య సిద్ధాంతముల సారమై యున్నది. కాంతశక్తి నాడులను, కండరములను బలుపుజెందించి, ఆ సుగుణమును స్థిరముగా నుంచుటలో నద్వితీయమైనది.

ధాతుసంబంధమగు గమనమంతయు కణముల (Cells)లో నున్నదనుట, ఆవిరియంత్రముయొక్క శక్తిఅంతయు బాయిలర్ (నీరు ఆవిరిగా మారుభాగము) లోనే యున్నదనుట వలెనే నిరర్థకమైనది. నీటిని ఆవిరిగామార్చునట్టి అగ్నిని గూర్చి యిందేమియు ప్రస్తావింపఁబడలేదు. ఈ గ్రంథాదిని వివరింపఁబడివిశ్వమునం దంతటను వ్యాప్తమైయున్న సూత్రము డాక్టరుగారికి తెలిసియున్నచో నీ పొరపాటు పడెడివారు గారు. ఆ సూత్రమిది :—"శక్తి ద్విపక్షమైనది. అందొక భాగము స్థూలమగు పదార్థము, రెండవపక్షము సునిశిత మగు చైతన్యము" గ్రంథాదిని నాడీశక్తులును ద్రవములవలె ప్రవహించుననియు, నవి మెదడునందును, నాడులయందును గల కణములందు చైతన్యమును గలిగించుననియు వివరించి యున్నాను. ఏ శక్తి గలుగుటకైనను తినిన పదార్థములే కారణ మని డాక్టరుగారు జెప్పియున్నారు. అట్లనుటలో నాతడు విశ్వవ్యాప్తమగు నొకప్రధానసూత్రమును గమనించుటలో సుఖనిద్రఁ జెందియున్నాడు. వృక్షజాతి యంతయు అసంఖ్యాకములగు తమ సూక్ష్మరంధ్రములతో నమితమగు సూర్యతేజమును పీల్చుచున్నది. అత్యంతబలకరమగు నాహారము నొసంగినను, చైతన్యకరమగు సూర్యకాంతిగాని చల్లని

గాలికాని నిరాకరింపఁబడినయెడల నానాటికిని దిగనాసిల్లి మానవులు మరణింతురు. జీవితములో సగముభాగము రోగముతో తీసికొనుచుండిన వారికి కొందరు మనుష్యులు చేతితో తాకినంతనే రోగనివారణము జేయగలిగియున్నారు. సంకల్పమాత్రమునను రోగనివారణ చేయగలరు. ధాతువర్ధకములగు శీతశక్తులును, ఉష్ణశక్తులును వారియందు నిహితమైయున్నవని గోచరించుటలేదా?

**1874** వ సంవత్సరములో బోస్టన్ నగరమున లోయల్ సంస్థయందు, నాడీశక్తిని గురించి సుప్రసిద్ధులగు డాక్టరు బ్రౌన్ సిక్వార్డ్ గారు **6** ఉపన్యాసముల నిచ్చిరి. నాడీశక్తి నాడులకు వెలుపల నెచటను లేదనియు జంతుకాంతశక్తి కిది చావుదెబ్బ యనియు నం దతడు వివరించెను. 'జంతుకాంతశక్తికి చావుదెబ్బ' యని న్యూయార్కు నగరమునందలి సుప్రసిద్ధ వార్తాపత్రికలో నొకదానియందు ప్రతిధ్వనింపజేసిరి. ఈ విషయ మింతమాత్రముననే సిద్ధాంతమయినట్లు దీనికి భిన్నముగా **10** వేల రుజువుల నీయవచ్చును. ఇవి యన్నియు మన చుట్టు ప్రక్కల జరిగినవే. ఒకపండితుఁ డేదో చెప్పినాడు; పత్రికలన్నియు దానిని సిద్ధాంతముగా గ్రహించినవి. అంతే, ఒకనిపై నింకొకఁడు తన శక్తిని బఱపినప్పు డది మనస్సు యొక్క పనియనిగాని ఊహయొక్క పనియనిగాని భావించుట లాతలనాటిమాట. కేవలము మనస్సు పనిచేయదగిన పరికరము లేనిదే దేనిద్వారా పనిచేయును? ఇదెట్లున్నదనగా సూర్యునివలన వృక్షజాతియంతయు ప్రాణవంతమగుచున్నది.

ఇక సూర్యకాంతి లేనట్లైనా? ఒక తీగె వెంట సముద్రగర్భము గుండ వార్త పంపఁబడినది. ఇక విద్యుచ్ఛక్తి లేనట్లైనా? మన శ్శక్తి పునఃపునః పనిచేయుటవలన కొంత భాగము వాచుటయు, వేడి యెక్కుటయు గలదు. ఇక మనశ్శక్తిగాని, కాంతశక్తిగాని వ్యాపించుటకు వీలగు వైహాయసములు లేవన్న మాటయే డాక్టరుగారి ధోరణిప్రకారము తేలుచున్నది. నాడీశక్తిపై డాక్టరు బార్జిసిక్వోర్డ్ గారు యిచ్చిన యుపన్యాసమునకు జవాబుగా 'ధాతుకాంతశక్తి శక్తికి ఆధారమ'ను వ్యాసమును రచించి పంపితిని.

తరువాత కొంతకాలమునకు ఒక ఫ్రెంచి పెద్దమనిషి, డాక్టరు బార్జిసిక్వోర్డ్ గారు కాంతశక్తిని గూర్చిన తన యభిప్రాయమును మార్చుకొనెనని నాకు తెలియఁబఱచెను. తరువాత నాతడు మానసికశాస్త్ర పరిశోధనలయం దత్యధికమగు నభిరుచిని గలిగియుండెనని తెలిసినది. నిజమునకు ఫ్రాన్సు మొదలగు నైరోపీయదేశములం దీ కాంతిశక్తి ప్రజలను మిక్కిలి వశపఱచుకొను చున్నది. వైద్యులును ఒక శతాబ్దము దాని నపహాసించిరి. ఇప్పుడు వారికని దానియందు మిక్కిలి యభిరుచి గలిగినది. డాక్టరు బ్రెయిడ్ గారిచే కనిపెట్టఁబడిన దానిని 'మనోవశ్యశాస్త్ర' మనుపేర వారు వాడుచున్నారు. ఇంతకాలము జంతుకాంతశక్తి, మనశ్శక్తి భ్రమ మాత్రములుగా నిరసించిరి. ఇప్పుడు దానినే నమ్మిన యెడల బాగుండదని కాబోలును మనోవశీకరణశక్తియను నూతనమగు పేరుతో దానినిఁ బ్రచారముఁ జేయుచున్నారు.

కాలముక్రిందటనే ఇంగ్లండునందు ఘనుడగు డాక్టరు ఎల్లి యస్ టర్ గారును, ఎడింబరా విశ్వవిద్యాలయ సంబంధులు నగు జర్మనీపండితులు, ఇతరులును తమవిజ్ఞానమును, అనుభవములును ఇందున కుపయోగించిరి. అమెరికాయందు దశ శతాబ్దమునుండి యీ విషయమును మిక్కిలిగా పెంచిరి. అజ్ఞానవశమున ప్రజలను బలియిచ్చుచున్న మందువైద్యులే విషయమును పెంచుచున్నవారిని నిరసించుటలో గడుపుచుండిరి. వారి కీశక్తులు తెలియవుగద!

అకటా! నేటి దౌర్భాగ్యపు విద్యవలన, పాతపుంతలను నడచుటయేగాని నవీనమును, సత్యమునునగు విషయములందు బుద్ధిని చొరనీయకుండునట్లు విద్యార్థులు తయారు చేయబడుచున్నారు. అందువలన సార్వజనికమై, గౌరవప్రదముగా భావింపఁబడువానినే వారవలంబింతురు. ఇక దైవికమగు సత్యములు అడుగుకొని తినవలసినదే.

2. యూరపియను దేశములందు మానసిక శాస్త్రము:
జర్మనీ దేశమునందలి వైద్యాలయములందు మర్దనచికిత్స చిరకాలమునుండియు వాడఁబడుచున్నది. మానసికశాస్త్ర సంబంధమగు పరిశోధనలందు వారియభిరుచి మెండగుచున్నది. ఫ్రాన్సు దేశమునందలి ప్రకృతిశాస్త్రజ్ఞులు ప్రత్యేక మీ విషయమునందే చురుకుగాఁ బనిచేయుచున్నారు. ఈ క్రింది వృత్తాంతము పారిస్ నగరమునుండి 'న్యూయార్కు హెరాల్డు' అను పత్రికకు తంతిచేయబడినది.

"డాక్టరు చార్కొట్ (Dr. Charcot) గారి ఆజ్ఞానుసారము వారి యనుచరులగు డా. బాబిన్స్కీగారు (Dr. Babinski) సాల్పెట్రిరీ (Salpatriri) ఆసుపత్రియందు మనోవశ్యమునందు కొన్ని అసాధారణములగు పరిశోధనల జేసిరి. మందువైద్యమునందు ఊహించుటకు సాధ్యముకాని ఫలములఁ గాంచిరి. దానివలన ఫ్రెంచిసంఘమునందు అత్యంతానుభవము కలిగినది. కాంతశక్తివలన నొకరి నుండి వేరొకరికి కొన్ని నాడుసంబంధమగు మార్పులు గలిగింపవచ్చునని పై పరిశోధనలవలన ఋజువైనది. మూగ, కాళ్ళుచేతులు చచ్చుబడుట, తీవ్రములగు నొప్పులు, మొద లగునవి నివారింపవచ్చును. ఈ స్వాస్థ్యములు మొదటచూచిన తోడనే ఇంద్రజాలములని తోపవచ్చును. బైబిలునందలి క్రొత్త నిబంధనలో వివరింపఁబడిన మాహాత్మ్యముల కివి సరి తూగును. "పారిస్ నగరపు పత్రికయందు నీ పరిశోధన లకు సంబంధించిన వృత్తాంతము అతిశయోక్తులతోడను, న్యూనోక్తులతోడను విపరీతముగాఁ బ్రచురింపఁబడినవి. ఈ వృత్తాంతములకు మూలకారణమగు ప్రదేశమునకుఁబోయి చూచుటకు నిశ్చయించుకొంటిని. సెయిన్ జెర్మెయిన్ బొల్వల్ అను ప్రదేశమునందలి దివ్యభవనమునందలి డాక్టరు చార్కొట్ గారిని దర్శించితిని.

"వెంటనే ఒకసేవకుఁడు నన్నొక పెద్దగ్రంథాలయములోనికిఁ బ్రవేశపెట్టెను. ఒకచివర పెద్దదై సుందరమైన శిరస్సును, 1 వ నెపోలియన్‌ను మిక్కిలి పోలియున్న 60 సంవత్సరముల

మనుష్యునిఁ జూచితిని. అతనికి గ్రద్దముక్కువంటి నిడుపైన నాసిక కలదు. పెదవులు బాగుగ నొక్కబడి అతనికిగల నైశ్చల్యమును సూచించుచుండెను. డేగకన్నులవంటి యతని కన్నులలోనుండి సుతీక్ష్ణమును, నిశితమునగు చూడ్కులు వెడలుచుండెను. నల్లని పట్టుదారముతో కట్టఁబడిన కంటిజోడునం దుండి యా దృక్కులు వ్యాప్తము లగుచుండెను. మానవుల నాడులనుగురించిన పాండిత్యమునం దత్యుత్తమాధికారియైన డాక్టరు చార్కట్ గారిని చూచుటకు నా కదే మొదలు. నన్ను ఆహ్వానించుట కాతఁడు లేచుటతోడనే గారడివలె యతని యందలి నైశ్చల్యము తొలగిపోయెను. చిరునవ్వులతోడను, బహుమానముతోడను నన్నతఁడు స్వీకరించెను. అతని ధ్వని మృదువై, మంజులమై యుండెను. నాడీనిద్రనుగూర్చిన శాస్త్రమునందు నూతనాభిరుచి యీ పరిశోధనలవలన గలిగినది. ఇప్పుడు నాగరకులగువారి కచేరీచావడులయందెల్ల నీ శాస్త్రమునుగూర్చి 'జేమ్సుబ్రెయిడ్'గారిచే రచింపఁబడిన గ్రంథముండుచున్నది. దానికి బ్రౌ౯సిక్వర్డుగారు పీఠిక వ్రాసిరి. నిజమునకు మనోవశ్యతత్త్వ శాస్త్రము నేటికాలమున మానసోద్రేకకరమగు విషయమై యున్నది.

అనేక సంవత్సరములనుండి అమెరికా మొదలగు దేశములలో చేయఁబడుచున్న పరిశోధనలకంటె నిచ్చట చేయు పరిశోధనలు గుణతరములు నసమానములును అయియున్నవి. వానిని ఈగ్రంథముయొక్క వేరొక భాగమున వివరించెదను.

3. కాంతశక్తితోడి మర్దనము: నందు నాడులలోనికిని, రక్తవాహికలలోనికి చొరబారు స్వభావము గలిగిన సునిశితమగు ప్రాణతత్త్వమగు కాంతశక్తి యుండుటవలన, అట్టి మర్దనమువలన గలిగిన ఫలితములు శాశ్వతములై, దేహమున కత్యంతశక్తి దాయకములై యుండును. శక్తితత్త్వమును గురించి వ్రాసినపుడివి వివరించియున్నాను.

డాక్టరు టెయిలర్ (Dr. Taylor) కాంతశక్తితో సంబంధము లేని యంత్రములతో పరిచయముగలవాడు. చలనచికిత్స (అనగా అవయవముల కదలికవలన రోగముల నివారించుట) నతడభ్యసించెను. కాంతశక్తితోడి మర్దనమునందు సునిశితమగు శక్తి మర్దనచేయువారినుండి ప్రవహించునని యతనికి దెలియనట్లున్నది. శక్తిదాయకములగు మర్దనచికిత్సలకు తోడు పడున వేవియు లేవనియు, మానసికశక్తి యేమియు వృద్ధికాదనియు, దానివలన నొప్పి తాత్కాలికముగా తగ్గునేగాని, మూలమట్లే నిలిచియుండుననియు నతఁడు ప్రకటించెను. శక్తి దాయకమగు కాంతశక్తిగలవారి తేజశ్చక్రముఁ కాంతశక్తిగల వారి దేహమునుండి వెలఁవడునట్టియు, మామూలు కన్నులకు గానిపింపనట్టియు వర్తులాకారమైన కాంతిపుంజము దృశ్య ప్రపంచమునందలి యే యితర చికిత్సావిధానము కన్నను నెక్కువ ఫలవంతమును, శాశ్వతమును నగు స్వాస్థ్యమొం గూర్చునను సంగతి ఆతనికి దెలియదు. దీనిని మీరిన మొడల సూర్యకాంతి మీరవచ్చును.

4. కాంతశక్తిప్రసారమునకు నిదర్శనములు :-మానవ దేహమునుండి బయలు దేరినవియు, దేహముచుట్టును వ్యాపించియున్న కాంతికిరణములు సమీపములోనున్న వస్తువులను, మానవదేహమునందును మార్పులు గలిగించు ననుటకు అనేక నిదర్శనము లున్నవి. (1) సునిశితస్వభావముగల యీ



35 వ పటము

కాంతశక్తిగలవాడు.

కాంతికిరణములను గ్రహింపఁగలరు. వచ్చువానిని జూడకయు, వినకయు నతడెట్టివాఁడైనది వారు యూహింగ దెలుపఁగలరు. (2) దేహమునందుండి స్థూలదృష్టికి కానిపింపని చెమట గలుగును. అనగా దేహమునందుండి మాలిన్యములు వాయువులో చేరిపోవును. ఆస్వేదమునకు విలక్షణమగు వాసనయు నుండును. ఆ వాసనయు గుర్తింపననువై యుండును. (3) అన్ని

వస్తువులయందును, వానినుండి వెలుపటికిని, శీతఉష్ణవైహాయసములు ప్రవహించుచుండును. దానివలన రాసాయనికమగు మార్పులు గలుగుననియు నిదివరకె వివరించియున్నాను. (4) వైద్యుతము, రాసాయనికము, ప్రాణికమునగు ఉద్రేకములు గలిగినపుడు, వస్తువులనుండి బయలుదేరిన ప్రసారములను, వేలకొలదిమానవులు చూడగలిగియుంటున్నారు. అనుభవించుటయు కలదు. కాంతికిరణముల వలెనే యివియును అన్ని వైపులకును ప్రవహించుచుండును. కాంతశక్తిగలిగి, దైవికావేశము గలవారి శిరస్సు చుట్టును అసాధారణమైన కాంతికిరణములు బ్రసరించుచుండును. దేహముయొక్క చివరలను, అందు ముఖ్యముగా వ్రేళ్ళకొనలయందీ శక్తి విద్యుచ్ఛక్తివలెనే



36 వ పటము
డోర్ అనువారు వ్రాసిన యేసుక్రీస్తు పటము.

మిక్కిలి జిగి కలిగియుండును. నామట్టుకు నాకాంతశక్తి నా వ్రేళ్లచివరనుండి దేహముపై నెచ్చటనైనను వ్యాపింప

జేయ ననువై యుండును. అట్లే కొంతసేపు ప్రసరింపఁజేసిన యెడల చచ్చుబడిపోవును. వానియందుండి అంత ధాతుశక్తి వెడలిపోవును.

అందువలననే చేతులు, వ్రేలికొనలు కాంతశక్తిని వ్యాపింపఁజేయు సాధనములై యున్నవి. కనుక రోగనివారణమునకు హస్తమును రోగగ్రస్తమగు భాగముపై చలింపఁ జేయుట మిక్కిలి గుణతమమైన విధానములలో నొకటి. ఇట్లుచేయుటకు 'హస్తచాలన'మని పేరు. 35వ పటమునందు దేహమునందుండియు, శిరస్సునుండియు సూటిగఁ బ్రసరించు కాంతికిరణముల రీతిని నూహింపవచ్చును. వలయములవలె నుండు కాంతశక్తి సంబంధమగు కిరణములును గలవు. అవి యిందు వదలివేయబడినవి. 'తేజోవర్ణశాస్త్రము'నందివి వివరింపఁబడినవి. (Principles of Light and Color, Page 481). 36 వ పటమునందు సుప్రసిద్ధ చిత్రలేఖకుఁడు గుడోర్ భావించి వ్రాసిన యేసుక్రీస్తుశిరస్సు గలదు. శిరస్సుచుట్టును కాంతి పరివేషము (Halo of Light) చిత్రింపఁబడినది. అన్ని కాలములందును ఋషులయొక్క పటములిట్లే చిత్రింపబడుచు వచ్చినవి. ఆంతరంగికమగు నీ కాంతిని, వర్ణమును చూడ గలవారును అన్నికాలములందును గలరని గ్రహింపవలెను. ఈ తేజఃపరివేషము ధాతుశక్తికి చిహ్నమై యున్నది. ప్రతి దేహమునందసంఖ్యాకములగు రాసాయనికగమనములును, ధాతుకాంతశక్తులును, విద్యుత్ప్రభవయంత్రములును గల

వసియు, వైహాయసశక్తులు వ్యాపించువిధమును వర్ణించి యుంటిని.

5. కాంతశక్తిగలవారివంకకు సునిశితతత్వముగలవారు ఆకర్షింపఁబడుచున్నారు :— కనుక నీధాతుసంబంధమగు వైహాయసములును కాంతశక్తి గలవనుట తెలిసికొనవచ్చును. వారిచేత కాంతశక్తి ఆరోపింపఁబడిన బెత్తములు (మాంత్రికుని పేపబెత్తములు హిందూదేశమునను బ్రసిద్ధి) మొదలగునవినయితము సునిశితతత్వముగలవారి నాకర్షించును. ఇక్లీగద అయస్కాంతము, లోహ (ఇనుము) సంబంధము లగువానినెల్ల నాకర్షించుచున్నది. కాంతశక్తిగల స్త్రీపురుషులు, పల్లెత్తుమాటైనన పలుకకయే తమవంకకు నితరుల నాకర్షింతురు. తమయందలి మనోవశ్య సంబంధమగు వలయమైన శక్తిని వా రిచ్ఛామాత్రముననే ప్రయోగింపఁగలిగియుందురు. ఒకతూరి ప్రొఫెసరు కాడ్వెల్ (Prof. Cadwell) మానసిక విద్యాప్రదర్శన మిచ్చుచుండెను. ఒక బెంచీమీద నున్న పోగరుబోతులగు పడుచువాం డ్రది యంతయు మోస మని యల్లరిజేయ నారంభించిరి. అత డా బెంచీయొద్దకు బోయి తనశక్తిని వారిమెదడులగుండ బ్రయోగించెను. అంతట గందరగోళ మాగిపోయినది. కనుక మోటైన మనుష్యులకు మోటుజాతి కాంతశక్తినే ప్రయోగింపవలయు నని యతఁడు తెల్పుకొనెను. అప్పటికి వారు లోబడుదురు. ఉద్రేకించియున్నప్పుడు వైహాయసశక్తులును కాంతశక్తియందువలెనే సవ్యాపసవ్యములగు వలయములుగా నేర్ప

డును. కనుక నీ శక్తులను జంతుకాంతశక్తియనియు, మనః కాంతశక్తియనియు, ధాతుకాంతశక్తియనియు, సౌరకాంత శక్తియనియు, లోహసంబంధమగు కాంతశక్తిని పేర్కొన వలసినచో అయస్కాంతశక్తి యనియు పేర్కొనఁదగి యుండును.

6. నామకరణము:—మర్దనచికిత్సనుగూర్చి నేను వివరించి నప్పుడు ధాతుశక్తులు ప్రయోగింపఁబడు ననియు; అవి అయ స్కాంతశక్తులకన్న భిన్నమైనవనియు, గ్రహించితిని. మాన సిక మర్దన, మానసికమర్దకుఁడు అనునవి మనస్సు అనగా జీవము; మర్దన చేతితో చేయునది; అనుపదముల సమ్మేళ నముచేత నేర్పడి మనస్సు, దేహము అనువానితో చేయు మర్దనను బోధించుపదముగా నేర్పడును. మానసిక మర్దన = దేహముతోను మనస్సుతోను చేయు మర్దన యగును. అణు వుల తత్వమును, వైహాయసశక్తుల తత్వమును, సూక్ష్మముగా నేను పరిశోధింపగా పరిశోధింపగా, మానసిక శక్తులును అయస్కాంతశక్తులవలెనే నిజమైనవనియు, కాని యింకను మానసికశక్తులు సునిశితతరస్వభావము గలవనియు గ్రహించి తిని. అందువలననే దానికి మనశ్శక్తి, మనః కాంతశక్తి (Psycho-magnetism) అని పేరు పెట్టితిని. ఆత్మశక్తి యని నప్పుడు ప్రకృతికి అతీతమగు శక్తి యని యర్థము. కాని ప్రకృతి లేనిదే ఆత్మశక్తి యెట్లు గ్రహింపవీలగునో బోధ పడుటలేదు. ఆత్మ భౌతికమగు మెదటితో కలసిననేకాని మన స్సనునది గలుగదు. ప్రకృతి లేనిదే ఆత్మకు గతియే లేదు. అది

యెట్లుండునో మన మెఱుగము గూడను. మానసిక చికిత్స యను మాటకు ఒకవిధమగు జీవచికిత్స యని యర్థము. మానసిక చికిత్సకుఁడనుమాట ఆత్మచికిత్సకుఁ డను మాటకన్న శ్రేష్ఠమైనది. మర్దన యనుమాటకు రుద్దుట, చఱచుట, పిసుకుట అని యర్థము. ఇట్లు మర్దనచేయువానికి మర్దకు డని పేరు. ఇతఁడు యాంత్రికముగ మాత్రమే పనిచేయును. రోగియందున్న విద్యుచ్ఛక్తి యొకింతమాత్రమే దానివలన కదలబారును. ఇందు దైవికమగు ప్రాణాగ్ని లేదు. దానివలననేగాని నాడీశక్తియొక్కయు, రక్తము యొక్కయును మూలములు కదలింపఁబడవు. కాంతశక్తి గల మర్దకుడు నిజముగా నుదాత్తమానవుడు. ప్రతిభావంతు లందరివలెనే, యతఁడు తనకు దైవసంపత్తిగలదని యెఱిఁగియుండి, తనయెదుట నున్న దౌర్భాగ్యుడును, బలహీనుఁడును నగు రోగిని నుద్ధరింప వేచియుండును.

7. అశాస్త్రీయ పద్ధతులు:— మర్దకుఁడుగా నుండవలయు నెడల 2 సంవత్సరములు ఆవిద్య నభ్యసింపవలసియుండు నని ఆధునికుఁడగు నొకరచయిత ప్రచురించెను. ఆ శాస్త్రమును గురించిన విషయములను సత్యముగను, శాస్త్రీయముగను క్రమపరచుకొనకపోవుట యిట్టి పొరపాటగు అంచనాకు కారణమైయున్నది. జీవసంబంధమగు గమనమునకు సంబంధించిన ప్రధానసూత్రముల నెఱుంగకుండుటవలన నీ ప్రమాదము గలిగినది. ఒక్కొక్క వైద్యకళాశాలలో విద్యార్థులు 2,3,4 సంవత్సరములు విద్య నేర్చుకొందురు. అది

బాగుగ నడచుచున్నదని భావింపఁబడుచుండును. కాని రసాయనశాస్త్రము, శారీరశాస్త్రము, రోగనిదానశాస్త్రము, చికిత్సాశాస్త్రము - వీనిని గురించి అన్యోన్యసంబంధముతోడి బోధనవలన వారీశాస్త్రములను ఒక్క సంవత్సరములోనే నేర్వఁగలిగియుందురు. మరియు 2,3,4 సంవత్సరముల విద్య నేర్చినవారికన్న ఆచరణయందు, ఉపయోగమునందును గుణతరులుగను నుందురు.

8. అసత్యసిద్ధాంతములు:— బోస్టన్ నగరవాసియగు ఎడ్డీ యను నామె యిట్లు వ్రాసినది:—"దుడుకగు మానవుల యిచ్ఛవలననే ఉష్ణమును, జంతుకాంతశక్తియుగల మర్దకుడు తన రోగులను స్వస్థపఱచుచున్నాడేగాని సత్యముచేత గాదు. ఆ రోగియొక్క స్వాస్థ్యమైనను శాశ్వతముగా నుండునా? లేదు. జంతుకాంత చికిత్సతరువాత చెడుఫలములే గలుగును."

—ఆరోగ్యశాస్త్రము.

మూడువారములకు సరిపడు పాఠములకు 300 డాలర్లు వసూలు చేయు అమ్మగారియొక్క వ్రాత లివి. విశ్వవ్యాప్తములగు అనంతశక్తుల నామె విస్మరించుచున్నది. మనస్సే అన్నిటికిని బ్రధానమనుచున్నది. తా నవలంబించుచున్న ఒక్కమానసిక చికిత్సయందే ఆమె నిమగ్నురాలై యున్నది. శాశ్వతఫలదములైన జీవకాంత్యాది యితరవిధానములచే గలిగిన స్వాస్థ్యముల నామె గ్రుడ్డిదానివలె చూడ మానుచున్నది. దుడుకగు నిచ్ఛ మానసికచికిత్సయందే ప్రయోగింపఁబడు

నుగాని, కాంతశక్తి గల మర్దకుఁ డెప్పుడు నట్లు వర్తింపఁడు. మానసికచికిత్స, విశ్వాసచికిత్స, ప్రార్థనచికిత్స—వీనియం దెల్ల సాధారణముగా కాంతశక్తితో తేజః పరివేషము ప్రయో క్తనుండి రోగికిఁ జేరును. అస్పష్టములైన అనేక యితర సిద్ధాంతములు, ఈ సునిశిత శక్తులనుసరించి చెప్పఁబడు చున్నవి. వైహాయస అణుసూత్రముల నెరిగినవారికి మాత్ర మీ విషయము సులువుగనే బోధపడును. విస్తరమక్కరలేదు.

9. జీవ (ప్రాణ) కాంతశక్తి మానవుల కింత మేలు జేయ శక్తి గలిగియుండుటకు హేతువేమి? అసంఖ్యాకము లగు మానవ తత్వములందు నాడీశక్తి చెడిపోయినది. శక్తి హీనమైనది. బలహీనమై రోగగ్రస్తమైనది. కాంతశక్తి అత్యం తముగా గల మర్దకునివలన నా ప్రాణప్రవాహములు వారి నాడులయందు నింపఁబడి రక్తమునందు మంచి కదలిక గలు గును. నాడులయం దుద్రేక ముండి, సమత్వము చెడిపోయి యున్నవారి నాడులయందలి యుద్రేకము లాగివేయఁబడి సౌమ్యత గలిగింపఁబడును.

10. కాంతశక్తియందు విశ్వాసమును, భావమునే ప్రధానమని కొందరందురు. అదియే నిజమైనయెడల భావిం చుటయు, విశ్వసించుటయు నేమో యెరుగని అడవిజంతువు లును, మచ్చికలేని పక్షులును, గుఱ్ఱములును ఈ కాంతశ క్తిచే లోబడిపోవుటకు హేతువేమో వివరింపవలసియున్నారు. భావనాదు లెఱుఁగని శిశువులకు, పెద్దలకు స్వాస్థ్యము కలిగి నంత కాలములోనే స్వాస్థ్యము గలుగుచున్నది. కాంతశక్తి

యం దెట్టి శక్తియును లేదని రూఢిగ నమ్మువారికి సయితమిద్దానివలన స్వాస్థ్యము కలుగుచున్నది. భావనగాని విశ్వాసముగాని లేనివారైనను కాంతశక్తి గలవానియెదుట నుండిన మాత్రముననే స్వాస్థ్యము గలిగినవారును గలరు. దీని కేమి కారణము? సునిశితమగు నీశక్తుల ప్రయోగము లేకయును, విశ్వాసమువలననే గొప్ప స్వాస్థ్యములు గలుగుచున్నవి. ఇందుల కేమి హేతువు?

ఇచట కాంతశక్తితోడి మర్దనకు గొన్ని సామాన్య నియమముల బేర్కొనెదను. వివిధవ్యాధుల కెట్లు చికిత్స చేయవలసినది, తరువాతభాగములందు విశేషముగా వివరింతును.

**11. రోగి యెట్లు పరుండవలెను?** :— వంకరలు లేక బారుగా పరుండవలెను. అట్లైన చేయుచికిత్సను స్వీకరింపననువై యుండును. పడకకుర్చీలో పరున్న మంచిది. మంచము మీదగాని పరుపుమీదగాని పరుండబెట్టవచ్చును. కుర్చీమీదగాని, పరుపుమీదగాని పరున్నవానికి కుడివైపుననుండి చికిత్స చేయవలెను. రోగియొక్క శిరస్సు ఉత్తరపుదిక్కుగా నుంచిన యెడల భూమిసంబంధమగు విద్యుద్గమనమున కనుగుణముగా నుండును. అనగా భూమధ్యరేఖనుండి బయలుదేరిన వేడి వైహాయసములు పాదములకు తగులగా, ధ్రువమునుండి బయలుదేరిన శీతకిరణములు శిరస్సునకుఁ దగులును.

**12. కాంతచికిత్సాకాలమున వస్త్రములు తీసివేయవలెను** :— లేదా యేదైన వలుచని వస్త్రము ఒకటికన్న

నెక్కువగానైన నుండనీయరాదు. వస్త్రములమీదను నీ చికిత్స చేయవచ్చును. దానివలనను మంచి మేలే గలుగును. కాని కాంతశక్తితోగూడిన ప్రాణశక్తి కొంత వస్త్రముల వలన నరికట్టఁబడి వ్యర్థమైపోవును. స్త్రీలకు పురుషులును, పురుషులకు స్త్రీలును చికిత్స చేయవలసినను, శుద్ధ మనస్కు లగువారు దిగంబరముగా నుండవలసినను నెట్టి ఆడంబరమును జేయరు. మానవస్వరూపమును నిర్మించుటలో దేహమునందు కొంతభాగము బూతుగను, సిగ్గుపడవలసినదిగను నుండునట్లు భగవంతుఁడు నిర్మించినాడని తలచువారును గలరు. వారు ఆ భావములతోనే పెంచఁబడియున్నారు.

13. చికిత్స చేయవలసినవా రెవరు?:— రోగము లేని వారైనను మర్దనచేసి స్నేహితులకు మేలుజేయఁ గలిగియుం దురు. ఎవరి దేహములు చల్లగ నుండునో, యెవరి ప్రాణ శక్తులు చురుకుగా నుండునో; ఆరుబయటను, సూర్యకాంతి యందును దిరుగుచు నెవరు ప్రాణవాయువు నెక్కువగా స్వీకరించియుందురో; పొగాకు, నల్లమందు, మాంసము, సారాయి, వ్యభిచారము మొదలగు దురలవాటులచే దేహ మును చెరుపుకొననివా రెవరో వారుమాత్రమె కాంతశక్తి తోడి మర్దకులుగా నుపయోగింతురు. కాంతశక్తి నెక్కు వగా గడింపఁదలచినవారు దేహముపై వస్త్రము లేకుండ మంచి యెండలో దిరుగవలెను. ఎక్కువగా గాంతశక్తివలన నా శక్తిని స్వీకరించినవారైన నైయుండవలెను. వారివలన నుద్దీపనకరమగు శక్తులను స్వీకరించినవారైననై యుండవలెను.

తత్త్వములు సమరసమును బొందినవారు నుందురు. వారివలన చికిత్స బొందినవారి కెల్ల మేలే గలుగును. రోగి యొక్కయు, చికిత్సకునియొక్కయు తత్త్వములందు భిన్నత (విలక్షణత) యుండవలెను. అప్పుడు రోగియొక్కతత్త్వమునందలి ధాతువు లుత్తేజితము లగును. పురుషులకు పురుషులే చికిత్స చేయుట కన్న పురుషులకు స్త్రీలును, స్త్రీలకు పురుషులును జికిత్స చేయుట మంచిది. అట్లు చేయుటవలన అత్యంతమగు మేలు గలుగును. ఇంగ్లండునం దొక ఆసుపత్రిలో స్త్రీలకు పురుషులును పురుషులకు స్త్రీలును సీమర్దన చేయుచున్నారు. అమెరికాయందు సయిత మిట్లు చేయుటయే వాడుకలోనికి వచ్చుచున్నది. న్యూయార్కు - డేన్స్‌విల్లాలోని సంస్థయందు చిరకాలము పనిచేసి, యీ క్రిందివిషయమును ప్రచురించుటకు నర్హతను గడించిన డాక్టరు జేమ్సు సి. జాక్సన్‌గా రిట్లు చెప్పిరి:—

"ఉచితమైనంతవఱకు పురుషులకు స్త్రీలును, స్త్రీలకు పురుషులునే ఉపచారకులుగా నుండుట మంచిది. రోగగ్రస్తులైనవా రందరును నిది సరియైన అభిప్రాయమేయని యొప్పుకొనుచున్నారు. స్త్రీలు పురుషులను, పురుషులు స్త్రీలనే తమ ఉపచారము చేయుటకు గోరెదరు. ఇది యిట్లుండునని మామూలుగా 'అనుకొనుమాట' కాదు. అట్లే కోరుచున్నారు. మర్యాదకు భిన్నము గాకుండ స్త్రీలకు పురుషులును, పురుషులకు స్త్రీలును ఉపచరించుటయే మేలైనది."

కాంతశక్తి గలవారును, పురుషులు పురుషులకును, స్త్రీలు స్త్రీలకును మర్దనజేసినయెడల త్వరలో నీరసించి పోవుదురు. ఇది స్వానుభవమైన విషయము. స్త్రీలు స్త్రీలను, పురుషులు పురుషులను స్పృశించిన మాత్రముననే జలదరించి, బలహీనులగు వారును గలరు. అక్రమమగు విద్యను బొందినవారు ఇష్టు మర్దనచేయించుకొనుట కిష్టపడ రని నాకు తెలియును గాని యిది సాంఘికమగు అభివృద్ధి గలిగినకొలఁదిని అంతరించి పోగలదు. కాంతశక్తితోడి మర్దనజేయు నాతఁడు నిర్మలమగు మనస్సుతో, రోగియొక్క స్వాస్థ్యమే మనస్సులో నుంచుకొని మర్దన జేయువాడుగా నుండవలెను. లేనిచో నింకొకని సాయమును కోరవలెను.

14. మర్దనజేయవలసిన దేహభాగము: రోగగ్రస్తములగు భాగములేనేగాక మిగత భాగములనుగూడ మర్దనజేయవలెను. చర్మము, రక్తవాహికల చివరలగు కేశనాళికలును, నాడీమండల మంతయును, ఉత్తేజితము కావలెను. ఒక కంతియున్న దనుకొనుడు. అంతవరకే చికిత్సచేసిన, దేహమునందలి మాలిన్యముల నట్లనే వదలివేయుట యగును. అందువలన నితరములగు కంతులు వృద్ధి నంద వీలగును. విద్యావంతులగు వైద్యులు చేయుపని యిదియే. వారు కంతిని కోసివేసి మూల కారణమునుమాత్ర మట్లనే వదలివేయుదురు. వారివైద్య శాస్త్రజ్ఞాన మిట్టిదే! సున్నితతత్త్వముగల రోగులకుమృదువగు స్పర్శమాత్రమే చాలును. కాంతశక్తి గలవారి తేజశ్చక్రము మీద పడుచుండ, దూరమునుండి చేసిన హస్తచాలనమే

(చేతితో మంత్రించునప్పుడు చేయునట్లు చలింపఁజేయుట) చాలును. కాలికవ్యాధులు గలవారి కనేకులకు బాగుగా నుర్దింపవలసి యుండును. కాళ్లమీదను, చేతులమీదను, గుండ్డలు పిడుచునట్లు పిండవలసియు నుండును.

15. మర్దన, పాదములవద్ద ప్రారంభింపవలెను. అచట చైతన్యమును గలిగింపవలెను, పిసుకవలయును, సాగదీయవలయును, రుద్దవలయును, వేడి కలుగునట్లు చేయవలెను. అందువలన మెదడు, ఊపిరితిత్తులు, జీర్ణకోశము, ప్రేగులు, గర్భాశయము మొదలగువానియందత్యంతముగా జేరియున్న రక్తము క్రింది కాకర్షింపఁబడును. తరువాత కాళ్ళకును, అటుమీద ఉదరము, ఎదురురొమ్ము మర్దనచేయవలెను. తరువాత బాహువులు, చేతులు కందునట్లు మర్దనచేయవలెను. అవి యప్పు డుజ్జీవనముం బొందును. తరువాత చేతులు చన్నీటిలో ముంచి ఆ తడిచేతులతో శిరస్సును మర్దనచేయవలెను. కణతలమీదను పైనను నున్న వెంట్రుకల చన్నీటితో బాగుగా తడుపవలయును. మునివ్రేళ్ళతో కపాలమునంతయు నొత్తిడిగా నొక్కవలయును. శిరస్సు వెనుకభాగమును ముచ్చెల గుంటయును బాగుగా మునివ్రేళ్ళతో ముఖ్యముగా నొక్కవలయును. మెదటియొక్క ముందుభాగము అనగా నుదురునకు లోపలగానున్న భాగమునందలి యొత్తిడిని తగ్గించుటకు శిరస్సునకు శ్యామోదకమును వాడవలయును. అది లభింపనిచో చన్నీరే చాలును - వెండ్రుకలు బాగుగను, ఒత్తుగను నెప్పుడునుగను నుండగోరిన యెడలను, చుండు, పేను కొరుకు

మొదలగునవి పోవలయునెడలను కపాలములోనికి ధూమ్రోదక మును ఇంకునట్లు రుద్దవలయును. అప్పుడప్పుడు శ్యామోదకమును మార్చుచుండవలెను. కపాలమునందు చైతన్యము గలిగి, వెంట్రుకలు బాగుగా పెరుగుటకు నెవరికి వారైనను ఇట్లు చేసుకొనదగును. అప్పుడు శ్యామోదకముతో రుద్దుకొనుట చాల యుపయోగకరమై యుండును. శిరస్సునకుఁ గూడ మర్దనచేసిన తరువాత, రోగి బోర్లపరుండవలయును. తరువాత వీపుమీద సవ్యాపసవ్యముగను; పైనుండి క్రిందికిని గుండ్రముగను బాగుగా రుద్దవలయును; పిసుకవలయును. తరువాత వెన్నుపామునకు రెండువైపుల వ్రేళ్ళతో నొత్తుచు పైనుండి క్రిందికి జరుపవలయును. తరువాత వెన్నుటెంటనున్న నాడులయందలి ముడులను ఒత్తుటవలన రక్తప్రసరణము నయితము బాగుపడును.

16 నాడులయందలి యుద్రేకమును తగ్గించుటకు :— మెదటినుండి అన్నివైపులకును వెలుపలికి హస్తచాలనముల జేయవలయును. దానివలన మెదటికి అధికముగా జేరుచున్న జ్ఞానసాడీశక్తులు తగ్గిపోవును. శిరస్సునకు వెనుకభాగమును, ముచ్చెలగుంటయును, ముష్టిపూసలును, మలుగులును, పాదములును వెచ్చనైన చేతులతో పిసుకవలయును. శ్యామోదకముతోఁ దడిసిన చేతివ్రేళ్ళతో మర్దనచేసినయెడల ప్రని సులువగును.

17. మాంద్యముగా నున్నట్టియు, చల్లనైనట్టియు రక్తమును చైతన్యవంతముగ చేయుటకును :— కేశ

నాళికలను, మలినరక్తవాహికలును బాగుగ పనిచేయునట్లు చేయుటకును హస్తచాలనము దిగువనుండి యెగువకు జేయవలెను. పైనుండికిందకు కూడదు. ఎడమనుండి కుడికిని, కుడినుండి యెడమకును మర్దనము జేయవలెను. చలచవలయును. రోగి అసలే యుద్రేకముగా నున్నయెడల కండరములను పిసుకవలయును.

13. కండరములందు బలారోగ్యముల గలిగించుటకు :— ఎగువకు హస్తచాలనము జేయవలయును. కండరములు బిగదీసియున్నప్పుడు ఎగువకే హస్తచాలనము జేయవలయును. ముందువైపున హస్తచాలనము చేయునప్పుడు కిందినుండి సూటిగా జీర్ణాశయమువంకకు జేయరాదు. వెనకవైపున క్రిందినుండి మీదకు జేయు చాలనములందు సూటిగా మెడటివంకకు జేయరాదు. గర్భాశయమును స్థానములోనుండు కండరములను బలపఱచుటకును, గర్భాశయభ్రంశము (జారిపోవుట) కలుగకుండుటకును, ఊర్ధ్వగతిగా హస్తచాలనము చేయవలయును. అట్లుచేయుటలో పైకి జీర్ణాశయమువంకకు చలింపజేయక ప్రక్కలకు పోవునట్లు చలింపజేయవలెను. వెన్ను బలుపు జెందుటకును ఆరోగ్యముగా నుండుటకును, మలుగులనుండి పైకి అనగా మలుగుల కుడివైపునుండి యెడమభుజమునకును, మలుగుల యెడమవైపునుండి కుడిభుజమువంకకును తిక్కిడిగా హస్తచాలనము చేయవలెను. అట్లు చేయుటకు ఆ తిక్కిడి × కలియుచోట నడ్డివూన అయియుండవలెను.

19. మలినరక్తపు వాహికలు తేలుటకును, చిదుగుటకును:— హస్తచాలనము దిగువకు జేయుటకంటె నెగువకు జేయుట మంచిది. దానివలన మలిన రక్తవాహికలును, కేశనాళికలును చైతన్య యుతము లగును.

20. వేడిగను మంటలుగను నుండు భాగములకు:— అందు ముఖ్యముగా నడ్డిపూస, నాభిమధ్యభాగమునందు మర్దన జేయునపుడు చేతివ్రేళ్ళు నీలివర్ణోదకముతో తడుపవలయును. ఏదైన ప్రుల్లని ద్రావములో ముంచుటయును మంచిదే. చర్మము పచ్చగ నున్నప్పుడు అనగా కామిలా వ్యాధి యున్నప్పుడును, పైత్యముగా నున్నప్పుడును 2 చిన్న చెంచా (2 teaspoonfuls) ల యాసిటికామ్లము (aceti-c acid) నందు 15 చెంచాల నీలివర్ణోదకముగాని ధూమ్రోదకముగాని చేర్చవలయును; ఆ నీటిలో వ్రేళ్ళుముంచి మర్దన జేసినయెడల పైత్యసంబంధమగు వికారములు సామరస్యము బొందును.

21. వేడిగను, శీతముగను నుండు స్థితులందు:- వేడి భాగమున కుడిచేయియు, శీతముగా నున్న భాగమున నెడమ చేయియు నుంచి మర్దన చేయవలెను. మెదడును సౌమ్యపఱచుటకు కణతలమీద కుడిచేతి బొటనవ్రేలును, వ్రేళ్ళను నుంచవలయును. తలయొక్క వెనుకభాగమున నెడమచేయి యుంచవలయును. నిద్రకలిగింపవలయుచో కుడిచేయి ముచ్చెలగుంటమీదనుంచి యెడనుచేయి మలుగులపై నుంచవలయును.

పాదములమీద వేడియైన చేతుల నుంచవలయును. మెడడు యొక్క వెనుకభాగమునను, ప్రక్కలందునను చన్నీటిలో ముంచిన కుడిచేతివ్రేళ్ళతో మర్దన చేయవలెను. నుదురు రుద్ద వలదు. మర్దనచేయువాని చేతులు వెచ్చగా నున్నయెడల సున్నితతత్త్వముగలవారు దానిని భరింపఁజాలరు. వారి మెడ యంత సుకుమారముగా నుండును.

22. జీర్ణాశయమును, పోషకతత్త్వమును నుద్దీపింపఁజేయుటకు :— జీర్ణాశయమును ముందునకు వెనుకకును ఊగింపవలయును. జీర్ణాశయముమీద నెడమచేయియును, వర్ణిపూసమీద కుడిచేయియు నుంచవలయును. జీర్ణాశయము నుద్దీపింపఁజేయునపుడు న్యూమోగాస్ట్రికు నరము (Pneumo-gastric nerve) ద్వారా చేయవలయు ననుట మఱువరాదు - అనగా వెన్నుపూసకు నిరుప్రక్కలను శ్వాసాశయముల లోనికి, జీర్ణాశయములోనికిని బోవునరము లున్నవి. వానిని కుడివైపునరములను కుడిచేతివ్రేళ్ళతోడను, నెడమవైపునర ములను ఎడమచేతివ్రేళ్ళతోడను నొక్కవలయును.

23. మలబద్ధకము పోగొట్టుటకు :— ప్రేగులపై గుండ్రముగా మర్దనచేయవలెను. అనగా నాభిని మధ్యగా నుంచి, కుడివైపున పైకిని, తరువాత యెడమవైపునకును, తరువాత దిగువభాగమునకును, తిరిగి కుడివైపు దిగువభాగము నకును - ఇట్లువరుసగా 5 నిమిషములవరకును రుద్దవలయును. ఎక్కువకాలమును చేయదగును. ఇట్లు పెద్దప్రేగు వెంట ఊర్ధ్వ

ముఖాంతర్యము, సరళాంతర్యము, అధోముఖాంతర్యము వెంట చేతిని ఒత్తిజరుపవలయును. అతిసారము నుపోగొట్టుటకు: ఈ మర్దన వ్యతిరేకముగా జేయవలయును. పీతోదకము మలబద్ధకమునకును నీలివర్ణోదకము అతిసారమునకు వినియింపవలయును.

24. వయసు చెల్లినవారికి:—దీర్ఘమును, తీవ్రమునగు చికిత్స పనికిరాదు. వారికి మృదువును, కొద్దికాలమును నగు చికిత్సయే తగును.

25. సమతలేని స్థితులందు:—దేహమునందొక భాగము మిక్కిలి వేడిగనుండి, వేరొకభాగము మిక్కిలి చల్లగనుండును. వేడిప్రదేశమునుండి చల్లనిప్రదేశమునకు హస్తచాలనముఁ జేయవలయును. దానివలన సామరస్యము గలుగును. వేడిప్రదేశముమీద కుడిచేయియు, చల్లని ప్రదేశముమీద నెడమచేయియు నుంచుటవలనను సామరస్యము గలుగును. కుడిచేయి విద్యుద్యంత్రముయొక్క సవ్యధృవము వలె చల్లనైనదనియు, నెడమచేయి అపసవ్యధృవమువలె వేడియైనదనియు నిదివరకే వివరించితినిగద. రోగియొక్క దేహమిదివరకే అత్యంతమలయుతమై యున్నప్పుడు మాత్రము మర్దనజేయు తన రెండుచేతులను ఒకేతూరి రోగిదేహముపై నుంచరాదు. దీనివలన కాంతశక్తియొక్క గమనము (Circute) పూర్తియై, రోగియొక్క దేహమునందలి మాలిన్యము లందే నిలచిపోవును.

26. మర్దనచేయుకాలమునందును, తరువాతను:— మర్దనచేయు నతఁడు తన చేతులను చన్నీటితో కడుగుకొనుచుండవలెను. అట్లుచేసినయెడల రోగిదేహమునందుండి తనకు జేరిన మాలిన్యము తొలిగిపోవును. ఏదైన ద్రావకపు నీటిలోగాని, సుగంధద్రవ్యములలో గాని కడుగుకొనుట యింకను శ్రేష్ఠతరమైనది.

చికిత్సాభాగమున, వివిధరోగములకు, నీ విధానము నె ట్లుపయోగింపవలసినది వివరింపఁబడినది.

పంచాశ్మీదవకిరణము

# విద్యుచ్ఛక్తి

1. విద్యుచ్ఛక్తి మిక్కిలి శీతలమైనది: సంకోచమును గలిగించునదియును. బహునిశితమైన గుటవలన ఆ శీతలత్వము గోచరింపదు. చన్నీటియందును, శీతగాలియందును, మంచుగడ్డయందును, సూర్యకాంతి యందలి నీలివర్ణమును, ధూమ్రవర్ణమును నగు కిరణములందున, ఆమ్లము లన్నిటియందును గలదు. 2 వ కిరణము 2 వ విషయము నందు వివరించిన యుత్తర పదార్థము లందును గలదు. విద్యుత్తును రాసాయనికముగ గలిగింపవచ్చును. ఘర్షణవలనను విద్యుత్తు గలుగును. కాంతశక్తి గల పనిముట్లతోను విద్యుత్తును గలిగింప వచ్చును. జంతు ప్రాణక్రియ యందును నిది గలుగును. శక్తియందంతటను నిది ప్రధానముగా నుండును గాన నిది ప్రతిపదార్థమునందును మిక్కిలి నిశితముగను, గర్భితముగను నుండియే యుండును.

2. ప్రతి అణుసమ్మేళనమునందును విద్యుచ్ఛక్తి యెడతెగని గమనము గలిగియే యుండును. అణు సమ్మేళనమునందు స్థితిస్థాపకత్వమును గలిగించునదదియేగద. ఆవిద్యుద్వాహికలే చిక్కుబడి, సంఖ్యయును, వేగమును ఎక్కువైనప్పుడే మన కది విద్యుచ్ఛక్తిగా గోచరించును. ఈ పని యాంత్రికముగను, రాసాయనికముగను, ఘర్షణవలనను గలిగింపబడు చున్నది.

3. ఒక గాజుముక్కపై పట్టుగుడ్డ వేసి:— రుద్దిన దాని యందు విద్యుచ్ఛక్తి యుద్భవించును. ఘర్షణవలనను విద్యుత్తు కలుగును. అది తెంపులేకుండ గాని (విద్యుద్దీపములు మొదలగు వానియందు వలె) తెంపులతోగాని (టెలిగ్రాములందువలె) యుండును. తెంపులతో గూడిన విద్యుత్తునందు కొంతకాలము విద్యుచ్ఛక్తి తాత్కాలికముగా నాగిపోయి, తీవ్రమగు వేగముతో తిరిగి బ్రవహించు చుండును. విద్యుచ్ఛక్తి ప్రవహించునని నేను వ్రాయుటలో ప్రకృతియందలి యితరశక్తుల వలెనే విద్యుచ్ఛక్తియు బ్రవహించు స్వభావము గలిగియుండు ననియే నా సిద్ధాంతము. అందు సునిశితములగు వైహాయసములు బ్రవహించు చుండును.

4. రాసాయనికముగా విద్యుచ్ఛక్తిని పెంచు విధాన మిచట వర్ణించఁబడు చున్నది.

ఒక గాజుపాత్రయందు ఒక ద్రావము - సాధారణముగా గంధకద్రావకము పోయవలెను. ఇది సహజముగా మిక్కిలి శీతమైన స్వభావముగలది. ఇందలి విద్యుచ్ఛక్తిని చలింపఁ జేయుటకు రెండు విరుద్ధస్వభావములుగల కడ్డీలు (rods) ఉంచఁబడును. అందు శీతస్వభావముగల తుత్తునాగఁపు కడ్డీ యొకటి, బొగ్గుతోగాని రాగితోగాని చేసిన వేడిస్వభావము గల కడ్డీ రెండవదై యుండును; వానికొనలు ద్రావకములో నుండునట్లు నిలువబెట్టవలెను. వాని నొకదాని కొకటి తగులకుండునట్లుంచవలెను. నీలముతో గూడిన తెలుపురంగుగల తుత్తునాగము మిక్కిలి శీతస్వభావముగలది, ఎరుపురంగుగల రాగి ఉష్ణ

స్వభావముగలది. ఇట్టి విరుద్ధస్వభావముగల యీ రెండు లోహములయొక్క కొనలును గంధకద్రావకము (Dilute




37 వ పటము - గంధకద్రావకము

Sulphuric Acid) నం దుంచవలయును. వేడిస్వభావము గల వస్తువులు శీతము నాకర్షించుట సహజము గాన రాగి గంధక ద్రావకమునందలి శీతవాహికల నాకర్షించును. కడ్డీలయొక్క పైభాగములను రెంటిని ఒకతీగెతో సంధించినప్పుడుగాని; రెండింటి కొనలను మనుష్యుడు చేతులతో నొకరియొకకొనను తాకినప్పుడుగాని విద్యుచ్ఛక్తి తీవ్రతర మగును. ఎందువలననగా అప్పటికి ఒకచుట్టు (circuit) పూర్తియగును. అప్పుడు క్రింద గంధకద్రావకములోని విద్యుచ్ఛక్తి రాగి కడ్డీలోనికిని, అం దుండి రాగికడ్డీ చివరభాగమునకు తగిలించిన తీగలోనికిని, అందుండి తుత్తునాగపు కడ్డీ పైచివరకును, అందుండి గంధక ద్రావకములోనికిని అందుండి తిరిగి రాగికడ్డీలోనికిని చేరును. ఇట్లు ఒకచుట్టు పూర్తియగును. రాగికడ్డీ పైభాగమునుండి

విద్యుత్తు వెలువడునుగదా. ఆ భాగమునకు ధనధ్రువమనియు (Positive pole) అనియు, తుత్తునాగపు పైకొననుండి విద్యుత్తు క్రిందికి దిగిపోవుచుండును గాన దానిని ఋణధ్రువము (Negative Pole) అనియు పేర్లు. వీనికే సవ్య అపసవ్య మనియు వాడియుంటిని.

5. సవ్యాపసవ్య ధ్రువములు: అనగా ధన, ఋణధ్రువము లనుపదములు అయోమయముగ వాడఁబడుచుండెను. ఎందుండి విద్యుచ్ఛక్తి బైటికి వచ్చుచుండునో దానికి సవ్యమనియు; ఎందుండి విద్యుచ్ఛక్తి లోనికి బోవుచుండునో దానికి అపసవ్యమనియు వాడవలసియున్నది. అప్పుడు రాగికడ్డీయొక్క పైకొననుండి విద్యుచ్ఛక్తి వెలుపలికి వచ్చుచుండును. తుత్తునాగపు పైకొననుండి విద్యుచ్ఛక్తి లోనికి ప్రవహించుచుండును. కాన రాగి (ధన) సవ్యమనియు, తుత్తునాగము (ఋణ) అపసవ్యమనియు విద్యుచ్ఛాస్త్రజ్ఞులు వాడియున్నారు. ఇది సరిగ నుండలేదు. ఏలయన, సహజోష్ణస్వభావము గల రాగికడ్డీ యొక్క దిగువభాగమువద్ద విద్యుచ్ఛక్తి లోనికి పోవుచున్నది. అప్పుడు దానిని అపసవ్య (ఋణ) మనవలసివచ్చును. సహజ శీతస్వభావము గల తుత్తునాగపుకడ్డీయొక్క దిగువభాగము వద్ద విద్యుచ్ఛక్తి వెలుపలికి వచ్చుచుండును. దాని నప్పుడు సవ్య (ధన) మనవలసివచ్చును. అయినను విషయసౌలభ్యము నకై యిదివరకువలెనే ఆ పారిభాషికపదముల నట్లనే యుంచితిని. గంధకద్రావకములోని శైత్యము (అనగా విద్యుచ్ఛక్తి)ను, త్వరత్వరగ లాగివేయుటకే తుత్తునాగపు దిగువ

కొననుండి విద్యుత్ప్రవాహము మిక్కిలి వేగముతో బయలు వెడలుచుండును.

6. రాగి కడ్డీ పైన తగిలింపఁబడిన తీగెచివరయందు సయిత మీఁ చల్లదనమే కలుగుచుండును. దానికి ధనాగ్రము (Anode) అని పేరు. ఇట్లే తుత్తునాగపు కడ్డీకి పైన తగిలింప బడిన తీగెచివరకు ఋణాగ్రమని పేరు. ధనాగ్రము చల్లదన ము గలిగించును. సౌమ్యపఱచును. మంటలను తగ్గించును. నొప్పి తగ్గించును. వేడియైన అణుప్రవాహ మొప్పుడును చల్లదనము నకు నెదురుగాఁ బ్రవహించుచుండును. కనుక ఋణాగ్రపుచివర వేడిని గలిగించును; ఉద్దీపనకర మైనది. విద్యుచ్ఛాస్త్రజ్ఞులకు నిశ్చితమైన అభిప్రాయములు లేవు. అయినను ఈ అగ్ర ముల స్వభావమునుమాత్రము వారు సరిగనే నిర్ణయించిరి. వారు ఋణాగ్రము ఉద్దీపనకరమైన దనియు ధనాగ్రము నొప్పిని తగ్గించుననియు వర్ణించిరి. ఈ అభిప్రాయము సరిగనే యున్నది.

ఇత్తడివస్తువులకు వెండిగాని బంగారుగాని పూతవేయుటలో విద్యుచ్ఛక్తి నుపయోగింతురు. అప్పుడు వెండిసంబంధమగు ద్రావకము నుంతురు. అప్పుడు ఆ ద్రావకమునందలి వెండి విద్యుత్ తాకింపఁబడిన ఆ యిత్తడి వస్తువుల మీఁద నిలిచిపోవును. ఇట్లు క్రిందనున్న ద్రావకములోని ధాతువులు విడదీయుటకు ఎలిక్ట్రోలిసిస్ అని పేరు. ఇట్లే తీక్ష్ణము కానట్టి విద్యుదగ్రములను మనుష్యుడు పట్టుకొనినప్పుడు వాని

దేహమునందలి పాదరసాదిధాతువులు బైటికి లాగివేయఁ బడును. అట్లు రోగనివారణ మగును.

న్యూయార్కునందలి రానేపండితులు (Prof. Ranney) ఇట్లు వ్రాసిరి:—

"ఋణాగ్రము రోగికి మిక్కిలి బాధకరమై యుండును. అత్యంత మగు రాసాయనిక చలనమును గలిగించును. చర్మము కందును. మంటలు పుట్టును. తీవ్రమగు విద్యుదగ్రమును ఎక్కువగా తాకించిన బొబ్బ యేర్పడి పుండుపడును. ఋణాగ్రము ఉద్దీపనకరమైనది. ఉద్రేకమును గలిగించును. ధనాగ్రము నొప్పిని తగ్గించునదై యున్నది." వైద్యశాస్త్రమున విద్యుచ్ఛక్తి అను గ్రంథము 44 పుట.

ఇట్లు కలుగుటకు కారణము బాగుగ తెలియవలయు నెడల ప్రపంచమునం దంతటను చలి, వేఁడిములు గలవని శాస్త్రజ్ఞులకు తెలిసియుండవలెను. మామూలు యంత్రములతో కొలుచుటకు సాధ్యముకానంత నిశితముగా సయితము అవి యుండుటయును గలదు. ఈ ధనఋణశక్తులలో నొకటి రాసాయనికమైన దనియు వేరొకటి కాదనియు ననరాదు. ఒకదానియం దెక్కువశక్తియు రెండవదానియందు తక్కువశక్తియు గలదనుటయును తప్పే. ఒకటి లేకున్న రెండవదానికీ శక్తియే లేకుండును. ఇది యెట్లుండు ననగా సూర్యకిరణము నందలి రంగులవరుసలో ఊదారంగు గల చివర, రాసాయనికమైన దనియు నెరుపు గల చివర కాదనియు ననిన ట్లుండును. లేదా

పురుషునికంటె స్త్రీ కాని, స్త్రీకంటె పురుషుడుగాని అధికు లనుటవలె నుండును. ఋణాగ్రము, కాలిక మైచల్లబడి పోయిన భాగము ఉద్దీపన జేయుటకు సమర్థమైన దే. ధనాగ్రము వేడిని తగ్గించును. తరుణములును, మంటలను గలిగించునట్టియు స్థితు లను సౌమ్యపఱచుటలోను సమర్థమైనది.

7. విద్యుచ్ఛక్తి రెండు వైపులకును నడచును. శీతములగు అణువు లొకవరుసలోను ఉష్ణముల అణువులొక వరుసలోను, ఒకవరుస కొక వరుస యెదురుగా నమరియుండును. అందువలన ఉష్ణాణువులు రెండు వైపులకును నడచును. ఇట్లే శీతాణువులును రెండు వైపులకును నడచును. ఇట్లే అయ స్కాంతమునందును జరుగును. అయస్కాంతమున ఉత్తరవు కొన ధనాగ్రమని మనకు దెలియును. దక్షిణపు కొనకు శీత ప్రవాహము నడచుననియును దెలియును. దక్షిణపు చివర చుట్టును శీత (Electricity) ప్రవాహములు తిరుగుచుండు నని యునుం దెలియును. అట్లుండి రెండవకొన నాకర్షించుచుండును. ఇందు సత్యమేమన మిక్కిలి బలమైన విద్యుచ్ఛక్తి, ఒకవంక కే వ్యాపించును. ఆ వైపు శీతస్వభావము గలదగును. ఇట్లే మిక్కిలి బలమైన ఉష్ణశక్తి వ్యాపించినవైపున నున్న కొన ఉష్ణస్వభావము గల కొన యగును. ఇందలి శీతోష్ణస్వభావ ములు, వేడిని కొలుచు యంత్రముతో కొలుచుటకు వీలులే నంత సునిశితమై యుండును. కాని బారన్ రేచిన్ బాక్ గారి సున్నితస్వభావము గలవారి కిది అనుభవనీయమై యున్నది. ధనధ్రువమునందలి శీతమును, ఋణధ్రువము నందలి ఉష్ణ

మును వారు గుర్తింపఁగలిగి యున్నారు. అయస్కాంతము యొక్క ఉత్తరపు చివరను శీతవర్ణముల యొక్క ఆధిక్యమును, దక్షిణపు చివరను ఉష్ణవర్ణముల యొక్క ఆధిక్యమును చూడ గలిగిరి. అవే చివరలను వ్యతిరేక వర్ణములును చాల తగ్గి యుండుటను చూడగలిగిరి.

8. గాల్వనిజము: పై పటములో వర్ణింపఁబడిన విధముగా తయారుచేయఁబడి తెంపులేని ప్రవాహము గల విద్యుచ్ఛక్తికే ఓల్టేయిజం అనియును పేరు. దీనికి ధనాగ్రము, ఋణాగ్రము అమర్చబడియుండును. చికిత్సయందు దీనిని ఫారడే కనిపెట్టిన ఫారడేయిజంకంటె, నెక్కువ శాస్త్రీయముగా నుపయోగింప వీలై యుండును.

9. ఫారడేయిజం: మృదువైన ఉక్కుముక్కకు విద్యుచ్ఛక్తిని బ్రయోగించుట ద్వారా తెంపులు తెంపులుగా వచ్చు విద్యుచ్ఛక్తిప్రవాహము అం దేర్పడును. దీనికి ఒకవైపు చల్లనిదనియు, రెండవవైపు వేడిదనియు లేదు. రెండువైపులను శీతోష్ణములు సమముగనే యుండును. మర్దనయందు వలె దీనిని బ్రయోగించుటచే మాంసము కండలు పిసుగుటవలన వలె నుద్దీపనము బొందును. కాని దేహమునందలి మాలిన్యములను లాగివేయునట్టి ఎలిక్ట్రోసిస్ అనునది దీనియందు గలదు. గాల్వనిజమువలె నిది నాడులను సౌమ్యపఱచునదిగాదు. ఫారడేయిజముకంటెను, స్టేటిక్ విద్యుత్తుకంటెను ఆ గాల్వనిజమే యెక్కువ గుణవంతమైనది.

10. స్టేటిక్ విద్యుచ్ఛక్తి :— ఘర్షణవలన నిది కలిగింపఁబడును. ఇది విద్యుచ్ఛక్తు లన్నిఁటిలోను మిక్కిలి ముతుకరక మైనది. ఇది చర్మముయొక్క పైభాగమునమాత్రమే వ్యాపించి చర్మమును ఉద్రేకపింపఁజేయును. అందువలన లోపలి మాలిన్యములు వెడలిపోవ వీలగును. ఈద్పు, హిస్టీరియా మొదలగు వ్యాధులయం దిది యుపయోగకరమైనది.

11. విద్యుచ్ఛక్తియును ప్రవహించు స్వభావముగలది. చలనమునకు కారణమైనది. ఈ విద్యుచ్ఛక్తి యెందు ప్రవహించునో అందలి యింకను నున్నితమైన తత్త్వములతో నది గలసిపోవును. కనుక మోటైన మందులను జీర్ణకోశములోనికి స్వీకరించుట కంటె ఆ స్వభావముగల మృదువైన విద్యుచ్ఛక్తిని స్వీకరించుట నిరపాయమైనది. క్షేమకరమైనది.

ఈ వైద్యము చేయునపుడు 2 విద్యుద్ఘటములు (cells) వాడుట మంచిది. అందు ఒకటి మిక్కిలి వేడిస్వభావము గలదియు, వేరొకటి మిక్కిలి శీతస్వభావము గలదియునై యుండవలెను. వేడిఘటమున కీ క్రింది ద్రావకము నుపయోగింపవలెను. 6 ఔన్సులనీరు 1 ఔన్సు గంధక ధృతి, (Sulphuric acid), 2 ఔన్సులు పొటాసియం బైక్రోమేటు (Bichromate of Potassium), సల్ఫేటు ఆఫ్ క్వైనైన్ (Sulphate of Quinine) 3 గ్రాములు ; లోహద్రావకము (Tincture of Iron) 6 బిందువులు ; సైలికామ్లము 4 గ్రాములు, (Salicylic acid 4 grms); శీతఘటమునకు నీ క్రిందివాని నుపయోగింప

వలెను. 8 ఔన్సులనీరు ; 1 ఔన్సు గంధకద్రావకము ; 12 బిందువుల నీలిమందు. ఈ విద్యుద్ఘటములు కలియకుండునట్లు జాగ్రత్త తీసికొనవలెను.

12. ముందు ముందు క్రొత్తధాతువుల నుపయోగింపవచ్చును. శాస్త్రజ్ఞులైన వారుమాత్రమే ఆ పని చేయనర్హులు. వేడిపైపున రాగికంటెను బొగ్గుకంటెను, బంగారు మెక్కువ బలమైనది. కాని అంతఖరీదు నెవరు భరించెదరు ? శీతపువైపున తుత్తునాగమును మించున దేదియు లేనట్లున్నది.

13. విద్యుచ్ఛక్తిని సూర్యకాంతితో పోల్చుటః-శాస్త్రమర్యాద ననుసరించి ఘటములోనుండి వచ్చిన విద్యుచ్ఛక్తికంటె సూర్యకాంతి యెక్కువ సునిశితమైనది. ప్రతిఫలీకరణపటములతోగూడిన రంగద్దములలోనుండి దేహముమీదికి శాస్త్రీయముగాఁ బ్రయోగింపఁబడిన సూర్యకాంతి (ఆదిత్య పేటికయందువలె) దేహము లోనికి బాగుగా చొఱబారును. దేహము నంతటిని ఒకతూరిగా నుజ్జీవింపఁజేయును. సూర్యకాంతి ప్రసరింప వీలులేనిచోట్లు గలవు. అచట నీ విద్యుచ్ఛక్తిని బ్రసరింపజేయవచ్చును. జననేంద్రియము, ఆసనము ఇట్టివానియందు విద్యుచ్ఛక్తి నుపయోగింపవీలగును. విద్యుచ్ఛక్తిగల గిన్నె కంటిపై బోర్లించి, సుతారముగా చికిత్సజేసిన కంటిలో మేహాపటలము (శుక్లము) తీసివేయఁబడును. పుట్టుమచ్చలును విద్యుచ్ఛక్తిచే తీసివేయవచ్చును. కాని సూర్యకాంతిని భూతద్దముద్వారా ప్రయో

గించినయెడల, విద్యుచ్ఛక్తివలనకంటె 10, 20 రెట్లు త్వరగా నివి కుదురును. అప్పుడు విద్యుచ్ఛక్తి అగత్య ముండదు - స్త్రీలముఖముమీద నున్న వెంట్రుకల మొదళ్ళను కాల్చి వేయుటకు బునాగ్రము ప్రయోగింపఁబడును. భూతఅద్ద ముతో కాల్చినయెడల అనవసరమైన వెంట్రుకల కుదుళ్ళు బాగుగాను త్వరగాను కాలిపోవును. కొకేయిన్ రాచిన బాధ యును అనుభూతముగానంత తక్కువగా నుండును. ఇది శోధించిన విషయమే. విద్యుచ్ఛక్తిచేతకంటె భూతఅద్దముతో కాల్చుటయే మంచిది. భూతఅద్దపు కాల్పునందు మచ్చ త్వరగా మాసిపోవును. విద్యుచ్ఛక్తి చేయుటకు రోగనిదా నము చాల అవసరము.

**14.** విద్యుచ్చికిత్సయందు సంక్షేపము గు విధులు:— ప్రొఫెసర్ ఫ్రాంబ్రిస్ యల్. రానీ, యం. డి. అను వారు వ్రాసిన 'వైద్యమునందు విద్యుచ్ఛక్తి' (Electricity in Medicine) అను గ్రంథమును రచించిరి. Appleton Jco. Newyork, U. S. A వారు ప్రచురించిరి. అందుండి యీ క్రింది భాగము సంక్షిప్తపరచబడినది.

(1) విద్యుచ్ఛక్తి సులువుగా వ్యాపించుటకు విద్యుదగ్రములను కొద్దిగా ఉప్పు వేసిన నీటిలో కడుగవలెను. ఉత్తనీట కడుగవద్దు. (2) విద్యుచ్చికిత్స తేలికయ గుప్రవాహములతో మొదట ప్రారంభింపుము. అనేకవిషయములందు బలమైన వాహికల (currents) కంటె బలము తక్కువ వాహికలే నిర్ణయింపఁ బడుచున్నవి. (3) వాహికయొక్కగతి (Polarity) అవసరమై

నంతకంటె నెక్కువ తూరులు మార్పుచేయవలదు. (4) మెడ టికి చికిత్సచేసినపుడు చాల మృదువైనట్టి, గాల్వానికు వాహికలను మాత్రమే యుపయోగింపవలసినది. (5) ఋణాగ్రము ధనాగ్రమునకంటె సాధారణముగా లావుగా నుండవలయును. (6) సాధారణముగా 5, 6 నిమిషముల చికిత్స చాలును. ఎప్పుడైనను ఎక్కువ చేయవలసియు నుండును. (7) సాధారణముగా దినమున కొకతూరి చికిత్స చేసిన చాలును. అనేకవిషయములందు వారమునకు 3 తూరులు చాలును.

15. మానవదేహము నందలి విద్యుచ్ఛక్తియొక్క గతి:-ఇదివరకు వ్రాసిన గ్రంథభాగమునందు, మానవదేహముయొక్క కుడిభాగము శీతభాగముగా నుండుననియు, నెడమభాగము ఉష్ణభాగముగా నుండుననియు అనగా మానవదేహము అనే విద్యుద్యంత్రము కుడివైపు ధనవిద్యుత్ అనియు ఎడమవైపు ఋణవిద్యుత్ అనియు వివరించితిని. అందే ముందు (పురో) భాగము ధనవిద్యుద్భాగ మనియు వెనుక (పృష్ఠ) భాగము ఋణవిద్యుద్భాగ మనియు వివరించితిని. ఒకరి తరువాత నొకరుగా నిలువఁబడినప్పుడు, వ్యతిరేకశక్తులకు అనురాగ ముండుటవలన, సామరస్యమును, నెమ్మదియును గలుగును. కుడివైపునకు కుడివైపును, నెడమవైపునకు నెడమవైపును తగులునట్లు నిలిచినప్పుడు, సజాతి సజాతి నుద్దీపింపఁజేయును గాన ఉద్దీపనమే గలుగును. ఇదే నున్నితతత్త్వము గలవారియందు దుఃఖమును గలిగించును. బాధయును గలుగును. గాల్వనిక్ విద్యుద్యంత్రము నుప

యోగించినపుడును నిట్టి ఫలితములే చేకూరును. దేహము నందు సామరస్యము గలుగుట కిట్లు చేయవలెను. దేహము నందలి వేడిప్రదేశములకు విద్యుద్యంత్రమునందలి ధనాగ్ర



38 వ పటము 39 వ పటము

1,2,3 అంకెలకు పైభాగమున రొమ్ములు. 1,3 కుడియెడమవైపుల యందలి జీర్ణభాగములు. 2 జఠరకోశము, 4,6 కుడియెడమ డొక్కలు. 5 నాభి. 7,9 కుడి, యెడమ జననేంద్రియ భాగములు. 8,5 జీర్ణభాగము లందలి దిగువభాగము.

C. మెడజీవులు. D. వెన్నుపూసలు L. నడ్డిపూసలు. S. ముడ్డిపూసలు. B.B. ఉదరము H. హృదయము. L. శ్వాసాశయములు.

మును; దేహమునందలి చల్లని, మాంద్యము గల ప్రదేశము లకు ఋణాగ్రిమును నుపయోగింపవలెను.

నాశాస్త్రము ననుసరించి దేహమునందలి భాగములకు +,— అనే గుర్తులతో పటములు తయారు చేయఁబడినవి. అవి పారిస్ లోని 5, బౌల్ వార్డ్ డి. టెంపిల్‌లోని కాంతశక్తికి సంబంధమైన గ్రంథాలయమునందలి ప్రొఫెసర్ డల్ విక్ల అను వారు తయారు జేసిరి.

అతని చిత్రము ననుసరించియే 38, 39 వ పటముల నిందు చేర్చితిని. ఆతఁడిచ్చిన గుర్తులకుతోడు, విద్యార్థులకు సులువుగా తెలియుటకు ఉదరము యొక్కయు, మిగతవాని యొక్కయు విభాగములను గూడ నిందు జేర్చితిని. దేహమునందలి భాగములను అయస్కాంతమునకు పోల్చి అందలి ఉత్తర అగ్రిమును (ధనాగ్రిమునకు) పోలిన భాగమునకు + అనియు, దక్షిణ అగ్రిమును (ధనాగ్రిమునకు) పోలిన భాగమునకు - అనియు గుర్తు లుంచియున్నాఁడు. "సమానమైన పేర్లుగల అయస్కాంతపు అగ్రిముతో దేహభాగమునందలి కాంతమునందలి అగ్రిము సమావేశపఱచినయెడల వేడిమి, ఉద్రేకము గలుగును. వ్యతిరేక అగ్రిములు కలసిన సామరస్యమును, సౌఖ్యమును గలుఁగును" అని యతఁడు వ్రాసియున్నాఁడు.

---

రెండుపటములందును + ధనాగ్రిము, — ఋణాగ్రిము

ఇరువదవ కిరణము

# మానసికచికిత్స - యోగనిద్ర

1. మనుష్యబుద్ధి గంభీరమైనది; అనంతమగు నాకాశము యొక్క పరిమితిని, గౌరవమును అది గ్రహింపగలదు. అనంతమగు నా పరమేశ్వరుని సయితే మిది వివేచనఁజేసి యనుభవింపఁగలదు. మనుష్యబుద్ధియందును, విశ్వమునందలి యితర శక్తు లన్నిటికివలెనే ద్విధాత్వ మున్నది. ఒకవైపున విశ్వాత్మయొక్క ఆత్మతత్త్వమును, రెండవవైపున భౌతికమగు మెదడును గలదు. ఇందా యాత్మ పనిచేయుచుండును. ఆత్మను, భౌతికమగు మెదటిని కలుపుటకు సున్నితమగు వైహాయసములు మెదటి నుద్దీపింపఁజేసి, దేహమునం దంతటను వేగముతో గూడి వ్యాపించును. మానవ దేహమునందే గాక, దేహమును వదలి వెలుపలను చాలదూరమువఱకును, ఈ వైహాయసములు వ్యాపించియుండును. అనిర్వచనీయమగు నీయాత్మ, లేక జీవము, బుద్ధిలో బహు సునిశితమైన భాగమే యగును. నిశితమగు వైహాయసములు ఆత్మను వెలుపల ప్రకాశింపజేయుటకు కారణమై యుండును.

[ఇట్లు చెప్పుటలో నేను గుడ్డిగా చెప్పుచుంటినని మీరు భావింపవచ్చును. శక్తియొక్క నియమము (Law of force) ల గురించి నేనుచెప్పినది యెఱుగనివా రట్లు భావింపవచ్చును. అణువులన్నిటియందును తీవ్రమగు పీల్చునట్టి శక్తి యున్నది. వైహాయసము లనగా అణువులందలి సూక్ష్మాతిసూక్ష్మము

లగు భాగములు. అవియును వానికంటెను సునిశితమగు వైహాయసములను తమయందు వ్యాపింపఁజేయును. వైహాయసములన్నిటికంటెను అత్యంత సునిశితమగు వైహాయసము లుండును. ఇంకను విడదీయుటకు వీలుకానంత సూక్ష్మములగు అణువులును నుండును. వీని కన్నింటికిని ఆంతర్యమున అణోరణీయమగునట్టియు, ఇంకను విభాగించుటకు సాధ్యముకానట్టియు నాత్మతత్త్వమున్నది. దీనినే 'విశ్వాత్మ'యనియు నందుము. ఆత్మసారమగు నీ తత్త్వమును, ద్యోతకముజేయుటకు వైహాయసములును, సున్నితములగు, అణువులయందలి వాహికలును సమర్థములై యున్నవి. ఆత్మను ఇట్లు ద్యోతకము జేయుటలో తామును వెలుపలికి స్పందనములుగా గోచరించును. ఇట్లు విశ్వాత్మ ప్రేరణనుఁబొంది ద్యోతకమైనప్పుడు, అదియే శక్తియందలి ప్రధానమైన భాగముగా నుండును. అదియే ప్రతిమానవదేహమునందును సాంద్రమై సక్రమమై యుండును. విశ్వాత్మయగు నా పరమేశ్వరునకు మన మందఱమును పుత్రులమనియు, పుత్రికల మనియు; మన మందఱమును సోదరులమనియు భావించుట సంతోషముతో నుబ్బిపోవుటకు హేతువగుట లేదా? మన మందఱమును అణువునకు భిన్నమును, అమృతమునునగు తత్త్వమే యనియు, అపరిపక్వమగు నేవో స్థితులవలన నిట్లుంటిమనియు, పరిపక్వదశ నందినయెడల క్రమక్రమముగా నా విశ్వాత్మతో సాయుజ్యమును బొందెదమనియును భావించుట ఆనందాయకము గాదా?]

ఆత్మ కనుచరులగు నా వైహాయసములే మెదటియందలి కణముల నుజ్జీవింపఁజేయును. నరములను కదలించును. మానవ బుద్ధియందు స్థూలతత్త్వములు ఇవిగానే యుండును. ఏశక్తి యందైనను సున్నితతత్త్వములు లేకుండ స్థూలపదార్థములును, స్థూలపదార్థములు లేకుండ నెట్లు సున్నితతత్త్వములును నిరుపయోగములో, అట్లే మనుష్యబుద్ధియందును జీవము (ఆత్మ) లేకుండ ఇతర మెదడును; మెదడు లేకుండ జీవమును పనిజేయఁజాలవు. ఆత్మయొక్క వైశాల్యము అంతులేనిది. అది వ్యాపించి మానసికములగు వైహాయసముల నుజ్జీవింపఁజేయును, ఆ వైహాయసములు మెదడునందలి కణము (Cells) లను గదలించును. కణములు నరములనుగదలించును. అవి దేహమునందలి ముదుకభాగములను గదలించును. ప్రపంచమునందలి రూపములు, రంగులు, ధ్వనులు, వాసనలు, రుచులు, నాడుల ద్వారా మెదటికి జేరి యచట మానసికములగు వైహాయసములద్వారా ఆత్మనుఁజేరుచున్నవి. అచ్చటనే ఆలోచన, ఉత్సాహము, ఉద్రేకము, సంకల్పము మొదలగునవి గలుగుచున్నవి. ఇట్లు ప్రపంచమునందలి పదార్థములయొక్క రూపము మొదలగునవి మెదడునందలి జ్ఞానకోశము (Sensorium) నందు చేరును. మెదడునందలి ముందు భాగము మొదలగువానియందు ఆ వస్తువులయొక్క వివేచన జరుగును. వానియొక్క అన్యోన్యసంబంధమును విచారింపఁబడును. ఇట్లు తనకు నిష్టమైనట్లు ప్రపంచమును గ్రహించును.

2. సమగ్రముకాని సిద్ధాంతములుగలకొందఱు:— ఆత్మయే సర్వమనియు, పదార్థమున కది యజమాని యనియు; పదార్థముపై పదార్థమున కేమియు ప్రాబల్యములేదనియు నందురు. ఇట్లు చెప్పినయెడల శీతకాలమున చలిపోఁగొట్టుటకు నిప్పు అవసరము లేకపోవును. ఆకలితీరుటకు ఆహారము కూడ నక్కరలేదు. విశ్రాంతివలన మెదడు, నాడులు మొదలగునవి శుద్ధమగుటకు నిద్రయును అనవసరమే కావలెను. సారాయి, నల్లమందు మొదలగు మత్తుపదార్థములు మెదటికి మత్తు గలిగింపకుండనుండవలయును. 10,000 సత్యములు. ఈ విషయములకు వ్యతిరేకమును రుజువుచేయుచున్నవి. నేటి మానసిక చికిత్సకులు అనేకులట్టి నిరాధారమగు సిద్ధాంతములను దెలుపుచుండుటచే నింతమాత్రమైనను చెప్పవలసివచ్చినది. లేకున్న నీ విషయము పేర్కొనుటకైనను తగినంత అర్హతగలదిగాఁ లేదు. బోస్టన్ నగరమునందలి ఎడ్డీయను నత డిట్లు చెప్పెను:— "నా పరిశోధనలవలన నొక విషయమున గాక అన్నివిషయములందును, దేహము మనస్సున కధీనమై యుండునని రుజువైనది. ఐనను పక్షవాతము, యీడ్పు, భద్రనాట్యము (St. Vitus Dance) అనే వ్యాధులయందు మనస్సు ఏమియు చేయలేనిదే యగుచున్నది. అప్పు డట్టి అనాలోచితములగు సిద్ధాంతములు తప్పే యగును."

బోస్టన్ నగరమునందు డబ్లియు - యఫ్. ఈవన్సు మొదట మొదట నుపయోగకరమును, ఉత్తమములును అగు అనేక విషయములను బోధించియుండెను. జర్మనుమాంత్రికులవలెనే

అతఁడు ఇప్పుడు తీవ్రవాదియై యిట్లు వ్రాసియున్నాడు:—
"బయట ధ్వని యనునది లేదు. అది మనసులోనుండి, అందే ద్యోతక మగుచున్నది. గానము లేనిచో బయటనుండదు. వెలుగునందలి భాగములగు రంగులు మొదలగునవి నాకంటె వెలుపలలేవు. నాలోనే యున్నవి."

(Primitive Mind Cure Page 50)

వెలుతురు, రంగు, ధ్వని అను వానిని, వానిని తెలుసుకొనుట (జ్ఞానము)నుగా పొరబడినాడు. ఈ సిద్ధాంతమే నిజమై, మన మందఱమును గ్రుడ్డివారమును, చెవిటివారమును నై యుందు మేని రంగు, వెలుఁగు విమలగానము, పక్షుల కలకలధ్వనులు, ఇంతయేల! సూర్యభగవానుఁడే లేకుండ పోవలసివచ్చును. మనకు లేకున్న, లేకపోవునుగాక! సూర్యభగవానుఁడు ప్రపంచము నుజ్జీవింప మానునా? సూర్యకాంతియు, చూచు కన్నులును ఒక్కటిగాదు. అవి వేరువేరైనవి.

ఇట్టి అతివాదములాడువారు సుప్రసిద్ధులలోనే కొందరున్నారు. అయినను నీ వాదమువలన, ప్రపంచమే లేకపోవలెను. అంతయును మనస్సుయొక్క పనియే యగును. అవి మనము నమ్మవలయునెడల బయటి ప్రపంచముయొక్క జ్ఞానము నశింపవలెను. పదార్థతత్త్వము మనకు తెలియకుండపోవలెను. శాస్త్రములు లేకుండవలెను. ఆత్మయే విశ్వశక్తియని నమ్ముచు, భావమాత్ర ప్రపంచములో మునిగితేలుచు నుండవలెను. ఆత్మయొక్క శక్తిని రుజువుపఱచు సామర్థ్యము మాత్రము మనకు లేకుండును.

ప్రమాదకరమగు తప్పుసిద్ధాంతము ప్రబలకుండుటకు నింత మాత్రము చెప్పవలసివచ్చినది. ఇంక, మానసికశక్తి ఇచ్ఛాశక్తి, భావన, క్రియాశక్తి ఒక విధముగా నడచినయెడల మానవాభ్యుదయమును గలిగింపఁ గొప్ప శక్తిగలవై యుండును. సునిశితమైనకొలఁదిని వానికంత గొప్పశక్తి కలుగును.

3. గొప్పదైన మనోనిగ్రహమును సంపాదించుటకు మానసికమైనట్టియు మేధాసంబంధమైనట్టియు శక్తుల నుపయోగించుట చాలదు. పదార్థసంబంధమైన శక్తులు అనగా సూర్యకాంతి, జంతుకాంతశక్తి (animal magnetism) పోషకమగు నాహారము, పరిశుద్ధవాయువు మొదలగునదియును అవసరమైయుండును, కాంతశక్తితోను, ఆత్మశక్తితోను ఒకతూరి తత్త్వమును పూరించుకొనుము. తరువాత నీ సమీపమునకు వచ్చువారి కందరికిని రోగనివారణ మగును. సజ్జనులును అగుదురు. ఆ శక్తియే సమీపమునకు వచ్చిన వారందరి మెదడులలోనికినిఁ బ్రవహించి వారి యిచ్ఛాశక్తిని బలపఱచును. దానితో వారు తమరోగములనుఁ గుదుర్చుకొన సమర్థులయ్యెదరు.

4. మానసికచికిత్సకులు: కాంతశక్తి గలవారు. కాంతశక్తిగలవారికంటె రోగనివారణము జేయుటయందు యెక్కువ సమర్థులై యుందురు. కాంతశక్తిగలవారినుండి యా శక్తి రోగులలోనికిఁ బ్రవహించి వారికి మేలుజేయును. ఇచ్ఛాశక్తి నయితమును తగినంత కాంతశక్తితో గూడియున్నప్పుడే

క్రమముగా బనిచేయగలిగియుండును. ఆరోగ్యవంతులలో కొలదిమంది, తమ శక్తులను నిగ్రహించుటయేగాక చుట్టుపట్ల నున్న వారి శక్తులను నిగ్రహింప గలిగియుందురు. వారి యందలి కాంతశక్తి తగ్గిపోయినంతనే పరుల శక్తులను నిగ్రహింపజాలరు సరిగదా మిక్కిలి బలహీనులగుదురు.

5. మానవసంఘము :—మానసికశక్తులను స్వీకరింపం దగినంత సున్నితముగా తయారై యుండనందున స్పృశించిననేగాని వారికి మానసికశక్తులు వ్యాపించుటలేదు. అందువలననే కాంతశక్తితోగూడిన మర్దనమును సూర్యకిరణ ప్రసారమును అగత్యమై యుండును. అట్లు చేయుటయే మానసిక చికిత్సకంటె గుణతరముగా నుండుచున్నది. ప్రకృతియందలి సున్నితశక్తులద్వారా చెమటగలుగునట్లు చేసికొని తత్త్వమును శుద్ధముగా చేసికొనినగాని మానసికచికిత్స స్వీకరించుటకు తగిన అర్హతయును గలుగుటలేదు.

6. ఇచ్ఛాశక్తి :— అనగా ఇది యిట్లు కావలయునని తన యిచ్ఛాశక్తిచే కోరుట. ఇట్లు కోరుటవలన మానసికశక్తులన్నియు క్రియావంతములగునట్లు చేయఁబడును. ఇతరమానసిక శక్తులన్నియు దీనియెదుట బలహీనమైనవియే యగును. పెనిసిల్‌వానియా జిల్లాలోని లాంకాస్టరునం దుండిన శ్రీ॥ శే॥ విలియం. బేకరుగారు రోగనివారణఁజేయుటయు, బాధానివారణ జేయుటయు, దూరదృష్టిని వృద్ధిజేయుటకు ప్రత్యేకముగా నీ శక్తులను వృద్ధిజేసి ప్రయోగించుచునుండెను. డాక్టరు బ్రెయిడ్

మొదలగు మానసికచికిత్సాపరిశోధకులకు వలెనే ఆ మానసికశక్తు లెట్లు పనిసేయునో అను విషయము ఈతనికిని పూర్తిగా తెలియకనేయుండెను. పరుల యిచ్ఛాశక్తివలన తన రోగములు కుదురుటకంటె, తన యిచ్ఛాశక్తివలననే తాను రోగముల గుదుర్చుకొనఁగలిఁగియుండుట యెక్కువ మేలైనది. నాలోని ఆయిచ్ఛాశక్తి ఒకతూరి శక్తిమంతమగునేని స్వాభావికమగు నింద్రియజయము గలుగును. ఏ ప్రదేశమునందైనను బాధయున్న యెడల నా ప్రదేశమునందలి జ్ఞాననాడులను నిగ్రహించుటద్వారా బాధను జయింపవచ్చును. ఏ ప్రదేశమునందైనను కోసికొనిపోవుచుండినను, బాధ తెలియకుండునట్లు జేసికొనవచ్చును.

7. వివరణము : సామాన్యముగా ముదుకవైన పశుసంబంధమగు వైహాయసములే మెదటిలో సామాన్యముగా పని చేయుచుండును. మెదటియందు నిహితమైన సునిశితశక్తులున్నవి. వానిని ప్రేరేచినయెడల నీ ముదుకవైహాయసములు వానికి లోఁబడిపోవును. అప్పుడు ఇచ్ఛాశక్తియే మనయందు ప్రాధాన్యమును వహించును. మనకు నిదివరకే సునిశితశక్తులు ఎక్కువశక్తిమంతములని తెలియును. కనుక నీ యిచ్ఛాశక్తి దేహమునందలి ఏ భాగమునందున్న జ్ఞాననాడులనైనను నిగ్రహింప నెక్కువ శక్తిగల దగుచున్నది.

8. యోగనిద్రను వృద్ధిచేయు విధానము :— డాక్టరు ఫాహ్నెస్టాక్ గారు ప్రయోగించు విధానము నిచట చేర్కొ

నుచున్నాను. [ఇందు యోగనిద్ర బ్రయోగించువానికి ప్రయోక్తయనియు; ప్రయోగింపఁబడువానికి ప్రయోగి యనియు వాడెదను.] ప్రయోగి, వీలుగానున్న యెడల తల నుత్తర దిక్కుగా నుంచి ఉసులుగా పరుండవలెను. తనకు వెలుపలగా నున్న ఏదేని ఒకవస్తువును బాగుగా ధ్యానించిన యెడల తన దేహమునందు నిహితమైయున్న వైహాయసములు బహిర్గతము లగును.

ఇట్లు ధ్యానించు వస్తువు (ధ్యేయము) ప్రయోక్తకును ప్రయోగికిని తెలిసినదై యుండవలెను. అదియొక ప్రదేశముగా గాని గృహముగా గాని యుండుట మంచిది. ప్రయోక్త ప్రయోగికి 6 అడుగుల దూరములో కూర్చుండవలెను. లేకున్న ప్రయోక్తయందలి మదుకరమైన పశుసంబంధమగు వైహాయసములు ప్రయోగివైహాయసములతో కలసిపోవును. ఆ ప్రదేశమునందే ప్రయోగియొక్క మనస్సు నిలిచిపోవుటకుగాను ఆ ప్రదేశము యొక్క వివిధస్థితిగతులనుగురించి ప్రయోక్త యడుగుచుండవలెను. ప్రయోగి ఆ ప్రదేశమునకు పోయిన వానినిగానే భావింపఁజేయవలెను. ప్రయోక్త యిట్లు చెప్పవలెను:-'పద్య,కచేరిచావిడిలోనికి,అక్కడ బల్లమీద నేమున్నదో చూడు. క్రిందపడుచిన తివాసీరం గేమిటో కనిపెట్టు; మెల్లగా సోఫామీదికి చేరు. గోడమీదనున్న పటములను చూడు; కుర్చీలు ఏది యెక్కడ నెట్లు అమర్చఁబడియున్నదో చూడు, ఇంటిలోనికిచూడు; అక్కడ నెవరున్నారో కనిపెట్టు.(కొంచెము నేపు ఆగవలయును.) రా! ఇంటినుండి వెలుపలకు; అక్కడ

యేమైనా మార్పులున్న వేమో కనిపెట్టు. బజారునందు ఎగువ దిగువచూడు. ఎవరైన వచ్చుచున్నారేమో కనిపెట్టు.'

ఇట్లు మనస్సు దేహమునందుగాక దూరముగానున్న వస్తువుపై కేంద్రీకరింపవలెను. ఇట్లు తేపకు అరగంట మొదలు గంట వరకు చొప్పున కూర్చుండి అభ్యాసము చేయవలెను. [దీని కంటె నిహపరసౌఖ్యదాయకమైన శివరామకృష్ణాదిరూప ముల ధ్యానముచేయుట మేలుగద! అందును ఒక్కొక్క ధ్యానశ్లోకమునందే, రూపవివరణము లుండును. వానిని బాగుగా మనస్సునందు నిలిపి ధ్యానముచేసిన భుక్తిముక్తులు గలుగునని చిరకాలమునుండి మనవారందఱును ఆచరించు చునే యున్నారుకాదా! దానిని వదలుటవలననే మనకీ అవస్థ లన్నియును. - పు. వెం.]

సాధారణముగా మొదటి ప్రయోగమునందే యోగనిద్ర కలుగును. లేదా వరుసగా నింకను కొన్ని ప్రయోగములు చేయవలసియుండును. ప్రతివారికిని, కాలమునందు కొంచెము ఎక్కువ తక్కువలేగాని, యోగనిద్ర గలుగుననియే డాక్టర్ షాహీన్లాస్ట్ గారి నమ్మకము. దూరదృష్టియు, నిచ్ఛాశక్తియును గలుగుటకు నిట్టివి 20 ప్రయోగములు కావలసియుండును. మొదటి ప్రయోగములోనే దూరదృష్టి కలిగినవారిని నయితము నే నెఱుఁగుదును. నూర్లకొలదిమైళ్ల దూరమునందలి విషయములనైనను వారు ఆ దూరదృష్టితోఁ జూచిరి. దానినిగురించి వ్రాసినమీఁద నవి నిజములే యని

రుజువైనవి. వారికి మామూలుజ్ఞానము నశింపనైనను లేదు. దేహమునుండి ప్రాణము కదలునట్లు తోచును. అయినను భయ పడవలదని ప్రయోగిని మంజలింపవలెను. వారికి యోగనిద్ర బాగుగా రానప్పుడే నిరోధములను స్వయముగా జయించు శక్తిగలిగినవారును గలరు. ఇట్లు వారి యోగనిద్ర బలపడి నది. ఆత్మవిజయము లభించినది. డాక్టరు ఫాహ్నెస్టాక్ గారి వద్ద నొకపిల్లవాడుండెను. వానికి పాదము వంకరతిరిగియుండెను. ప్రయోక్త దానిని సరిగానుండునట్లు ఇచ్ఛయించినంతనే దాని వంకర పోవుచుండెను. ఆమవాతము, రక్తజ్వరము, పిశాచ నాట్యము (St. Vitus dance), మూర్ఛ, హిస్టీరియా, గ్రుడ్డి తనము, ప్రసవవేదన మొదలగునవియును ఇట్లే కుదుర్పఁబడి నవని యాతఁడు వ్రాసియున్నాఁడు. ఆహికజ్వరము కుదుర్పఁ బడినది. దానివివరము ఈ క్రిందవ్రాసెదను:—

యస్. పి. బి అను వారికి ప్రతి మూడుదినములకు ఒకతూరి చొప్పున జ్వరము వచ్చుచుండెను. అతనికి ఈ యోగనిద్ర కలిగింపఁబడినది. అదియు నసమగ్రముగనే. మొదటిదినమున నుపశాంతి గలుగలేదు. రెండవతూరి చలి గలుగుటకు పూర్వము అరగంటకు ముందు యోగనిద్ర సమగ్రముగా గలిగింపఁబడినది. తరువాత అతఁడా యోగనిద్రయందే రెండుగంటల కాలముండెను. ఆ కాలమునం దాతని మనస్సును దూరప్రదేశములందు లగ్నమై యుండునట్లు చేయఁబడు చుండెను. అందతఁడు దూరదృష్టితో చూచునట్లు చేయఁ బడెను. తరువాత చలి, జ్వరము మొదలగునవి గలుగునవి

కలుగలేదు. రోగమును మఱచిపోవునట్లు దృఢసంకల్పము చేసిన తరువాత అతనిని యోగనిద్రనుండి లేపిరి. తరువాత ఐదు మాసముల కతనిని దర్శించితిని. ఆ యోగనిద్ర గలిగింపఁ బడిన తరువాత నతనికి జ్వరమే కలుగలేదని నాతో వెల్లడించెను. అనేకు లిట్లే అప్పుడప్పుడు వ్యాధివినిర్ముక్తులగు చుండిరి." (యోగనిద్ర అనే గ్రంథమునుండి)

డాక్టర్ ఫాహ్నెస్టాక్ గారి శిష్యురాలు జె. ఆర్. ఇలియట్ కన్య. వాషింగ్టన్ నివాసి. ఆమెయును నిట్లే యితరుల కీ యోగనిద్రను గలిఁగించుచుండెను. ఒక వృత్తాంతమును ఆమె యిట్లు వ్రాయుచున్నది:—

"ఒక పెద్దమనుజుడు 3 తూరులు యిట్లు ప్రయోగింపఁ బడిన తరువాత నతనికి యోగనిద్ర కలిగెను. అతను యోగనిద్రలో నున్నప్పుడు సొంతము లోకజ్ఞానము లేకుండ పోయెను. నేను చూచినంతవర కెవరికిని అట్టి ఖ్యాతి కేంద్రియజయము కలిగి యుండలేదు. దేహమంతయు మొద్దుబారించు కొనగలడు. దేహములోని యేదే నొకభాగమును స్పర్శజ్ఞానమైనను లేకుండఁ జేసికొనఁ గలఁడు. వ్రేలితో ప్రారంభించి దేహమంతయు జ్ఞానరహితము జేసికొనఁ గలఁడు. వ్రేలిని మాత్రము జ్ఞానవంతముగా నుంచి దేహమంతయు జ్ఞానరహితమగునట్లునుఁ జేయఁ గలఁడు. ఇందతఁడు గొప్ప మొనగాడయ్యెను. అతఁ డిచటికి జేరుటకు బూర్వము జరిగిన వృత్తాంతము నిట్లు చెప్పెను. అతఁడు రాత్రింబవళ్లు ప్రయాణముల

వలన మిక్కిలి అలసిపోయెను. నిద్రయైనను పట్టనంతగా నాడు లుద్రేకించి పోయెను. పక్కపై దొర్లుచు పరుండెను. తరువాత యోగనిద్రసంగతి అతనికి అకస్మాత్తుగా జ్ఞాపకము వచ్చినది. అది మేలుజేయఁదగిన సమయమంతకంటె దొరకదని తలచినవాఁడై యోగనిద్రను గలిగించుకొన నారంభింపగానే యతనికి యోగనిద్ర గలిగెను. అందతఁడు సుఖస్వప్నములఁ గనుచుండెను. తాను ఈ యోగనిద్రను అభ్యసించుటలో పడిన శ్రమ కంతకును, ఈ యొక్క సుఖనిద్రయే చాలినంత ఫలమని యాతని నమ్మకము."

దేహస్థితులను, మానసికస్థితులను లోఁబఱచుకొనుటకు యోగనిద్రయు, మెస్మరిజము నిజముగా నింద్రజాలమువలె పనిఁ జేయునవై యున్నవి. పొగాకు, త్రాగుడు, నల్లమందు మొదలగు నపాయకరములగు దురలవాటు లొకనికిఁ గలవనుకొనుఁడు. అతఁడీ యోగనిద్రలో నుండగా నా పదార్థములను స్వీకరించుటవలన రోగముగలుగునని యాతనికి నమ్మజెప్పుఁడు. అతఁడీ సంగతులను యోగనిద్రనుండి లేచుటతోడనే మఱచి పోవును. కాని అంతరమగు మేధాశక్తిమాత్రము వీనిని మరచి పోదు. ఈ వస్తువులలో వేనినైనను అతఁడు ముట్టినతోడనే, ఆతనికి జబ్బు కలుగును. ఆతనికి ఆశ్చర్యమును గలుఁగును. కొంతకాలమునకు వానిపై నతని కేవగింపుగలుఁగును. వాని నతఁడు విసర్జించును.

ప్రతివిషయమునందును రోగియొక్క మనస్సును రోగము వంకకు మరలించి, ఆ రోగము పోవునట్లు సంకల్పించునట్లు

జేయవలెను. తన ఇచ్ఛప్రకారమే జరుగునని ఆతనికి నమ్మకముగలుగు నెడల ఆతఁడు ఇంకను బాగుగ సంకల్పించుటలో ఈ ఆంతరమగు గొప్ప శక్తిని లోఁబఱచుకొనగలడు. అనుమానముతోను, పిఱికితనముతోడను అతఁడు యోగనిద్రను వదలివేయునప్పు డుండరాదు. తప్పక యేదో మేలుగలుగు ననియే అతఁడు తీర్మానించుకొనవలెను. లేనియెడల యోగనిద్రవలన రాఁదగిన మేలు రాఁదు.

ఈ యోగనిద్ర కలుగకున్నను ప్రతివారును ఇచ్ఛాశక్తిని వృద్ధిపరచుకొనవచ్చును. నిద్రలేచుటతోడనే కొంతకాలము ప్రశాంతమగు మనస్సుతో నుండి దినమంతయు నీ మనస్సు ప్రశాంతముగను, ఆనందముగను నుండునట్లు సంకల్పించుము. దౌర్బల్యములు, లోపములు నిన్ను బాధింపకుండునట్లు సంకల్పింపుము. త్వరలోనే నీ మనస్సునందు గలిగిన బలమునకు ఆశ్చర్యమును బొందెదవు. కొందఱు సహజపరిజ్ఞానముతోనే ఎల్లప్పుడు నుందురు. వారు తమ శక్తుల నుపయోగించుకొనినఁ జాలును. అవి లోఁబడి వర్తించును.

ఇరువదియొకటవ కిరణము

# జల చికిత్స



40 వ పటము.

ప్రకృతియందలి చికిత్సా శక్తులలో నొకటి

ప్రకృతియందు సూర్యకాంతి మిక్కిలి సుందరమైన శక్తితత్త్వము. దానికి తరు వాతి జలముసయితము మహత్తరమైన శక్తులలో నొకటి. మంచుగడ్డ, చన్నీరు శీతమును వహించును. వేడినీరు ఉష్ణ మును వ్యాపింపజేయును. శీతలోదకము ఉష్ణోదకములు రెండును మాలిన్యముల కలిగించి వెలువరింప శక్తిగలవే. జంతువుల ప్రాణక్రియలకు సయితే మీా జలమవసరమైయున్నది. ఈ తత్త్వము చేపలకు నివాసమై యున్నది. ఈ తత్త్వము అత్యధికముగా నుపయో గించిన మానవదేహములందలి ధాతుసంబంధమగు విద్యుత్తును వెలువరించివేయును. ఈ తత్త్వము రోగనివారకగుణము కలిగియున్నది. సూర్యకాంతి, కాంతిశక్తుల (Magnetism) వలె నంత ప్రతిభావంతమైనది కాదు. వాడుకలో నున్న మందులకంటెను, ఓషధులకంటెను గుణతరమైనది; నిరపాయ మైనదియును. మున్ముందు జలముయొక్క సునిశితమైన రోగ నివారకశక్తినిగురించి వివరించెదను. ఇక్కడ సామాన్యపరికర ముల యొక్కయు, ప్రక్రియలయొక్కయు వివరముల నిత్తును.

1 తుర్కీ స్నానములు : రషియా స్నానములు :— చెమటపోయించి దేహమునందలి మాలిన్యములను వెలువరించుట కివి యుపయోగించును. తరువాత చేసిన స్నానమువలన చర్మముమీది మాలిన్యములు కడిగివేయబడును. దానితరువాత మర్దన చేయుదురు. ఆ మర్దనవలన దేహమునందలి రక్తమునందుద్దీపన గలుగును. దేహమునందు చల్లగా నున్నట్టియు వేడిగా నున్నట్టియు భాగముల కన్నింటికిని సమానమైన వేడి తగులుట శాస్త్రదూష్యమే యగును. ఈ స్నానములవలన వేడిగానున్న భాగములయందలి వేడి యింకను నెక్కువమై మెదటిని ఆవరించును. ఇక ముందు చేయబోవు ఆవిరి స్నానములుమాత్రము ఇంకొక విధముగా నుండవలయును. అనగా దేహమునకు ప్రయోగించు వేడి వెల్తురుతో కూడి యుండవలయును. అది ముదుకరకపు వేడికంటె చాల సునిశితమైనది. తలకు సన్నని గాలి తగులుచుండవలయును. దేహమునందలి యుష్ణభాగములకు శీతవర్ణములును, చల్లనిభాగములకు ఉష్ణవర్ణములును తగులునట్లుగా నేర్పాటు చేయవలయును. అందువలన బలహీనులకును, పలుచని వారికిని, నాడీవ్యాధులు కలవారికిని నీరసము కలుగక మిక్కిలి మేలుకలుగును.

తుర్కీస్నానములు అయినతోడనే దేహమంతయు చల్లబడునట్లు చన్నీటితో కడుగవలయును. అందువలన రోమకూపములు ముడుచుకొనును. అట్లు ముడుచుకొనిన జలుబు చేయును. సుకుమారులును, హృదయ దౌర్బల్యముగలవారును శీతలోదకమును మిక్కిలి ధారాళముగా వాడతగదు. వేడిగదు

లలో నున్నపుడు మనోదౌర్బల్యముగలవారు తలపై తడి పాత్తి నుంచుకొనుట మంచిది.

తుర్కిస్నాన మనగా నాలుగువైపుల మూసియుండి పైభాగమున తలకాయ తప్ప మిగతభాగములు మూసివేయునట్లుగా నేర్పడియున్న యొక యుపకరణము. అందులో రోగి ఒక యెత్తు పీటమీద కూర్చొనియుండును. లోపల మద్యసారము (Alcohol) ఒక చిన్నగిన్నెలో వేసి వెలిగింతురు. అందువలన లోపలి గాలి వేడి యెక్కును. ఆ వేడికి లోపల కూర్చుండి యున్న, రోగికి చెమట పట్టును.

రష్యాస్నాన మనగా నుపకరణము మాత్రము అట్లే యుండును. లోపల చెమట కలిగించుటకు వేడిగాలికి బదులుగా నొక గొట్టముద్వారా నీటి యావిరిని లోపలికి విడుతురు.

2. తడికట్టు:— ఒకతడిగుడ్డ పిండి అవసరమైనన్ని మడతలు వేసి కట్టుకట్టవలసిన భాగముపై పెట్టవలెను. దేహమునందలి వేడి బయటికి పోకుండునట్లు పైన ఒక పొడిఫ్లానలు చుట్టవలయును. మంటలుగా నున్నట్టియు వేడిగా నున్నట్టియు భాగములపై కేవలము నీటిపాత్తికంటె నీలివర్ణోదకపు తడిపాత్తితో కట్టిన నింకను మేలగును.

3. వేడినీటి కాపు:— వేడినీటిలో తడిపిన వస్త్రము మొద్దుబారినట్టియు, చచ్చుబడినట్టియు, భాగముపై వేసి పై తడిపాత్తి వలెనే కట్టవలెను. పిండి నుడికించియు నిట్లు కట్టుదురు. తలనొప్పి, రక్తప్రదరము మొదలగు వ్యాధులయందు వేడి

నీటి పాదస్నానమువలన మే లగును. సీసాలో వేడినీరు పోసి కాచుటయును కలదు. మూత్రము వెంట తెలుపు పోవుచున్నప్పుడు నడ్డిపూసలమీద వేడినీటి సీసాతో కాచవలయును. అట్లే ఊపిరితిత్తుల సంబంధమైన వ్యాధులయందు ఊపిరితిత్తుల మీదను ఈ కాపు చేయవలయును.

4. గొంగళిచుట్ట:— నాలుగుమడత లుండునట్లుగా ఒక గొంగళిని క్రింద పఱచుము. దానిపైన చన్నీళ్ళతో తడిసిన దుప్పటిని పఱచుము. రోగి దానిపైన దిగంబరముగా పరుండవలయును. ఆ రోగి దేహమున కంటునట్లు బిగుతుగా మొదట తడిదుప్పటియును తరువాత గొంగళియును చుట్టవలయును. పాదములు చల్లగా నుండినయెడల నుదుటిపైనను కణతలపైనను తడిగుడ్డ వేసి చల్లపఱచవలయును. మెుచ్చెలగుంట వెచ్చగా నుండునట్లు చేయవలయును. 45 మొదలు 65 నిమిషములవరకు నీ కట్టులో నుండినయెడల బాగుగా చెమట పోయును.

5. మిక్కిలి శీతలోపచారములు:— రక్తక్షయముకలిగి నాడీవ్యాధులు, పాండువును గలవారికి మిక్కిలి శీతలోపచారములు చేయగూడదు. బలముగలవారికైనను కన్ను, గర్భాశయము, మూత్రయకోశము మొదలగు మృదువైన అవయవములపై మిక్కిలి శీతలోదకమును ప్రయోగింపరాదు. పిచ్చి, మసూచకము మొదలగు వ్యాధులయందు మిక్కిలి శీతలోపచారమువలన రోగపదార్థము ప్రాణావయవములలోనికి వ్యాపించి అపాయము చేయును.

6. వ ర్ణా రో ప ణ ము చే సి న జ ల చి కి త్స 6:-రంగులను నారో పించుటవలన జలము మిక్కిలి గుణముగల దగును. వేడినీరు త్రాగినప్పుడు జీర్ణాశయము ప్రేగులు వీనియం దుద్దీపన కలుగును. కాని ఆ యుద్దీపన స్థిరమైనదికాదు. అందువలన ప్రతి దినమును ఇట్లె చేయవలసియుండును. పచ్చసీసాలో పోసి యెండలో నుంచిన నీరు ప్రతిదినము ఉదయమున కొంచెమోతాదుగా కొన్నిదినములు త్రాగిన యెడల జీర్ణాశయమునందును ప్రేవులయందును స్థిరమైన ఉజ్జ్వనము కలుగును. చన్నీరు త్రాగినయెడల ప్రేగులయందును జీర్ణాశయమునందును గల మంటలు తగ్గును. కాని ఆ మంటలు శాశ్వతముగా తగ్గవు, తేప తేపకును త్రాగవలసియుండును. నీలివర్ణపు సీసాలో పైనతెలిపినట్టు తయారుచేసినటువంటి నీటిని మోతాదుగా ప్రతి దినము ఉదయము త్రాగుచుండిన యెడల శాశ్వతోపశాంతి కలుగును. బట్టతల, చుండు గలిగినప్పుడు ఊదావర్ణోదకముచే రుద్దిన నివారణ మగును. చుండు, బట్టతల, కాల్పులు, పుండ్లు మొదలగు వానిపై నీలివర్ణోదకముచే గడుగుటవలన గాని వర్ణోదకపు తడిపాత్తివలనగాని నివారణ మగును. ముడ్డి పూసలపై నీలివర్ణోదకముగాని ఊదావర్ణోదకముగాని తడిపాత్తి నుంచినయెడల శుష్కనష్టము, తుంటినొప్పి నయమగును. గర్భాశయమందలి మంటలకు నీలివర్ణోదకపు భగవస్తివలన నయమగును. (ఇతరచికిత్సలకు వర్ణవైద్యము చూ.)

ఇరువదిరెండవ ప్రకరణము

# పాతపద్ధతి

1 స్థూలములగు పదార్థములయొక్క స్వభావమునుగురించి పరిశోధనచేసినట్టియు, అస్థినిర్మాణశాస్త్రమునందును, శస్త్రచికిత్సయందును ప్రజ్ఞానవంతులైనవారిని మన అల్లోపతి వైద్యులు సన్మానింతురు. పారిభాషికపదములు, రసాయనశాస్త్రమునందలి సాంకేతికపదములు, రోగనిదానశాస్త్రము, వారి చికిత్సాశాస్త్రము, మొదలగునవి మాత్రమే వారికి తెలియును. కంటికి కనుబడని యతీంద్రియశక్తులు, పైశాస్త్రములయందెల్ల సునిశితముగ పనిచేయుచుండును. ఆ విషయమైన జ్ఞానము వారికి శూన్యము. అందువలన మిక్కిలి ప్రమాదకరములైన పొరబాటులను వారు చేయుట జరుగును. ఎవరైనను మనస్సంబంధమైన క్రియాకలాపమును వివరించుటకు ప్రయత్నించినపుడు వారికి సహజమగు భౌతికదృష్టితోనే దానిని స్వీకరింతురు. అనగా శాస్త్రజ్ఞాన రహితముగా తమ యిష్టమువచ్చినట్లు భావింతురే కాని దీనియొక్క సత్యమును వివేచనచేయరు.

జీవతత్త్వములను గురించియు, రోగముయొక్క నిజస్వభావమును గురించియు, రోగనివారణ చేయుటయందలి రసాయనపు మార్పులను గురించియు స్థిరమైన విధానమును తెలిసికొనుటకు మందువైద్యుల కేలసాధ్యమగుటలేదు ? మందువైద్యులు తమ కది తెలిసినట్లును అభినయించుటలేదు. బిఛాట్ అను

వైద్యు డిట్లు వ్రాయుచున్నాడు. "అసంబద్ధపు భావములచే నేర్పడిన అవ్యక్తపు కలాపమే మందు. అది శాస్త్రమే కాదు." ఏల్ కళాశాలాసంబంధులగు బార్కర్‌గా రిట్లనిరి:–
"అన్నివృత్తులయందువలెనే వైద్యవృత్తియందును, మోస మున్నది."

డాక్టరు మెగండీగా రిట్లనిరి:–
"మనలో న్యాయమైన భౌతికనియమ మొక్కటేని మనయందు లేదు."

"శాస్త్రములందెల్ల మందువైద్యమే అస్థిరమైనది" అని కీ॥ శే॥ విల్లార్డ్ పార్కర్‌గారనిరి. "మనకు రోగస్వభావ మసలే తెలియదు. అందువలన రోగమునకు మన మేమియు చేయకుండుటయే మేలుగా నుండును" అని డాక్టరు మెగండీగా రనిరి. "రోగస్వభావమును గురించి యెవరికిమాత్రి మేమి తెలియును" అని ప్రొఫెసరు యం. క్లిటాక్‌గా రనిరి. "రోగ కారణము మన కెవరికిని తెలియదు. అని, డా. జాన్‌గుడ్ అను వారనిరి. "రోగమును దానినిగురించి మొన్న మొన్నటివఱ కెవ రును తెలిసికొన బ్రియత్నింపలేదు. రోగమును గురించి యెవరికిమాత్రి మేమి తెలియును?" అని డా. విట్నీగా రనిరి. ఇట్లే అసంఖ్యాకములగు నభిప్రాయములను, ఒప్పుదలలను, వేర్కొనవచ్చును.

జ్వరము మంటలు, నాడులయందలి రక్తాధిక్యము, కండర క్రియ, మానసిక గమనము, భౌతికక్రియ, ఉష్ణకర్మ, హృదయ స్పందనములు, సవ్యాగ్రము, అపసవ్యాగ్రము మొదలగు

ననంఖ్యాకములగు విషయములు మందువైద్యులకు అజ్ఞాత విషయములుగానే యున్నవి.

మందువైద్యులలోను మిక్కిలి ప్రజ్ఞావంతు లున్నారు. వారి కైనను శాస్త్రీయములగు పునాదులు లేవు. వారి పరిశోధనలు నిజముగా ముఖ్యమైనవి. వారి శ్రమయును అత్యధికమే. వారు పూర్వకాలపు పాతబడిన గాడిలోనే పడి పైకి పెల్లగిలి రాఁజాలకున్నారు. క్రొత్తవిషయము లనినవారు వెఱ్ఱిచూపులు చూచెదరు. ఉష్ణము, వెలుతురు, విద్యుచ్ఛక్తి, కాంతశక్తి, రాసాయనికశక్తి, ధాతుక్రియ, అమృతమగు జీవతత్త్వము- వీనియొక్క తత్త్వమునుఁగురించి వారి కేమియు దెలియదు. పూర్వ సాంప్రదాయిక వైద్యులు చేయు తప్పులు మూడు.

ఒకటి ప్రపంచమునందలి మిక్కిలి సునిశితమైన సృష్టియగు మానవునికి వారు మిక్కిలి ముదుకస్వభావముగల ధాతువుల బ్రయోగింతురు. ఉద్రేకమగు క్రియలం జేతురు. కత్తితో కోయుట, పొక్కు మందుల వాడుట, కాల్చుట, ఎఱ్ఱగా కాలిన యినుముతో వాతలు బెట్టుట, జలగలను పట్టించుట, దేహమునకు రంధ్రములు వేయుట, కట్లు, మొదలగు దుర్భరక్రియలం దఱచు ప్రయోగింతురు. నిరంకుశశాసనము లెక్కువకాలము ప్రజల నణచుట కుపయోగింపదు. దానివలన ప్రభుత్వము బలహీనమగును. పోను, పోను ప్రభుత్వమున కపాయము వాటిల్లును. ప్రభుత్వము నశించును. ఇట్లే ముదుకస్వభావము గల విషాదివైద్య ప్రక్రియలవలన దేహమే

నశించిపోవును. ధనవ్యయముగూడ నమితముగా నగును. పాదరసము, నల్లమందు, మద్యసారము, పొటాసియం, సౌవీరము, నాభి, మొదలగు దుష్పదార్థముల ప్రయోగమువలన నెంతమంది దేహతత్త్వములు పాడైనవో, ఎట్టి దుర్భరదశలు కలిగినవో, ఎంతమందికి కాటికి కట్టెలు తోల వలసి వచ్చినదో వివరించుట కిచట తావు లేదు. కాయలు, కంతులు, సంధులయందలి వాపు, రక్తాభిష్యందము మొదలగు వ్యాధులయందు అనవసరముగా శస్త్రచికిత్స చేయుట మొదలగు నసంఖ్యాక విషయములను లెక్కింపవచ్చును.

2. ఒకరోగమును నివారించుటకై, దానికి ప్రతీకారముగా చేయబడుచున్న చికిత్సయు నుతప్పే. - రోగ మొక దయ్యము. దానిని వెలువరించుట కింకొకదయ్యమే కావలయును. అని పూర్వకాలపు నమ్మకము. రోగము యొక్క నిజస్వభావ మది కాదు. దేహములో మాలిన్యము శక్యము గానంతగా చేరియున్న దని ప్రకృతి దయతో జేయు హెచ్చరికయే రోగము. దేహములందలి శీతోష్ణస్వభావము లందలి సామరస్యము (balance) చెడినది. వానియందలి సామరస్యమును కుదిర్చిన రోగనివారణమగును. అసంఖ్యాక ములగు ననుభవములనుండి కొలదివిషయముల మాత్ర మిట చేర్కొందును.

బూక్లిన్ నగరమున నొక యువకుం డున్నాడు. వానికి శ్వాసాశయములనుండి రక్తము బైటికి వచ్చుచుండెను.

వైద్యుఁడు దానికి పొక్కుపట్టీని వేసెను. దేహమునందలి యితర భాగములందలి రక్తము సయితమచ్చటి కాకర్షింపఁబడి రక్తాభిష్యందమును ఎక్కువగానే చేసెను. ఒక స్త్రీ యచ్చట నుండెను. ఆమె యిందలి తప్పును గ్రహించెను. ఒక్క బొక్కెనలో వేడినీరు పోయించి, అందు పాదముల బెట్టించెను. వెంటనే రక్తము క్రింది కాకర్షించఁబడి రక్తాభిష్యంద మాగిపోయెను.

డాక్టరు బౌర్జ్ సిక్వర్డు అను వైద్యుఁడుగలఁడు. ఛార్లస్ సమ్నర్ అను నొక రోగియొక్క వెన్నుపై నెఱ్ఱగా కాల్చిన యినుముతో కాల్చెను; అందువలన నరములయం దుద్దీపనము గలుగునని యతని నమ్మకము. అట్టి దుర్నయమగు ప్రతిక్రియవలన నాడుల యందలి శక్తి నశించిపోవును. అది యట్లే జరిగినది. ఆ సెనేటరు బహుకొలదికాలములోనే మృతినందెను. ఈ క్రింది ప్రక్రియలలో నేదయినను చేసిన నెంత బాగుండును? (1) కాంత శక్తి గలిగినవానిచేతితో వెన్నుపా మంతయు మర్దనచేయుట. (2) కేంద్రీకరించిన సూర్యకాంతిప్రయోగమువలన వెన్నుపా మంతయు కందునట్లు చేయుట. పై ప్రక్రియలవలన నాడీక్రియ మృతినందక యుద్దీపనముఁబొందెడిది. దానివలన దుర్భర బాధయును తగ్గియుండును.

3. మందువైద్యులు కారణమునకుగాక పైలక్షణములకు చికిత్స చేయుదురు. దీనికి కారణ మేమనగా వారికి రోగకారణము లసలే తెలియవు. - తెలిసినను వారికి కారణ

మును జోగొట్టుటయైనను తెలియకుండును. ఈ పై సంగతిని ఈ క్రింది సంగతులతో రుజువుచేయుచున్నాను.

రాచపుండ్లు, కంతులు మొదలగునవి రక్తమునందలి మాలిన్య ములవలన గలుగును. రక్తమును శుద్ధిచేయుటయే వీనికి దగిన చికిత్స. శస్త్రవైద్యులు వీనిని కోయుదురు.

ఈ కాయలపై భూతద్దముతో సూర్యకాంతిని కేంద్రీకరించు టచే నవి మాయమగును. కాంతశక్తిగల చేతితో చేసిన మర్దనమువలనను అచ్చటి మాలిన్యములు చెదరగొట్టఁబడి వెలువరింపఁ బడును. స్వేదమువలన నీ మాలిన్యములు వెడలి పోవును. ఆవిరిస్నానములతో స్వేదమును గలిగింపవచ్చును. ఒక అవయవము బలహీనమైనప్పుడు దానిని బలపడునట్లు చేయవలెను. కట్లతో బిగించినంతమాత్రమున బిగిసికొని పోయిన సంధులు విడిరావు. ఒకనికి మేహవాతమువలన మోకాలు బిగిసికొని పోయినది. మందు వైద్యులు కట్లు కట్టిరి. కుదురలేదు. కాలును బలవంతముగాఁ జాచి కొయ్య లలో నుంచి బిగింపనెంచిరి. ఆవైద్యునకు అచ్చటి రక్తమునం దుద్దీపన గలిగింపవలయునను జ్ఞానమైనను లేకపోయినది. రోగకారణ మదియే గద. ఈ అగ్నిపరీక్షవలన రోగము నయము కాదు. ప్రాణాపాయమగును. ఆ రోగి ఆతపస్నాన ముల గురించి వినియుండెను. ఎఱ్ఱని రంగుగల సూర్యకాంతిని ఆ చోట ప్రసరింపజేయుచు, చేసిన ఆతపస్నానములవలన వాని కాలు చాపుటకు వీలయ్యెను.

అండవాతము (బుడ్డ) గూడ మొదలగు వ్యాధులకు ట్రిస్సులను పటకాలను ధరింతురు. దీనివలన ప్రయోజనము లేదు. బృహత్తు మొదలగు వానికి కారణమగు మాలిన్యములు పోవుటకు రక్తమునందు చైతన్యము గలిగింపవలయును.

ఎచ్చటనైనను వ్రణము కలిగినప్పుడు ఆ భాగమును శస్త్రవైద్యులు కోసి తీసివేయుదురు. అచ్చటి మంటలను తగ్గించిన యెడల నా భాగములందలి వ్రణములను ప్రకృతియే కుదుర్చును. నంజు, ఉబ్బు కలిగినప్పుడు చెమ్మటవలనను, మలమూత్రములు గాను దానిని వెలువరించి వేయవలయును. అందుకు బదులు, శస్త్రవైద్యులు రంధ్రములు చేసి ఆ నీటిని తోడి తీయుదురు. అందువలన ఆ శస్త్రపుగాయమునందు కుళ్లుపుట్టి ప్రాణాపాయము గలుగును. తుర్కీస్నానమువలన నయితము నంజు నయమగును. కాని కాంతితో గూడిన వేడిమివలన యకృత్తు, ప్రేగులు, మూత్రపిండములు మొదలగు వానియందుద్దీపనము కలిగి నంజు ఇంకను త్వరగా నయమగును.

**4. ఉపశాంతికౌషధములవాడుట** :-ఆమ్ల పిత్తమునకు సోడాబైకార్బొనేటు వాడుదురు. అందువలన ప్రేగులయందలి పుల్లనిద్రవముతో నీ క్షారము కలిసి బాధ తగ్గును. కాని ఆమ్లమును గలిగించు గుణ మట్లనేయుండి తిరిగి తిరిగి ఆమ్లముకలిగి బాధ గలుగుచునే యుండును. నిద్రకలుగుటకు నల్లమందును వాడెదరు. దానివలన మెదడునందు రక్తాధిక్యము

గలిగి నిద్రగలుగును. అందువలన దేహము నానాటికి బలహీనమై పోవును. స్వాభావికమగు పద్ధతులద్వారా దైహిక, మానసిక క్రియల యందు సామరస్యమును గలిగింపవలయును. తాత్కాలికముగా నుపశాంతి గలిగినట్లు కన్పించి తరువాత నమితమగు నపకారము గలిగించు విషయముల ననేకముల నిచట చేర్కొనవచ్చును. ఇదంతయు రోగస్వభావము తెలియకుండుటవలననే కలుగును. వర్ణవైద్యుడు జలవైద్యుడు, సరియైన మర్దనవైద్యుడు శారీరకక్రియలను గురించియే చికిత్సచేసి, శారీరకక్రియలను బలపఱచుట ద్వారా దార్ఢ్యమును గలిగింతురు.

మందువైద్యులందును మిక్కిలి ప్రతిభావంతులున్నారు. నేర్పరులున్నారు. వారు తమతోడి వైద్యులకంటె కొంచెముపైకి పోయి చాలవిషయములందు ప్రకృతి ననుసరింతురు. నే నిదివఱకు పేర్కొనిన విషయము లన్నియు సత్యమైనవి. న్యాయబుద్ధిగలవారెల్ల వీనిని ఒప్పుకొనియే తీరెదరు. "అన్ని శాస్త్రములలోను అనిర్ధారితమైనదని" డాక్టరు పార్కర్ గారిచే చెప్పఁబడిన యే అసత్యశాస్త్రమున్నదో అట్టి మందు శాస్త్రము ప్రకారము సక్రమవైద్యులు, తమకంటె భిన్నమైన సాంప్రదాయములయందు వినయమును, సహనమును జూపుట న్యాయమే కదా? కాని వారికి సహనములేదు. కొన్నిచోట్ల ప్రజలరక్షణమను పేరుతో నిజమునకు తమ సంరక్షణకొరకై నిరంకుశములగు శాసనములను చేసియున్నారు.

కేవల నిరపాయచికిత్సలు చేయగలవారైనను రోగనివారణము చేయుట కర్హులుగారు. మందువైద్యులతోనే కూడిన సంఘముయొక్క పరీక్షలలో గెలుపొంది, వారిచే యోగ్యతాపత్రిమును ముందుగా బొందవలయును. లేకున్న జరిమానాలు, శిక్షలు తప్పవు. ఎంత అవినయము! ఇందు వలన తమ రోగనివారణకై తమ యిష్టమువచ్చిన వైద్యులను నిర్ణయించుకొనుటకు వీలులేనంత అసమర్థులుగా ప్రజలు భావింపఁబడినారు. దీనికిని రాజశాసనమే కావలెనా? మతనిరంకుశత్వ మెప్పుడో పోయినది. ఫలాని సాంప్రదాయము గలవారి బోధనలే వినవలయు నను నియమ మిప్పుడులేదు. "దేవునిగురించి వినుట యెవరి యిష్టము వచ్చినట్లు వారు చేసిన ప్రమాదము లేదుగాని, ప్రాణముతో సంబంధించిన విషయములందు జాగ్రత్త వలదా" అని యందురు. పూర్వము మతబోధవిషయమున సయితే మిట్లే యనుకొనిరి. అది యిప్పుడు పోలేదా? మిక్కిలి సత్యమగు సిద్ధాంతములపై నాధారపడిన చికిత్సాశాస్త్ర మిప్పుడు భూమిపై నుదయించుచున్నది. ఆ విధానములు మిక్కిలి స్వాభావికమైనవి. ప్రతిభావంతములగు గుణములు కలిగియే తీరును. స్థిరముగా నుండును. స్వర్గీయమగు నీ సత్యము జగద్వంచకులగు మందువైద్యులచే సంహారింపఁబడగలదా? ఈ కువైద్యులనుండి మనకు రక్షణ లేదా యని నన్నడుగుచున్నారు. ఎవరిని మీరు కువైద్యులనుచున్నారో అట్టి మేము సాంప్రదాయిక వైద్యులగు మీరు నివారింపఁ జాలని రోగములను సులభముగను,

సత్యముగను, శాశ్వతముగను నివారింప గలుగుచున్నాము. ప్రతిరాష్ట్రమునందును "దుస్సాంప్రదాయము''ను అణచి వేయుటకు శాసనమున్నది. అదియే చాలును. విద్య సంపాదించుట మంచిదే. కాని స్వర్గీయమగు నీ శక్తులను సంపాదించి యెముకలను సరిజేసి, సాంప్రదాయిక వైద్యులకంటె సులువుగా రోగనివారణము చేయగల వానిని అణచివేయ నెంచుట దుస్సాహసమును, పిల్లకాయతనమును కాదా ?

ఇరువదిమూడవకిరణము

# వివిధ విషయములు

1. మానవుల రోగనివారణకొఱకు నవీనములగు అనేకవిధానము లున్నవి. కొన్నింటి నిదివఱకే వివరించితిని. ఇంకను కొన్నింటి నిచట పేర్కొందును.

2. మృత్తికా వైద్యము:—చాలచోట్ల మిక్కిలి యుపయోగకరముగా నుండును. రాసాయనిక క్రియవలన ముదుకరకపు విషములను లాగివేయుటకు మట్టికట్లును, మృత్తికా స్నానములు మిక్కిలి ప్రయోజనకారులు. 'మణి' అని వాడబడు రాతియందు పిచ్చికుక్క తేలూరకు విషమును లాగివేయు గుణమున్నది. పిచ్చిజంతువు యొక్క కాటువలన దేహమునందు చేరిన విషమును లాగివేయుటకు మట్టికట్టునం దెక్కువ సామర్థ్యమున్నది. సూర్యాగ్నియందు తప్తమైన యిసుక దేహముమీద గప్పుకొనినయెడల రక్తమునం దుద్దీపనము కలుగును. అందువలన రక్తము శుద్ధమగును. పొడిమన్ను పుండుపై చల్లుట మంచిది. మంటలతో గూడిన యెఱ్ఱని పుండ్లకు నల్లమట్టి యెక్కువ గుణము గలది. చచ్చువాతము మొదలగు ఉద్దీపనము తక్కువగుటచే గలుగు వ్యాధులకు పచ్చని, యెఱ్ఱని మన్ను మంచిది.

3. సంగీతము వలన నొకానొకప్పుడు ఉద్రిక్తమగు మనస్సునకును, నాడులకును శాంతి చేకూరును. మాంద్యముకలదిగా నున్న మనస్సును, నాడులను ఉద్దీపింపజేసి ఉత్సాహము గలి

గించి, నవజీవమును కలిగించును. అందువలన నాడులును, రక్త వాహికలును సమరసమును బొంది సక్రమ గమనముగల వగును. గానమునందలి మంజులధ్వనివాహికలు సక్రమ ప్రవాహము గలవై యుండుటవలన నారోగ్యవర్ధకములై యుండును, రాళ్లు పఱచిన రోడ్లపైన నడచు శకటములవలన గలిగిన కఠోరమగు ధ్వనివలన సునిశితమగు నాడుల కెంతయేని అపకారము గలుగును. ఈ ధ్వని అక్రమ ప్రవాహము గలదై శూలపు పోటులవలె మొనదేలి శబ్దగ్రాహక నరములను బాధించునట్లుండును. రోడ్లు మిక్కిలి నునుపుగా నుండి వానిపైన విద్యుచ్ఛక్తితో శకటములు నడచునట్లు ముందుం దేర్పడగలదు. అప్పుడు దేశీయుల యారోగ్యమునకు భంగకరమగు ఈ టక్-టక-టకా-టక్ అను ధ్వనులు లేకుండబోవును. దేశీయుల యారోగ్యము వృద్ధియగును. విసుగెత్తియున్న ప్రజలకు మంజులగానము తఱచుగా వినఁబడుచుండిన ఆరోగ్యము వృద్ధియగును. అట్టిది ప్రతిబహిరంగ సాముదాయిక స్థలమున తఱచు జరిగిన మేలగును. [మన దేశమునందును మద్దెల దెబ్బ తగులని చోటఁ బీడలు ప్రబలునను వాడుక మాటగలదు.]

4. కొన్ని యోషధులు గలవు:— వానిగుణమున కనుగుణమైన గుణముగల రంగుల సీసాలో వానినుంచి యెండలో నుంచినయెడల నాయోషధియందలి గుణమధికమై, మిక్కిలి చోఱబారు స్వభావమును, గుణమునందు స్థిరతయు నేర్పడును. ఇట్లు ఆమ్లములు నీలిరంగు సీసాలోగాని, నీలి ఊదారంగు సీసాలోగాని యుంచుటవలన వానిగుణ మధికమగును. క్షారములు

పచ్చని సీసాలోగాని, యెఱ్ఱని సీసాలోగాని యుంచవలెను. భేదికరౌషధములను పసుపు పచ్చని సీసాలో నుంచవలెను. వేడితగ్గించునట్టియు, ఉపశమనకరములునగు వానిని నీలి రంగు సీసాలో నుంచవలెను. హైడ్రోక్లోరికామ్లము మొదలగు పుండు కలిగించు మందులను ఎఱ్ఱని రంగుసీసాలోగాని నారింజరంగు సీసాలోగాని యుంచవలెను. దానిని నీలిసీసాలో నుంచి యెండలో నుంచినయెడల ఆ సీసా బ్రద్దలగునంత యుద్రేకమైన యెఱుపురంగు అందు గలదు.

5. దీపమునకు వేయుగ్లాసులు :— ఎఱ్ఱని రంగువిగా నుండరాదు. ఆరంగు కంటికి హితముగా నుండదు. నాడులయందు దేక్రమును గలిగించును. లోపలిభాగమున తెలుపుతో గలిసిన నీలిరంగు కాంతిగల చిమ్నీల నుంచినయెడల కన్నులకు హితవుగా నుండి నాడులకు నెమ్మదిని గలిగించును.

6. కంటిజోళ్లు నీలిరంగు గలవిగా నుండినయెడల బలహీనమగు కంటికి మేలుచేయును. ఇసుక, మంచు మొదలగునవి పడకుండ నాపును. నీలిరంగద్దములు దొరకనిచో పొగ రంగుఅద్దములే చాలును.

7. విద్యుద్దీపముల యొక్క తీక్ష్ణతను తెలుపురంగు పూసిన చిమ్నీలవలనగాని, నీలిచిమ్నీలవలనగాని తగ్గించుకొనవలెను. రంగులయొక్క రోగనివారకశక్తిని గురించిన జ్ఞానము లేకుండుటవలననే ఫ్రెంచిదేశపు ఇంజనీయరుగారు విద్యుద్దీపములకు పసుపుపచ్చని చిమ్నీల నేర్పాటు చేసెను.

గాలిదీపములు, కిరసనాయిలుదీపములకు పసుపుపచ్చని లేక, నారింజరంగు చిమ్నీలవలన చాల అపాయము గలుగును. అందువలన చిమ్నీలు ఆకుపచ్చనిరంగు గలవిగా నుండ వలెను. నీలపు రంగు కలవిగా నుండిన నింకను మేలగును.

8. వైద్యులును బోధకులును:— విద్యాగర్వముచే విఱ్ఱవీగుచు నే సంస్కృతమో, లాటినో, గ్రీకుభాషయో తమకు తెలియునని ఆ పదములనే తఱచు ప్రయోగించుచు తాము కని పెట్టినవానినిగా నేవో కొన్నిసంగతులను జెప్పుచుందురు. లేదా యెక్కువ వెలపెట్టి ఒకగ్రంథమును రచింతురు. అది రహస్యగర్భితమని చెప్పెదరు. అందు మహత్తు ఉన్నదనియు చెప్పెదరు. వీనియం దెల్ల స్వార్థమే గోచరించును. మరియు పదింట నొక్కదానియందేని చెప్పగలిగిన దేమియు నుండనే యుండదు.

9. స్వీడిష్ చలన చికిత్స:— స్వీడను దేశమున దేహమును బట్టి రోగ నివారణ చేతురు. వానికి స్వీడిష్‌చలన చికిత్స యని పేరు. కండరముల పట్టు చికిత్సగలదు. వాయువు లేని తిత్తులను దేహముపై నుంచుదురు. మన దేహము నందలి వాయువు అందులోనికి చొచ్చుకొనివచ్చును. దీనికి వాయురహిత చికిత్స The vacuum treatment) అని పేరు. దేహముపై నున్న కోశములోనికి గాలిని ఎక్కిం తురు. దానికి వాయుపీడన చికిత్స (compressed air treatment) అని పేరు. కుంచెలతో మర్దనచేయు చికిత్స యొకటి గలదు. ముతుక తుండుగుడ్డలతో రుద్దుట యింకొక

విధము. సౌందర్యమును బలమును గలిగించు వ్యాయామము, శరీరపరిశ్రమ, స్నానములు గలవు. ఇవి యన్నియు యుక్తరీతి నాచరించినచో కండరములందు చైతన్యమును గలిగించి రక్త శుద్ధినే కలిగించును. కాంతశక్తిగల దుస్తులు (Magnetic garments) మిక్కిలి బరువుగాను, రోమకూపములను మూసి వేయునట్లును లేకుండునట్లును ధరించిన రక్తమునం దుజ్జీవనము కలిగి మాలిన్యములు వెడలిపోవును. రోగనివారణ మగును. విశ్వాసమువలనను, ప్రార్థనవలనను, రోగములు నివారణమై తీరును. ఈ సంగతిని నిరాకరించుట అజ్ఞానవశముననే అయి యున్నది. అనాదినుండియు సత్ఫలితముల నొసంగుచున్న ఈ విధానముల నిరాకరించుటకు మూర్ఖతయే కారణము. ఈ విధానమును బ్రయోగించువానినుండి వెడలుచుండు కాంత శక్తివలన రోగనివారణ మగును. మరియు ప్రార్థనవలనను, విశ్వాసమువలనను దైవికశక్తులు మనయందు సులువుగా వ్యాపించును. అందువలనను రోగనివారణ మగును.

10. వ్యాయామము :— శాస్త్రములవలన మన మత్యంత మభివృద్ధి నందుచున్నాము. మిక్కిలి జనసంఖ్యగల నగరములలో మాత్రము వసతులు తక్కువగ నుండుటవలన నిది సరిగ సాధ్యమగుటలేదు. మానవజీవితము రెండువందల వత్సరములకంటె నిప్పు డధికమైనది. సర్కారు లెక్కలను బట్టి చూచినచో స్త్రీలయొక్క ఎత్తు పూర్వమునకంటె నిప్పుడు కొన్ని అంగుళములు పెరిగినట్లు తెలియుచున్నది. దీనికి వ్యాయామము, ఆరోగ్యనియమపాలనములునే కారణ

ములై యున్నవి. రొట్టె, మానవముఖము తెల్లని తెలుపు రంగు కలిగియుండుట ఆరోగ్యకరములు గావని తెలిసికొను చున్నారు. తీక్ష్ణమగు సూర్యకాంతివలన ముఖము, వెంట్రుకలు, కన్నులు నల్లఁబడును. సౌందర్యవృద్ధి యగును. యూరపు దేశము 1,10,00000 బడిపిల్లలను పరీక్షింపగా జర్మనిలో మాత్రమే వేయింటికి 318 మంది చొప్పున శుద్ధముగా చామన చాయగలవా రున్నారు. అంతకంటె వేడిదేశమైనను ఆస్ట్రియాలో నట్టివారు వేయింటికి 198 మంది మాత్రమే. స్విట్జర్లండులో నట్టివారు వేయింటికి 111 మంది మాత్రమే. బాగుగా వేడిదేశమగు స్పెయిన్‌లో నింకను నల్లనివా రున్నారు. వారికే యారోగ్యనియమములు సమగ్రముగా దెలిసి యుండినయెడల వా రత్యంతదృఢజాతిగా తయారయ్యెడివారు. డాక్టరు బెడ్డియో అనువారు ఇంగ్లండులో 726 గురు స్త్రీలను పరీక్షింపఁగా అందు 369 మంది తెల్లనివారు, 356 మంది చామనచాయవారు నుండిరి. తెల్లనివారికంటె, చామన చాయవారిలో నూటికి 15 ఎక్కువమందికి వివాహము లగుచుండెను. పాలిపోయిన వారిని వివాహమాడుటవలని అనర్థకతను యువకులు గ్రహించుచున్నట్లు భావింపవలెను. తెల్లని చర్మమువారు అనవసరము. చామనచాయవారే అవసరమై యున్నారు.

10 వ పేరాలోని విషయములన్నియు విదేశముల సంగతులు. మనజాతి దిగనాసిల్లుచున్నది.

11. దిగంబర ఆతపస్నానములు:— ఎక్కువ కాలము చేయుచుండినయెడల చర్మము ఆర్చుకొని పోవుచుండును. కాన శేఱుచుగా నూనె రాయుచుండవలెను. ఆలివు నూనె మంచిది. [కొబ్బరి, నువ్వులనూనె లైనను మంచిదే] నీలివర్ణోదక క్షాళనమువలన నయితము మిక్కిలి మేలగును. ఎండలో తిరుగు జాతులవారు చమురు తరచుగా రాచుకొనుచుందురు. అందువలన వారి చర్మములు మృదువుగా నుండును.

12. సన్నని వారు:— ఎక్కువగా చన్నీటి నుపయోగించినయెడల చర్మమునందు క్రొవ్వుపదార్థము తగ్గియుండుట వలన, వారి దేహములందలి కాంతశక్తి అత్యధికముగా వెడలిపోవును. అట్టి వారికి వారమునకు ఒకటి రెండుతూరులు దేహమునకు నూనె రాచుకొనుచుండుట మంచిది. ఎక్కువ కాలము ఈత కొట్టఁదలచినవారు తమ దేహములకు నూనె రాచుకొనుట మంచిది. నూనె యుండుటవలన దేహమునుండి కాంతశక్తి త్వరగా వెడలిపోనీయక ఆపును.

13. ఉష్ణదేశములందు నివసించువారు:— శీతలదేశవాసులవలెనే, ఆతపస్నానముల వలనను, సూర్యకిరణచికిత్సాసంబంధమగు నుపకరణముల వలనను మేలును బొందఁగలరు. దిగంబరమగు దేహముపైఁ బడిన సూర్యకాంతివలన ధాతుశక్తి వృద్ధియగును. అట్టివా రెంతటి శీతోష్ణముల నైనను నిరపాయముగ భరింపఁ గలరు.

**14. గ్రంథముద్రణ కుపయోగించు కాగితము:—** కొంచెము నీలిరంగు కలసిన తెల్లనికాగిత ముండవలయును. అందు ముద్రింపఁబడిన నల్లని అక్షరములు మిక్కిలి స్పష్టముగా నగుపించుట కవసరమగు తెలు పుండవలయును. బలహీనమగు కన్నులకు చల్లదనము నీయగలిగినంత మాత్రమైనను నీలిరంగు సమ్మేళన ముండవలెను. గులాబిరంగు కాగితము కన్నులకు వేడిచేయును. పాలవలె కేవలము తెల్లగా నుండు కాగితమైనను పనికిరాదు. బూడిదరంగుతో గూడిన తెలుపు, కొద్దిగా నీలముకాని, మిక్కిలి తక్కువ ఆకుపసుపు రంగుతో కలిసినట్టి కాని తెలుపురంగు కాగితము మంచిది. తరువాత తెల్లని కాగితము మంచిది.

మొదటిభాగము సమాప్తము.

# సునిశిత వైద్యోపం

రెండవ భాగము

## నాడీమండలము - ఉన్మాదము

హరిః ఓం.

ఒ క ట వ  కి ర ణ ము

# గ్రంథ విషయములు

1. పెద్దపెద్ద గ్రంథములలోని మిక్కిలి సూక్ష్మవివరములను వదలివేసి నాడీమండలముయొక్కయు దానికి సంబంధించిన వివరముల యొక్కయు వర్ణన నిచ్చెదను.

2. అవసరమైన చోటులందు వాడుకలో నున్న పారిభాషిక పదములనే వాడెదను. బుద్ధిమంతులకు విసుగు జనింపకుండు నట్లు విషయములను సాధ్యమైనంత సంగ్రహము చేసెదను. నాలుగువేల పేజీలున్న నిఘంటువులలో సయితము కానరాని పదములను ప్రయోగించుటయందే చాలమందికి అలవాటు.

3. నాడులకు సంబంధించిన వ్యాధులను వివరించి, మామూలుగా వాడుకలోనున్న మోటు మందులతోగాక సునిశిత తత్త్వములతో చేయఁదగిన చికిత్సను వివరించెదను. మోటు తత్త్వములకన్న సునిశితతత్త్వము లెక్కువ ప్రతిభావంతములుగద! దుర్భరమగు నీ నాడీవ్యాధులను నివారించుట కవసరమైనంతవరకు ప్రధానసూత్రములను మానసిక శాస్త్ర విద్యార్థుల యుపయోగమునకై వివరింతురు. ఈ సూత్రములను తెలిసికొందురేని దుర్భరనాడీవ్యాధుల నింకను త్వరగను, సులువుగను నివారింప వీలగును.

4. ఈగ్రంథముయొక్క మొదటి భాగమునను, నాలుగవభాగమునను నాడులయొక్కయు, మనస్సు యొక్కయు గమనక్రియ వివరింపఁబడినది. ముందాభాగములు చూచుట మంచిది.

## రెండవ కిరణము

# నాడీమండలము

1. నాడీమండలము యొక్క స్వభావము :— మానవ దేహమునందు మానసికయంత్రమును, నాడీమండలమును ప్రధానభాగములు. కండరములు, రక్తము నిర్జీవములగు సేవకులు. నాడులయందుండి చైతన్యము సంతతము ప్రవహించుచు కండరములను, రక్తమును చైతన్యవంతములుగా జేయుచుండును. రక్త మొక ద్రావకము. నెమ్మదియైన నడకగలది. ముదుకస్వభావము గలది. ప్రాణావసరమైనదే కాని ఆత్మస్వభావము గలదిగాదు. కేవల దైహికమగు పదార్థము. మానసికశక్తులన్నను మెఱుపువలె మిక్కిలి వేగముగల గమనము గలవి. ఈ వైహాయసములు ఆత్మపదార్థమునకు మిక్కిలి సన్నిహితమైనవి. సామాన్యమగు నాడీశక్తి మానసికశక్తులలో మిక్కిలి ముదుకస్వభావము గలది. కాని కండరములను, రక్తమును కదలించుటకు సూక్ష్మశక్తులకంటె ఈ స్థూలశక్తులే చాల అవసరమైయుండును.

2. నాడీశక్తి ద్రావమేనా ?:— వైహాయస మని పిలిచినప్పుడే నాడీశక్తిని ద్రావమని పిలుచుట యైనది. దృశ్యప్రపంచమునందలి శక్తియంతయు ద్రావమే యని నే నిదివరకే అనేకతూరులు వివరించియుండుటవలన నిచట తిరిగి వివరింప నక్కరలేదు. విశ్వమున నంతటను ఒక్క నియమమే వర్తించుచుండును గాన అదృశ్యశక్తులకు సయితమ మిది వర్తించును.

కనుక అదృశ్యశక్తియును ద్రావమే. హార్వే అను నతఁడు రక్తాభిసరణమునుగురించి తెలిపినప్పు డతని సమకాలికులు గ్రహింపలేరైరి. ఇప్పుడు నాడీశక్తి ద్రావమే నని చెప్పిన ననేకులు గ్రహింపలేకుండ నున్నారు. వివరింప సాధ్యము గాని యనేక విషయములను వివరించుట కీజ్ఞానము మిక్కిలి యుపయోగకరముగా నుండును.

3. ప్రధానఅవయవములప్రాముఖ్యము:— ప్రధానావయవమగు మెదటినుండి అసంఖ్యాకములగు నాడీతంత్రులు హృదయమునకు, రక్తవాహికలకును, కండరములకును, ప్రేగులు మొదలగు నవయవములకును వ్యాపించి యున్నవి. వానిద్వారా ఆయాయవయవములయొక్క గమనము శాసింపబడుచున్నది. ఆ నాడులయొక్క గమనమే లేనియెడల దేహ మొక శవ మగును.

4. నౌకరులవలన పంపఁబడు ప్రతిక్రియారూపకశక్తి:— రక్తము, కండరములు మొదలగునవి మిక్కిలి కలుషితము లైనయెడల యజమానులగు నాడులు చెడిపోవుటయును జరుగును. వాని గమన మరికట్టబడి నశింపు జేయబడును. మెదడునందలి కణముల కాహారమును, తడియును కావలసి యుండును. కొంత రక్త మచటికిఁ బ్రవహింపవలయును. అతీంద్రియదృష్టితో చూడగలవారున్నారు. పిచ్చిమెదటిని పరీక్షించి మెదటిలోనికి బోవు రక్తవాహిక లరికట్టఁబడినట్లు వారు గుర్తింపఁ గలిగిరి. మనస్సు శుద్ధముగా నుండవలయునన్న రక్తము శుద్ధముగా

నుండుట అవసరము. రక్తము శుద్ధముగా నుండవలయునన్న శ్వాసాశయములు, హృదయము, జీర్ణాశయము, ప్రేగులు, మూత్రపిండములు మొదలగునవన్నియు మిక్కిలి సక్రమము గా నడచునవిగా నుండవలయును. అతీంద్రియదృష్టి గలవారే కాక వైద్యశాస్త్రజ్ఞులును నీ విషయమునే నిర్ధారణజేసిరి.

5. నాడులయందలి భాగములు: విద్యుత్ సంబంధ మగు తీగెలను మీరు చూచియుందురు. అందు, తీగెలు లోపల నుండి పైన ఒకతిత్తిలో మూయఁబడియుండును. మన నాడు లకును అట్లే లోపల నాడీసంబంధమగు తెల్లని తంతువులుండి, దానిపైన బూడిదరంగుగల ఒక కవచముండును. ఆ తిత్తి లోపలనున్న తంతువులలోని నాడీశక్తిని వెలుపలకు పోకుండ గాపాడుచును, లోపలనున్న తంతువులన్నియు నొక ప్రధాన తంతువును చుట్టుకొనియుండును. అందలి ప్రతితంతువును అసంఖ్యాకములగు సూక్ష్మాతిసూక్ష్మములగు తంతువుల సమ్మే ళనమై యున్నది. ప్రధానతంతువునుండియే వార్తలు నడచు చుండును. లోపలితంతువులును, వెలుపటితిత్తియును గలిసి ఒక నరమనుపేర బిలుతురు. వీనియందు భాస్వరముతో గలిసిన క్రొవ్వుపదార్థమును, శ్వేతధాతువును నీరును గలిసియుండును.

6. ప్రతినాడీసముదాయమునందును: ఇట్టి తంతువుల తోను వెలుపలి తిత్తితోను గలిసిన అనేకనరముల సముదా యము లుండును. ప్రతి నరసముదాయమునకును ఒక రక్షక

కోశము (తిత్తి) ఉండును. కొన్నిరకముల నరముల పటము యీ క్రింద నీయఁబడినది.




1 వ పటము.

A. - కవచము (తిత్తితో గూడిన ఒకనరము) 1 - రెండు భాగములను కలుపుచోటు, ఇది తుంటినరముల కట్టలోని ఒక తంతువు. 400 రెట్లు పెంచబడినది. నల్లనిభాగము కవచము (తిత్తి).

B. - స్వతంత్ర నాడీమండలములోని నరములలో నొకటి. దీనికిపై నున్న తిత్తి తీసి లోపలి తంతువులు చూపఁబడినవి. 450 రెట్లు పెంచి చూపఁబడినది.

మూడవకిరణము

# మెదడు-మజ్జామండలము

## ( CEREBRO-SPINAL SYSTEM )

1. నాడీమండలము రెండు విధములు. ఒకటి మెదడు, మజ్జామండలము. రెండవది స్వతంత్రనాడీమండలము. రెండు సంస్థలయొక్క పనులు విలక్షణముగా నుండును. కాని ఒకదాని కొకటి సంబంధించి యున్నవి. ఒకటి ఒకే సంస్థ యొక్క సవ్యభాగము, రెండవది అపసవ్య భాగము. ఒకటి లేకున్న రెండవది పనిజేయదు.

2. వెన్నుపాము ముచ్చెలగుంట మొదలు ముడ్డిపూసలలో క్రిందిదానివరకును వ్యాపించి యుండును. అచటినుండి ముడ్డిపూసలు సన్నగను ఇరుకుగను నుండి కణములతో గూడుకొని బూడిదరంగు గలిగి యుండును. దీనికే తోక యనిపేరు.

3. వెన్నుపాములోనుండి వెడలు నాడులు 31 జంటలు. అది వెన్నుపాములోనుండి వ్యాపించియుండును. వెన్నుపాము వానిని గాపాడుచుండును. వెన్నుపాము 33 పూసలయొక్క యేకాకారమైయున్నది ఇందు మెడపూసలు 7, వెన్నుపూసలు 12, నడ్డిపూసలు 5, ముడ్డిపూసలు 5. ఈముడ్డిపూసలు పెద్దవారి యందు యేకాకారమై త్రికాస్థియనుపేర బిలువఁబడును. అన్నిటి దిగువనున్నది తోకటిక. ఈ వెన్నుపాము దేహమును నిలువబెట్టుగట్టి స్తంభమువలె నుండును. అనేక పూసలయొక్క

సమ్మేళనముతో నేర్పడియుండుటవలన నటునిటు వంగుటకును, కదలుటకును వీలుగా నేర్పడియున్నది.




మెదపూసలు, వెన్నుపూసలు, నడ్డిపూసలు, ముడ్డిపూసలు.

4. వెన్నుపాము :— ఇందుండి వ్యాపించిననరములు, చిన్న మెదడు, పెద్దమెదడు, వానికి సంబంధించిన ముడులు, మజ్జాముఖము (ఇచటనుండియే వెన్నుపాము ప్రారంభమగును). మజ్జాముఖము, చిన్నమెదటిని కలుపు (Pons Varolii) అను సంధియును చేరినదానికే మెదడు, మజ్జామండల మని పేరు.

5. మెదటిని గురించి ఇచట కొలఁదిగా మాత్రమే వ్రాయుదును.

6. మెదటికిని అట్లే వెన్నుపామునకును చుట్టుకొని ళిపొర లున్నవి. పుఱ్ఱెయెముకలకు లోపలిభాగము నానుకొని దట్టమైన పీచుపదార్థమున్నది. దీనికిగట్టిపొర అనిపేరు. దీనికి లోపలగా పలుచని ద్రవముతోగూడిన సాలెగూడువంటిపొరయున్నది. దీనికి సంధిపొర అని పేరు. ఇది గట్టిపొరను నిక ముందు వర్ణింపఁబడు మెత్తనిపొరతో కలుపును. వీనికి రెంటికిని లోపలగా నున్న మెత్తని పొర నాళముతో గూడియుండును. ఇందు రసము, నరములు మొదలగునవి కలిసియుండును.

7. చిన్నమెదడు పెద్దమెదడుల వెలుపల ఒక పొరకప్పియుండును. అందులోపల కణము లుండును. ఆ కణము లున్న భాగము మిక్కిలి చురుకుగానుండి మెరుపు కలిసిన బూడిద రంగుగా నుండును. ఇందుండియే అన్ని నాడుల ముడుల (ganglia) కును శక్తి వ్యాపించుచుండును. వెన్నుపాము లోపలను, మజ్జాముఖమునను ఈశక్తి మిక్కిలి చురుకుగా బనిచేయుచుండును. లోపలకు వచ్చుచుండు నాడీశక్తివలన

నిందలి కణము లుద్దీపనఁ బొంది తమ శక్తి నలువైపుల విర జిమ్మును. అందువలన నా శక్తి దేహమంతటికిని వ్యాపించును. అంతట దేహము చైతన్యవంత మగును. ఈ బూడిద రంగు గల పదార్థము మెదటిలోనుండినను, మజ్జాముఖమున నున్నను వెన్నుపాములో నున్నను, ముడులలో నున్నను, మిక్కిలి చురుకుగా నుండి నాడీవాహికలను తెలచుటకు సమర్థత గలిగియుండును. ౮-వ పటములో మానవ దేహమునందలి కొన్ని నాడీకణములు చిత్రింపఁబడినవి. వానియొక్క వ్యాసరేఖ 200 రెట్లు




౮ వ ప ట ము.

పెంచి వ్రాయఁబడినవి ప్రతి నాడీకణమునుండియు వ్యాపించి యున్న సూక్ష్మములగు కణములు చిత్రింపఁబడి యున్నవి.

21

కణమునందలి మిక్కిలి శీతలమైన భాగములనుండి చలన నాడులు (Motor nerves) బయలుదేరును. విద్యుచ్ఛక్తి సన్నని భాగములకు చేరుకొనును. 3-వ పటమున C. D. F. అను కణములు వెడలుపు తక్కువగను, పొడుగు ఎక్కువగను నున్నవి. వాని రూపములు ఆ సన్నని భాగములనుండియే సాగి వచ్చుచుండును.

**8. వెన్నుపూసలలో నొకదాని అడ్డుకోత**

4-వ పటములో చిత్రింపఁబడినది. ఇందు నాడు లెట్లు ప్రసరించునది చిత్రింపఁబడినది. వెన్నుపామునుండి బయలు




4 వ పటము.

దేరు నాడుల మూలము (13) లిందు చూడవచ్చును. మెడ వ్రూసలలో నొకదాని అడ్డుకోత యిది. నాడుల సంబంధమగు పీచుపదార్థము తెల్లగా నుండును. లోపల నుండు బూడిద రంగుపదార్థము మిక్కిలి స్పష్టముగా కాన్పించుటకు ఆ తెల్లని భాగము మిక్కిలి నల్లగా చిత్రింపఁబడినది. బూడిదరంగు పదార్థమునందలి రెండు పెద్దభాగములును ముందు (5) భాగమున తెల్లని పదార్థముతోను, వెనుక (6) భాగమున బూడిద రంగు పదార్థముతోను కలుపఁబడుచున్నది.







6 వ పటము.

5 వ పటమునందు, లోపల నున్న బూడిదరంగుగల పదార్థము




6 వ పటము

నందలి శృంగముల నుండి జ్ఞాననాడులు, చలననాడులు బయలుదేరుట చూపఁబడినది. దేహము నందలి చర్మమువైపు భాగమున జ్ఞాననాడులున్నవి. దేహమునకు నేదైన అపాయము సంభవించిన నీజ్ఞాననాడులు హెచ్చరిక దెలుపును. అందులకే ప్రకృతి వానిని చర్మము వైపున నుంచినది.

9. 6 వ పటము చూడుము. ఇందు వెన్నుపాము, వెన్నుపామునందుండి కపాలములోనికిని దిగువకును వ్యాపించియుండు నరములు వానికి సంబంధించిన భాగములును చూపఁబడినవి.

వెన్నుపూసలలోని ద్వారములవెంట వ్యాపించిన కొన్ని నర ములును ఇందు చూపఁబడినవి.

10. మజ్జాముఖము (Medulla Oblongata):— ఇందు బూడిదరంగు గల పదార్థము విస్తారముగా నుండును. అనేక సముదాయముల కిది మూలము. ఇందు 5, 6, 7, 8, 9, 10, 11, 12 సంఖ్యలు గల కపాలనాడు (Cranial nerves.) లున్నవి. శ్వాసక్రియకు, మాట్లాడుటకు, నమలుట, మ్రింగుట, భావప్రకటన కవసరమైన ముఖచిహ్నములను గలిగించుట, మొదలగు క్రియల కిదియే మూలము. హృదయము నకు సయితము మిచటినుండియే నాడులు చేరును. హృదయస్పంద నమున కవసరమైన నాడులు, మొదటి వెన్నుపూసలోనుండి వచ్చును. అయినను హృదయకండరముల కదలించు నాడులు మాత్రము మిచటనుండియే వ్యాపించియున్నవి. కనుక కాంతి శక్తిగలవ్రేళ్లతో ముచ్చెలగుంటకు నెగువను, ఉద్దీపింపఁజేయుటవలన రక్తనాళములయం దుద్దీపనము గలుగునని గ్రహింపవలెను. ముందు వెనుకలనుండి దిబ్బవంటి భాగములు (Anterior and Posterior Pyramids) ఆలివ్ గింజవంటి భాగము (Olivary body); ప్రక్క భాగము (Lateral Tract); చిన్నమెదడున కాధారమైన భాగము (Restiform Body)- ఇవి యన్నియు నీ మజ్జాముఖములోనివే.

బాహుసంబంధమగు భాగము (Brachial plexus) మెడ నరములలో 5,6,7,8 సంఖ్యలు గలవియును వెన్నునరములలో 1,2,3 ను నిందు చూపఁబడినవి.




7. వ పటము. బాహుసంబంధమగు భాగము

**11.** బాహుసంబంధమగు భాగము 7 వ పటములో చూపఁబడినది. మెడనరములలో 5,6,7,8 సంఖ్యలు గలవియును, వెన్నునరములలో మొదటిదియును కలిసి బాహుభాగ (Brachial plexus) మనఁ బడును. కూర్పరనరములును, మణిబంధాధారనరములును గలిసి, బొటనవ్రేలిని ఇతరవ్రేళ్లను కదలించుట కెట్లుపయోగించునో యిందు గాననగును. ఇందలి కండరసంబంధమగు నరములు (Musculo- spiral) చేతి వెనుకకువచ్చి దానిని చాపునట్లు చేయును. వీనికి (Extensor carpi) అనగా చేతిని చాపునరము లని పేరు. ఈ బాహునరములు భుజములు, చంకలు, బాహువులు, చేతులు, రొమ్ముయొక్క వెనుకభాగము, ముందుభాగము, వ్యాపించి యుండును. ఈ భాగమునందలి చలనము నశించిపోయినప్పుడా యా భాగము చచ్చుబడిపోవును. వీనిసంబంధమగు వ్యాధులం దెల్ల మర్దన చేయుడు. ముచ్చెలగుంటయొక్క దిగువభాగమునను మర్దనచేయవలెను. చలననాడులయందు చచ్చుపర్పడినపుడు బాహువులపై నుండి దిగువకు హస్తచాలనముఁ జేయవలెను. జ్ఞాననాడులలో గమనము తగ్గినప్పుడు స్పర్శజ్ఞానము తగ్గియుండును. అప్పుడు బాహువులపై దిగువనుండి యెగువకు హస్తచాలనము చేయవలయును. చలననాడులు చచ్చుబడినప్పుడు విద్యుచ్ఛక్తితో చేయు చికిత్సయందు ధనాగ్రము ముచ్చెలగుంటవద్దను, ఋణాగ్రము చేతులవద్దను ఉంచవలయును. జ్ఞాననాడులు చచ్చుబడినప్పుడు అగ్రములను వ్యతిరేకముగా త్రిప్పి చేయవలయును.



8-వ పటము. ముడ్డినరములు, నడ్డినరములు

**12.** న డు ము న ర ము లు (Lumbar plexus):—ఇందలి నరములు కేవలము నడ్డివూసలలోనుండి బయలుదేరును. ఈ నరములు దాదాపుగా వీపున కంతటికిని వ్యాపించుటయే కాక జీర్ణమండలమునకు, జననేంద్రియములకు, కాళ్ళకును వ్యాపించును. (8-వ పటము చూడుడు.)

**13.** ము డ్డి న ర ము లు:—8-వ పటము చూ. తుంటి, కాళ్లు, జననేంద్రియములు, గర్భాశయము, మొదలగు భాగముల కీ నరములు వ్యాపించును. ఒక పెద్దనరమునందుండి నాడీశక్తియంతయు దిగువకు ప్రసరించును. ఈ నరము బృహత్ కటినాడి (The great hip nerve) యను పేరఁ బరగును. ఇది మోకాలువఱకును వ్యాపింపక, మోకాలునకు వెలుపలను, లోపలను వ్యాపించు రెండు పెద్దనాడులలోనికిఁ బ్రవేశించి, అచటినుండి దిగువ, కాలివేళ్ళవరకును వ్యాపించును.

14. ప్ర తీ కా ర క్రి య :—(Reflex action) మందువైద్యులీపదమును ప్రయోగింతురు. నాడీక్రియ యొక్క రాసాయనిక శాస్త్రము వారికి ఎఱుక లేకుండుటవలన వారు దీనిని తప్పార్థములో ప్రయోగించుచున్నారు. ఒకనాడీకేంద్రము నుండి వాలుగాగాక యెదురుగా నాడీశక్తి ప్రసరించుటకు ప్రతిక్రియ యందురు. ఇక నాడీకేంద్రమువంకకు నడచు నాడీశక్తి జ్ఞానశక్తి. అది ఉష్ణధర్మము గలిగియుండును. నాడీకేంద్రమునుండి కదలిన శక్తి చలనశక్తి. అది శీతధర్మముగలది. ముడుచుకొను స్వభావము గలిగియుండును. మఱి ప్రతిక్రియ

రొుక్క కారణ మేమి? న్యూయార్కు నగరమునందలి ప్రెసి బటేరియన్ ఆసుపత్రిలో డాక్టరుగా నుండిన డా. హెర్టర్‌గారీ క్రిందివిధముగా జెప్పిరి. అది సత్యమునకు చాల సమీపముగా నున్నది.

"జ్ఞాననాడులయందు గలిగిన ఉద్దీపనమువలన, జ్ఞానశక్తి చలన శక్తిగా మాఱుటకు ప్రతీకారక్రియ యని సామాన్యముగా చెప్పవచ్చును. జ్ఞానవేగము (Sensory impulse) జ్ఞాననాడి వెంట చలననాడుల సంబంధమగు ముడివద్దకు చేరును. అచట నుండి చలననాడులవెంట కండరమునకు, లేదా కండరములకు ఆ శక్తి ప్రతిఫలించును. ఏచలననాడులు కణములు లేదా కణ ముల సమూహమునుండి 'ప్రతీకారశక్తి బయలుదేరునో దానికి ప్రతీకార కేంద్రమని పేరు. మెదడుయొక్క అంచునుండి బయలు దేరిన స్వేచ్ఛాశక్తిని వహించునవి యీనాడులే. మెదడుయొక్క అంచునందలి ముడులలోనికణములను, వెన్నుపాములో నున్న నాడులయందలి ముందువైపు శృంగమునందలి ముడులలోని కణములను, కలుపునట్టి చలననాడులసంబంధ మగునాళికలు స్వేచ్ఛాశక్తినిమాత్రమే వ్యాపింపజేసి యూరకుండవు. ప్రతీ కారశక్తిని అదుపులో నుంచుటయును వానియొక్క పనియే."

ఈ పైభాగమున వ్రాసినదానియందు డాక్టరు హెర్టర్‌గారు ప్రతీకారక్రియ కుండలీకరణము జేసిరి. అనగా అది వారి యభిప్రాయముప్రకారము ప్రతీకారశక్తి కాదు. ఈ ప్రతీ కారశక్తి వెన్నుపామునుండి రావచ్చును, లేదా మెదటి

నుండి రావచ్చును. నేను దీనిని ప్రతీకారక్రియ యనుటకు బదులు విలోమ (inverse) క్రియ యందురు.

ఇఁక నొక విషయమైన స్ఫురణ యెట్లు గలుగునో విచారింతము. మోకాలిలో నిశితమైన స్పర్శ తగిలినదనుకొనుము. అది యెట్లు కలిగినది? మోకాలుయొక్క చర్మము నంటియున్న జ్ఞాననాడి ఉష్ణధర్మము గల తన ద్రావమును వెన్నుపాములో నున్న నాడీకేంద్రమునందలి వెనుకవైపు నరమునకు జేర్చును. చలననాడులయందలి కణముపై, నది రాసాయనిక ప్రతీకారవశమున మెఱయును. అచటనుండి ఆ మెఱపు నలుముఖముల వ్యాపించును. అందు ముఖ్యముగా మోకాలివైపునకు బోవు చలననాడులలో నది బాగుగా వ్యాపించును. అందువలన మోకాలు ప్రేరేపింపబడును. అయితే అక్కడ నొప్పి యెట్లు తోచినది? ఎచ్చోటనుండి నాడీశక్తి బయలుదేరినదో అచటనే అది ముగించును గాన ప్రత్యేకము ఆచోటనే బాధ తెలియుచున్నది. వెన్నుపామునుండి బయలుదేరిన నరములతోడనే యీ బాధ స్ఫురించినదా? దాదాపుగా కారణ మంతియేకాని బాధయొక్క వివరములు తెలియుటకు మెదడునందలి ముందుభాగమునందలి అంచున నుండి తెలియవలయును. దిగువనుండి నాడులవెంట మెదడుయొక్క అంచున కీబాధ చేరును. అచ్చట నది తెలిసికొనును.

కన్నులతో చూచును. చెవులతో వినును. అట్లు బాధాకారణమును దెలిసికొనును.

**15. వెన్నుపామునందలి మండలములు:—** ఈ క్రిందిపట్టికలో వెన్నుపాము నుండి బయలుదేరిన నరము లేకండరములకు జేరునదియును, వానియొక్క విలోమక్రియలును, స్పర్శజ్ఞాన మేభాగమునందు గలుగునదియును చూపింపబడినది.

వెన్నుపామునందలి నాడుల వివిధ భాగములయొక్క నిర్దేశము, వానియొక్క కర్మ:

| భాగము | కండరములు | (ప్రతీకార) విలోమక్రియ | జ్ఞానప్రదేశము |
|---|---|---|---|
| మెడనరములలో 2,3 | దవుడకండరములు, భుజము, మెడ జీవులు, విభాజిక (diaphram) | పక్క టెముకల దిగువ భాగమున అకస్మాత్తుగా గలిగినపీడనమువలన గలిగినబాధ | ముచ్చెలగుంట మొదలు భుజముపైభాగము, మెడ |
| మెడనరములలో 4 | విభాజికము, భుజకండరములు, భుజదండకండరములు, మోచేతి కండరములు, ముంజేతియొక్క, మణిబంధముయొక్క కండరములు | కనుగ్రుడ్డు: మెడ నరములలో 4 మొదలు 7 వ దానివరకు: మెడయందలి ఉద్రేకము వలన కనుగ్రుడ్డువాపు | మెడ, ఎగువభుజము, బాహువుయొక్క వెలుపలిభాగము |

| భాగము | కండరములు | (ప్రతీకార) విలోమక్రియ | జ్ఞానప్రవేశము |
|---|---|---|---|
| మెడనరము లలో 7 వది | స్నాయువులు (Triceps) మణిబంధమును, వేళ్లను చాపునట్లు చేయును. మణిబంధమును. తిరుగ, బోర్లవేయునట్లు చేయును. మణిబంధమును వంగునట్లు చేయును, భుజమును కదలించును. ఉరమునందలి కండరములు, వెన్నుకండరములు. | మణిబంధముయొక్క వెలుపల భాగము మెడనరములలో నేడవది, వెలుపలికి స్నాయువులకు తగిలి మణికట్టును వంగునట్లు చేయును. మెడనరములలో 7, 8 వెన్నునరములలో మొదటిది వేళ్ళను ముడుచుకొనునట్లు చేయు అరచేతులలోని కండరముల గదలించును. | బాహువుయొక్క వెనుకభాగమునందలి లోపలివైపు, చేతియొక్క సగభాగము |
| మెడనరము లలో 8 వది | మణికట్టును, వేళ్లను వంగునట్లు చేయు కండరములు, చేతియొక్క చిక్కైన కండరములు | — | ముంజేయి, చేయిలోపలిసగము |
| వెన్నునరము లలో మొదటిది | బొటనవ్రేలిని వంగునట్లుచేయును. చేతియొక్క చిక్కైన కండరములు, అరచేతి యందలి యెత్తుగానున్న కండరములు | — | ముంజేతియందలి లోపలిసగము చేతికి చేరిన పూర్వనరరములు |

| భాగము | కండరములు | (ప్రతీకార) విలోమక్రియ | జ్ఞానప్రవేశము |
|---|---|---|---|
| 5 వ నడ్డినరములు | తొడను వెలుపలికి కదలించునట్టి మోకాలును చాపునట్టి, చీలమండను కదలించునట్టి, కాలివ్రేళ్లను కదలించునట్టి కండరములు | — | తొడ వెనుకభాగము, కాలు, పాదము, వెలుపలిభాగము |
| 1,2 ముడ్డినరములు | చీలమండల గదలించునట్టి, కాలి వ్రేళ్ళను కదలించునట్టి, పాదము యొక్క చిక్కని కండరములు | కాలు భూమిమీద అనుభాగము అరికాలు, కాలివ్రేళ్ళను చాపునట్లు చేయును. కాలిని వంగునట్లు చేయును | తొడయొక్క వెనుకభాగము, కాలు, పాదముల యొక్క వెలుపలిభాగము |
| 3,4,5 ముడ్డి నరములు | ఆసనము-జననేంద్రియముల మధ్య నుండు కండరములు | పాదములను చాచును. పిక్క మెందలు మడమువరకు నుండుకండరముల గదలించును. ఎక్కువగా నిద్చుటవలన పాదము ముడుచుకొనును. చీలమండను కదలించును, మూత్రాశయము మలకోశసంబంధి కండరముల గదలించును. | వృషణములు గుదము, జననేంద్రియములు, ఆసనము, జననేంద్రియముల మధ్యనుండు భాగము - వీనిపైనుండు చర్మము, |

నాల్గవ కిరణము

# శిరోనాడులు

1. మెదడునుండి 12 జతలు నాడులు బయలుదేరి కపాల సంబంధమగు భాగములకు బోవును.

2. ఒకజత ఘ్రాణనాడులు : వాసన జూచుట కుపయోగించును. పెద్ద మెదడుయొక్క వెలుపలి వృత్తమునుండియు, మధ్యవృత్తమునుండియు, దృజ్ఞాడుల మూలమునుండియు ప్రారంభమగును.




9 వ పటము. శిరోనాడులు - (Cranial nerves)

3. రెండవజత దృజ్ఞాడులు : చూచుట కుపయోగించును. × వలెనుండు దృజ్ఞాడుల మూలమునుండియు, చతుర్మా లము (ఇచ్చట నాలుగు జతల నాడులు బయలుదేరును)

నుండియు ఆరంభమై × వద్ద ఒకదాని కొకటి సంధించి కుడివైపుది యెడమకంటి లోనికి, యెడమది కుడికంటిలోనికి, పోవును.

4. మూడవజత చలనదృజ్నాడులు: నేత్రములు క్రిందికి చూచుట కనువుగా గదలించును.

5. నాలుగవజత చలనదృజ్నాడులే: కంటికి పైకిఁ గదలించును.

6. అయిదవ జత త్రిముఖనాడులు: చలనము, స్పర్శ, రుచిని గ్రహించు సామర్థ్యము గలిగియుండును. మెదడులో ననేక భాగములనుండి బయలుదేరి ప్రతి దంతముక్రిందికిని, చేరును. ముఖ నాడీదాహము (Facial Neuralgia) అను వ్యాధి యందు బాధను దెలుపు నాడు లివియే. ఈ నాడులయొక్క స్పర్శ సబంధమగు శాఖలు గూబదగ్గరకు చేరుకొనును (అందు వలననే తీవ్రములగు పదార్థముల దినినపుడు గూబ గుయ్యి మనును). ఇచటనుండియే నాడులు త్రి (మూడు) ముఖముల బయలుదేరును. ఒకభాగము క్రిందిదవుడకును, ఒకభాగము పైదవుడకును ఒకభాగము కన్నులకునుఁ బోవును. (తీవ్రపదార్థముల దినినప్రుడు కంటివెంట నీరుకారును.)

7. ఆరవజత ఇవియును చలనదృజ్నాడులే: కనులను కదలించుట కుపయోగించును.

8. ఏడవజత భావనాడులు: సుఖ, దుఃఖాదిలక్షణములను ప్రదర్శించుట కనువగు కండరములను గదలించును. ముఖము

చెవులు, కన్నులు, నాలుక, కణతలు, వీనిని కదలించును.

9 ఎనిమిదవజత కర్ణనాడులు: వినుట కుపయోగించును.

10. తొమ్మిదవజత జిహ్వానాడులు: రుచిని దెలుపును.

11. పదవజత ద్విమ్మరి నాడులు: దీనినే న్యూమోగాస్ట్రిక నాడియందురు. వెలుపల చాలభాగమువరకును వ్యాపించి ధ్వనులను గ్రహించును. సప్తపథ (Pharynx), స్వరపేటిక (Larynx), శ్వాసనాళము (Trachea), ఆహార నాళము (Bronchi), హృదయము, శ్వాసాశయములు, ఆహార నాళము జీర్ణాశయము, ప్రేగులు మొదలగు నన్నిభాగములకు పోవును. కనుక నీ ద్విమ్మరినాడుల జతను నొక్కినయెడల మనుష్యు డూపిరియాడక చనిపోవును. చెవికి దిగువను కొట్టుకొనునాడి కాన్పించును. అచట నిదియుండును. ఈ నాడులు చలననాడులు, జ్ఞాన నాడులుగూడ అయియున్నవి.

12. పదునొకండవజత వెన్నునాడులలోనుండి సంబంధముగల ద్విమ్మరి నాడులు: దీనితో శిరోనాడు లనేకము గలియును. ద్విమ్మరినాడులకు బలమిచ్చునవి యివియే.

13. పన్నెండవజత జిహ్వానాడులు: రుచిని తెలిసికొనునట్లు చేయును. నాలుకక్రిందికిబోయి నాలుకను కదలించును. ద్విమ్మరినాడితోను,అనిచ్ఛానాడులతోను,మెడనరములతోను, రసనానాడులతోను కలసియుండును.

ఈ శిరోనాడులు 9 వ పటమున జూపబడినవి.

ఐదవకిరణము

# స్వతంత్రనాడీమండలము

1. స్వతంత్రనాడీమండలము:— దీనినే ముడుల మండల మనవచ్చును. వెన్నుపామునకు కుడివైపునను, ఎడమ వైపునను రెండు నాడుల సంబంధమగు ముడులతో గూడిన గొలుసులు గలవు. ఇందు నాలుగుముడులు కపాలసంబంధ మైనవి. మెడజీవుల సంబంధమైనవి మూడు, వెన్నుసంబంధమై నవి పండ్రెండు, నడ్డిసంబంధమైనవి నాలుగు, ముడ్డిసంబంధ మైనవి ఐదు, ముడితోత్రిక సంబంధమైనది యొకటి.

2. స్వతంత్రనాడీమండలము నాలుగు విభాగములుగ నుండును. ప్రక్కముడులు— వెన్నుపామున కావల నీవల మెదటినుండి తోత్రికవరకు నుండు నాడుల సంబంధమగు ముడులమాల యిందు చేరును. రెండవది అర్ధచంద్రాకారము గల ముడులమాల మొదలగునవి చేరియున్న పురోనాడీ ముడులమాల. మూడవది ఆ యా యవయవములలో నుండి వానిని చలించునట్లు చేయు భాగమునందలి ముడులు. నాడీ ముడుల మాలయొక్క అగ్రము లని పేరు. నాలుగవది మజ్జా నాడులయొక్క వెలుపలి చివరలు. వీనిని స్వతంత్రనాడీమండల ములో నిజమునకు లెక్కింపనివారును నున్నారు.

3. వివిధనాడీభాగములను కలుపు శాఖలు:— మజ్జాసంబంధమైన నాడులను స్వతంత్రనాడీమండలముతో కలుపు శాఖలున్నవి. స్వతంత్ర నాడీమండలములోని ఒక్కొక్క

ముడినుండి ఎఱుపుతో గలిసిన బూడిదరంగు గల స్పర్శ నరములను మజ్జా నాడులలోనికి బంపును. మజ్జానాడులలో నుండి తెలుపుతోగూడిన నీలపురంగు గల చలననాడులను స్వతంత్రనాడులయందలి ముడులలోనికిఁ బంపును. ప్రతి విషయమునందు మజ్జానాడులలోనుండి యీ శాఖలు కలియవు. కొన్ని సందర్భములలో కలియకుండుటయును గలదు. ఉరము నరములలో రెండవ దాని మూలమునకు ఎగువను, సడ్డినరములలో రెండవదాని మూలమునకు దిగువను ఈ తెలుపునరములు కాన్పించుటలేదు. రెండవ మూడవ ముడ్డినరములనుండి మాత్ర మిట్టివి కాన్పించుచున్నవి.

4. నరములలో చాలభాగము స్వతంత్ర నాడీమండలమునకే సంబంధించియుండును. నాభికందము, జీర్ణమండలము, హృదయ మండలము మొదలగు ప్రధానమండలములకును, హృదయములోపలిభాగము, వీర్యసంబంధమైన భాగము, మూత్ర భాగము మొదలగు నప్రధానమండలముల నీ నాడులు చలింపఁజేయును.

5. క్రిమిచలనము (Peristalitic action):—అన్నవాహిక, జీర్ణాశయము, ప్రేగులు - వీనియందలి క్రిమిచలనము మజ్జా నాడుల మూలమునుండి వచ్చిన ఆజ్ఞలవలన కలుగుటలేదు. త్రిమ్మరి నాడి, అనుబంధ నాడులయందలి ఆమాశయమునకు బోవు నరముల శాఖవలన గలుగును.

6. రక్తనాళ సంబంధమగు చలననాడులు: మజ్జాముఖము, వెన్నుపాముునుండి వచ్చిన నాడి శాఖలుగా చీలి స్వతంత్ర నాడీమండలములోనికిఁ బోయి మజ్జాసంబంధ నాళికలనుండుట మాని కండరములలోనికి జేరుకొనును.

7. నాడుల సంబంధమగు ముడి:—లోపలనున్న బూడిదరంగుగల పదార్థమును మూసి వెలుపల తెల్లని పదార్థ ముండును. ఇదియొక అంచెకార్యాలయము (Relay Station) వలె నుండును. ఇందులోనికి వచ్చునట్టియు, వెలుపలకు పోవునట్టియు నరములు తంతితీగెలవలె నుండును. ప్రతి ముడియును ఉత్తేజకమగు నాడీశక్తికి స్థానమై యున్నది. అందుండి నరములను ముట్టించును. దానియందుండి పోవునరములు శక్తిమత్తరము లగును. కర్కే (Kirke) అనువారు వ్రాసిన శారీరశాస్త్రమునం దిట్లున్నది. "స్వతంత్రనాడీమండలములందలి ముడులయందున్న వేననగా:— 1 ఆ ముడుల కడ్డముగా పోవు నరములు. 2 వానిలో పుట్టుచుండు నరముల సంబంధమగు పీచులు. 3 ఈ పీచులు పుట్టుటకు కారణమగు కణములు. 4 స్వేచ్ఛగా నున్నట్లు గనిపించు నితరకణములు" అనగా స్వయముగా నరముల సంబంధమగు పీచులను ఉత్పత్తి చేయుట కవసరమగు చలనములేనివి.

8. మెదడు-మజ్జామండలము:—ఇచ్ఛననుసరించి పని జేయును. స్వతంత్ర నాడీమండలము రాసాయనిక అనురాగ వశమున నడుచుచుండును. యోగవిద్యయందు ప్రజ్ఞా

10-వ పటము.




స్వతంత్రనాడీమండలమునందలి మెడలకును, ఉరమునకును సంబంధించిన భాగము

వంతులైనవారు మాత్రము స్వతంత్ర నాడీమండలమును సయితము తమ యిచ్ఛానుసారమే నడిపింప సమర్థులై యున్నారు. హృదయము, శ్వాసాశయములు, జీర్ణాశయము, ప్రేగులు, జననేంద్రియములు మొదలగువానిచే వారి యిష్టానుసారము పని చేయింపఁగలరు.

9. నాడీముడుల ప్రదక్షిణము:—ప్రకృతియందలి రసాయనస్వభావము ప్రదక్షిణముగా నగుట కిష్టపడు చున్నట్లు దోచుచున్నది. అట్లే స్వతంత్రనాడీమండలమునందు వెన్నుపామున కావల నీవల వ్యాపించియున్న గొలుసులవంటి నాడీముడులు ప్రారంభమున కపాలమునందును, చివర ముడ్డిదగ్గరను సన్ననిశాఖలచే కలుపబడుచున్నది. అందువలన నందలి వైహాయసశక్తియును బయలుదేరినచోటికే ప్రదక్షిణము చేసి వచ్చుట కనువుగా నేర్పడియున్నది. గ్రే అను వారి అస్థినిర్మాణశాస్త్రమునం దిట్లు వ్రాయబడియున్నది:—"వెన్నుపామున కావల నీవల సమదూరములలో ముడులతో గూడుకొన్న యీ రెండు నాడీమాలలు ముడ్డివఱకును వ్యాపించి తోకటికకు పురోభాగమున ఒక సన్నని నాడిచే కలుపఁబడుచున్నవి. ఇంకను కొందఱు అస్థినిర్మాణశాస్త్రజ్ఞులు ఈ నాడీమాలలు పైభాగమున కపాలమునందును ఇంకొకనాడిచే కలుపఁబడుచున్నవని చెప్పుచున్నారు." ఇందులో చెప్పినట్లు రెండవవైపున కలుపఁబడి యుండకున్నను, గుఱ్ఱములాడము వలె నుండు అయస్కాంతము (Horse shoe magnet) నందు వలె కాంతశక్తి ప్రదక్షిణము చేయుట కనువుగా నుండుట

వలన అప్పుడును వానియందలి నాడీశక్తి, పరస్పరోద్దీపనకరముగా నుండి సంతతమును సజీవముగా నుండును. కనుక నీ నాడీమాలలను సంతతము శుద్ధిగాను, నిర్మలముగాను నుంచుట యెంత ప్రధానమైన విషయమో గ్రహింపవచ్చును. అప్పుడు నాడీశక్తి నిరాటంకముగను, సంతతమును, సజీవముగను నుండుటకు వీలగును.

**10. నాడీద్రవము, స్ఫ్లేషమ్:**—ఘనుఁడగు స్ఫర్ షేమ్ ముడులను గురించి యిట్లు చెప్పెను:—"నాడులయందును ఒక విధమగు ద్రవ ముండునట్లు అసాధ్యముగాదు. వేయేల ఉండనే యున్నది. ముడులయందీ ద్రవము పుట్టుట, వెలువడుట జరుగుచుండవచ్చును. దాని ప్రచారమును, పంపకమును ముడులు సమరసపరచు చుండవచ్చును."

**11. అర్ధచంద్రాకృతిగల రెండు నాడీమండలములు:** వెన్నుపాముస కావల నీవల వ్యాపించియున్నవి. వీని రెంటి వలనను నాభికందము (Solar plexus) అను నాడీకేంద్ర మేర్పడుచున్నది. ఇది నాభికి సూటిగా లోపల నుండును. ఇందుండియే జీర్ణాదిమండలములకును, నాభికి నాడీశక్తి చేకూరుచున్నది. జీర్ణాశయాదిపోష కేంద్రియముల న్యూమోగాస్ట్రిక్ నాడిచేతను జీర్ణశయమునకు (జేరిన యితరనాడుల చేతను, పనిచేయించునదీ నాభికందమే. ఇది జీర్ణాశయమునకు వెనుకగా నాభికి సూటిగా లోపల నుండును.




11-వ పటము. ఉదరమునందలి నరముల ప్రధానభాగము.

**12.** హైపోగాస్ట్రిన్‌నాడులు :–(Hypogastric plexus) ఇది ముడిగా లేదు. కాని బృహద్రక్తనాళముసంబంధమగు నాడినుండియు, నడ్డినరములలో దిగువనరము రెండు ముడ్డి నరములనుండియు దీనికి శక్తి చేకూరుచున్నది. ఈ నాడులు కూపకము, ఆమాశయాదులను గదలునట్లు చేయును.

ఆరవ కిరణము

# వివిధ విషయములు

**1. మజ్జాముఖము.** ఇదియొక విచిత్రమైన మెదడు. దీనిని నాడుల మెద డనవచ్చును. ఇందుండియే కపాలనరము లలో దాదాపుగ నన్నియు బయలుదేరును. ఇది నరముల సము దాయమున కంతకును మూలము. చిన్నమెదడు, పెద్ద మెదడులను తీసివేసి నప్పటికంటెను మిక్కిలి త్వరితముగా నీ మజ్జాముఖము దీసివేసినప్పుడు సక్రమశ్వాస మాగిపోయి ప్రాణాపాయము సంభవించును. త్రిమ్మరినరమువలన శ్వాసక్రియ నడుపబడుచున్నది. నాభికంద మున్న పొట్ట మీాదను, ముచ్చెలగుంటకు కొంచె మెగువగా మజ్జాముఖ మునను ఒక గుద్దు గుద్దినంతనే ప్రాణాపాయము సంభ వించును. ఈ మొదలైన సంగతులచే నీ నాడీకేంద్రములు తృణీకరింపగూడనివని గ్రహింపఁగలము.

**2. రెండురకముల నరములు :—** శక్తిస్వభావముతో, పరిశీలించినయెడల నాడులు శీతస్వభావము గలవి కొన్ని, ఉష్ణ స్వభావము గలవి కొన్నియును. శీతస్వభావముగలవి, సంకోచ స్వభావము గలవి. వీనినే చలననాడులనియు, వెలుపలకు గొని పోవు నాడు లనియు, కేంద్రమునుండివచ్చు నాడు లనియు బిలు తురు. ఉష్ణధర్మముగల నాడులు వ్యాకోచస్వభావము గలవి. వీనినే జ్ఞాననాడు లనియు, స్పర్శనాడు లనియు లోపలకుఁ దెచ్చున వనియు, కేంద్రమునకుఁ బోవు నాడు లనియు బిలుతు రు. కొందఱు శారీరశాస్త్రజ్ఞులు చలననాడులను వెలుపలకు గొని

పోవు నాడులని పిలుచుటయే యుక్త మనుచున్నారు. వారు చెప్పిన దేమన ' వెలుపలకు శక్తిని గొనిపోవు నాడులు కొన్ని చలన నాడులు, కొన్ని పోషకనాడులు. ఇవి నాడులయొక్క గమనమును క్రిమపఱచును. వ్యాకోచస్వభావము గలవి, అని శక్తియొక్క స్వభావము నెఱిఁగియుండనందువల్లనే యీ పొరపాటు గలిగినది. వెలుపలకు గొనిపోవు నరము లన్నిటియందును సంకోచవ్యాకోచము లొకటితరువాత నొకటి జరుగుచునే పోవుచుండును. ఇట్లే జీర్ణాశయము యొక్క ఆవరణపుగోడలయందు గలిగింపఁబడిన సంకోచవ్యాకోచ ములవలననే జీర్ణక్రియ జరుగుచున్నది. తమయందలి ద్రవ ములను మిక్కిలి స్వేచ్ఛగా వదలివేయకుండునట్లును, కండరము లను అదుపులో నుంచుటయును ఈ చలననాడుల స్వభా వమే. కనుకను సంకోచమువలన నయితము మధ్యభాగము వ్యాకోచ మగుట జరుగును గనుకను నీ నాడులను చలన నాడు లనుటయును; స్పర్శజ్ఞానములను తెలియజేయునవి గాన జ్ఞాననాడు లని ఉష్ణధర్మముగల నాడులను పిలుచుటయే తగి యున్నది.

3. చలననాడులు ముడుచుకొను స్వభావము గలవి. కండ రములమీాద పనిచేయును. ఇవి శీతస్వభావము గలవి. ఇందలి వైహాయసములు నీలివర్ణముగలవిగా గాని ఊదావర్ణము గల విగా గాని యుండును. నీలివర్ణమునకు రాసాయనికానురాగ ముగల రంగు ఎఱుపు. కనుకనే యీ నాడులు ఎఱ్ఱని కండ రములచే నాకర్షింపఁబడును. అందువలననే యీ నాడులను

మన యిష్టానుసారము కదలింప వీలగుచున్నది. ఈ శక్తి తత్త్వము నెఱింగినవారికి కండర సంకోచముయొక్క స్వభావము తేలికగా నెఱుగ సాధ్యమగుచున్నది.

4. నాడీ కేంద్రము :— ముడియందునుండి వలెనే యిందునుండియును దీపముయొక్క కాంతి పలుముఖముల వ్యాపించినట్లు నాడీశక్తి నలుముఖముల వ్యాపించును. పిండమునందు ఈ వెలుపలికి పోవు ప్రవాహము లెట్లు అణుసమూహముల నాకర్షించి నాడులుగా వృద్ధిబొందునో స్పష్టముగా దెలియుచున్నది. శీతశక్తులు ఈ నాడులకు హద్దు లేర్పఱచును. అందున్న నాడీకేంద్రము శీతస్వభావముగల దగుటవలన, ఉష్ణతత్త్వముల నాకర్షించును. పోను పోను రెండుశక్తులును వృద్ధిబొంది శీతశక్తులు చలననాడులుగాను, ఉష్ణశక్తులు జ్ఞాననాడులుగాను తయారగును.

ఏడవ కిరణము

# నాడీ వ్యాధులు

1. ఒకటవ భాగమున కాంతశక్తి, యోగనిద్ర మొదలగు కడు నిశితమగు చికిత్సావిధానముల చేర్చి, అవి యెట్లు నాడీవ్యాధులను నివారించుట కుపయోగించునో వివరించి యున్నాను. ఇచట నా వ్యాధులనుగురించి సంగ్రహముగను సామాన్యముగను వివరింప నెంచితిని. మిక్కిలి చొచ్చుబారు స్వభావముగల సునిశితవైద్యమునందు నాడీవ్యాధులయొక్క ప్రతి సూక్ష్మ భేదమునకు ప్రత్యేకప్రత్యేకచికిత్సలు అవసరము లేదు. ఇది మందువైద్యమునందు మిక్కిలి అవసరమై యున్నది. అట్లయ్యును వారు ప్రయోగించునట్టి మోటుమందులు (స్థూల ఓషధులు) ఎన్నిమార్పులో పొందిననేకాని సునిశితమగు నాడులకు చేరవు - చేరకుండుటయును గలదు. మనము ప్రయోగించు సునిశిత చికిత్సలు సూటిగా నాడులనే వెదకు కొనుచు బోయి రోగనివారణము జేయును.

2. డాక్టరు జె. యం. డా. కోస్టా అనువారి 'రోగనిదానము' అను గ్రంథమునుండి యీ క్రింది పట్టిక యివ్వబడినది. అచ్చు టచ్చుట మా వివరణమును గలదు :—

## మెదడు

### అవయవనిర్మాణమునందలి లోపమువలన గలుగు వ్యాధులు

| | |
|---|---|
| రక్తసంకీర్ణత (Hyperamea) | మృదుత్వము |
| | కఠినత్వము |
| పాండువు | రక్తాభివ్యందము |
| మేదస్తాపము | కుదప |
| మేదస్సం॥నంజు | దూరవుకుదప |
| వ్రణము | కంతి |

### అవయవకర్మయందలి లోపమువలన గలుగు వ్యాధులు

| | |
|---|---|
| సవాయివ్యాధి | కుంగియుండుట |
| ప్రలాపము | తలనొప్పి |
| ఉన్మాదము | పరవశత |

## మెదడునకు వెన్నుపామునకు సంబంధించిన వ్యాధులు.

### అవయవ నిర్మాణము నందలి లోపములు.

- మెదడు, వెన్నుపామునందలి తాపము.
- మెదడును వెన్నుపాముగట్టిపడుట,

### అవయవ కర్మయందలి లోపములు.

- పిచ్చికుక్క కాటు।
- మూర్ఛ
- స్మృతిరాహిత్యము
- కుంగియుండుట
- పరవశత
- భద్రినాట్యము
- హిస్టీరియా

**వెన్నుపాముసంబంధమగు వ్యాధులు**

- **అవయవనిర్మాణలోపమున గలుగునవి.**
  - రక్తసంకీర్ణత
  - పాండువు
  - కశేరుకాదాహము (వెన్నుపామునందలి పొరలలో మంటలు)
  - మజ్జాదాహము (మజ్జయందలి మంటలు)
  - మృదుత్వము
  - చచ్చు (పనిచేయకుండుట)
  - కాఠిన్యము
  - అక్రమచలనము
  - కశేరుకాఽభిష్యందము (వెన్నుపామునుండి రక్తముకారుట)
  - కంతులు
  - సవాయి
- **అవయవకర్మలయందలి లోపమువలన గలుగునవి.**
  - వెన్నుపాములో చికాకు
  - వెన్నులో నీరసము
  - వణుకు
  - వణుకుతోగూడిన చచ్చు
  - ఈడ్పు
  - వెన్నుపామునందుద్రేకమువలన గలిగినయీడ్పు

3. కోష్టాగారీజాబితా సమగ్రమైనదనిగాని సంపూర్ణమైనదనిగాని భావించుటలేదు. పక్షవాతము మొదలగు వ్యాధుల

నతఁడు వదలివేసెను. ఈ వ్యాధి పెద్దమెదడునందలి చలన భాగమునందే యుత్పత్తియగును. వెన్నుపామునందును గలుగ వచ్చును. నాడులయందే కలుగుటయును గలదు.




12 వ పటము.

12 వ పటమునకు వివరణము. ఇందు చలననాడులలో ఎచ్చట దెబ్బ తగిలిన నే భాగము పనిచేయదో అది వివరింపబడినది.

A అనుచోట దెబ్బ తగిలిన దైశికమగు పక్షవాతము గలుగును.

B అనుచోట దెబ్బ తగిలిన దానియెదుటివైపున పక్షవాతము గలుగును.

C అనుచోట దెబ్బ తగిలిన అదేవైపున మెదడుయొక్క 3 వ నరము పనిచేయదు. ముఖనాడులు పనిచేయవు. ఎదురువైపున చేయి, కాలు చచ్చుబడును.

D అనుచోట తగిలినదెబ్బవలన రెండవవైపున పక్షవాతము గలుగును.

E అనుచోట తగిలిన దెబ్బవలన ముఖమును, రెండవవైపు కాలు చేతులును చచ్చుబడును.

F అనుచోట తగిలిన దెబ్బవలన కాలుచేతులు చచ్చుబడును.

G అనుచోట తగిలిన దెబ్బవలన అదేవైపున పక్షవాతము గలుగును.

4. పక్షవాతము :— మెదడునందు కుడివైపున చలన నాడులకు సంబంధించిన భాగమున రక్తముయొక్క పీడనము (Pressure) ఎక్కువయగునేని దేహమునం దెడమభాగమున పక్షవాతము గలుగును. ఇట్లే ఎడమవైపుచలననాడులకు సంబంధించిన భాగమున పీడన మెక్కువగు నేని కుడివైపున పక్షవాతము గలుగును. వెన్నుపామునందు రెండువైపులకు సంబంధించి యేదైన ఆఘాతము (దెబ్బ) తగులునేని కాళ్లు రెండును, నడుమును చచ్చుపడును. ఒక కాలో చేయియో చచ్చుపడుటయును గలదు. ఇది దైహికపక్షవాతము. అథవా చచ్చుఅనిపిలుతురు. 12 వ పటము చూడుడు; అందుమజ్జాముఖమునందు ఒకవైపు నాడులు ఇంకొకవైపునాడులను తిక్కడిగా దాటి వేరొకవైపునకు బోవుట చూడవచ్చును. మరియును ఎచ్చట చెడిన నెట్టిచచ్చువ్యాధి గలుగునో గుర్తింపవచ్చును.

పక్షవాతమునకు చికిత్స :— విద్యుచ్ఛక్తివలన పక్షవాతము కొందరకు నయమగును గాని ఇంకను నిశితమగు పచ్చనిరంగుగల సూర్యకాంతి, మానవకాంతశక్తి, యోగనిద్ర, మానసికచికిత్స మొదలగు ప్రక్రియలవలన దేహమునందలి సూక్ష్మభాగములైన నాడులకు నెక్కువ త్వరగా గుణము గలుగును. మెడలమీద శిరస్సుయొక్క వెనుక భాగమునను ఆదిత్యపేటికనుండి ప్రయోగింపఁబడిన పచ్చని రంగుగల కాంతివలన పక్షవాతము సులువుగా నయమగును. నడ్డిమీదను, ముడ్డిపూసలమీదను ఆ కాంతిని ప్రసరింపఁజేసిన చచ్చువాతము నయమగును. అటుతరువాత కాంతశక్తిగల

చేతితో మర్దనచేసిన ఇంకను త్వరగానయమగును. స్పర్శజ్ఞానము లేని చచ్చువ్యాధికి చేతిని పైకిని, చలనము లేని చచ్చువ్యాధికి చేతిని క్రిందికిని చాలనము చేయవలెను. మెడనకు సమీపముగా వెన్నుపామువిూద నెప్పుడును చేతులను ఊర్ధ్వముఖముగా చాలనము చేయకూడదు. వెన్నుపామువిూద ఊర్ధ్వముఖముగా చాలనము చేయవలసి యున్నప్పుడు చేతిని మెడదువంకకు పోనీయక భుజములవంకకు పోనీయవలెను. విద్యుచ్చికిత్సలో నిట్లు చేయవలెను. ధనాగ్రము వెన్నుపాము విూదను, ఋణాగ్రము పాదములవిూదను నుంచిన చలనము లేకుండబోయిన చచ్చువాతము నయమగును. ధనాగ్రము పాదములవిూదను, ఋణాగ్రము వెన్నుపామువిూదను నుంచిన స్పర్శ లేకుండబోయిన చచ్చువాతము నయమగును.

చిరకాలమునుండి నిలిచియున్న పక్షవాతవ్యాధి సూర్యకాంతి, కాంతశక్తితోడి మర్దనము, మానసికశక్తి మొదలగు సునిశితవిధానములవలన మాత్రమే నివారింప సాధ్యమగును. వాషింగ్టన్‌నగరవాసినియగు జే. స్మిత్ అను నామె ఆదిత్యపేటికతోడను, కాంతశక్తితోగూడిన మర్దనమువలనను పక్షవాతము, అనువాతము వ్యాధులను నివారించెను. జె. ఆర్. న్యూటన్ అనువైద్యుడు మర్దనచికిత్సతో నసంఖ్యాక రోగములను కుదర్చెను. అందు కొలది నిమిషములలోనే నివారణమైన విషయములును గలవు. వెస్ట్‌చెష్టర్ అను పట్టణవాసినియగు జేమ్సు స్వీనీ అనునామె 19 సంవత్సరములనుండి నడువలేని స్థితిలో నుండెను. 30 నిమిషములలో నాతేఁడామెను

మర్దనచికిత్సచే నడిపింపఁ గలిగెను. ఆమె కుమార్తె ఆమె నడచుటను అప్పుడే జీవితములో మొదటితూరి చూచియుండుటవలన అత్యంతాశ్చర్యమును బొందెను. కేవల మర్దన చికిత్సచేతనే పక్షవాతమును నివారింపఁగలవారు వంద లుందురు. రోగనివారణమునకు వారములు పట్టును. కొందఱికి నెలలు పట్టును. యోగనిద్రవలన సయితము పక్షవాతము నయమగును.

5. మేదోరక్తసంకీర్ణత:—దీనినే మెదడులో రక్తము ఎక్కువగా కూడుకొనుట యని పిలువవచ్చును. దీనికి మందు వైద్యులు అర్థరహితమగు చికిత్స చేయుదురు. ముఖము ఉబ్బి కందియుండును. మెదడుయొక్క పైపొరలయందలి నరముల యందు రక్తపీడనము ఎక్కువగా నుండును. అందువలన తల తిరుగుట, ప్రలాపము, ఉన్మాదము నుండును. శిరఃపృష్ఠము; (దీనినే పెడతలయనియు, శిరస్సుయొక్క వెనుకభాగమనియు నందురు.) ముచ్చెలగుంటలపైన రక్తపు పీడనమును తగ్గించుటకు మర్దన చేయవలయును.

రక్తమును హస్తచాలనమువలన (పాదములు, హస్తములు) తుదలకు లాగివేయవలయును. వేడినీటితో చేసిన హస్తపాద స్నానములవలన మిక్కిలి మేలగును. అందు ఆవపిండిగూడ కలిపిన ఇంకను మేలు త్వరగా గలుగును. ఇంకను వ్యాధులు తీవ్రముగా నున్నప్పుడు మెడమీదను ముచ్చెలగుంట మీదను 105 మొ॥ 115 డిగ్రీలవరకు వేడిగల నీటిని పోయవలయును.

ఒక బొక్కెనెడు వేడినీటిని చెంబుతో ముంచి పోయుచుండ వలయును. ఇదే చికిత్స వడదెబ్బకు గూడ గారడివలె పనిచేయును. ఈ డెబ్బ (Apoplexy) రోగమునం దిది మిక్కిలి మంచిది. వడదెబ్బలను నివారింప వచ్చును. పిచ్చిని ఆపవచ్చును. మృతిని ఆపవచ్చును. మెదడునందు కుదప లేర్పడుటవలన గలిగిన పక్షవాతమునందు వేడినీటిచికిత్స రోగనివారణము నం దసమానమైనది.

6. మెదడువాపము :—మెదడుయొక్క దిగువభాగముయొక్క లోపలిపొరయందు మంటలు గలుగును. గండమాలరోగ పరిణతగల 8, 10 సంవత్సరముల వయస్సుగల శిశువులలో నిది తఱచుగా గలుగును. పెద్దల కిది తఱచుగా రాదు. ఇందు తలనొప్పి, సూదులతో పొడిచినట్లు పోట్లు నుండును. వాంతులు, ప్రలాపము మొదలగునవియును నుండును. మందు వైద్య గ్రంథములం దిట్లు వ్రాయఁబడి యున్నది :—

“ తృప్తికరమగు వైద్యములేదు - రోగము నావుట దుస్సాధ్యము.” మర్దనము చేసిన నిరుత్సాహము బొంద నగత్య ముండదు. క్రిందమెడటినుండి భుజములవంకకును, బాహువుల వంకకును మర్దనము చేయవలెను. తునలను బాగుగా మర్దనము చేయవలెను. వేడినీటితో పాదస్నానముల చేయింపవలెను. మలసాధికకొఱకు పసుపు పచ్చని సీసాలోని నీటి నీయవలెను.

7. పెద్దమెదడునందలి కుదపలు :—రక్తనాళమునం దలి రక్తము ఒకచోట నిలిచి గడ్డకట్టి కుదపగా నేర్పడును;

లేదా యితరమాలిన్యము లడ్డుకొని కుదపగను నేర్పడవచ్చును. దీనికి రక్తసంకీర్ణతచేత గలుగు మేదోవ్యాధులకు వలెనే చికిత్స చేయవలయును. వ్రణము, ప్రలాపము మొదలగు మేదడుదేశికమువలన గలుగు వ్యాధులకును ఇదే చికిత్స.

8. భద్రనాట్యము (St. Vitus dance) :— దీనినే పిశాచ నాట్యమనియు నందురు. ఇది చిన్నపిల్లలకు గలుగును. వయస్సు రాదగిన ఆడపిల్లలకును గలుగును. భయము, విసుగుదల, పాఠశాలయందలి అమితశ్రమ, వంశపారంపర్యాగతమగు ప్రవణత మొదలగువానివలన నిది గలుగును. ఇతరనాడుల వ్యాధులకు దీనికిని దేహమునందలి బలము తక్కువగా నుండుటయు; పరిశుద్ధవాయువు, సూర్యకాంతి, వ్యాయామము లేకుండ సదా యింట కూర్చుండుటయే కారణములు. అప్పుడప్పుడు ఆదిత్య పేటికాస్నానములవలన దేహమునందలి మాలిన్యము స్వేదముగా పోగొట్టుకొనవలెను ;- సులభముగా జీర్ణముకాదగిన ఫలాదిపోషక ఆహారములను తినవలెను. సూర్యకాంతి, వాయువు, వ్యాయామములు మొదలగు బలవర్ధకములగు వానిని అవలంబించుటయును చేసిన, దుస్తరమగు నీ వ్యాధులు నివారణమగును. సవ్యాపసవ్యముగను, దిగువకును దేహమంతటిని బాగుగా కాంతశక్తితో గూడినమర్దనము చేయవలెను. పౌరవనవిహారమువలన, దుస్తరములగు ననేకవ్యాధులు రాకుండును - వచ్చిన నవి నయమగును. శిశువులు సూర్యకాంతియందు స్వేచ్ఛగా తిరిగి యాడుకొనుచుండిన యెడల వారికి

ఎండువాత (Marasmus) మను వ్యాధి రాకుండ మాననను. ఇతరములగు మొండివ్యాధులును రావు.

9. చలనపక్షవాతము:— ఇది పెద్దలకు గలుగును. స్త్రీలకంటె ఎక్కువ పురుషులకే గలుగును. ఒక చేయియో, కాలో వణక నారంభించి తరువాత తల తప్ప మిగత దేహ భాగముల కన్నిటికిని ఆ వణకు వ్యాపించును. మందు వైద్యమున వీనికి చికిత్స లేదన్నారు వైద్యులు. మర్దనమువలన నిది నయమగును. కాని యెక్కువకాలము పట్టును. మర్దనము వలన కండరములును, నాడులును బలపడును.

10. వణకు:— ఇది పెద్దవయసువారిలో కాన్పించును. కండరములు, నరములయందలి బలహీనతచేత నిది గలుగును. ఇందు తల ప్రధానముగా వణకును. మెడలమీదను, శిరః పృష్ఠముననుు మర్దన చేయవలెను. పైనుండి క్రిందికిని, క్రింది నుండి × తిక్కడిగా పైకిని మర్దనముచేయవలెను. అందువలన నాడులును, కండరములును వరుసగా సుద్దీపనను బొందును.

11. ఈడ్పు:— చలనవైహాయసములు పైకి నడచుటవలన సాధారణముగా నిది గలుగును. శీతప్రయోగములవలనను కొందరికి ఈడ్పు గలుగును. మెదడునందు వేడి యెక్కువైనప్పుడా వేడిని సమరసపఱచుటకు క్రిందినుండి శీత మాకర్షింపబడును. అందువలన చలనవైహాయసములు పైకి నడచును. వెన్నుపామునందు మంటలు గలిగినను నీ వ్యాధి గలుగును. పైనుండి క్రిందికి చేసినమర్దనమువలనను; విద్యుచ్ఛక్తిని పైనుండి

క్రిందికి ప్రయోగించుటవలనను; విద్యుచ్ఛక్తియందలి ధనాగ్రము మెడలమీఁదను ఋణాగ్రము పాదములపైనను ఉంచి ప్రయోగించుటవలనను నీ వ్యాధి కుదురును. సూర్యకాంతితో గూడి స్వేదమును గలిగించు ఆదిత్యపేటికాస్నానము ఈ వ్యాధియందు నిరుపమానముగా బనిచేయును. ఈ యీాడ్పె తఱచుగా గలిగినయెడల కంపవాత మందురు.

12. వ్రాతగానితిముర:—(Writer's cramp) వ్రేళ్ల లోనున్న నరములయందలి విద్యుచ్ఛక్తి, లోహసంబంధమగు కలములు వాడుటవలన దేహమునుండి వెడలిపోవును. గాజు కాయపాళీలను వాడుట మంచిది. పైనుండి క్రిందికి మర్దనము చేయవలెను.

13. మూర్ఛ:— మెదడునందు సంకీర్ణత (congestion) యేర్పడి, రోగి స్మృతి తెలియక పడిపోవును. అమితమగు భయాదిమానసికోద్రేకములవలన గలుగవచ్చును. ఈ వ్యాధి వంశపారంపర్యముగా నుండి రావచ్చును. సవాయివ్యాధివలనను వచ్చును. మెదడునకు అఘాతము (దెబ్బ) తగులుటవలనను వచ్చును. చెవిలోపల వ్రణము గలిగి అందు మంటలు కలుగుటవలనను రావచ్చును. డాక్టరు డాకోస్టా అను వారు మూర్ఛానిదానమును గురించి యిట్లు వ్రాయుచున్నారు:—

"మూర్ఛావ్యాధి మెదడునందలి మధ్యభాగమునగాని, మెదడు యొక్క వెలుపలి ఆవరణమందుగాని గలుగవచ్చును. అనగా రోగమునకు మూలమగు కారణము మెదడునందు గాని, మజ్జ

యందు గాని యున్న నాడీకేంద్రములం దుండును. అచటి నుండి వెలుపలికి గొనిరాబడి తిరిగి నాడీకేంద్రముల కాకర్షింపఁ బడును" నేను వెనుక చెప్పినట్లే యిందును నాడీకేంద్రములందలి మంటలవలన చలననాడులయొక్క నడకయందు వైపరీత్య మేర్పడును. ఈడ్పువ్యాధియందును నిట్లే గదా జరుగును! ఈడ్పునకు నే చికిత్సయో, దీనికిని అదే చికిత్స. ఈ వ్యాధి వచ్చుటకు ముందు కొంచెము సూచనగా తెలియుట కలదు. అప్పుడు మలసాధిక చేయవలయును. దేహముమీఁద వడిగా చఱచవలయును. వేడినీటితో కంఠస్నానము చేయవలయును. ఆదిత్యపేటికాస్నానములు మర్దనమువలన నీ వ్యాధి రూఢిగా నివారణమగునని ఋజువైనది. డాక్టరు యస్. రోవ్ హార్ గారు ఇట్లు రోగనివారణ వృత్తాంతమును పంపినారు:— "ఒకామెకు దినమునకు 4,5 తూరులు మూర్ఛవ్యాధి గలుగుచుండెను. 2 తూరులు మాత్రమే ఆదిత్యపేటికాస్నానముల జేసెను. ఇప్పటికి మూర్ఛ 25 దినములనుండి వచ్చుచుండుటలేదు." ఆమె వృత్తాంతము తరువాత నాకు తెలియలేదు. అందువలన తిరిగి మూర్ఛ వచ్చినదో లేదో తెలియలేదు.

14. ముఖనాడులయందు మంట:—రక్తక్షయమువలన నిది గలుగును. నాడులయందలి వైహాయసములు తిన్నగా బ్రవహింపకుండుటవలనను నిది గలుగును. నాడీప్రవాహములు బలహీనముగా నుండుటవలన తాత్కాలికముగా సంకీర్ణము లగును. తరువాత విరోధమును బలవంతముగా నెట్టు

కొని ప్రబలవేగముతోడ బ్రవహించును. అప్పుడే పోట్లు, మంటలు గలుగును. రక్తనాళములందలి రక్తము సమగ్ర ప్రవాహము గలిగియుండునెడల నందలిమాలిన్యముల గెంటివే యును. అట్లే నాడీప్రవాహము సక్రమముగా బ్రవహించు చుండినయెడల నందలి వైహాయసముల నరికట్టుమాలిన్యములు లేకుండబోవును. అందువలన సూర్యకాంతి, ధాతుకాంతశక్తి (Vital magnetism) మొదలగు సునిశితతత్వముల బ్రయో గించినప్పు డవి నేరుగా నాడులలోనికే చొచ్చుకొనిపోయి యందలి మాలిన్యముల వెలువరించును. అందువలన వెంటనే బాధోపశమన మగును. త్రిముఖనాడి (ఇదేభాగమున 4 వ కిర ణము 6 పేరా చూ.) 3 శాఖలుగా చీలును. అందొక శాఖనుదురు కన్నులు ముక్కులలోనికిబోవును. 2 వ శాఖ కణతలు, చెక్కిళ్లు, కంటిక్రిందిరెప్ప, ముక్కు, పెదవులు పై పన్నులు మొ॥ భాగ ములలోనికి బోవును. మూడవశాఖ క్రిందిపన్నులకును, చెవులు, నాలుక మొ॥ వాని లోనికిని పోవును. ఇందు మొదటి రెండు శాఖలయందే ప్రధానముగా ముఖనాడులయందు గలుగు పోట్లు, మంటలు గలుగును. చిగుళ్ళసంబంధమగు వ్యాధులు, వానిసంబంధమగు నెముకలవలనను, నీ బాధలు మరింత ఎక్కు వగును. ఈ నాడులు గూబవద్ద చీలునని వ్రాసియున్నాను. మర్దనము చేయు నాతఁడు తనచేతులను చన్నీటిలో గాని- నీలివర్ణోదకములో ముంచిన ఇంకను మేలు - ముంచి కుడిచేతిని కుడిగూబమీఁదను, ఎడమచేతిని ఎడమగూబమీఁదను ఉంచి నొక్కిన అనేకవిషయములందు వెంటనే ఉపశాంతి యేర్ప

డును. మెడనుండియు, చెక్కిళ్ల నుండియు, బాహువులనుండియు, మజ్జనుండియు దిగువకు మర్దించినయెడల నది గారడీవలె బాధోపశమనమును జేయును. కాని ఆ యుపశాంతి శాశ్వతముగా నుండవలయునన్న దేహమున కంతటికిని చికిత్స చేయవలయును. కొలదికాలపరిమితిగల ఆవిరిస్వేదపెట్టికాస్నానములు కొన్నిదినములు క్రమముగా జేయవలయును. మనస్సుతో గట్టిగా భావన చేయుటవలనను నయితే మీా వ్యాధి కుదురును.

15. తుంటినొప్పి:—తుంటినాడియందలి మంట. వెన్ను నుండి మలుగులవరకు నీ బాధ యుండును. మోకాలులోనికి పోయి అచటనుండి పాదములను బాధించును. తొడవెలుపలివైపున నెక్కువబాధ కలుగును. చలిజ్వరము, సంధివాతము (ఆమవాతము) అతిమాత్రసంగమమునలని నీరసము, సవాయి మొదలగు వ్యాధులవలన నిది గలుగును. జననేంద్రియముల సంబంధమగు నాడీసముదయముపై సవ్యాపసవ్యముగను, తిక్కడిగను మర్దనము చేయవలయును. అనగా ఒకచేతిని పైనను, రెండవచేతిని దిగువను, ఒకదాని కొకటి అభిముఖముగా నుంచి క్రిందిచేయి పైకిని, రెండవచేతిని దిగువకును జరుపవలయును. తొడుపాత్త మలుగులమీాదను, పాదముల వరకును సవ్యాపసవ్యమర్దనము జేయవలయును. దీనికి మందు వైద్యులు స్ట్రిచినీన్ (చిత్రమూలము) అభిని, పాషాణము, నల్లమందు, క్లోరోఫారము ప్రయోగింతురు. పై విధముగా మర్దనము చేసినచో పైనపేర్కొనిన మందుల నుపయోగించు నవసరము లేకుండ బోవును. నూదిమందులు వాడ నవసర

ముండదు. సవాయి, గండమాల రోగముల సంబంధ మున్న యెడల ఆదిత్యపేటికాస్నానము లెక్కువమేలును చేయును. ఇతరచికిత్సలు పనిచేయనప్పుడు వేడినీటి కటిస్నానమువలన బాధోపశాంతి గలుగును.

16. మజ్జాదాహము:—వెన్నుపామునందలి మజ్జయందు మంటలు. వెన్నుపామునందలి పొరలలోనున్న మంటలకు కశేరుకా దాహమని పేరు. రెండు వ్యాధులవలనను, కాళ్ళు చచ్చుపడును. రెండు వ్యాధులును దుర్భరమైనవే యగును. ఆదిత్యపేటికాస్నానము వలన నిది గుదురును. అందు వెలుతురు వచ్చువైపున కభిముఖముగనే వెన్నుండునట్లు కూర్చుండవలెను. నడ్డి ముడ్డినరముల మీాద ఆకుపసుపు కాంతియును, పైభాగమున, నీలికాంతియును, నుండునట్లు జేయవలయును. వెచ్చని చేతులతో నెప్పుడును వెన్నుపై మర్దన చేయరాదు. వెన్నుపామునుండి నరములవెంట వెలుపలకు మర్దనము జేయవలయును. నడుము మొదలు దిగువకును మర్దనము చేయవలెను. ఆనొప్పి శిరస్సువరకు వ్యాపించినయెడల మెడ మీాదనుండి భుజముల మీాదకు మర్దనము జేయవలయును.

17. పరవశత:— డాక్టరు డాక్టోస్టాగారీ వ్యాధిని మేద స్సంబంధమగువ్యాధులలో జేర్చిరి. ఈ విషయమునందు మందు వైద్యులకున్న అజ్ఞానము శోచనీయమైనది. వారికి రోగనిదానము తెలియకుండుటవలన చాల మోటైన విషములను ప్రయోగించుచున్నారు. మఱియును ఉత్తమజీవుల ననేకుల

ఉన్మాదవైద్యాలయములకుం బంపుచున్నారు. మనోబలము వలన యోగనిద్ర కలిగించుట మీరు చదివియున్నారు. పరవశతావిషయమునందు, అదృశ్యులై యున్న జీవుల యొక్క మనోబలమువలన నీ పరవశత కలుగును. దీనివలన న్యాయముగా ప్రమాదము లేదు. కాని రోగిబంధువులయొక్క అజ్ఞానమువలన అనవసరభీతివలననే ప్రమాదములు జరుగుచుండును. కాని పరవశతవలన గలుగు అత్యంతమగు మేలు అమూల్యమైనది. నాడీవ్యాధు లున్నవారికి పరవశత గలుగునెడల నాడీవ్యాధు లంతరించును. మఱియు వారివలన ననేకములగు నూతనవిషయములు బహిర్గతమగును. ఎడిసన్ అనువారు ఒకచిక్కైన విషయమును విడదీయుటకు చాల శ్రమ పడుచుండెను. ఇంతలో నతనికి పరవశత గలిగెను. తరువాత నతని కా విషయము మిక్కిలి సులువుగా సాధ్యమైనది అని ఒక పురోహితుఁడు (Clergyman) వివరించెను. [భాగవతము వ్రాయునప్పుడు పోతన్న గారికి 'అలవైకుంఠపురంబులో' అనే పద్య మిట్లే లభించెనేమో]. న్యూయార్కునందు సుప్రసిద్ధుఁడగు పత్రికాధిపతి యొకడున్నాడు. అతఁడు భూమి యొక్క ధ్రువములనుగురించిన వివరములు జీవించియున్నవా రెవరును ఎఱుంగరని యనెను. నే నిట్లంటిని:—

"తమరు పరవశత నొంద నిష్టపడుదురేని ఆ విషయము తెలియగల దంటిని. అట్లే ఆతనికి గొలదినిమిషములలో పారవశ్యము గలిగెను. అంతట నతడు వానిని వేగముగా వివరింప నారంభించెను. అప్పుడు తెలిసికొనిన విషయములవలననే నీ విషయము

లను అతివిపులముగా 'తేజోవర్ణశాస్త్రము'న వివరింపసాధ్యమాయెను. ఈ పరవశత గాఢసుషుప్తికంటె గాఢతరముగా నుండును. కొన్ని విషయములలో మరణమునకు తుల్యముగానుండి మామూలువైద్యులకు గుర్తింపననువుగాక యుండును. సందేహాస్పదముగా మానసికశాస్త్రవేదిసలహా తీసికొనవలెను. పెన్సిల్వానియాలో 'ఈరీ' అను పట్టణమున రోగిణి యొకతె చనిపోయినదని వైద్యులంఽఱును నిర్ణయించిరి. ట్వింగ్ అనునామె అది పరవశతయేగాని మరణము కాదని నిర్ణయించెను. ఆమెమాటకు వైద్యులంఽఱును పరిహసించిరి వైద్యమెఱుఁగని యీామె మాటలు వారికి పరిహాసభాజనములుగా నుండెను. కాని యీామె శక్తివలన నా పారవశ్యత పోయెను. ఆమె జీవింపఁగలిగెను. న్యూయార్కునగరమున 23, కెథరైన్ వీథియందు జాన్ క్రాన్ హామ్ అను నతఁడు మరణించెనని ఐదుగురు నకిలీవైద్యులు నిర్దేశించిరి. సోల్మన్ జోయెట్ అనునొక ఆవేశము గలవాడు (మనదేశమున గణాచారియను పద మున్నది) ఉన్నాడు. ఆతడు క్రాన్‌హామ్ దేహ మంతయు కాంతశక్తితో మర్దనము చేసి, ముక్కు రంధ్రములలోనికి గాలిని ఊదగా నాతఁడు పునరుజ్జీవితుఁడాయెను. తరువాత 45 నిమిషములలో తనభార్యతో నాతడు భోజనశాలనుండి గృహాభిముఖుడై చనుచుండెను. ఇది 1869 వ సంవత్సరము మార్చి 16 వ తేదీన జరిగినది.

18. నాడీశోష :— నరములయందలి శక్తి యుడుగుట, అమితశ్రమ, విచారములవలనను, చుట్టత్రాగుట, మద్యపానము, విషయాసక్తి, అమితమైథునము మొదలగువాని

వలన నాడీసముదయమునందలి వైహాయసములు శోషించి పోవును. లేదా క్రిమరహిత మగును. స్త్రీలయం దెండక న్నెఱుగక యిండ్లలోనే సదా వసించుటవలనను, విచారము, లేమిడి, దిగులు మొదలగువానివలనను; స్వాభావికముగా నన్నిచివరలనుండియును దాటిపోవుచుండు నాడీశక్తిని నిగ్రహించి నిలువుకొనలేక పోవుటవలనను నిది గలుగును. అట్లు నాడీశక్తి తఱిఁగిపోవుచున్నవారు, ఇంకొకరితో కలిసిగాక ఒంటరిగా పరుండవలయును. ఇతరులకు మిక్కిలి సమీపమందేని పరుండరాదు. పాదములవెంటను హస్తములవెంటనే నాడీశక్తి దాటిపోవుచుండును గాన దేహముపై ఎడమనుండికుడికిని, కుడినుండి యెడమకును అడ్డముగామాత్రమే మర్దనము జేయవలయును. మానసికతత్త్వము గలవారియం దివి గలుగును. వీరియందు దిగులు, దానివలన సమముగా నాలోచింపలేకుండుట, అసంబద్ధముగా నాలోచించుట, విపరీతభావన మొదలగునవి గలుగును. విశ్రాంతి, వేరువృత్తిలోనికి మనస్సును దింపుట, వ్యావృత్తులలోనికి దిగుట; సహజముగా జీర్ణము కాదగిన పోషకపదార్థముల భుజించుట; సాధ్యమైనంత యెక్కువ నిద్ర; మర్దనము; ఆదిత్యపేటికాస్నానములవలన నీ వ్యాధి త్వరగా నివారణ మగును. రోగికి మనస్సు మిక్కిలి బలమైన శక్తియనియు, దానికి సదా దేవతలు సాయపడు చుందురనియు, దేహసంబంధమైన రోగములు మానసికశక్తిచే నివారింపఁబడి తీరుననియు నమ్మి, రోగములను జయించుటకు భావన చేయుచుండవలయును. మానసికముగా 'తా నారోగ్య

వంతుఁడ నగుచుంటినని విశ్వాసముతో భావన చేయ వలయును.

19. ని ద్ర లే మి, పి ఱి కి త న ము :— నిద్రలేమియును నాడీశోషకు చెప్పిన కారణముల వలననే గలుగును. ఇదే చిరకాలము జరుగునేని పిరికితనము వృద్ధియై, పిచ్చిపుట్టును. ఒక పెద్ద మనుష్యుడు అమెరికానుండి యూరపుపోయెను. ఎందుకు? తన నిద్రలేమికి చికిత్స కనుఁగొనుటకు. "నీవు రాత్రులయందు నిద్రపోవుటకు పూర్వము ఎక్కువగా చదివెదవా?" అని వైద్యు డడిగెను. "నిజమే" అని రోగి చెప్పెను. తరువాత "అట్లైన చదువుట మానివేస్తేనీ రోగము కుదురు"నని వైద్యు డనెను. అట్లే చదువుమానగా రోగము కుదిరెను. అమెరికాలో నున్న వైద్యు లింతమాత్రపు సలహా నీయజాలరైరి. ఇది యిచ్చట(అమెరికా)నున్న వారికి పరాభవకారణముగాదా? మానసికతత్త్వము ప్రధానముగానున్న వారు వ్రాయుటవలన, చదువుటవలన, ఆలోచించుటవలన దేహమునందలి రక్తము నుదురున కాకర్షింపఁబడును. అందువలన మెదడునందలి ముందు భాగము ఉడుకెత్తును. అందువలన నిద్రలేమి కలుగును. పరుండబోవునప్పుడు పరుగెత్తుటయో వడిగా నడచుటయో చేసిన నిది తగ్గిపోవును. నీలివర్ణోదకము పరుండభోవునపుడు కొద్దిగా త్రాగినను నిది శాంతించును. ముఖమునుండి రక్తము చివరల కాకర్షించినయెడల మెదడునందలి ముందుభాగము నందలి పొరలు చల్లబడును. నిద్రగలుగును. అందువలన ఆ భాగములు బలపడును. కష్టపడి పనిచేయువానియందలి రక్తము

అన్నియవయవములకు సమానముగా లాగివేయఁబడును. అందువలన నతనికి మంచినిద్ర గలుగును. సామాన్యముగా పాటకపుజనములం దెవరును మనస్సుతో బనిచేయరు. వారు చదువుట, వ్రాయుట, ఆలోచించుట చేతురేని వారియందలి సునిశితశక్తులు ఉద్దీపనము బొందును. అందువలన వారికి చాక చక్యము, సౌఖ్యము వృద్ధియగును. ఆయుఃపరిమితియును వృద్ధి యగును. ఒకామెసోదరుడు అకస్మాత్తుగా మరణించెను. ఆమె నాడీమండలమున కంతటికి నది ప్రబలమగు ఆఘాత మయ్యెను. ఆమెకు రాత్రింబవళ్లు నిద్రయే లేదు. నాడుల సంబంధమగు తలనొప్పి; ఎప్పుడును చీకటింట నుంపవలసివచ్చు చుండెను. పిచ్చి రా సిద్ధమై యుండెను. అప్పు డామెపెనిమిటి యామెకన్నులకు గుడ్డకట్టి ఆమెను ఎండలోనికి తీసికొని పోయి నుదుటిపై నీలకాంతినిఁ బ్రసరింపఁజేసెను. "కూర్చుం డియే ఆమె 5-10 సెకనులలో నిద్రపోయిన"దని యాతఁడు చెప్పినాడు. దుర్భరమగు నా తలనొప్పి పోయినది. ఆమె మెదడునరము సుఖముగా విశ్రమించెను. ఆమెకు తలనొప్పి నివారణమైనది. ఆమె నిద్ర లేచినతరువాత నిట్లు చెప్పెను. "ఒక చల్లని ప్రవాహము నా నుదుటిలోనుండి ప్రవేశించి, బాధల నన్నిటిని ఊడ్చివేసినది." అద్దముద్వారా బ్రసరింప జేసినపుడు నీలిరంగుతో కొద్ది ఊదారంగు కలిసియుండును. [ఈ వృత్తాంతము ప్రౌఢప్రభాకరములో వర్ణింపఁబడినది] సూర్యకాంతి యెక్కువగాఁ బ్రసరించునట్టి దేశములందెల్ల సూర్యకాంతియందు పసుపు, నారింజపండురంగులు ప్రధాన

ములై యుండును. అందువలన మానసికక్రియ యుద్దీపింపఁ జేయబడును. బలహీనుల నాడులయం దుద్రేకమును గలుగును. వర్ణవైద్యజ్ఞాన మున్న యెడల నీయాపత్తును జయింపవచ్చును. నాడీదౌర్బల్యము గల చిన్నలు పెద్ద లుండు గదులకు గల కిటికీలో, నాలుగవవంతు నీలిమందురంగుగల యద్దము నుంచిన చాలును. అనగా చలువ నిచ్చు నీలిరంగుతో, తగు మాత్రము ఊదారంగు గలిసిన అద్దముగా నుండవలెను. అందువలన చల్లదనము అత్యధికముగాకుండ ఆగును. దీనివలన గదియంతయు చల్లదనము నిచ్చునది యగును. ఇటలీదేశమున అలస్సెన్‌డ్రో అను చోట నున్న ఉన్మాదవైద్యశాలయందు డాక్టరు పోంజాగారు పిచ్చివాండ్రను నీలి ఊదారంగు ప్రసరించు గదులలో నుంచి పిచ్చిని గుదుర్చుచుండిరని ప్రౌఢప్రభాకరమున వ్రాసియున్నాము. గదిలో వేసిన తివాసీ, గోడలకు వేయు వెల్ల - ఇవియును నీలిరంగు గలవిగా నుండిన చల్లదనము నిచ్చు స్వభావ మింకను వృద్ధియగును.

మానసిక శక్తులు:— నాడీమండలమును అదుపులో నుంచుటకు మానసికశక్తులు చాల ప్రధానమై యున్నవి. కొందఱు తమ మనోబలమువలన నాడీమండలము నెల్ల అదుపులో నుంచఁగలిగియున్నారు. వారియిష్టానుసారము నిద్ర గలుగును. ఇచ్ఛాశక్తివలన నాడీమండల మంతయును మార్పును బొందును. మత్తుపదార్థముల నెల్ల మానితీరవలయును. ద్వేషము, అసూయ, భయము, విచారము, లోభము మొదలగు వానివలన తత్వమంతయు విషమయమైపోవును గాన

వానిని మానవలయును. సుఖమైన వ్యాయామమువలన మేలగును. స్నేహితులతో కలిసిచేయు నృత్యము, భజనవలన సుఖము గలుగును. అట్టి యానందప్రదమగు వ్యాయామము వలన నుత్సాహమును, నాడులయుజ్జీవనమును గలుగును. రాత్రులయందు చాలపొద్దుపోవువరకును నాట్యముచేయక మితముగా జేయవలయును.

20. భాషాశూన్యత :— అనగా మనస్సులోనున్న అభిప్రాయమును ప్రకటింపలేకుండుట. ముసలితనములో నీ వ్యాధి గలుగును. తరువాత పేరులు మరచిపోవుట గలుగును. కణతలపైన, కన్నులకు సమీపముగా, కాంతశక్తిగల చేతుల నుంచవలయును. భాషాప్రగల్భ్యము గలవారిచేతుల నుంచిన నింకను మేలగును. మజ్జాముఖమునను నిట్లే చేయవలయును.

21. స్వరరాహిత్యము :— స్వరపేటికయందు గలిగిన వ్రణము (Laryngitis) వలన స్వరము లేకుండబోవును. నోటిలోనికి వచ్చు నాడులయందలి నిరోధమువలనను నిది గలుగును. గొంతుపైనను, మజ్జాముఖములపైనను, కాంతశక్తిగల చేతితో నుద్దీపింపఁజేయవలయును. తత్త్వమును బలపఱచవలయును.

22. అంకిలికలిసికొనిపోవుట :— ధనుర్వాతమునందు (Tetanus) ఇది మిక్కిలి దుర్భరమైనస్థితి. మామూలు సాంప్రదాయిక వైద్యమునం దీవ్యాధివలన మరణమే సంభవించును. కాని నక్రమమైన మన వైద్యమునం దిది సామా

న్యముగా కుదుర్పవచ్చును. క్రిందిదవుడ కదలుట మానును. గుటక దిగదు. మెడలు, పొట్ట మొ॥ నవయవములు బిగిసి కొనిపోవును. విభాజకము (Diaphragm) నం దీడ్పు గలిగి నాభివద్ద నమితమగు బాధ యుండును. వెన్నుపామునం దీడ్పు వలన వెన్నుపాము విల్లంబువలె వెనుకకు విఱుచుకొనును. సామాన్యజ్ఞాన మున్నవారి కెవరికైనను నీడ్పున కంతయు శీతము కారణ మనియు, వేడివలన నది కుదురు ననియు తెలియును. శిరస్సునకు దిగువభాగ మంతయు నీటిలో నుండునట్లు తొట్టిలో 100॰ F. H. వేడిగల నీరుపోసి కూర్చుండబెట్టి క్రమక్రమముగా ఒక్కొక్క చెంబెడు తొట్టి లో నీటిని పారబోసి మిక్కిలి వేడిగల నీటిని చేర్చుచు, నీటి వేడిని పెంచుచుండవలెను. ఇట్లు 30 నిమిషములు 110॰ డిగ్రీల నీటిలోగాని 115॰ డిగ్రీల నీటిలోగాని యిట్టిస్నానము చేయింపవలెను. స్మృతి తప్పునట్లు తోచినయెడల, నుదుటి మీాద చన్నీటి తడిపొత్తి తఱచు వేయుచుండవలెను. ఇట్లు చేసి చన్నీట కడిగి తుడిచిన తరువాత, ముచ్చెలగుంట నుండి భుజములవైపునకును, దవుడనుండియు, భుజములు చేతుల నుండియు దిగువకును హస్తచాలనము జేయవలయును. ఇట్లే వెన్నుపాము వెంట పాదములవరకును జేయవలయును. వీలు గానున్నయెడల ఆదిత్యపేటికతో చేసినస్నానము, పై వేడి నీటిస్నానమునకంటె ననేక మడుంగులు మేలైనది. తరువాత మర్దన చేయవలయును. బిగిసికొని పోయిననాడులు సళ్లువద లును. పై విధానమువలన నీ వ్యాధి త్వరగా కుదురుచున్నది.

పాదమునకు మధ్యభాగమునందు పుండు పుట్టి, అందుండి నరము వెంట మెదడున కొక యీడ్పు ప్రవాహము జేరును. అప్పుడును క్రిందిదవుడ కదలకుండ బోవచ్చును.

23. పిచ్చిజంతువుల కాటు:— పాశ్చర్ (Pasteur) అను వారిచే కనిపెట్టఁబడిన టీకాలవలన అనేక జంతువులను హింసఁబెట్ట వలసి యుండును. అట్టి హింస మన కవసరము లేదు. పాశ్చర్ గారి పద్ధతి యిట్లున్నది. పిచ్చిపట్టిన కుక్క దేహమునందలి రక్తమును సీమకుందేలు దేహములోని కెక్కింతురు. దానికి పిచ్చియెత్తి మరణించును. తరువాత దాని రక్తమును ఇంకొక సీమకుందేలున కెక్కింతురు. అదియును మరణించును. ఇట్లొకదాని వెంట నొకటి యీ దుర్భర వ్యాధిచే మరణించుచు రాగా చివరకు చచ్చిన సీమకుందేలు రక్తమును పిచ్చిజంతువులకాటు తినినవాని దేహములోనికి నెక్కింతురు. ఇట్లు చేయను చేయను మందు సునిశిత స్వభావము గల దగుటవలన రోగనివారణ మగుట గలుగును. కాని అనేకజంతువులను నిర్దాక్షిణ్యముగా హింసింపవలసి యుండును. సీమకుందేళ్ళ సంబంధమగు నితరవ్యాధులు ఈ రోగికి సంక్రమింపవచ్చును. హోమోపతి వైద్యమున పిచ్చికుక్క రక్తమును పాలపంచదారతో నిశిత (Trituration) పఱచెదరు. దానివలనను పిచ్చిజంతువుల కాటువలన గలిగిన పిచ్చి నయమగును.

కాని యింతకంటె సులభతరమైన చికిత్సలు గలవు. బ్యూసర్ అను ఫ్రెంచివైద్యుఁ డొకఁడున్నాఁడు. అతఁడు 80 మంది కిట్టి

పిచ్చిని కుదిర్చెను. కళలు, శాస్త్రములకు సంబంధించిన వరి మత్తు నెదుట నాతఁడు దానిం బ్రకటించెను. మొదట నతఁడు పిచ్చిజంతువుల కాటు వేసినచోట ఎమ్మోనియా నీటితో కడుగును. తరువాత అవిసెపిండి పట్టు వేయును. దినమున కొక్క తూరి చొప్పున 7 దినము లావిరి పట్టును. ఈద్పునయితము గలిగిన సందర్భములో మొదటదినమునకు 3, 4 తూరులు చొప్పున చికిత్స చేయగా న్యూజెర్సీలో నొకామె కిట్టి వ్యాధి కుదిరినది. ఇట్లే కేవలము ఆవిరితోనే అనేకులపిచ్చి కుదురుచున్నది.

సరియైనది దొరకునెడల పిచ్చిజంతువుల కాటునకు 'మణి' వాడుట మంచిది. అది విషమును సొంతము లాగివేయువరకును ఆచోటనే అంటుకొని యుండును. ప్రతిదినము 2 తూరులు ఆవిరిపట్టుచు ప్రతిరెండు మూడుగంటల కొకతూరి తడిమట్టి గాని, తడియిసుకగాని కట్టుచుండవలయును. ఆదిత్యపేటికా స్నానములు అన్నిఁటికంటెను నెక్కువమేలును జేయును. అందువలన ఆవిరి గలుగుటయేకాక విషము నయితము హరించి పోవును. దేహమునందలి బలము తగ్గిపోదు.

24. హిస్టీరియా - యోషాపస్మారము :—ఈ వ్యాధి నాడీ సంబంధమైనది. ఇందు నీద్పు గలుగును. విచారము, ఏడుపు, నవ్వు మొదలగునవియును గలుగవచ్చును. అది ఋతుకాలము నందు గలుగును. లేదా కొంచెము వెనుకముందు కాలము లందును గలుగును. భీతివలనను అతిచాకిరివలనను నిది గలు

గును. సౌమ్యమగు మర్దన చేయవలయును. పైనుండి క్రిందికి దేహ మంతటికిని హస్తచాలనము చేయవలయును. నడ్డిమీద గుండ్రముగా మర్దనచేయవలయును. మలుగులపై ఉష్ణ హస్తములతో చాలనము చేయవలయును. మజ్జాముఖమునను దిగువను చేతుల నుంచవలయును. విద్యుత్ ఘటము నుపయోగించిన యెడల నడుములపై ధనాగ్రమును, పాదములపై ఋణాగ్రమును, నుంచవలయును. ఆదిత్యపేటిక నుపయోగించి నచో నడుముల పై ఆకుపసపుగాని, నీలి కాంతినిగాని బ్రసరింపఁజేయవలయును.

ఎనిమిదవ కిరణము

# ఉన్మాదము

1. ఉన్మాదమునందలి రకములు.— మతివిభ్రమము, భ్రమ, ఏకాకిగా నుండుటకు కోరిక, ఒకే విషయమున మనసు నిలిచియుండుట, తనకు రోగము గలదను పిచ్చి, పిచ్చి, ఉన్మాదము, యోషాపస్మారము, మూర్ఛ, త్రాగుబోతుతనము, వ్యభిచారము, దయ్యము పట్టుట, మెదడు పలుచనగుట - యివి యన్నియు ఉన్మాదమునందలి వివిధరకములే. ప్రతివానికి నేదో యొకరకపు పిచ్చి యుండు నందురు. అది లేకుండ జేయుటకు దేహమును మనస్సును నిర్మలముగా నుంచుకొనవలసి యున్నది. దేహబలము లేని మనోబలమువలనను, మనోబలము లేని దేహబలమువలనను, ఉన్మాదము గలుగదగియుండును. యోగనిద్రవలన ఉన్మాదము కుదురునని వ్రాసియున్నాను. ఉన్మాదమును గుదుర్చుటకు ధాతుకాంతశక్తి (Vital magnetism), సూర్యకాంతి, మానసికశక్తివంటి సునిశితశక్తు లెక్కువ ఉపయోగకరముగ నుండును. దుర్భరమగు దారిద్ర్యమువలనను పిచ్చి పుట్టును. ధనము ఏ కొద్దిమందిచేతిలోనో చిక్కి, అసంఖ్యాకులు దుర్భరదారిద్ర్యమున మునిగియుండుటవలనను దాని వలన వారికి మనస్సునందు శాంతి లేకపోవుట, ఆందోళన, దిగులు, విచారము మొదలగునవి యెక్కువగుటవలనను ఉన్మాదము గలుగును. అనేకు లందువలన ఆత్మహత్యకు పాలుపడుచున్నారు. ఎవరికైనను (విచారమునకు కారణము

కలిగినతోడనే అందు మునిగిపోరాదు. దాని కారణములను పోగొట్టుటకే ప్రయత్నింపవలయును. మనస్సును నితర విషయముల వంకకు మరలింపవలయును. ఉత్సాహమును, ఆనందమును కలిగించుకొనుటకు ప్రయత్నింప వలయును. ఎన్ని కష్టము లున్నను, దుఃఖము లున్నను, లోపలను, వెలుపలను ఆ పరాత్పరునికరుణామృతవృష్టి గురియుచునే యున్నదనియు, కష్టము లన్నియు ఒకనాటికి పోకమానవనియు విశ్వసించుటవలన నయితే మవి అణగిపోవును.

2. దిగులు (Melancholia) :— నిష్కారణమగు భయము, సంశయము నుండును. రక్తము క్షీణించి, నాడీశక్తి లోపించియున్నవారికే యీవ్యాధి గలుగును. ఈవ్యాధి గలవా రుండు గదికిటికీలో, వెలుతురున కడ్డముగా వసువు రంగు, ఎఱుపురంగు అద్దముల నుంచిన రోగనివారణ మగును. ఈ విషయ మనేకతూరులు పరిశోధించి, ఋజువుపఱచియున్నాము. దేహమునందలి యితరవ్యాధులకు చికిత్స చేయుటయును అవసరమే. 1 వ విషయములోని సూచనలను గమనింపవలయును.

3. ఆభాస (Hypochondria):— లేని దానిని భావించి భయపడుట, యకృత్తు మొదలగు కుడిమొడమ డొక్కలలో నుండు అవయవములు తిన్నగా పనిచేయకపోవుటవలన అజీర్ణము, అగ్నిమాంద్యము, మలబద్ధకము గలిగి రక్తప్రసరణము చెడి, నాడులు కృంగియుండుటవలన నీవ్యాధి గలుగును.

అతనికి వివిధములగు భయప్రదములైన ఆభాసలు తోచుచుండును. అతడు చెడును భావించినకొలదిని అతనిస్థితి మఱింత పాడగును. బాల్టిమోర్ నం దొకరోగి తాను రాత్రి ఒంటిగంటకే మరణించితి నని చెప్ప నారంభించెను. వైద్యుడు పైత్యకోశములో నేదో రోగ మున్నదనియు, తాను కోసి చూడవలసియున్నదనియు చెప్పి కత్తిని నూఱ నారంభించెను. అతడు (రోగి) శస్త్రమునకు సమ్మతింపలేదు. కనుక ఆభాస వ్యాధి గలవానికి ఋజుప్రవర్తనయు నుండదు. ఆదిత్యపేటికా స్నానములు, మర్దన, పసుపుపచ్చని సీసాలోనినీరు లోని కిచ్చుట, వ్యాయామము, రోగి నివసించు గదికి నెఱ్ఱనైనట్టియు, పచ్చనైనట్టియు అద్దముల నిముడ్చుట, మొదలగునవి చేసిన రోగనివారణమగును. (ప్రౌఢప్రభాకరము 1 వ భా. 56 పేజీ చూ.)

4. వెఱ్ఱి (Mania):— దిగులునకిది వ్యతిరేకముగా నుండును. నీలము, ఆకుపసపు రంగుగల అద్దములు ఇమిడ్చిన కిటికీలు గల గదిలో రోగిని కూర్చుండబెట్టవలయును. (ప్రౌఢప్రభాకరము, 1 వ భాగము, 56 పేజీ చూడుము.) అందు నీలిరంగు గల తివాచీ కలిగి నీలము ఊదారంగులు కిటికీలలో నమర్చబడిన గదులయందు కూర్చుండుటవలన నెట్లద్భుతముగా రోగనివారణ మగుచున్నదో చూపబడినది.

5. బీభత్సదృశ్యములు (Hallucinations):— మొదడు ఉడుకెత్తియున్నప్పుడు ఇట్టి దృశ్యములు తోచును. బలమైన

మనశ్శక్తి గలవాని ప్రభావమువలనను ఇట్టి మానసికస్థితి కలుగును. తనయొక్క భావనాదార్బల్యము వలనను గలుగును. మెదడునందలి జ్ఞాననాడులు బయలుదేరు భాగములందు ఈదృశ్యములు బాగుగా చిత్రింపబడి యుండును. వానిని వెలువరించుటకు మంత్రశాస్త్రవేత్తగాని బలమైన కాంతశక్తి గలవారుగాని మాత్రమే తుడిచివేయగలరు. సంధి మొదలగునవి గల్గినప్పుడు పెద్దపామును చూచినట్లు ప్రలపింతురు. రక్తమునందు చేరిన మాలిన్యమునందలి సూక్ష్మజీవులయొక్క విరివిచేయబడిన రూపమే మనస్సునందు పాములుగా తోచును. మెదడునుండి అవి ఎవుడు తలచిన అవుడు ప్రత్యక్ష మగుచుండును. పిచ్చినమ్మకములు గలవారు వానిని తలచినపు డెల్ల అవి మనస్సునందు ప్రత్యక్షమై భయభ్రాంతులను చేయుచుండును. దీనికి మందు వైద్యులు చేయున దేమియు లేదు. ఇట్టి రోగులను చూచిన వారును భయభ్రాంతులే యగుచుందురు. మెదడునందలి రసములు శుద్ధముగా లేనపుడే ఇట్టి దృశ్యములు తోచును. ముడులున్న అద్దములో చూచిన మన రూపమే వికారముగ గాన్పించునుగదా.

6. ఆత్మవంచన (Delusion) : — మనస్సునందు స్థిరమైన పొరపాట్లున్నప్పుడు అజ్ఞానమువలన మూర్ఖపునమ్మకము కలుగును. కాని తెలివి కలవారిలో ఒకడు భోజనమునకు కూర్చుండినపుడు ఆరుగు రుండిన తాను ఏడవవాడుగా కూర్చుండుట కిష్టపడడు. వేరొకడు వర్తకము మొదలగునవి శుక్రవారమునాడు ప్రారంభింపడు. ఇంకొకడు 3,13,8,18 (తీన్,

తేరా, ఆట్, అటారా) తేదీలందు, ఏపనిని ప్రారంభింపడు. అనేకులకు దయ్యమునందలి పిచ్చినమ్మకము వలన పిచ్చి కలుగుచున్నది. భగవంతుడు కృపాసముద్రుడనియు, జగత్పిత యనియు నమ్మజాలక అత డొక మూర్ఖనిరంకుశాధికారి యనియు, ప్రపంచమంతయు దయ్యములతోడను, ప్రలోభముల చేతను నింపియున్నాడనియు మానవుడు మిక్కిలి జాగరూకతతో నుండక ఏ మాత్రమైనను కాలుజారినయెడల నాతడు పట్టి శిక్షించు ననియు మూఢవిశ్వాసము కొందరకు కలదు.

ఇట్టి భయము స్థిర మగుటవలన రక్తము, పిత్తము, నాడీమండలము, చివరకు జీర్ణావయవములును కలుషితములై జీవితమునందలి మాధుర్యము నశించిపోవుచున్నది. కొన్ని సంవత్సరములకు పూర్వము పిచ్చివాండ్ర ఆసుపత్రులయందలి లెక్కల వలన ముష్టిమైథునము పిచ్చికి ప్రధానకారణముగాను, మతోద్రేకము రెండవ కారణముగాను, తేలినది. నిజమైన మతము మానవుని ఇహమునను పరమునను రక్షించును. మానసిక ఆత్మీయస్వభావము నుజ్జీవింపచేయును. ఐహిక ఆనందము నొసంగును. సుఖమగు సమరసమగు భౌతికసౌఖ్యమును సమకూర్చును.

7. దయ్యము పట్టుట (Obsession) :— మన మందు వైద్యులు ఎంత తెలివి గలవాండ్రైనను వారి కెన్ని ఇతర సంగతులు తెలిసియున్నను ఈ విషయమున వారికి తెలియునే తెలియదు. తాము చెప్పినదే సత్యమనియు ఇతరులు చెప్పిన దెల్ల అసత్యమనియు వారినమ్మకము. కొందరు రోగులు,

మనస్సు దుర్బలమైయున్నప్పుడు తమ నేదో భూతము పీడించుచున్నదనియు, తమను వెన్నంటి బాధించుచున్నదనియు, విశ్వసింతురు. మంచి మనస్సు కల్గి, అంశమైన ఒక బాలిక అకస్మాత్తుగా పిచ్చిమాటలాడుచు, పిచ్చిచేష్టలను చేయ నారంభించిన యెడల మనదృష్టికి కనుపడని యేదోగ్రహము పనిచేయుచున్నదని నమ్ముటకు వీలైయున్నది. అట్టివానిని మంత్రివేత్తయో కాంతశక్తి గలవాడో కుదుర్పగల్గియుండును. మిచిగాన్‌లో ఒక అందమైన పిల్ల గలదు. అది చనిపోయినదని సమాధిచేయుటకు తీసికొనివచ్చుచుండిరి. ఆమెను ఒక మంత్రివేత్త చూచెను. వెంటనే ఆమెచుట్టును గిరిగీచి చెడుగ్రహమును వెలుపలికి తరిమివేసెను. అటుల ఆమెజీవితము రక్షింపబడినది. చికాగోలో డాక్టరు విల్బరు అను మంత్రివేత్త యున్నాడు. మిచిగానులో ఒకామెకు జబ్బు చేసినది. అందరును నిరాశచేసికొనిరి. విల్బరునకు అతీంద్రియదృష్టి గలదు. ఆరోగి తల్లిదండ్రులే పిశాచదేహములతో ఆమెను దూరము నుండి చూచుచున్నట్లు ఈయన కనిపెట్టెను. వెంటనే ఆతల్లిదండ్రులతో త్వరగ విడిచిపోవలసినదనియు లేనియెడల వారి బిడ్డ మరణించుననియు, వారికి చెప్పగానే వారు వెడలిపోయిరి. రోగియును, పిశాచము వదలిపోయి క్రమక్రమముగా నారోగ్యము నందనారంభించెను. కాని ఇట్టి విషయములు చాల అరుదుగా నుండును. మనోదౌర్బల్యము గలవారు ఇట్టివానికి లోబడకుండుటకై ఉదాత్తమైన భక్తి, ప్రేమ, మొదలగువాని నలవరచుకొనవలసియున్నారు.

త్రొమ్మిదవ కిరణము

# కుదిరిన నాడీవ్యాధులు

సునిశితవైద్యకళాశాల విద్యార్థులచేతను ఇతరులచేతను ఇవి కుదుర్పబడినవి. అసంఖ్యాకములగు రోగనివారణ వృత్తాంతములలో కొన్ని మాత్రమే ఇట వ్రాయబడుచున్నవి.

1. నిద్రలేమి (Insomnia)—నీలము యొక్కయు, ఊదావర్ణము యొక్కయు నాడులను చల్లబరచు గుణము:

"డాక్టరు బ్యాబిట్ గారికి

ప్రియమైన అయ్యా! నేను మీవద్ద తీసికొనిన నీలిసీసా వలన ఉద్రేకించిన నా నాడీమండలము మిక్కిలిగా శాంతి పొందినది. ఇతరమందు లన్నియు నిరుపయోగములై నిద్రలేమికంటెను తీవ్రములగు దుర్గుణములను కల్గించినవి. అపుడు మీ సీసాలోని నీటివలన నిద్ర కలుగుచుండెను.

"రెవరెండు జోసఫ్ వైటీ మాష్టరు,
ఒంటారియో, కనడా.

2. పిచ్చి (Insanity):— ఒకనికి తీవ్రమగుపిచ్చి. వానిని నలుగురు మనుష్యులు పట్టి ఆపుచుండిరి. ఒక్క చికిత్స వలననే వాని ఉద్రేకము తగ్గినది. నాలుగుతూరులు చికిత్స చేయగా రోగనివారణ మైనది. ఆవైద్యునకు మానసిక కాంతశక్తి గలదు. మర్దనతో జోడించి దాని నాతడు ప్రయోగించెను.

ఇట్లద్భుతముగా పిచ్చిని కుదిర్చిన వానిపేరు డాక్టరు గ్రాసు వెనార్ స్వాన్. అతడు మొదట చికాగోలోను తరువాత న్యూయార్కులోను, దాని తరువాత హార్టుఫర్డు లోను నివసించుచుండెను.

3. ఉడుకు విరేచనములు - పక్షవాతము :— టోలెడో యందలి పశ్చిమోత్తర భాగమునందు ఓహియో వైద్యకళా శాలాపండితులు హెచ్. యన్. స్నెల్లరు, యం డి. గారిట్లు వ్రాయుచున్నారు:—

"ప్రియమైన డాక్టరుగారికి,

శిశువులకు గల్గిన నీళ్ళవిరేచనములకు నీలివర్ణోదకమును వాడితిని. మిక్కిలి మేలు కల్గినది. మెడకునకు సంబంధించిన రక్త అభిష్యందనము వలన కల్గిన అర్ధాంగవాతము పసుపుకాంతిని ప్రయోగించుటచే కుదిరినది. ఈ అర్ధాంగవాతమునకు ఎన్ని మందులు వాడినను నిరుపయోగమే యైయుండెను."

4. ముఖమునందలి నాడులలో మంట :— "ఈ తరగతికి చెందిన అనేక వృత్తాంతములను పంపగలను. ఇందనేకులకు ఒక్కతూరి చికిత్సచేసిన చాలును. బాధగా నున్న భాగముపై నీలివర్ణోదకముచే తడిపిన మునివ్రేళ్ళను, పైనుండి దిగువకు దౌడ మీదుగా చాలనము చేయవలెను. అప్పు డప్పుడు వెన్నుపాము వెంట పైనుండి క్రిందికి హస్త చాలనము చేయుచుందును. కాని ఇట్లు చేయుట తఱుచుగా అవసర ముండదు. పన్నెండింట ఒకదానికి మాత్రమే విద్యు

చ్ఛక్తి నుపయోగింతును. ఒక తమాషా జరిగినది. ఒకనికి పైనుండి క్రిందకు హస్తచాలనము చేసినను మంటలు తగ్గలేదు. నాకు ఆశ్చర్యమైనది. కొంచె మాలోచించితిని. ముచ్చిలిగుంటపై రెండుచేతులతోడను బలముగా నొత్తితిని. "ఓ! మంటలు పోయిన"వని యాత డనెను.

విలియం ఏ జోన్సు, డి. యం.,
64, బ్రిన్ హైఫామిడ్ పెనిడేరెన్, మెర్థిర్,
టిడ్విల్, సౌత్ వేల్సు, గ్రేటుబ్రిటన్.

పై చికిత్సయందు జోన్సుగారు మజ్జాముఖముగా నొత్తియుండిరి. అక్కడనుండియే అనేకనాడులు బయలుదేరుచుండును.

5. నరముల తీత :— 1893 వ సంవత్సరము వేసంగియందయు, మారిస్ అను వడ్రంగి నాడీక్షయముచే బాధపడుచుండెను. వైద్యు లనేకులు చికిత్సచేసిరి. వానిస్థితి నానాటికి పాడాయెను. నావద్దకు వచ్చునప్పటి కాతడు సరిగ నడువనైన లేకుండెను. దేహ మంతయు నొప్పులు. చేతితో బరువుగల వస్తువులను వేనిని పట్టుకొనజాలడు. వానికి నీలివర్ణోదకమును, హోమోపతి పద్ధతిని ఎక్కువ తూరులు మర్దనము చేసిన నాభిని ఇచ్చుచుంటిని. అయిదారు తూరులు చికిత్స చేసినంతనే వానికి రోగనివారణ మైనది. అత డిప్పటికిని నారోగ్యముగనే యున్నాడు."

విలియం. ఎ. జోన్సు, యం. డి.

౯. పక్షవాతము- ఎడమభాగమందలి అర్ధాంగవాతము:— పైఁజెప్పిన ఏ. జోన్సుగారే ఈ క్రిందిరోగనివారక వృత్తాంతములను పంపుచున్నారు.

"1892 సంవత్సరము శీతకాలమున సౌతువేల్సునందలి జాన్ జోన్సు టెగ్రిడిజా అను నతనికి పక్షవాతము గల్గినది. అతనికి చికిత్స చేయవచ్చిన వైద్యుడు రోగియొక్క రక్తనాళము చిట్లినదనియు అందువలన మెదడునందలి రక్తము కుదపలుగా నేర్పడిన దనియు కనుక పక్షవాతము కుదురదనియు వివరించి చెప్పెను. ఎడమభాగమంతయు రోగగ్రస్తమైనది. అందులో ఎడమ చేయియు బాహువును, కాలును నిరుపయోగముగా నుండెను. అత డేవో చెప్ప శ్రమపడుచుండెను.

వాని మాట లెవ్వనికిని అర్థమగుచుండుట లేదు. 5 వారములు ఏవేవియో మందుల నిచ్చిరి. అత డంతకంతకు దిగనాసిల్లుచుండెను. వారు నాకొఱకై కబురంపిరి. ఆతడు పూర్వవయసున మిక్కిలి నియమరహితముగా జీవించియుండెను. అతనికి అప్పటికే 60 సంవత్సరములు దాటియుండెను. మిక్కిలి అనిష్టముతోనే వానికి చికిత్సచేయ నొప్పుకొంటిని.

దేహమంతయు మర్దనచేయుచుంటిని. వెన్నుపాములో చైతన్యము గల్గునట్లు వేడినీటిని పోయుచుంటిని. తరువాత ప్రతి కండరమును, ప్రతితంతువును పిసుకుచుంటిని. మెదడునందు నిలువయున్న మలిన శక్తులు వెలువడిపోవునట్లు పై నుండి క్రిందికి హస్తచాలనము చేయుచుంటిని. ఆ రోజు సాయంత్రమే

పీపునందును, కాలికి దిగువభాగమునందును మిగుల బాధగ నున్నట్లు నా కెఱిగించెను. స్పర్శజ్ఞానము గల్గుట మంచిదేయని నే నాతని కెఱిగించితిని. కొలది దినములలో ఆ బాధ తగ్గినది. కొలది వారములలోనే ఆతనికి ఆరోగ్యము కల్గినది. ఒక నాటిసాయంకాలమున తనకు హాయిగా నున్నదనియు అనేకదిన ములనుండి తా నిట్టి సౌఖ్యమును గోల్పోయితి ననియు తన కారోగ్యము కల్గుచున్నట్లు తోచుచున్నదనియు చెప్పెను. తనయొక్క దృష్టి 18 సం॥ల నుండియు చెడియుండి అపుడు బాగుపడినదని ఒప్పుకొనెను. దానినే అతనిభార్య స్థిరపఱచెను.

ఒకనాడు వాని పాతవైద్యుని పిలిచిరి. రోగి అప్పుడే షికారు నకు పోయి వచ్చియుండెను. వైద్యుడు అత్యాశ్చర్యమును పొంది వెనుకకు తిరిగి, ఎట్టి ప్రశ్న లడుగకయే వెడలెను."

మజ్జాముఖముననుు, మెడమీదను రెండుమూడు తూరులు వేడినీటిని పోయుచు, శీతోదకమును ధారాళముగా త్రాగనిచ్చుచుండినయెడల డాక్టరు జోన్సుగారు ఈ రోగ మును ఇంకను వడిగా కుదుర్పగలిగెడివారే. వా రావ్యాధి యెటుల నివారణమైనదియు వైద్యులతో చెప్పలేదు. ఇక్లే ఈ దేశమునందు ఈ విధానమువలన రోగనివారణ మగుచుండు ననునది వైద్యులకు తెలియుటయేలేదు. ఒక సంగతి చూడండి. ఒక డాక్టరుగారు ఒకరికి అనేకమందు లిచ్చి చికిత్స చేసిరి. రోగము కుదురలేదు. ఒక మర్దనచికిత్సచేయువానిని పిలిచిరి. అత డావ్యాధిని కుదిర్చెను. రోగిబంధువులు ఈ సంగతిని

మందువైద్యునితో చెప్పుటకు భయపడిరి. ఆతడీ రోగనివారణ మంతయు తన మందువలననే కలిగినదని యానందించెను. ఇంకొకవిషయము ఒక శిశు వారాత్రియే మరణించునని డాక్టరుగారు చెప్పిరి. ఉదయమున డాక్టరుగారువచ్చి చూచునుగదా ఇతరపిల్లలతో కలిసి భోజనము చేయుచుండెను. ఆరాత్రియే ఒకమర్దన చేయు నామెవచ్చి రోగనివారణ చేసి యుండెను. ఈ సంగతి ఆవైద్యునకు ఒక్కడైనను చెప్పరైరి. కాంతచికిత్స మొదలగు సునిశితవైద్యముల చేయు వైద్యు లందరును కువైద్యులనియు, మూఢులనియునే ఆ వైద్యు డింకను తలంచుచున్నాడు.

7. కుడి వైపు పక్షవాతము :— కాలిఫోర్నియాయందలి శాన్టామోనికా వాసి, విలియం జి. డోబీ, యం. డి. గారు ఈ వ్యాధిని కుదిర్చిరి. "లాసు ఆంజిలీసునందలి మేజరు, ఇ అను నతనికి కుడివైపు పక్షవాతము. కుడిబాహువు భుజమువద్దనే కట్టివేయబడినట్లు కదలదు. జ్ఞాపకశక్తి లేదు. సంధులయందు కదలిక సరిగా లేదు. మూడుతూరులు కాంతచికిత్స చేసినతోడనే బాహువుతో పనిచేయ వీలాయెను. అనేకమాసములు వరుసగా, కాంతచికిత్స చేయునప్పటికి వానికి రోగనివారణ మాయెను. ఇప్పు డతడు సంయుక్తరాష్ట్రమునందలి పటాలములో కర్నల్ ఉద్యోగమునం దున్నాడు.

8. నడ్డి వూసలు సళ్లు వదలుట :— కుదిర్చినవారు డాక్టరు డోబీగారు. "శాంటా మోలికాయందలి 'కే' అను నతనికి క్షయ

రోగము వచ్చినదనియు చల్లనిప్రదేశములలో నివసించిన తప్ప అతడు జీవింప డనియు వైద్యులు చెప్పిరి. నడ్డిపూసలలో 4, 5 సంఖ్యలుగలవి, భ్రష్టమైనవనియు అందువలన నాడులు తిన్నగా పనిచేయుట లేదనియు నేను కనిపెట్టితిని. ఏడుతూరులు కాంతచికిత్స చేయగా వాని కా వ్యాధి కుదిరినది."

నాడులు కృంగిపోయి, మతిచాంచల్యము గల్గుటకు సిద్ధముగా నున్న 'కే' అను న్యాయవాదికి పది తూరులు కాంతచికిత్సచేసి జోబీగారు కుదిర్చియున్నారు. పిట్సుబర్గులో ఒక సుకుమారి యైన స్త్రీ గలదు. ఆమెకు నాడీవ్యాధి, పిఱికితనము, స్పర్శ నేని యూమె భరింపజాలదు. ఆతడు వచ్చినపుడెల్ల కొన్ని పూలను దెచ్చి ఆమె కిచ్చి గదిలో దూరముగా ఆమెకు ఎదురుగా కూర్చొనుచుండెను. ఇట్లామె ఆతనినుండి సునిశితములగు మానసిక ప్రభలనుమాత్రమే స్వీకరించుచుండెను. అందువలన ఆమెకు త్వరగా రోగనివారణమైనది.

9. విద్యుచ్ఛక్తి వలన పక్షవాతము కుదురుట :— విద్యుచ్ఛక్తి రోగములను నివారించుటయందు వర్ణవైద్యము ధాతుకాంతశక్తులయంత సమర్థమైనది కాదని నా నమ్మకము. ఐనను ఫ్రాన్సస్, ఇ. విలియము డి. యం., యం. డి అనునామె విద్యుద్యంత్రముతో అనేకతూరులు పక్షవాతము కుదిర్చియున్నది. అనేకు లిట్లే అదే యంత్రముతో అదేరోగమును చికిత్సచేసి చూచిరికాని ప్రయోజనము లేకపోయెను. నా నమ్మక మేమనిన విలియమ్సునందు బలమైన కాంతశక్తి

యుండెను. విద్యుచ్చికిత్స చేయునపుడామెయొక్క కాంతశక్తి రోగికి చేరుచుండెను. బోస్టనులోనున్న సుందరమైన జయప్రదమగు ఆరోగ్యసదనమును ఎత్తివేసి కాలిఫోర్నియా యందలి సుఖవాతావరణమునందు ఇప్పటి నివాస మేర్పఱచుకొనినది. ఆమె చేసిన చికిత్సలలో ఒకదానిని మాత్రమే ఇచట వ్రాయుటకు సావకాశ మున్నది. ఆమె యిట్లు వ్రాసినది.

"బోస్టన్ నగరవాసియగు హెచ్ యనుకన్య 12 వ జూన్ తారీఖున పక్షవాతముచే బాధపడుచు నాయొద్దకు వచ్చెను. అంతకు నాల్గుసంవత్సరములకు పూర్వము ఆమె పక్షవాతము వలన పడిపోయినది. అప్పటినుండి చిరకాలము ఆమె యవయవములయందు కదలిక లేదు. కొంతకాలమైన తరువాత ఆమె అవయవములు కొంచెము బాగుపడినవి. కాని ఆమె ఎపుడైనను పడుటకు సిద్ధముగానే యుండెను. వైద్యులామె యెప్పటికిని పరిపూర్ణారోగ్యమును కాంచజాలదని చెప్పిరి. నేనామెకు విద్యుచ్ఛక్తిని ప్రయోగింప నారంభించితిని. మూడు వారములలో ఆమె తాను ఎప్పటి ఆరోగ్యమును పొందినట్లు తలంచెను. జూలై 2 వ తేదీన ఆమె 28 మందితో కలిసి యూరపు దేశమున సంచారము చేయనారంభించెను. ఆ సంచారము శ్రమకరమైనదియే యయ్యెను ఆమె యానందముగను, బలముగను నుండెను."

# భారతదేశమున వర్ణచికిత్స

1. చెన్నపట్టణమునందలి రామస్వామి అయ్యరుగారిట్లు వ్రాసిరి:—"భారతదేశమున రోగనివారణకు వర్ణచికిత్స ఇతరచికిత్సలతోపాటు ఆదరింపబడుచున్నది. మధుర (U. P.) జిల్లాలో మహావనమునకు న్యాయాధికారిగా నున్న జ్వాలప్రసాద సోదరుడు తాను చేసిన పనివలన బాధితులగు అనేకమానవులకు శాశ్వతమగు నుపకృతి సల్పినాడు. అతని సేవ వర్ణింపసాధ్యము కానిది. బొంబాయిలో సుప్రసిద్ధుడగు తుకారాం తాతియాసోదరుడు ప్లేగును విజృంభించకుండ ఆపుటకును రోగనివారణ చేయుటకును ఎక్కువ పనిచేసినాడు. అవి యెల్ల జయప్రదమైనవి. ఇప్పుడు బుద్ధిమంతులగు పెద్దలు భారతదేశమునందలి వివిధభాగములందు ఈ చికిత్సాపద్ధతిని వ్యాపింపజేయ సంస్థలై యున్నారు. రోగగ్రస్తులకు వారీ చికిత్సను ఉచితముగనే సమకూర్చుచున్నారు."

2. ప్రపంచ సంచారియైన డాక్టరు పబుల్సుగారు జ్వాలాప్రసాదుగారిచే వ్రాయబడిన సూర్యకిరణచికిత్స యను కరపత్రమును దయతో నాకొసంగిరి. ఈ కరపత్రము కొలది మాసములలోనే మూడు కూర్పులుగా ముద్రింపబడినది. అది ఎనిమిది దేశభాషలలోనికి తర్జుమా చేయబడినది. దివ్యజ్ఞానసమాజముయొక్క అధిపతులగు కర్నల్ ఆల్కాటుదొరగారు జ్వాలప్రసాదుగారు మంచి మానసికచికిత్సకుడు (Mesmerist) కాగలడని ఆదేశించిరి.

జ్వాలప్రసాదుగా రిట్లు వ్రాయుచున్నారు :—
"వారిసలహా ననుసరించి నేను పనిచేయుటచే నేను మంచిమానసిక చికిత్సకుడనే నైతిని. దాని నాచరించుచుండుటవలన నాకు మానవ ప్రేమ, రోగనివారణ చేయుట యందలి యుత్సాహము వృద్ధిపొందినవి. క్రమాభివృద్ధినందుచున్న, మారోగులకు చికిత్స చేయుటకు నాకు శక్తిచాలదాయెను. అందువలన హోమోపతి జోడించితిని. ఈ రెండు విధానములును శాకాహార్యముమీద ఇతర విధానములవలెనే, అసంపూర్ణమైనవిగా నాకు తోచెను. మానవులకు శాశ్వతమగు మేలు చేకూర్పగల చికిత్సావిధానములకొఱకు నేను పరిశోధించితిని. తుట్టతుదకు డాక్టరు బ్యాబిటుగారు వ్రాసిన ఆరోగ్యపత్రికను, (Health manual) అందు వివరింపబడిన వర్ణవైద్య సిద్ధాంతములను చూచితిని. 11 సంవత్సరములు ఈ చికిత్సలో గడించిన అనుభవమువలన నే నిపుడు చెప్పగల్గిన దేమన ప్రపంచమునందలి వివిధములగు చికిత్సావిధానములు దీనిముందర పోల్చుటకు వీలులేదు. వాని అన్నిటికంటెను ఇది చాల గొప్పది, చౌకమైనది, మృదువైనది. రోగనివారణ చేయుటయందు అన్ని ఇతరవిధానములకంటెను ఇది అత్యంత సామర్థ్యముకలది."

—జ్వాలాప్రసాద్, యఫ్. టి. యస్. కాశీన్యాయాధిపతి.

3. భారతదేశమున వర్ణ చికిత్సా వృత్తాంతములు :—
జ్వాలప్రసాదులు వ్రాసిన సూర్యకిరణచికిత్సనుండి ఈ క్రింది విషయములు ఎత్తి వ్రాయబడినవి.

పిచ్చి:—నీలివర్ణోదకము ప్రయోగించినంతనే నమ్మ వీలుగానంత త్వరగా కుదురును. మీారటులో ఒకామెకు పిచ్చియెత్తినది. నుదురుపై ఒకనిమిషమైనను నీలికాంతి ప్రయోగింపక ముందే ఆమెకు స్వస్థత చేకూరెను.

కుక్క, పిచ్చికుక్క కాట్లకు చికిత్స:— (సూర్యకిరణ చికిత్స 13 వ పేజీ) ఈ (నీలి) రంగు అనేకజంతువుల వ్యాధులను నయము చేయును. కుక్కప్రాణమున కిది ఎక్కువ యవసరము. అవి వేసవియం దీ నీలివర్ణోదకము నిచ్చిన పిచ్చివగునను భయము పోవును. ...... కుక్కకాటునకు నీలివర్ణోదకము మిక్కిలి ప్రయోజనకరము. అట్టివారికి ముగ్గురకు పిచ్చిని నిశ్చయముగా కుదుర్పగల్గినాను. వారికి లోపలికిని, పైకిని చికిత్స చేసితిని. లోపలికి నీలివర్ణోదకము నిచ్చితిని. పుండుపైన నీలికాంతి ప్రయోగించి దానిపైన నీలివర్ణపు తడిపొత్తి నుంచితిని. మొదటిమూడు దినములు తేప కొక ఔన్సుచొప్పున ప్రతి మూడు గంటలకు నీలివర్ణోదకము నిచ్చితిని. తరువాత మూడు దినములు, తేప కొక ఔన్సుచొప్పున దినమునకు మూడు మోతాదులును దానికి తరువాత పరుండ బోవునపుడు ఒక మోతాదు చొప్పునను నీలివర్ణోదకము నిచ్చుచుంటిని.

బొబ్బలరోగము:— బొంబాయియందును, చుట్టుపట్లను, బొబ్బలరోగపువాతనుండి యనేకుల ప్రాణములను నీలివర్ణోదకము రక్షింప గల్గినది.* సూర్యకిరణచికిత్స (పేజీ 19) జ్వాలప్రసాదు లచటనే చికిత్సకూడ వ్రాసియున్నారు.

అతిసారము :— నీలివర్ణోదక మందులకు గుణతమమైన యౌషధము. నేను వందలాది రోగములను స్వస్థతపఱుప గలిగినాను. అది రెండు దినములలో రోగమును కుదుర్చును. అతిప్రమాదకరమైన స్థితియందు సైతము నమ్మకముగా కుదుర్ప గలిగినాను. నీలివర్ణోదకము వాడినయెడల అతిసారమువలన చావవలసిన పనియుండదు." (సూర్యకిరణచికిత్స 18వ పేజీ)
గ్రహణి ఇంతకంటెను తీవ్రమైనది. దానికి వాడబడు నల్లమందు మొదలగు మందు లన్నియు తరువాత అపకారమునే చేయును. రక్తము, చీముతోగూడిన గ్రహణియందు నీలివర్ణోదకము నిశ్చయముగను, సుఖముగను, నిరపాయకరముగను పనిచేయును.

కుష్ఠము :— జ్వాలప్రసాదు లీ వ్యాధిని పసుపువర్ణోదకమును వాడి కుదిర్చియున్నారు. కాని చికిత్స 6 మాసములు పట్టుచున్నాడు. పక్షవాతమున కతఁడు ఎఱుపురంగును వాడి కుదిర్చియున్నారు. పసుపురంగు, నారింజపండువర్ణము, ఈ వ్యాధిని కుదుర్చుటయందు ఇంకను ఎక్కువ ఉపయోగకారులు. కొన్ని సమయములందు మాత్రమే యెఱుపు అవసరమైయుండును.

మేదస్తాపము - తలనొప్పి : మొదలగువానికి నీలికాంతిని ముఖముమీదనో శిరస్సుమీదనో ప్రయోగించినంతనే ఈ వ్యాధి కుదురుచుండెను. జ్వాలప్రసాదులు అనేక రోగనివారక వృత్తాంతములను వ్రాసియున్నారు. చాల గౌరవముగా పని చేయుచున్నారు. నాచే రచింపబడిన శాస్త్రీయములగు నితర

ఉద్గ్రంథముల చదివియుండినయెడల ఇంకను శాస్త్రీయముగా చికిత్స చేయగల్గియుండెడివారు. హిందువులలో విద్యావంతు లనేకులు మాసునిశిత కళాశాలాపాఠములను తెప్పించుకొని చదువుచున్నారు. అధికజనసంఖ్యగల ఆదేశమున అత్యద్భుతములగు ఫలితములు గల్గునని నమ్ముటకు సావకాశమున్నది.

ప దు నొ క ం డ వ కి ర ణ ము

# మానసిక నాడీశాస్త్రములకు సంబంధించిన కొన్ని విషయములు

1. సునిశితశక్తులను గూర్చిన అభిప్రాయములు:— ఈ శక్తులగూర్చి మనము విచారించినకొలదిని సునిశితశక్తులను ప్రయోగించుటయందు ఆ శాస్త్రముయొక్క ఆవశ్యకత మన కెక్కువగా బోధపడుచుండును. మనయందు దైవత్వ మును వృద్ధియగును. భూతభవిష్యద్వర్తమానములయొక్క జ్ఞానము మనకు గల్గును. అతీంద్రియములగు లోకములయొక్కవివేచనము మనకుగల్గును. మన దేహమును మనస్సును ఉన్నతని బొందును. మన కానందము కరతలామలక మగును.

2. భవిష్యద్ జ్ఞానము :— కొందరి మనస్సులు మిక్కిలి తేజోవంతములుగా నుండును. వారు ముందు జరుగబోవు విషయములనుకూడ తెలిసికొనగల్గి యుందురు. ఫ్రాంసు దేశమునందు 'కెజోట్టి' అను నతడు ప్రపంచచరిత్రయందు అద్భుతమగుసూచనను చేసియున్నాడు. అందతడు ఫ్రాంసు దేశమునందు జరుగబోవు బీభత్సపరిపాలనమును, అందు తాను మరణింప బోవుటయు సూచించెను. డాక్టరు జే. ఆర్. బుచ్ నన్ అను నాతఁడు "అతీంద్రియజ్ఞానము" అను విషయమును గురించి వ్రాసిన భాగమును ఇచట ఎత్తివ్రాయుచున్నాను. "న్యూయార్కు నగరవాసియగు 'చార్లెసుడాబారను' అను నతడు

భవిష్యద్విషయములను నిశ్చయముగా చూడగల్గియున్నాడు. ఆరు సంవత్సరములకు పూర్వము న్యూయార్కులో ఒక ఆరోగ్యసదనమునందు అతిథులనేకులతో ఆయన కూర్చుండి యుండెను. అపుడిద్దఱు స్త్రీ లచ్చటకు వచ్చిరి. వారు అపరిచితలు. ఆయింటి యజమానురాలు మాత్రమే వారిని ఎఱుగును. అపు డతీంద్రియదృష్టినిగూర్చి వాగ్వాదము జరుగుచుండెను. ఆ స్త్రీలిద్దరును తల్లియును కూతురునునయియుండిరి. వారు అతీంద్రియజ్ఞానమనునది యుండదని పరిహాసించిరి. డా॥ బౌరను గారిని మమ్ములను గురించి ఏమైనను చెప్పుమని పెద్దయామె యడుగగా ఆతడిట్లు చెప్పెను. "అమ్మా, నీవును, నీబిడ్డయును ఆరుమాసములలో కూటికొఱకు కష్టపడి పనిచేయవలసియుండును. తరువాత 18 మాసములకు మీస్థితి బాగుపడును." అప్పు డా మాటలు విశ్వసించుటకు వీలుగాలేవు. కాని కొలది కాలములోనే వాని భవిష్యము నిజమాయెను. వారి ధనమంతయు నూనెబావులపై వెచ్చింపబడియుండెను. ఆ బావుల నుండి నూనె వచ్చుట మానెను. అందువలన వారు పూటకూళ్లు పెట్టుకొనవలసివచ్చెను. కాని తరువాత 18 మాసములకు వారి ఆస్తియొక్క విలువ పెరిగినది. అందువలన వారికి స్వతంత్రమగు ఆస్తి యేర్పడెను."

రషియా దేశపు రాజగు నికాలసు యొక్క చావును ఒక సాధువు భవిష్యత్ చెప్పుట:— 1854 సంవత్సరం డిసెంబరు 8 వ తారీఖున న్యూయార్కు నగరమునందలి డెయిలీటైమ్సు పత్రికయందు జాన్. యఫ్. కోల్సు అనునతడు.

ఈ విషయమును వ్రాసియున్నాడు. దానినే సండే డిస్పాచ్ పత్రిక 10వ డిసెంబరు తేదీన విపులముగా వ్రాసియున్నది. ఆ విషయమేమన — నవంబరు 29వ తేదీనుండి మూడు నెలలకు రష్యాదేశపు రాజగు నికాలను చనిపోవునని. అది అట్లే జరిగినది. కాని అతడు ఒకదినము ముందుగా మరణించెను. ఈ కాలము రష్యారాజధానియగు సెంటుపీటర్సుబర్గు, న్యూయార్కునగరములకుగల కాలవ్యత్యాసమునకు సరిపోయినది. యస్. బి. బ్రిట్టాన్ అనునాతని "మనుష్యుడు - వానిసంబంధియములు" అను గ్రంథమునుండి దీనిని సంగ్రహించితిని.

3. అతీంద్రియ దృష్టి:— "డాబారను కొన్ని సమయములయందు తాను చెప్పినదానిని దృఢముగను, స్థిరముగను చెప్పెను. న్యూయార్కునగరమున ఒకభవంతియందు ఒకస్త్రీయును ఆమె కుమార్తెయును ఆయనను కలసికొనిరి. అతనికి ఒక చిన్నకాగితము నిచ్చి ఆ కాగితము వ్రాసినయట్టి మనుష్యుని ప్రవర్తనను గురించి యడిగెను. ఆ కాగితము ఒకటి రెండు అంగుళములకంటె ఎక్కువ పెద్దదికాదు. డాబారను, ఆతడొకనియమరహితుడైన దుర్మార్గుడనియు త్వరలోనే జైలుకు పోదగినపని చేయుచున్నాడనియు చెప్పెను. దానిని వారు మొదట నమ్మలేదు. తరువాత ఆయన వెడలిపోయెను. పరిశోధన చేయగా అతడొక ఇంద్రియలోలుడనియు, తానొక గొప్పవానివలెను, వైద్యునివలెను వేషము వేసికొని ఖైదులో పడదగినపనులు చేయుచుండెననియు కనిపెట్టబడినది. అంతటినుండి అతని పరిచయమును వారు మానివేసిరి.

4. నాడులు దేహమును మనస్సును కలుపునవిగా నున్నవి. దేహావయవములను నడుపునవి ఈ నరములే. మందు కంటె మానసికశక్తి రెండు తరగతులు సునిశితమైనది. 1 నాడీ శక్తులను స్వాధీనపఱచుకొనుట, 2 వానిమూలమునకు పోయి మానసికశక్తిని లోబఱచుకొనుట. మాంత్రికులు మనఃకాంత శక్తిని, యోగనిద్రను నిందింతురు. వారు స్థూలచికిత్సలను వదలియున్నారు. కాని వారికి శాస్త్రీయజ్ఞానము లేదు. పైయుత్తమ విధానములకుతోడు సూర్యకాంతి, వర్ణశక్తులు, ప్రపంచమునందలి ఇతర శుద్ధములగుపదార్థములు, ప్రపంచమునందలి చికిత్సావిధానములుగా నుండగలవు.

యోగనిద్రావిజయములు.

సునిశితవైద్యకళాశాలయందు యోగనిద్రను పరిదర్శించి శోధించిన కాలిఫోర్నియాయందలి సెంటు ఆంజిలీసు నివాసియగు డబ్లియూ ఎ. డంటనుగారు నాకీ క్రిందివిషయములను పంపియున్నారు. దీనిని నాకు చాల ఆలస్యముగ పంపియుండుటచే యుక్తమగుచోట నిముడ్చజాలకపోతిని.

లాస్ ఆంజలీసు కాలిఫోర్నియా
22 మార్చి 1898.

ఈ యుద్యమమునందు స్నేహితుడును, సోదరుడును అగు డాక్టరు బ్యాబిటుగారికి.

యోగనిద్రాప్రయోగమునందు నా అనుభవములను మీకు తెలుపవలసియున్నాను. బి. డబ్లియు. అను నామె 30 సంవత్స

రములనుండి వరుసగా నల్లమందును వాడుచుండెను. అప్పు డప్పుడు తీవ్రమగు సారాయిలను సైతము త్రాగుచుండెను. ఏమియు దొరకకున్న యెడల మద్యసారము త్రాగును. ఆమెకు రోగనిద్రను కలిగించితిని. ఆమె కొయ్యవలె బిగుసుకొని పోయెను. నాయిష్టమువచ్చినస్థితిలో ఆమెను నిలుపగలిగితిని. అప్పుడామెకు సారాయి, నల్లమందు మొదలగునవి వాడి నంతనే వికారము గల్గుననియు, ఆమె నేదో దైవికశక్తి రక్షించుచున్నదనియు, నమ్మునట్లు ఆదేశించితిని. అప్పటి నుండియు నామెవ్యాధి నివారణమైనది. యవసారాయముగాని తేలికయగు మద్యసారముగాని ఆమె వాసన చూచినంతనే వికారము గల్గుచుండును. అప్పటినుండి రెండుసంవత్సరముల వఱకును, ఆమె ఒక్కగింజయెత్తు నల్లమందు నేని తినియుండ లేదు. బాధయంతయు ఆదేశమాత్రముననే నివారణ మాయెను. మందు ఒకబిందువైనను వాడబడలేదు. ఆమెకు అప్పుడప్పుడు తీవ్రమగు బాధలు గల్గుచుండెను. వానినెల్ల యోగనిద్రాప్రయోగముచేతనే కుదిర్చితిని. ఆకలి మామూలు స్థితికి వచ్చెను. తూకము 15 పౌనులు పెరిగినది. క్రొత్తమనిషి వలె కన్పడనారంభించెను. మనసు శుద్ధముగుటవలన ఆమె నైతికప్రవర్తనము బాగుపడెను. ఇప్పుడామె మంచిసంకల్ప బలము గల్గియున్నది. ఉదాత్తమైన భావములు గలవు. ఈమెను గురించి చోటుండినచో ననేకవిషయములను చెప్పవచ్చును.

మఱియొక దురదృష్టవంతున కిట్లే రోగనివారణము చేసితిని. 'సి' యను నతనికి 17 సంవత్సరములనుండి నల్లమందు అలవాటు

గలదు. ఇది మూడు మాసములకు పూర్వమే జరిగినది. చికిత్స పూర్తియైనది. అతని తూకము 20 పౌనులు పెరిగినది. అతని రూపము సంపూర్ణముగా మార్పునొందినది. అతనికి నల్లమందు మొదటనే మాన్పింపలేదు. క్రమక్రమముగా తగ్గించి 8 వ నాటికి అసలే లేకుండ చేసితిని. అప్పటినుండి నేటివఱకు నల్లమందు ఒక నలుసైనను వాడియుండలేదు. అతనికిగల బాధలు, కోరికలు ఆదేశముచేతనే పోగొట్టుచుంటిని.

'పి' యను నామెకు 40 సంవత్సరముల వయస్సు. ఋతుకాలమునందు రక్తస్రావ మధికముగా నగుచుండెను. ఆమె దేహమందలి రక్తమంతయు స్రవించిపోయెను. చావసిద్ధముగా నుండెను. నే నీవిషయము చేపట్టునప్పటికి మూడు మాసములు వరుసగా రక్తస్రావమగుచుండెను. ఆమె చాల నీరసించిపోయెను. అందువలన ఉద్దీపకపదార్థముల నిచ్చుచుంటిని. వైద్యశాస్త్రమందలి యుత్తమఔషధము లన్నిటిని వాడిచూచితిని గాని లాభములేకపోయెను. చేయునదిలేక యోగనిద్రను యోజించితిని. వెంటనే సంపూర్ణముగా రోగనివారణమైనది. రక్తస్రావ మాగిపోయినది. తిరిగి ఆరోగ్యము గల్గినది. ఆమె విద్యావంతురాలు. వివేచనజ్ఞానము కలది. సునిశిత కళలయందు ప్రజ్ఞ కలది.

జె. ఐ. అనునతనికి తీవ్రమగు పోట్లును, తలలో కుడివైపున నాడులయందు మంటలును గలవు. బాధోపశమన కరమగు మందులన్నియు నిష్ప్రయోజనమైనవి. నిద్రకలిగించుట అసాధ్యమాయెను. మూడురోజులు వరుసన ప్రయత్నింపగా

45 నిమిషములు మాత్రము నిద్ర కలిగింపగలిగితిని. వానిని యోగనిద్రనుండి లేపునప్పటికి వానిబాధ లన్నియు నుపశమించినవి. ఆతడు చాతుర్యముగల వర్తకుడు.

రోగనివారణమున కీవిద్యను ప్రయోగించుచుంటిని. అనేకులకు నయమైనది. ప్రపంచమునందలి మందు లన్నిటికంటెను ఈసునిశితశక్తులు వేయిమడుంగులు ప్రతిభావంతములైనవి. వీనిని ప్రయోగించుటయందు రోగమెట్టిదైనను రోగికిమాత్రము ఎట్టిఅపకారమును జరుగదు.

గమనింపవలసిన మఱియొకవిషయమును వ్రాయుచున్నాను. ఈవిద్యను ప్రయోగించువారు విద్యావంతులై యుండవలయును. సహజముగా ఆస్వభావము జన్మతోనే యుండవలయును. అప్పుడీశక్తిని వారు యుక్తముగను, జాగ్రత్తగను ప్రయోగింపగలిగియుందురు. మీ సహోదరుడు,

వాలెస్. ఎ. డంటన్, యం. డి.

డంటనుగారు పైన వ్రాసినవిషయములనుబట్టియు ఆతడు స్వయముగ నాతో చెప్పిన విషయములను బట్టియు, యోగనిద్రవలన తాత్కాలికఫలమేగాని శాశ్వతలాభము చేకూరదను విషయము కొట్టువడిపోవుచున్నది. పరిశుద్ధ మనస్కుడై ఉదాత్తమగు మానసికబలము గలిగినవాని యొక్క శక్తి దృశ్యమానప్రపంచకమునందుగల యేయితర శక్తికన్నను ప్రతిభావంతమైనది. ఈశక్తియే స్వయముగా ప్రయోగించుకొనబడినయెడల ద్విగుణమగు శక్తి గలిగియుండును.

రెండవభాగము సమాప్తము.

# సునిశితవైద్యము

మూడవ భాగము

## అవయవములు - వానియందలి రోగములు

# వైద్యప్రపంచము - విద్యావిధానములు

1 విజ్ఞానాభివృద్ధి:— వైద్యవేత్తలును, ఇతరశాఖలయందలి పండితులును బహుళములు, ఉత్తమములు నగు గ్రంథముల రచియించిరి. ప్రకృతి, మనస్సు మొదలగు వానిని గుర్తించి బాగుగా పరిశోధనల జేసి విజ్ఞానమును గడించిరి. అందువలన అమూల్యమును, అమితమును నగు విజ్ఞానసముదయము గడింపబడినది. ప్రపంచాభివృద్ధి కిది యెంతయో సాయపడినది.

2. అత్యంతావసరమైనది:— అన్ని కళాశాలలకు నొకే కార్యవిధాన మేర్పడియుండవలెను. అందలి విద్యార్థు లందఱును సనాతనమగు విజ్ఞానము నంతయు గడింపవలెను; నూతనవిజ్ఞానమును గడించుటకును, పరమసత్యమును గ్రహించుటకును, సుముఖులై యుండవలెను. ఇప్పటి విద్యావిధాన మట్లేర్పడి యుండలేదు. తాము గడించినదే పరమసత్యమనియు, అందుకు భిన్నమైన విజ్ఞానము హాస్యాస్పదమైనదనియు, దానిని బోధించువారు మూఢులు, అజ్ఞానులు ననియు, అతివాదు లనియు ఆధునికవిద్యాప్రవీణులు తలచుచున్నారు. వైద్యవరు లనేకులు, 'వైద్యము శాస్త్రమేగా' దనియు 'రోగమును గురించి మా కేమియు దెలియ' దనియు జెప్పియున్నారు. అయినను శాసనసభలను వారు స్వాధీనపఱచుకొనిరి. వానిద్వారా నిరంకుశశాసనములను తయారుచేయించిరి. తమ కళాశాలల

యందు పట్టముల బొందక, వైద్యము చేసినచో వారికి జరిమానాలు వేసి, శిక్షలు వేసి బాధింతురు. తమకన్నను చాకచక్యముగా రోగనివారణ చేయువారిని మఱియు బాధింతురు. మనకు స్వాతంత్ర్యమున్నది. మన కిష్టమైనవారిని మన శాసనసభ్యులనుగా నెన్నుకొను స్వాతంత్ర్యమున్నది. కాని మన కింకను వైద్యస్వాతంత్ర్యము లభింపలేదు. మనకు రోగనివారణ చేయుటకు మన యిష్టమైనవారిని మనము నిర్ణయించుకొనరాదు. ఈ విషయమునందు మన మింకను వందసంవత్సరములు వెనుకబడియున్నాము. మన రాజకీయస్వాతంత్ర్యమున నీ నిరంకుశతను భరింపవలసిన దేనా? మన స్వాతంత్ర్యమును మంటగలుపుకొనవలసిన దేనా? సాంప్రదాయికముగా పట్టా బొందిన వైద్యునికన్న సహజపరిజ్ఞానము గలయొక పరిచారికయో, పరిచారకుఁడో రోగనివారణమున నెక్కువ సమర్థత గలిగియుండవచ్చును. వారి కెట్టి విద్యయును రాదు. వారు నివారింపఁగలిగిన వ్యాధిని పట్టాబొందిన వైద్యులు నివారింప లేకుందురు. "ప్రపంచమునందలి విజ్ఞాన మంతయును చేరినను ఎవరిని వైద్యునిగా జేయజాలదు............మానవునకు ప్రకృతిధర్మములు తెలిసియుండవలయును. మానవునియొక్క స్థూలసూక్ష్మదేహములను గ్రహింపగలిగియుండవలయును." అన్నాడు పెరిక్లీసు. అనగా వైద్యునకు స్థూలశక్తులతో బాటు సూక్ష్మశక్తులను తెలిసియుండవలయును. వానివలన నుత్తేజితుఁడై యుండవలయును.

అనేకవందల విషయములలో నీకిృంది విషయ మొకటి. "తూర్పునగరములలో నొకదానియం దొక బిడ్డకు మాంస సంతానిక కలిగినది. ఒకవైద్యుని బిలిచిరి. అతడు చూచెను. ఆబిడ్డ యరగంటలో చనిపోవు నని యా వైద్యుఁడు చెప్పెను. అయిదునిమిషములలో నయితము చనిపోవచ్చు ననెను. 'అయ్యో దేవుడా! నాబిడ్డ బ్రతుకఁడా? నాయనా! యెట్లైనను నా బిడ్డను బ్రదికింపలేరా' అని యాబిడ్డతల్లి మొత్తుకొనెను. 'అయ్యో తల్లీ! పరమేశ్వరునిచేత లనిర్వాచ్యములు. నీవు దుఃఖమును దిగమ్రింగవలసినదేయమ్మా' అని వైద్యు డనెను. అప్పుడు పరిచారిక తాను చూచిన ఒకమందువలన రోగనివారణ మగునని సూచించెను. త్వరపెట్టబడి అప్పుడే ఆ దాసి యా మందును తయారుచేసి రోగి కిచ్చెను. వైద్యు డన్నాడు 'ఆమందు నిచ్చుటకు వీలులేదు. ఆ దాసి వైద్యపట్టమును బొందలేదు. అందువలన ఆమె రేపుదయము అరెస్టుచేయ బడును'. ఆమె 'నీవు నాబిడ్డను బ్రదికింపలేకపోతివి. నాబిడ్డను బ్రతికించుకొనుటకు నాయిష్టమువచ్చిన పను లన్నిటిని చేసెదను' అనెను. డాక్టరు ఆదాసివంకతిరిగి 'నీ వామందు నీయకు; ఇచ్చెదవా నిన్నరెస్టు చేయుదురు అనెను. ఆమె దేహమాపాదమస్తకము కంపింప కను లెఱ్ఱజేసి 'పశువా! గృహము నుండి తర్లు' మనెను. అతఁడు పోయెను. ఆమం దిచ్చెను దాసి. ఆ బిడ్డ బ్రదికెను. ప్రమాదము గడచిపోయినది. ఆనందము చెలరేగినది. శిశువును తల్లి ముద్దిడినది. ఆనందాశ్రువులచే బిడ్డచెక్కిళ్ళను తడిపినది.

3. అత్యున్నతమగు చికిత్సావిధాన మొకటి:- నేఁడు ఉదయభానునివలె నుదయించుచున్నది. అయిననేమిలాభము? వైద్యశాసనము, నూతనమగు నీచికిత్స నవలంబించి లోకమున కా సత్ఫలితముల బుజువు చేయదలచినవారి నెల్ల మ్రింగివేయ జూచుచున్నది.

డాక్టరు జె. ఆర్. బుచ్నర్ అనువారు బోస్టన్ కళాశాలలో పండితులుగా చాల కాలము పనిచేసిరి. న్యూయార్కు, చించినాటి నగరములలోని ఉత్తమవైద్యకళాశాలలయందును పండితులుగా పనిచేసియుండిరి. వా రిట్లు చెప్పియుండిరి. చికిత్సా సిద్ధాంతములందును, ప్రయోగమునందును పూర్వపద్ధతులకును క్రొత్త పద్ధతులకును సరిహద్దునందు మన మున్నారము. నలుబది సంవత్సరములకుపూర్వమునం దేది అత్యుత్తమ విధానముగా బరిగణింపబడుచుండెనో, నే డది మోటుగను రాక్షసకృత్యముగను భావింపఁబడుచున్నది. నే డేది బోధింపఁబడి ఆచరింపబడుచున్నదో అది మున్ముందు అక్లే రాక్షసవైద్యముగా భావింపఁబడవచ్చును. నాజీవితములోనే, నే ననేకమార్పులను జూచితిని. నాకు బోధకుఁడుగా నుండిన పండితుఁడు పెద్ద చెంచాలతో రసభస్మము నిచ్చుచుండెను. నే డట్లు మన మీయము. ప్రచండవేగముతో మార్పులు వచ్చుచున్నట్లు భవిష్యత్ కాన్పించుచున్నది.

"నేటి వైద్యకళాశాల లామార్పును రాకుండ నిరోధించుచున్నవి. కళాశాలారహస్యసంఘములుగాని, వైద్యశాసన

ములుగాని నవీనపరిశోధనఫలితములగు సంస్కరణముల నెన్నటికిని మార్కొనజాలవు. సుప్రసిద్ధులగు నా సంస్కర్తలను మాత్రము వారు బాధింప (Prosecute) వచ్చును. ఉదారములగు కళాశాలలు నూతనసంస్కరణములను జూచి భీతి నొందుటలేదు; నిరోధించుటయును లేదు.

"ఇప్పుడు బాల్యావస్థలో నున్న యీ శాస్త్రములే, ఉద్భవించుచున్న యీనవీనసత్యములే, అభివృద్ధిదములగు సంకల్పములే, ఘనులయుదారోత్సాహమే, మున్ముందు మన కొక నూతనశాస్త్రమును బ్రసాదింపఁగలదు. ఆశాస్త్రముయొక్క తోడ్పాటువలన మరణమువలనిభీతి నశించిపోవును. మహామారి, జ్వరాదివ్యాధులు నశించును. పరిపూర్ణబలారోగ్యములతో గూడిన సౌష్ఠవమును, మానసికబలమును, నిర్మలశీలమును, ఉత్కృష్టజీవితమును లభించును. ఒకవిధానము నింకొకవిధానము నిరోధించుకొనక, తమంట తాము పనిచేయుచుండిన నీ సత్ఫలములు బహుత్వరలో లభించును. నిరోధములు తప్పవాయెనా, యీ సత్ఫలములు లభించుటకు ఒక శతాబ్దమునకు తక్కువపట్టదు. ఏలనగా కళాశాలలవారి నిరోధమువలన నవి కళాశాలలలో నభివృద్ధి గాంచఁజాలవు. అందువలన వానికి వెలుపలనే, వ్యక్తుల ప్రత్యేకప్రయత్నములవలన నవి వృద్ధిగాంచవలసియుండును. కోపర్నికస్, గలీలియో, కెప్లర్ మొదలగు వారి నే సర్వకళాశాలవారును గుర్తింపలేదు. కార్టీజియన్ పద్ధతి సర్వకళాశాలల కవలంబనముగానుండి జగద్విజ్ఞాతుఁడగు న్యూటన్ పండితుని బరిహాసించి

నవి. వానిని వెడలనడపినవి. హార్వేపండితుడు కేవలములగు సత్యములను గనుగొనినపుడు వానిని విద్యావంతు లందఱును తృణీకరించిరి. విద్యుచ్ఛక్తిని గుర్తించిన గాల్వానీ, ఆవిరియోడలను నడుపుటను గుర్తించిన వాట్, ఫిచ్, ఫుల్టన్ మొదలగువా రందఱికిని నిట్టిగౌరవమే లభించినది. విక్లిఫ్, లూథర్ అనువారలును కాలేజీలకు చిరకాలము వెలుపలనే యుండిరి. వీరి నెవ్వరిని కాలేజీలు, సర్వకళాశాలలు తమలోనికి జేర్చుకొనలేదు. అత్యుత్తమసిద్ధాంతములను, ఉత్తమజీవితమును బోధించునట్టి వేలాదిమార్గదర్శులు సత్యముపేరిటను ధర్మముపేరిటను, కళాశాలలకు వెలుపలనుండియే కళాశాలల నిరోధములలోనే శ్రమపడి పనిచేయుచున్నారు.*

4. వైద్యులు:— పరులబాధను జూచి తమబాధగా భావించి రోగుల ప్రాణములకై తమప్రాణముల నేని సమర్పింప సిద్ధముగా నుండి భూమి కలంకారప్రాయముగా నుండి సుప్రసిద్ధులగు వైద్యులు స్త్రీపురుషులలో కొంద ఱున్నారు. వారు సునిశితమగు తెలివితేటలు గలిగి, చికిత్సాప్రయోగమునందు నిపుణులై యుందురు. ఇంకను కొందఱున్నారు. వారు దుర్బలహృదయులై చెడుమార్గములలోనికి ఈడ్చి వేయబడుచున్నారు. వారు పాపములకు నయితము ఒడికట్టుచున్నారు. శస్త్రచికిత్సవలన వారి కెక్కువ ధనము చేకూరును. అందువలన కేవలములగు నారోగ్యనియమములను పాలించుటవలన కుదురదగిన వ్యాధులకు నయితము వారు విచారింపకుండ శస్త్రమును చేయుటకే సిద్ధమయ్యెదరు. గర్భాశయములను తీసి

వేసి స్త్రీలకు స్త్రీత్వము లేకుండ జేయుచున్నారు; చేతులను, కాళ్లను తఱిగివేయుచున్నారు. ప్రేగులను కోసి తెఱచుచున్నారు; మెదటిని తరిగివేయుచున్నారు. ఇవన్నియు ప్రకృతి విధానము నవలంబించినంతనే కుదురును. కోతలు అనవసరమే యగును. దక్షిణకాలిఫోర్నియాలో నివసించుచున్న ఒకయువకునికి వైద్యు లందరును కాలు తీసివేయవలసియున్నదని నిర్ణయించిరి. అతడు లోస్ ఏంజలిస్ న కేగెను. అక్కడి వైద్యసంఘమువారు కాలును కోసివేయుట అవసరమే యని నిశ్చయించిరి. శాన్‌ఫ్రాన్సిస్కో లో నున్న యింకొక సుప్రసిద్ధవైద్యసంఘము కాలు తీసివేయుటకన్న వేరుమార్గము లేదని నిర్ధారణజేసిరి. అతఁడొక ఆరోగ్యసదనమున కేగి కేవలమారోగ్యనియమముల నవలంబించుటవలన 10 దినములలో రోగము కుదిరి యింటికి తిరిగి వచ్చెను. వైద్యులకు అనేకపరిశోధనాగారములతోఁగూడిన కళాశాల లున్నవి. శరీరవిచ్ఛేదకమందిరము లున్నవి. గ్రంథాలయము లున్నవి. రసాయనశాల లున్నవి. వైద్యశాల లున్నవి. విద్యార్థులకు వారనేకవిషయముల బోధింపఁదగినవసతు లన్నియు నున్నవి. అయిననేమి? విశ్వమున కంతకును ఆధారభూతములగు రాసాయని కానురాగమునుగురించియు, శక్తియొక్క స్వభావమునుగురించియును వారికి సత్యముగా నేమియు దెలియదు. అందువలన వారిపరిశ్రమ లన్నియు నసత్యములపై నాధారపడి అసత్యములకే త్రోవ దీయుచున్నది.

5. వైద్యుల దోషములు:- సుప్రసిద్ధులగు అలెగ్జాండర్, యం. రాస్, యం. డి. యఫ్. ఆర్. యస్. గారు వైద్యులయం దీక్రిందిదోషముల నిరూపించిరి:—

"రోగి తనవద్దకు వచ్చినంతనే వారి కారోగ్యసూత్రములను బోధించి యారోగ్యము గలిగింపవలయును. రోగము రాకుండ నుండు విధానముల బోధింపవలయును. వారట్లు చేయు చున్నారా? లేదు. రహస్యము, కపటము, కృత్రిమము, డంబమువంకకే వారాకర్షింపఁబడుచున్నారు.

"శుద్ధి, శౌచము, పట్టణపారిశుద్ధ్యములను గూర్చిన ఆవశ్యక తను న్యూనతపఱచి, రోగులకు మందులయందును, టీకాల యందును, కోతలయందును, కట్లయందును నమ్మకము గలిగిం చుటవంకకే వారాకర్షింపఁబడుచున్నారు.

"నడుమునొప్పి, చెవినొప్పి, తలనొప్పి, వ్రేలిగోరు లోనికి పెరుగుట, కురుపు, మొదలగు సామాన్యవ్యాధులకు నయితము రహస్యావయవపరీక్ష నిర్ణయింపఁబడుచున్నది. ఇది స్త్రీల యొక్క శీలమున కెంతయేని భంగమును గలిగించుచున్నది. ఈ పరీక్ష చాల యనవసరమైయున్నది. ఇది వైద్యవృత్తికే అవమానకర మైయున్నది.

"ప్రతిసామాన్యమగు గర్భాశయవ్యాధికిని గర్భాశయమును తీసివేసి స్త్రీలను వంధ్యలనుగా జేయుచున్నారు. ఇది దుర్భరము, ప్రాణాపాయకరమును, శాస్త్రీయాచరణకు దూష్యమైన పనియును నయియున్నది.

"స్త్రీలకు వచ్చు వ్యాధుల కన్నిఁటికిని గర్భాశయచ్యుతియో, గర్భాశయముయొక్క స్థానభ్రంశమో, గర్భాశయముయొక్క బలహీనతయో, అందలి వ్రణమో, కారణముగా పేర్కొనుట ఆచార మైపోయినది. ఇది సిద్ధాంతమునకును, అనుభవమునకును ప్రత్యక్షముగా విరుద్ధమైన విషయము. తమకుగల అజ్ఞానము, అవినీతి, మోహములను కప్పిపుచ్చుటకు మాత్రమే యిది యుపయోగించుచున్నది.

"గర్భధారణమునం దున్నట్టియు, పాలిచ్చునట్టియు స్త్రీలకు సయితము వారు సారాయి, బ్రాంది, మొదలగు మద్యసారములను త్రాగనిర్ణయించుచున్నారు. దీనివలన త్రాగుబోతుతనమే వృద్ధియగును. గర్భస్థమగు శిశువునందలి రక్తము సయితము విషీకృతమై దానికి సయితము పెద్దదైన తరువాత త్రాగుబోతుతనము గలుగుటకు అనువగు స్వభావము పుట్టుక నుండియే గలుగుచున్నది. అందువలన రాబోవుతరముగూడ పాడగుచున్నది.

"శాస్త్రీయమగు నూతనవిధానముల నన్నిటిని వారు నిరోధించుచున్నారు. ప్రపంచము నంతటిని అసాధ్యరోగములు గల రోగులతో వారే నింపివేసినారు. అందువలన శాస్త్రదూష్యమగు వారివిధానమునకు వృత్తిని గల్పించుకొనిరి. శాస్త్రదృష్టిగల విజ్ఞానులందఱును వారి యసత్యముల యందు రోతను గలిగించుకొనుచున్నారు. వారినిరంకుశత్వము, అసత్యవిశ్వాసము, మోసము కాపట్యము మితిమీఱినది.

"ప్రజలను కువైద్యులబారినుండి రక్షించెదమనుమిషతో, రోగులుగా నున్నవారికి రోగకాలమునందును, ఆసన్నమరణముగా నున్నప్పుడును, తమకు హితుడగువానిని వైద్యునిగా నిర్ణయించుకొను నధికారము లేకుండునట్లు నిరంకుశములును, స్వార్థపరములునగు శాసనములను తయారుచేయించి పెట్టుకొనినారు. అట్లు రోగులకు న్యాయముగా నుండదగిన వైద్యుని నిర్ణయించు నధికారము లేకుండ హరించివేసినారు.

"తమయొక్క వైద్యవృత్తివలన శాసనసభలను మోసగించి నిర్బంధటీకాలశాసనమును నిర్మించునట్లు చేసినారు. అందువలన తల్లిదండ్రులు తమబిడ్డలను నిర్దాక్షిణ్యమును, శాస్త్రవిరుద్ధమును, అనవసరమును, ప్రమాదకరమును, రాక్షసమునునగు టీకాలకు ఒప్పగింతపెట్టవలసివచ్చినది. మఱియు నట్లు టీకాలు లేనివారిని పాఠశాలలందును కళాశాలలందును చదువ వీలులేనివారిని జేసిరి. తమకు హితమగు మతము నవలంబించుట కెట్లు ప్రతివానికి నధికారము గలదో, తమకు హితమగు రాజకీయకక్ష నవలంబించుటకుఁ బ్రతివానికిని నెట్లధికారము గలదో, తాను నమ్మిన యారోగ్యవిధానము నవలంబించుటకు బ్రతివానికి నధికారముండవలెను. ఏవ్యక్తిగాని, ఏసంఘముగాని, తోడివానియొక్కగాని, తోడిసంఘముయొక్కగాని అధికారమును నిరోధించుచున్నదో వారెల్ల పరమేశ్వరునిసన్నిధిని తీవ్రశోధనకు గుఱియయ్యెదరు."

సుప్రసిద్ధుఁడై, అమితవిజ్ఞానము గలిగిన యీ మహానీయు డిట్టి తీవ్రపదములతో జేసిన విమర్శన మిది. ఈతఁడు తనవృత్తి

యందలి దోషములను భరింపలేకపోయెను. కనుకనే తా నీవిమర్శనాస్త్రమును స్వల్పులగు స్వీయవృత్తి నవలంబించిన వారిపైనను, వైద్యసంఘములపైనను బ్రయోగించెను. డాక్టరు రాస్‌గారు మశూచికము, ప్లేగు, క్షయ, మొదలగు వ్యాధు లందు గాన్పించు సూక్ష్మజీవులు రోగజన్యము లని నమ్మువారు.

6. వాదోపవాదములు:— న్యూయార్కులోను, బెర్లిన్ లోను నున్న సర్వకళాశాలలకు సంబంధము గల విలియం జే. రాబిన్‌సన్, యం. డి., పి. ఎచ్. జి. అనువారు ఉదారులగు వైద్యుల నందఱను 'హంతకు లనియు, దొంగలనియు, మోసగాండ్రనియు' తిట్టుచు 'ఇరువదవశతాబ్దపు పత్రిక' (Twentieth century Magazine) లో వ్రాయుచుండెను. ఈ గ్రంథకర్త (బాబిట్) మర్దనచికిత్సకులు, విద్యుద్వైద్యులు, రంగువైద్యులు ఎంత సులువుగను, రూఢిగను రోగ నివారణ చేయగలరో, వారిచికిత్సవలన ప్రమాద మెట్లు కలుగుచుండుటలేదో, రోగనివారణానంతర మెట్లు దుష్ఫలితములు గలుగుచుండుటలేదో రుజువుపఱచియుండెను. వారు హంతకులు, దొంగలు, మోసగాండ్రు కా రనియు, పూర్వ విధానావలంబకులకన్న వారే రూఢిగా రోగనివారణ చేయుచుండి రనియు రుజువుపఱచియుండెను. తరువాత రాబిన్‌సన్ వైద్యుడు తమవిధానమును హెచ్చుగా స్తుతించుచు వ్యాస పరంపరల బ్రచురించెను. మిక్కిలి అసత్యసిద్ధాంతములను నయితే మత డంబు వాదించి నిలుపదలచెను. దానికి గ్రంథకర్త

(బాబిట్) వ్రాసిన జవాబులో కొద్దిభాగమే యిచట యెత్తి వ్రాయబడినది:—

"అసంఖ్యాకములగు ఔషధములు అనేకమానవజీవితములను ధ్వంసము జేయుచున్నవి. నల్లమందు మొదలగు మత్తుపదార్థములవలన మెదడు మొద్దుబారిపోవును. దాన నాశనము గలుగును. విన్‌స్లో సిరప్ (Mrs. Winslow's soothing syrup) అను మందులో నల్లమందు కలియును. దానివలన సంవత్సరమునకు 1,50,000 శిశువులు మరణించుచున్నారు." అని మురేల్ అను వారు వ్రాసిన 'విషములు' అను గ్రంథమున 208 వ పుటలో వ్రాయబడియున్నది. మత్తుమందులకన్న బాధోపశమనము చేయఁగల విధానములు మనకు గలవు.

శిశువులకు రోగచికిత్స చేయుటలో పూర్వసాంప్రదాయిక వైద్యులు చేయు చికిత్స చాల ఆపత్కర మైయున్నది. న్యూయార్కు నగరమున కలరావ్యాధివలన 1887 సం॥ జులై నెలలో 1418 మంది శిశువులు మరణించిరి. నీలివర్ణోదకము నావ్యాధి కుపయోగించిన నొక్కజీవితమేని గోలుపోలేదు. మందుల యొక్క ప్రయోగమువలన నెంతమందియో మాతలు శిశుహీనలుగా జేయఁబడిరి.

"డాక్టరు రాబిన్‌సన్‌గారు మాంససంతానిక (Diphtheria) (స్కార్లెవ్యాధి కాఁబోలును) వ్యాధికి వేయుటీకాలయొక్క. సామర్థ్యమునుగురించి యిట్లు స్తుతించిరి:—ఇదివఱకీ మాంససంతానికవ్యాధి గలిగినవారిలో నూటికి 50, 60 మంది మర

ణించుచుండిరి. ఇప్పు డా రేటు నూటికి 15 గా మారినది. ఇందు డాక్టరుగారు విషయమును అతిశయోక్తిగా చెప్పలేదా? మిఛిగాన్ లోని టార్వర్స్ నగరమునందలి యొక మంత్రశాస్త్రవేత్తయొక్క కుమార్తె మాంసనంతానికచే మరణించిన వృత్తాంతము నావద్ద నున్నది. అందామె వైద్యులను పిలువలేదు. ఆ శిశువు మరణించినతరువాత ఆమెగృహము నరికట్టి, శిశువుయొక్క శవమును బలవంతముగా దెచ్చి కోసి ఆ శిశువునకు మాంసనంతానికావ్యాధి గలిగిన దనియు, సరియైన వైద్యునిచే చికిత్స పొందకపోవుటవలన మరణించిన దనియు నిర్ణయించిరి. ఈ నడత ఆ తల్లి భరింపజాలక మిక్కిలి కోపోద్రిక్తురాలై అసలు మాంసనంతానికావ్యాధికి వైద్యుల చికిత్సచేసిన విషయములో గలిగిన ఫలితమునుగురించి బహిరంగవిచారణ చేయించెను. ఆసంవత్సరమున 20 మందికి మాంసనంతానికావ్యాధి గలిగెను. అందరికి మాంస నంతానికావ్యాధినిరోధకములగు టీకాలను వేసిరి. అందు మూడింట రెండుపాళ్లు మరణించిరి. అట్లగుట నూటికి 67 గురు మరణించిన ట్లైనది. ఇది రాబిన్సన్ గారు మందు లేకపోవుటవలన మరణింతురని నిర్ణయించిన 50, 60 దామాయిషాకు మీరిపోయి నదిగదా! మాంసనంతానికావ్యాధికి జె. జె. ఫాక్సు, యం.డి. గారి నిర్దేశముప్రకారము స్వాభావికచికిత్సచే ఒక్కరైనను మరణింపకుండ రక్షింపబడిరి. ఆ చికిత్సావిధానము మున్ముందు వ్రాయబడును.

"ఇంకను రాబిన్సన్‌గారు" రిట్లు చెప్పిరి. మందువైద్యులు 10 వేల లేక 100 వేల రోగములను క్రమముగా నిదానము చేయగలరు. అంత మొత్తముమీద నెక్కడనైనను ఒకవిషయమునమాత్రమే పొరపాటుపడవచ్చును. పూర్వసాంప్రదాయికు లగు మన వైద్యసోదరులు చాల సూక్ష్మభేదములతో రోగనిదానమును చేయుదురు. వానిలక్షణముల కనుగుణముగ పారిభాషికనామములను పేర్కొందురు. వారికి అంత జ్ఞానమూ- లేదు. దైవికజ్ఞానమూ- అంతకన్న లేదు. అందువలన వారినిదానమునందు తప్పు లున్నట్లు అతీంద్రియదృష్టిగల వారిచే గుర్తింపబడినది. 'నెల్లీ బ్లై' అను నామెకు వ్యాధి. ఆమెను న్యూయార్కులో ఆరుగురు సుప్రసిద్ధవైద్యులకు జూపిరి. ఆరుగురును ఆరురకముల నిదానమును జేసిరి. న్యూయార్కులోనే ఒక సుప్రసిద్ధ వైద్యుడు గలడు. అతడు సంయుక్తరాష్ట్రముల పటాలములో పనిచేసియుండెను. అతడు 18 మాసములు ఒకరోగికి చికిత్సచేసెను. అంతకాలమును, నతడు హెచ్చురుసుములను వసూలుచేయుచునే యుండెను. అంతమునైనతరువాత తా నేరోగమునకు చికిత్సచేయుచుండెనో తనకు తెలియనే తెలియదని ఒప్పుకొనెను. కొంత కాలమైనతరువాత నారోగి శాన్‌ఫ్రాన్సిస్కోనగరమునకు పోవుట తటస్థించెను. అచ్చట కాంతచికిత్సకులగు జె. ఆర్. న్యూటన్, యం. డి. గా రుండిరి. ఈతనినే డా. రాబిన్సన్‌గారు బూటకపు కాంతచికిత్సకుడని పిలుచుచుండిరి. ఆరోగి న్యూటన్ గారిచికిత్సాలయమున కేగినంతనే "నీకు చేదుకట్టునందు శిల

లున్నవి. నేను నీకు నివారణచేతు"నని చెప్పివేసెను. తరువాత నతనికి మర్దనచేసి, మధుతైలమును త్రాగించెను. 2, 3 వారములలో నతనికి రోగనివారణ మాయెను. డాక్టరు లోజియర్ అను నామె యుండెను. ఆమె వైద్యశాస్త్రమునందు మార్గదర్శకురాలై యుండెను. ఆమెవలన నీ క్రిందివిషయము గ్రహింపబడినది. జగత్ప్రసిద్ధులగు డా. జార్జ్ సిక్వర్డుగారికి విద్యావతియగు నొకభార్య యుండెను. ఆమెకడుపులో ఒక కంతి పుట్టిన ట్లాతఁడు గుర్తించి వైద్యవరులను ప్రోగుచేసి వారిచే నిదానము చేయించెను. వారును కంతియేయని నిర్ణయించి చికిత్సచేసిరి. ఆమె మరణించెను. తరువాత శవపరీక్ష చేయగా నామె గర్భవతిగా నుండినట్లును ఆకంతిగా నున్నది గర్భమునందలి పిండమైనట్లును తెలిసికొనిరి.

"హోమియోపతి వైద్యులను నయితము తమలో జేర్చుకొని ఒక సంఘముగా నేర్పడి వైద్యులందరును మందువాడని వైద్యులను బహిష్కరించుట కనుకూలమగు శాసనముల జేయుచున్నారు. విద్యుచ్ఛక్తిని శాస్త్రీయముగా రోగనివారణ కొరకై ప్రయోగించుటయును, మర్దనచికిత్సయును, చలనచికిత్సయును, వర్ణచికిత్స, మానసికచికిత్సయును, ఈ వైద్యకళాశాలలయందు బోధింపరు, బోధింపజాలరును. మంచుగడ్డవలె మృదులమును, సూర్యకిరణమువలె హృద్యమును, ప్రేమపూరితమగు సత్సంకల్పమువలె శాంతిదమును, నగు నీనునిశిత శక్తులు రోగులదేహములోని సర్వధాతువులలోనికిని ప్రసరించి, ఉత్తేజనమును గలిగించును; శాంతినొసంగును. ఇతరమందు

వైద్యమంతయు నిరుపయోగమైనను ఈ సునిశితశక్తులు పనిజేయును. వీనియందు అపాయకరములును, మరణకారణములును నగు స్వభావము లున్నవనియు వానిని నాశనముచేయవలయుననియు భావించి, వానినిప్రయోగించువారిని జరిమానా వేసియు, బందిఖానాలో పెట్టియు బాధించుచున్నారు; లేదా వారు చిరకాలము వైద్యకళాశాలలయందు విద్యార్జనము చేసితి మని రుజువైనను చేయవలయును. నిజమునకీ విద్యయంతయును అనవసరమే యగును. ఇట్టిశాసనములు స్వతంత్రులగు ప్రజలయెడల దౌర్జన్యయుతములై యున్నవి."

7. పరిశోధనార్థమై జంతువుల వధించుట:— ఏదో ఘనకార్యము చేయుటకై డాక్టరులు మానవమిత్రులైన కుందేళ్ళు, కుక్కలు మొదలగు జంతువులనుపట్టి బంధించి, అవి మొరుగుచుండ, మూల్గుచుండ, తమ కత్తులను వానిదేహములోనికి చొప్పించి చిన్నచిన్న తుంపులుగా కోసి చంపుచున్నారు. ఇందు కొంచెము కరుణారసముగలవారు వానికి మత్తుమం దిచ్చి కోసెదరు. మిగతవారు వానిని మొఱుగుల మూలుగులమధ్యనే కోసివేతురు. ఇంతటితో నేమైనది? వారీ హాంతకకృత్యము మానవులపై ప్రయోగింపనున్నారు. దక్షిణ అమెరికాలో నొకవైద్యు డున్నాడు. హరిద్రిజ్వరము (Yellow fever) సంబంధమగు సూక్ష్మజీవులనుగురించి తెలిసికొనుటకై ఆవ్యాధి గలిగిన నోరెఱుగని అమాయికలగు అయిదుగురుస్త్రీల నాతడు, వారేడ్చుచు మూల్గుచునుండ కోసివేసెను.

వారు మరణించిరి. వైద్యుల పరిశోధన కొఱకి ట్లనేకులు హింసింపఁబడిరి, చంపబడిరి. మున్ముందు దూరదృష్టి, అతీంద్రియదృష్టి కలిగి యీ భౌతికమాలిన్యములు నశించును. అప్పుడు జీవధర్మములు బహునులువుగా గోచరింపగలవు. జీవశరీరవిచ్ఛేద మనవసర మగును.

రెండవ కిరణము

# హృదయము

1. మా పద్ధతి:— అవయవములను వర్ణించునప్పుడు మిక్కిలి సూక్ష్మములగు వివరముల నీయము. ఈ సూక్ష్మవివరములు కావలసినవారు అస్థినిర్మాణశాస్త్రము, శారీరశాస్త్రము, రోగనిదానశాస్త్రములు చదువవలసినదే. ఇచ్చట అవయవముల సామాన్యనిర్మాణమునుగురించి వివరించి, వానియొక్క గమనమునకు హేతువులగు రాసాయనికక్రియలను వివరించి వానియందలి గమనమునందు గలుగులోపములను, వానివలన గలుగు వ్యాధులను వివరించి వానికి చికిత్స పేర్కొందుము.

2. ఉరము:— మానవునికబంధమునందు రెండు ప్రధాన భాగములున్నవి. 1. పండ్రెండు వెన్నుపూసలు, వానికి సంబంధించిన నరములు వెనుకభాగమునను, ముందువైపున పర్శుకములు (ప్రక్కటెముకల లోపలనుండు) శ్వాసాశయము, హృదయములతోగూడి విభాజకముపైనుండుభాగను ఉరము. 2 విభాజకముదిగువ జీర్ణాశయము, ప్లీహము, యకృత్తు, ప్రేగులు మొదలగు వానితోగూడి క్షూపకముపైనుండుభాగము ఉదరము. 1 వ పటము చూడుము. కుడి ఊపిరితిత్తి (శ్వాసాశయము); అందలి పైనను క్రిందను, మధ్యను నుండు 3 వృత్తములును; వెడల్పు తక్కువగను, పొడ వెక్కువగ నుండు నెడమ శ్వాసాశయమును; అందలి పైనను క్రిందను




1వ పటము

శ్వాసాశయములు, హృదయము, వానిసమీపమందలి భాగములు

1,1 అగ్రములు
2 కుడిప్రక్కప్రక్కనైపు గొంతుసంబంధ సిర
3 కుడిమన్య
4 ఎడమమన్య
5 ఎడమప్రక్కనైపు గొంతుసంబంధ సిర
6 ఎడమ లోపలి సిర
7 వంపు రక్తనాళము
8 కుడిలోపలి సిర
9 కుడిశ్వాసాశయసంబంధ ధమని
10 శ్వాసాశయ ధమని
11,11 కుడి, యెడమలయందలి శ్వాసాశయసిరలు
12,12 కుడి, యెడమ శ్వాసాశయములందలి పై తిత్తులు
13 ఎడమ శ్వాసాశయ సిర
14 కుడిశ్వాసాశయ సిర
15 కుడికర్ణిక
16 కుడిజఠరిక
17 ఎడమశోధకధమని
18 ఎడమజఠరిక
19 శ్వాసాశయములందలి మధ్యతిత్తి
20 కుడిజఠరిక
21 శ్వాసాశయములందలి దిగువతిత్తి

నుండు 2 వృత్తములు (Lobes) ను; క్రిందికి వచ్చునప్పటి కెడమ భాగమునకు వ్రాలియున్న హృదయమును; కుడియెడమ శ్వాసాశయములకు సంబంధించిన ధమనులును, సిరలును; కంఠమునకు కుడియెడమలయం దుండెడి సిరలును; మెడకు కుడి నుండియు, ఎడమనుండియు పైకిబోవుచుండు 'మన్య' (Carotid arteries) యను ధమనులును; కుడియెడమలయందుండి పేరులేని 'అనామకసిరలు' (innominata veins) ను; కుడికర్ణిక, కుడి జఠరిక, యెడమకర్ణిక, యెడమజఠరికలును; బృహద్ధమని (Aorta) యును; శ్వాసనాళము (Trachea) ను; అందుండిన చీలిన చిన్నినాళములు, శ్వాసనాళికలు (Bronchial tubes) ను; (subclavian tubes) ను; శిరస్సు, చేతులు, మెడ, ఉరము మొదలగువానినుండి కలుషరక్తమును హృదయకోశములోని కుడికర్ణికయొక్క పైభాగమునకు జేర్చునట్టి పెద్ద ఊర్ధ్వసిరయును; దేహముయొక్క క్రిందిభాగమునందుండి ఉదరము మొదలగు భాగములనుండి మాలిన్యముల దెచ్చి హృదయకోశములోని కుడికర్ణికయొక్క దిగువభాగమునకు జేర్చునట్టి పెద్ద అధస్సిరయును ఈ 1 వ పటమున గాంచదగును. ఊర్ధ్వసిర, అధస్సిరయును గలసి ఒకచో బృహత్సిర యనుపేర బరగును. ఇది కర్ణికను చేరుచోట 2, 3 అంగుళముల పొడవుండును. ఇంతకన్న పెద్దసిర దేహమునం దుండదు. బృహద్ధమనియు నిట్లే దేహమునందలి ధమనులలో కెల్ల పెద్దది. హృదయము ఊపిరితిత్తులచే నావరింపబడియున్నది. అందు నెడమ ఊపిరితిత్తిచే నెక్కువగ ఆవరింపబడియున్నది. శ్వాసాశయమునందలి గదు

లలో నెచ్చటనేని చెడురక్తము చేరి మూయబడిపోవునేని హృదయమే రోగగ్రస్తమైన దందురు.

3. హృత్కోశము (Pericardium):— ఇది హృదయము నావరించియుండుతిత్తిపేరు. ఇట్లే హృదయముచే నావరింపబడి లోపలనుండు తిత్తికి 'అంతర్హృత్కోశ'మని పేరు.

4. హృదయమునందలి అరలు లేక గదులు:— హృదయమునందు కుడిభాగమనియు, ఎడమభాగమనియు 2 ప్రధానభాగములు గలవు. వీనికి రెంటికినిమధ్య ఒకదాని లోని పదార్థము లింకొకభాగములోనికి పోకుండున ట్లొక పొర నిలువుగా నేర్పడియున్నది. ఇందు కుడిభాగములోనికి దేహమునందలి కలుషమును, నీలిరంగుగలదియునగు రక్తము చేరును. ఇందుండి యీకలుషరక్తము శ్వాసాశయములోనికి బోయి అందులోనికి ముక్కులవెంట పీల్పబడిన వాయువు నందలి ప్రాణవాయువుచే శుద్ధిచేయబడి యెడమభాగము నందలి కర్ణికలోనికి చేరును. అచ్చటినుండి రక్త మెడమ జఠరికలోని కాకర్షింపబడి యచటనుండి బృహద్ధమనివెంట దేహమునకంతటికిని తోసివేయబడును. ఇందు జఠరికలకన్న కర్ణికలు చాల చిన్నవి. కుడిజఠరికకన్న నెడమజఠరిక రెట్టింపు బలము గలిగి దేహమున కంతటికిని శుద్ధరక్తమును నెట్టివేయు సామర్థ్యము గలిగియుండును.

2వ పటము.




హృదయమునందలి కుడిభాగములయొక్క ముందువైపు ఇందు చూపబడి నది. కుడియెడమభాగములు రెండును ముందునవు లేవు. ఎడమభాగము కొంచెము వెనుకగా నున్నది.

1 ఎడమమన్య (Left carotid) 2 అనామకసిర (Innominata)
3 బృహద్ధమనియందలి కమాను (Arch or Aorta)
4 పైభాగమందలి బృహత్సిర (Vena Cava superior)
5 కుడికర్ణిక అనుబంధి (Right auricle appendix)

6 గాలెన్ సిరయందలి రంధ్రము (Orifice of vein galen)
7 కోడిగుడ్డు ఆకారముగల పల్లమునకు పైనుండు గుండ్రనిభాగము (Annulus Ovalis)
8, 9 కోడిగుడ్డు ఆకారముగానున్న పల్లము (Fossa Ovalis)
10 దిగువభాగమందలి బృహత్సిర (Vena Cava Inferior)
11 థెబిసస్ కవాటము (Valve of Thebesus)
12 ముక్కోణాకారపు కవాటముయొక్క వెలుపటి తునుక (Segment of-Tricuspid valve)
13 పైకవాటముయొక్క కుడిప్రక్కతునక (Right segment of Tricuspid valve)
14 జఠరికయొక్క ఆవరణ లోభాగము (Section of ventricle-valve)
15 దిగువనున్న బృహత్సిర (Vena Cava Inferior)
16 ఊపజత్రువు (Subclavian)
17 కుడి శ్వాసాశయ ధమని (Right Pulmonary artery)
18 ధమని సంబంధమగు గ్రంధి (Ductus arteriosus)
19 ఎడమశ్వాసాశయధమని (LeftPulmonary artery)
20 శ్వాసాశయధమని (Pulmonary artery)
21 అర్ధచంద్రాకారముగల శ్వాసాశయ కవాటములు (Pulmonary Semilunar valves.)
22 ఎడమకర్ణిక అనుబంధి (Left auricular appendix)
23 సప్తధాతుసం॥ కండకములతోగూడిన కండరము (Small papillary muscle connected with Septum
24 మాంసభాగము (Column carnea)
25 స్నాయుతంతువులు (Chordac Tendinae)
26 వెలుపటి కండకములతో గూడిన కండరము (Anterior Papillary muscle)
27 ఎడమభాగమందలి శోధనధమని (Left Coronary artery)
28 మాంసముండుభాగము (Column carnea)
29 లోపలికండకములతో గూడినకండరము (Posterior papillary muscle)




3 వ పటము. హృదయమునందలి యెడమభాగములు.

1

2 శ్వాసాశయసిర (Pulmonary vein)

3 బృహద్ధమని (Aorta)

4 శ్వాసాశయధమని (Pulmonary Artery)

5

6 ఎడమకర్ణికలోని లోపలిభాగము (Interior of Left Auricle)

7 ఎడమకర్ణిక (Left Auricle)

8 శ్వాసాశయధమని (Pulmonary Artery)
9 శ్వాసాశయ సిర (Pulmonary Vein)
10 కుడి జఠరిక (Right ventricle)
11 ఎడమశోధనధమని (Left coronary Artery)
12 రక్తము - ఈగీత మొదటనున్న యెడమ కర్ణికలోని కవాటము ద్వారా జఠరికలోనికి వచ్చును
(Blood passes through Left auricle to ventricle)
13 బృహద్ధమనిలోనుండి రక్తము బయలుదేరుతో్రవ. Aortic opening)

5. ప్రధానవిద్యుచ్ఛక్తులు:—హృదయ స్పందనము, జ్వరము, ప్రధాన అవయవములగమనము మొదలగు విషయములకు కారణము అనేకశతాబ్దములనుండి అగమ్యగోచరముగనే యున్నది. శక్తియొక్క తత్త్వము నెవరును తెలిసికొనకుండుట వలననే యీ అసమర్థత గలిగినది. ఇది పాతవిద్యలను మూలబెట్టి, ప్రకృతిని దర్శించినవారికి సులువుగనే బోధపడును. నే నీ విషయమునుగురించి యిదివరకే మొదటిభాగమున వివరించుటవలన నిచట తిరిగి వ్రాయులేదు. విద్యుచ్ఛక్తివలన సంకోచము గలుగును. అయినను దానిని ఉష్ణశక్తి యని భావించువారింకను ప్రకృతిశాస్త్రజ్ఞులలో నున్నారు. విద్యుచ్ఛక్తిలో ననేకతరగతు లున్నవి. విద్యుచ్ఛక్తియందు ఒకటికన్న నెక్కువ తరగతులు లేవనువారి భావమునందిప్పటికిని మార్పు గలుగలేదు. సంకోచమును గలిగించు తత్త్వమంతయు విద్యుచ్ఛక్తియే యని వారు తెలిసికొందురుగాక. చల్లని ఉత్తరపుగాలియందు విద్యుచ్ఛక్తి యున్నది. సూర్యకిరణముల లోని నీలము, ఊదారంగులలో విద్యుచ్ఛక్తి యున్నది. కలుష

రక్తమునందు విద్యుచ్ఛక్తి యున్నది. చలననాడులయందు విద్యుచ్ఛక్తి యున్నది. చలనరహితమగు విద్యుద్యంత్రము (Static machinery) గాల్వనిజఘటము మొదలగువానియం దున్నదియును నింకొకతరగతివిద్యుచ్ఛక్తియే. విద్యుచ్ఛక్తి యొక్క గమనమునందు భిన్నముగా నుండినంతమాత్రమున నది విద్యుచ్ఛక్తి కాకుండ మానదు. ప్రాణవిద్యుచ్ఛక్తి బయటనున్న విద్యుచ్ఛక్తి కున్నంతటి గమనవేగము(velocity) గలిగియుండినయెడల నది మానవదేహమును తుత్తునియలు చేసివేయును. ప్రొఫెసర్ గౌల్డ్గా రిట్లు చెప్పిరి:—విద్యుత్తంత్రి భూమికి సమీపమున నున్నప్పుడు సెకనునకు 12,000 మైళ్ళ గమనవేగము గలిగియుండును. అతంత్రియే పైభాగమున కట్టబడియుండినయెడల సెకనునకు 16,000 లేక 24,000 మైళ్ళ గమనవేగము గలిగియుండును. వీట్స్టన్ (wheatstone) చెప్పిన సెకనునకు 2,88,000 మైళ్ళగమనవేగ మింకను స్థిరపడలేదు. ప్రాణసంబంధమగు శీతోష్ణశక్తులు చాల నెమ్మదిగా నడచును. కాంతశక్తి గలవా డెదుటివానివైపునకు చేతిని చాచుటచే రెట్టింపు త్వరగా నాకర్షింపగలడు. ప్రాణసంబంధమగు విద్యుచ్ఛక్తి వలయములుగా వ్యాపించినప్పుడు 'ప్రాణకాంత శక్తి' యందుము. ఈవిషయ మింకను వివరముగా నెఱుంగ గోరువా రీగ్రంథముయొక్క మొదటిభాగమును పఠింపనగును.

6. హృదయస్పందనమెట్లు గలుగును?:— ఇదివరకు భాగములలో ననేకతూర్లు నీలిరంగు, ఎరుపురంగు అత్యంత

మగు రాసాయనికానురాగము (Chemical affinity) గల వర్ణములని చూపియున్నాను. రాసాయనికానురాగమున విద్యుచ్ఛక్తి ప్రధానభాగమై యున్నది. కనుక హృదయమునందు కుడిభాగమునందలి నీలిరంగుగల కలుషరక్తమునకును, ఎడమ భాగమునందలి యెఱ్ఱని శుద్ధరక్తమునకును మధ్యనుండు విద్యుత్ప్రవాహము లెంత తీవ్రములై యుండునో మనకు గోచరింపగలదు. మధ్య బలమైన విభాగపుపొర యుండుటవలన మిక్కిలి ప్రచండవేగముతో సంకోచము గలిగింపవలసినంత యెక్కువ విద్యుచ్ఛక్తి ప్రోగగువరకును ఆగి తరువాత ప్రచండవేగముతో ముడుచుకొనును. అందువల్లనే హృదయ మొకతూరి ముడుచుకొని తరువాత కొంతసేపటికిగాని ముడుచుకొనదు. కనుకనే రక్తము ఏకప్రవాహముగా నభిసరింపక యాగి యాగి ప్రవహించుచుండును. అప్పుడు హృదయముయొక్క కుడి భాగమునందలి కలుషరక్తము శ్వాసాశయములలోనికి నొక్కి వేయబడును. అదేకాలమున నెడమభాగమునందలిశుద్ధరక్తము దేహమున కంతటికిని పంపబడును. ఇచట తిరిగి హృదయము క్రమమైన అవధితోఁగూడిన గమనముఁ గలిగి యుండుటకును హేతువు వివరింపబడినది. మరియు రక్తము కేశనాళికలవరకును ప్రవహించుట కవసరమైన శక్తికి కారణముసయితము పేర్కొనబడినది. విద్యుచ్ఛక్తితో నడుపబడు గడియారము లిట్లే క్రమమైన విరామముతో నడచుచుండును. అణువులయొక్కగతిని గమనించినచో శీతశక్తు లొకవంకకు నడచుచుండి నప్పుడు ఉష్ణశక్తులు వ్యతిరేకమగు దిక్కునకు నడచుచుండుట

తెలియగలదు. అప్పుడు హృదయమునందలికోశములు వ్యాకోచము నొంది కొత్తరక్తము నాకర్షించును.

7. వైద్యుల అభిప్రాయములు:—మందు వైద్యులు హృదయస్పందనమున కనేక కారణముల జేర్కొనిరి. కాని చివరకు రక్తమువలననే హృదయస్పందనము గలుగుచున్న దను సిద్ధాంతముపై నిలిచియున్నారు. డాక్టరు బార్క్ సిక్వర్డు మొదలగు వైద్యులందరును కలుషరక్తమునందలి బొగ్గుపులుసుగాలి (Carbondioxide) వలన హృదయస్పందనము గలుగుచున్న దనిరి. ఇది కొంతవరకు సత్యమే. ఏమన: ఆమ్లము లన్నియు శీతస్వభావము (విద్యుత్ స్వభావము - Electrical) గలవే. కలుషరక్తమునందు నూటికి 15, 20 భాగములు కర్బన ద్వయామ్లజనిదము (బొగ్గుపులుసుగాలి) యున్నది. ఇంకొక వైద్యుడు హృదయస్పందనమునకు కారణము ఊపిరి తిత్తులలోనే యున్న దనెను. కాని శ్వాసాశయములనుండి హృదయములోనికి వచ్చురక్త మెరగ్రా నుండును. దీనియందు సంకోచస్వభావము లేనేలేదు. హృదయస్పందనమునకు నాడీసముదాయము కొంతవరకు కారణమే యగును. మజ్జాముఖము నుండి ద్విమ్మరినాడిగుండ (దీనినే 'న్యూమోగాస్ట్రిక్ నాడి' యందురు.) బయలుదేరి హృదయమున కనేకనాడీతంతువులు వ్యాపించును. వీనిలో కొన్నిటియందు గమననిరోధము జేయు (ఆటంకపెట్టు Inhabitory) స్వభావ మున్నది. అందువలన నవి హృదయముయొక్క గతిని తాత్కాలికముగా నాపి తరువాత ప్రచండవేగముతో గదలించును. విద్యుద్వాహిక

లన్నియు హృదయమునందలి యెడమ భాగమునకు వచ్చుడు అచ్చట నెర్రని వేడియైన శుద్ధరక్తముండును దాని నాటంకపెట్టును. తరువాత కుడివైపునకు నపుడు అచటి నీలమగు చల్లని కలుషరక్తముతో గూడి చ్ఛక్తి ప్రబలతర మగును. పొట్టమీద బలమైన దెబ్బ నప్పుడు స్వతంత్రనాడులవెంట దానిప్రతిఫలము మజ్జ మునకు తగిలి అచటినుండి ద్విమస్తిరినాడి వెంట హృద మునకు చేరి దానియొక్క గమనము నాపివేయును. అంద ప్రాణాపాయము సంభవించును.

8. విద్యుచ్ఛక్తిని పీల్చిన విషమగుట యేల విద్యుచ్ఛక్తి శీతస్వభావముగలది. అందు నీలము, నీలి ఉదారంగు లుండును. నీలిధాతువు పీల్చినపు డది విధిగా యమునందలి యెడమకర్ణికలోనికి రక్తమువెంట జేరున ఎడమ కర్ణికలోని కెప్పుడు నెర్రనిరక్తమే పోవలసి యు కుడికర్ణికలో నీలిరంగుగల కలుషరక్తమున్నది. కర్ణికలో నయితము కలుషరక్తమే యున్నయెడల యనిక క్రియ ధ్వంసమగును. ద్రావకములు (ఆమ్ల acids) అన్నియు శీతస్వభావము గలవి. అనగా నీ ధాతువు గలవి. బొగ్గులు కాలునప్పుడు అందుండి చేరిన పొగయందు బొగ్గుపులుసుగాలి యుండును. ఆ పీల్చిన ప్రాణాపాయము గలుగును. ఈ బొగ్గుపులుసుగ తాగ్రు సోడానీటియందు చేరియుండినను ప్రాణమె గలుగదు క్లోరోఫారమునందు నీలి లేక నీలము ఆక

రంగుకలిసిన వర్ణస్వభావ మున్నది. దానిని బీల్చినప్పుడు ప్రాణ క్రియ అరికట్టబడును. వైద్యశాస్త్రమునం దిట్లున్నది: "క్లోరో ఫారము హృదయము చచ్చుపడునట్లు చేయును-" అనగా "సజాతి సజాతి నణచును." అనున ట్లయినది. అప్పుడు హృద యములోనికి రక్తమన్ని వైపులనుండియు ముట్టడించును. ఆరక్త ముహృదయమునుండి బయటికి గెంటివేయుటకు శక్తినశించును. అందువలన హృదయము స్తంభించిపోవును. దేహమున కంత టికిని ఆధారభూతమగు రక్తము హృదయమునుండి వెలువడు మార్గము లేకుండును. హృదయము చుట్టునుండు సిరలును నిండి పోవును.

9. శుద్ధవాయుప్రసారము:— ఇప్పుడు మనము పీల్చు గాలి శుద్ధముగా నుండవలయుననియు, అనేకులు పరిశుద్ధవాయు ప్రసారము లేనిచోట నివసించుటచే వాయువు చెడిపోవు ననియు, అందు బొగ్గుపులుసుగాలి తయారగుననియు, ఆగాలి హృదయమునందలి యెడమకర్ణికలోనికి చేరుటవలన బలా రోగ్యములకు చాల చేటుగలుగు ననియు గోచరించినదిగదా! గాలి ధారాళముగా రాని గదులలో కిటికీతలుపులు గట్టిగా మూసియుంచి, అం దనేకులు నిద్రించిన స్పృహ తప్పిపోదురు. అనేకులు చేరిన సభలో ఉపన్యసించువానికంఠధ్వనియు నిట్లే తగ్గిపోవును. ప్రతిసభలోని ధారాళముగా పరిశుద్ధమగు గాలి వచ్చుట కేర్పా ట్లుండవలయును. ఆగాలి సూటిగా సభ్యులకు దగులవలయును.

10. జ్వరము యొక్క తత్త్వము, యకృత్తు (కాలేయము కాలిజము - Liver) నందలి శర్కరయొక్క తత్త్వము :— హృదయస్పందనమునకు ముఖ్యమగు నింకొకకారణముగలదు. దాని నిచ్చట వివరించెదను. యకృత్తునందు పిండిపదార్థ ముండుటయు నది గ్లికోజన్ (Glycogen) గా మారుటయు గలదు. దీనికారణ మింతవరకు నగమ్యగోచరముగనే యున్నది. చమురుపదార్థములు, చక్కెర, పిండిపదార్థము నెక్కువగా తినినప్పుడు అంగార (బొగ్గు) మెక్కువగా రక్తము లోనికి జేరును. ఇది ప్రాణవాయువుతో జేరి బొగ్గుపులుసు గాలిగా నిలిచిపోవును. ఇది హృదయమునందలి కుడికర్ణిక లోనికి జేరి, మిక్కిలి శీతస్వభావము గలదగుటవలన విద్యుచ్ఛక్తియందు తీవ్రతను గలిగించును. అందువలన హృదయకోశమునుండి అమితోష్ణమగు రక్తము మిక్కిలి వేగముగ దేహమున కంతటికిని వ్యాపించుటయేగాక హృదయస్పందనములయొక్క సంఖ్యయు నెక్కువగును. తినినపదార్థములయం దిట్టి దత్యధికముగా నున్నప్పుడును, దానినంతను వెలువరించుటవలన హృదయము చెడిపోకుండుటకును నిట్టి పదార్థము కొంత యకృత్తునందు గ్లికోజన్‌గా నిలిచియుండును. చమురుపదార్థములును, తినకూడని యాహారములును అత్యధికముగా తినునెడల యకృత్తు మొద్దుబారిపోవును. అప్పు డీ గ్లికోజన్ ఏర్పడక, అందలి మాలిన్యములెల్ల హృదయమునకే చేరును. అందువలన హృదయస్పందనములును, వేగమును అధికమగును. అత్యధికోష్ణముగల రక్తము అమితవేగముతో

దేహమునంతను కాల్చివేయుచుండును. దీనికే జ్వరమని పేరు. దీనిని వివరించుట కనేకులు ప్రయత్నించి విఫలప్రయత్నులైరి. కర్కే అనువారి శారీరశాస్త్రమునందిట్లు వ్రాయఁబడియున్నది: "యకృత్తునందలి గ్లికోజన్ జీవితాంతముననే చక్కెరగా మారును. ప్రాణమున్నంతవరకును గ్లికోజన్ చక్కెరగా మారదు. దానికా స్వభావము ప్రాణమున్నంతవరకు నుండదు." ఈ సంగతి మా వాదమును బలపఱచుచున్నది. దీనినిబట్టి అమితత్వమును ప్రకృతి యెట్లు సరిపెట్టుచుండునో గ్రహింపవచ్చును. ఈ గ్లికోజన్ చక్కెరగా మారి అది రక్తములో కలియునెడల నది హృదయకోశములో చేరి క్రొత్తవిద్యుచ్ఛక్తులను కలిగించును.

'పేవీ' అను నాతడు కుక్కలయకృత్తునందు గ్లికోజన్ పరిమితి నిట్లు వివరించినాడు:

మాంసాహారము నిచ్చినప్పుడు నూటికి 7.19 భాగములు.
మాంసాహారము నొక పౌను
చక్కెరతో నిచ్చిన ,, 14.5 ,,
శాకాహారము, బంగాళాదుంపలు,
రొట్టె బార్లీ ఆహారము నిచ్చినప్పుడు నూటికి 17.23 ,,

గ్లికోజన్ రాసాయనిక పరిమితి అంగారము 6 పాళ్ళు, హైడ్రజము 10 పాళ్ళు, ప్రాణవాయువు 5 పాళ్ళు, చక్కెర అంగారము 12 పాళ్ళు, హైడ్రజము 22 పాళ్ళు, ప్రాణవాయువు 1 పాలు.

**11. హృదయముయొక్క పరిమితి:—** అతివిచిత్రమై, రక్తప్రసరణమునకు మూలకారణమైన, యీహృదయయంత్రము చేతిపిడికిలియంత పెద్దదై యున్నది. చావు, బ్రిదుకుల కీ యంత్రమే ఆధారము. కుడికర్ణికయందు 5 తులముల రక్తము పట్టును. ఎడమకర్ణికయందు కొంచెము తక్కువ రక్తము పట్టును. జఠరికలు కర్ణికలకన్న పెద్దవి. బలమైనవియును. సుప్రసిద్ధ మందువైద్యులగు డాక్టరు 'పెప్పర్'గారు ప్రతితడవయును హృదయమునుండి 15 తులముల రక్తము వచ్చుచుండునని వ్రాసియున్నాడు. కర్ణికలలోనుండివచ్చు రక్తమే జఠరికల లోనికిని వచ్చునుగదా! ఈ 15 తులముల పరిమితి యెట్లేర్పడినది? 5-10 తులములవరకే భరింపగల కర్ణికలు యింగత రక్తమును సృష్టించునా యేమి?

**12. హృదయకోశసంబంధివ్యాధులు:—** హృదయకోశపుపైపొరయందు తరుణమగుమంట, తీవ్రమగుపోటు నుండును. వికార ముండును. వాంతులుసయితము గలుగవచ్చును. శ్వాస చాల కష్టముగా నడచును. అణచబడిన దగ్గుండును. హృదయమునందు దప్పుడప్పుడు దుడుకుగానుండును. జలుబు వలన గలుగవచ్చును. ఆమవాతము, ఫుప్ఫుసము (Pleura) నందలి దాహమువలన గలుగును. న్యూమోనియా మొదలగు వానివలనను గలుగును.

**హృదయముయొక్క లోపలిపొరయందు తరుణమగుమంట:—** హృదయమునందలి గదులు, తలుపులకు లోపలగా నుండు

పొరయందు మంటలు గలుగుట. ఇది సాధారణముగా హృదయకోశమున ఎడమభాగముననే కలుగును. అచట వేడియైన రక్తముండుటవలన గలుగును. లక్షణము లన్నియు పైపొరయందు గలిగిన మంటలయందువలెనే యుండును. కాని యిందు చెవిలో ధ్వను లుండును. పై వ్యాధికిని దీనికిని సయితము రోగి ప్రక్కపై బరుండవలయును.

హృదయకండరములందు కొయ్యగండలు: శుద్ధరక్త మెక్కువగా బ్రవహించును. కలుషరక్తముయొక్క గమనము తగ్గిపోవును, బృహద్ధమని నిరోధింపబడి, కండరము ఉబ్బి, అధికగమనము గలుగును. ఎర్రని రక్త ముండుచోటనే యిది గలుగును. లక్షణములు: బృహద్ధమని, మెడయందలిధమనులస్పందనములు కాన్పించుచుండును. తలనొప్పి, ముక్కువెంట రక్తముకారుట, కన్నులయందును ముఖమునందును రక్తాధిక్యత, దిమ్ముగా నుండుట, కఠినమగుశ్వాస. శ్వాస దుడుకుగా నుండును.

హృదయమునందలి అరలు వాచుట:- ఇందు కుడివైపున గమనము యెక్కువగా నుండును. శుద్ధరక్తముయొక్క గమనము బలహీనముగా నుండును. దగ్గు, కఠినమగు శ్వాస, జీర్ణాశయము, ప్రేగులు, యకృత్, మూత్రపిండముల సంబంధమగు బాధలు, కండరములయందు కొయ్యగండలు పెరిగినప్పుడు హృదయగమన మెట్లు అధికముగా నుండునో యీ వ్యాధియందంత తగ్గియుండును. ఇదియును దుస్సాధమగు స్థితియే.

హృదయమునందలి తలుపుల సంబంధమగు వ్యాధులు :— కలుషరక్తము కుడికర్ణికనుండి, కుడిజఠరికలోనికి వడిగా ప్రవహించును. అప్పుడొక ద్వారముగుండ బోవును. ఇట్లే హృదయమునందలి యితరఅరలకు మధ్యనుండు తలుపులును, రక్తమును ముందుకు పోయినతరువాత దానిని తిరిగి వెనుక అరలోనికి రాకుండ నిరోధించును. ఇట్లు బృహత్సిరనుండి కుడికర్ణి జఠరికలోనికిని, అక్కడనుండి కుడికర్ణికలోనికిని; అక్కడనుండి శ్వాసాశయములలోనికిని; అందుండి యెడమకర్ణికలోనికిని; అక్కడనుండి యెడమజఠరికలోనికిని; అచటినుండి బృహద్ధమనిలోనికిని రక్తమును ప్రవహించు చోట్లనెల్ల మధ్యతలుపు (Valves) లున్నవి. బృహద్ధమనిలోనికి పోవు తలుపు చెడిపోయినప్పుడు అకస్మాత్తుగా మరణము సంభవించును.

హృదయమునందు దుడుకు:—దీనివలన ననేకదుర్భరవ్యాధులు గలుగును. దీనివలన ఆపద గలుగుననియు, మరణము గలుగుననియు భయముగా నుండును. హృదయమునందు దుడుకున్నవానికి పిరికితనము గలుగును. ఇచ్చట పదార్థము, మనస్సును లోబఱచుకొనుట జరుగును. ఇది ప్రాణాపాయకరమైనది గాదు.

హృదయనాడులయందు మంటలు : రోగికి అకస్మాత్తుగా బాధయు, మరణభీతియు దోచును. మరణమే సంభవించుటయు కలదు.

13. సామాన్య చికిత్స :—మించి వచ్చిన తరువాత కుదుర్పుట కన్న హృదయకోశసంబంధమగు వ్యాధులు రాకుండ నాపుట మిక్కిలి తేలికమైన పని. హృదయకోశవ్యాధులనుగలిగించు కారణములలో ప్రధానమైనవి ముష్టిమైథునము, అధికసంగమమును. పొగత్రాగుటవలన హృదయకోశము పాడగును. హృదయ స్పందనమునందు క్రమము లేకుండపోవును. త్రాగుబోతుల హృదయమునందలి ముడుచుకొనునట్టియు, తెరచుకొనునట్టియు (స్థితిస్థాపక) గుణము పోవును. అందలినాడులయందలి ముడులును, కండరములును బలహీనములై పోవును. హృదయకోశ సంబంధమగు వ్యాధులలో చిక్కనికాఫీ, టీలు త్రాగకూడదు. హృదయకోశమునందు వేడితో గూడిన వ్యాధులు : నీలిరంగును కేంద్రీకరించుటయో, ఆదిత్యపేటికయందు నీలియద్దము హృదయమున కెదురుగా నుంచి కూర్చుండుటయో మంచిది. ఇందలి నీలిరంగువలన హృదయమునందలి అధిక వేగము తగ్గును. వెలుతురు, వేడిమి యుండుటవలన హృదయమునందలి మాలిన్యములు చెమటగా వెలువరింపబడును. చెమట రా నారంభించువరకును మిక్కిలి తీక్ష్ణమగు నెండ తగులరాదు. అప్పుడు కొంచెము చల్లనిగాలిని లోనికి రానిచ్చుచుండవలెను. రోగి యొక్క హితవును గుర్తించి ప్రవర్తింపవలెను.

మర్దనచికిత్సవలనను నెక్కువ మేలగును. హృదయమునందు వేగ మెక్కువగా నున్నప్పుడు వేడియైన చేతిని హృదయముపై నుంచరాదు. హృదయమునుండి వెలుపలకు హస్తచాలనము జేయవలయును. పాదములు, చేతులు వెచ్చగా

నుంచి ఉద్దీపన గలిగింపవలయును. హృదయస్పందనము బల హీనముగా నున్నప్పుడును, తత్త్వము బలహీనముగా నున్నప్పుడును బలవర్ధకమును, ఉష్ణకరమును నగు నాహారమును దినవలెను. మర్దన జేయవలెను. ఎఱుపుతోగూడిన ఊదారంగు గాని, పసుపురంగు ఎక్కువగా గలసిననారింజపండురంగు గాని వాడదగును. ఎక్కువ వేడిని తగ్గించుటకు ఆవపిండితో కలసిన వేడినీటి పాదస్నానములును, అటుతరువాత చన్నీటి క్షాళనమును చేయవలెను. అప్పుడు రోగి అధికశ్రమను మాని నెమ్మదిగా నుండవలెను.

మూడవ కిరణము

# శ్వాసాశయములు మొదలగు శ్వాసావయవములు

1. అవయవముల పేర్లు:—నోరు, ముక్కురంధ్రములను దాటిన తరువాత సప్తపథ, దానితరువాత ధ్వనులను గలిగించుటకు ప్రధానమగుస్వరపేటికయును దానితరువాత వాయునాళమును గలవు.

ఈ వాయునాళమే రెండుగా చీలి కుడియెడమను అసంఖ్యాకములగు గోళములతో గూడియున్న శ్వాసాశయముల లోనికి బోవును. ఆగోళములలోనికి నీ వాయునాళములలోనుండి చీలిన లతలాది నాళికలు వ్యాపించియుండును. బయటనుండి స్వీకరింపబడిన పరిశుద్ధవాయువు యీ వాయునాళికలలోనికి పోవును. ఈ నాళికలను చుట్టుకొనియే, లతలాదిగా నున్న శ్వాసాశయగోళములు నుండును. శ్వాసాశయగోళములలోనికి హృదయకోశపు కుడిభాగమునుండి మలినరక్తము చేరును. అది యందుండి శ్వాసాశయములలోనికిని అందలి గోళముల లోనికిని చేరును. వాయునాళికలలోని ప్రాణవాయు వీగోళముల లోనికిని, గోళములలోని మలినరక్తమునందలి బొగ్గుపులుసు గాలి యీ నాళికలలోనికిని జేరి బయటికి వెలువరింపబడును. ఇట్లు శ్వాసాశయములందు సదా రక్తము శుద్ధమగుచుండును.

2. స్వరయంత్రము:- పొట్టివియును, పొడుగువియును, లావై నట్టియు సన్ననై నట్టియు వివిధములగు తంత్రులతో గూడియుండును. మరియు ధ్వనిని వెలువరించుట కొక శృంగముతో గూడియుండును. వివిధములగు నీ తంత్రులయొక్క కదలికవలన కండరములందు సంకోచవ్యాకోచములు గలిగిన హెచ్చుతగ్గుల ధ్వనులు గలుగును. స్వరపేటిక గొట్టమువలె నుండి అది పెద్దదై నప్పుడు మందధ్వనియును, ముడుచుకొనినప్పుడు షడ్జస్వరమును గలుగును. సాధారణముగా స్వరపేటిక సంబంధముగు సంధిబంధనముల (ligaments) వలననే ధ్వని గలుగుచున్నదని భావించుట కలదు. ఇట్లే చెవియందును వేలకొలది తంతులుండి వివిధములగు ధ్వనులయొక్క అత్యంతసూక్ష్మములగు భేదములను గుర్తింపగలవై యుండును.

4 వ పటమున నీస్వరయంత్రమునందలి తంతులను, నిర్మాణమును చూడగలము. స్వరపేటికయొక్క పై భాగమున కొండనాలుక యుండును. అచట స్వరపేటికను తెరచుటకు, కుడి యెడమలయందు రెండు ఉపాస్థు (Cartilages) లున్నవి. వానికి స్వరపేటికావికసన ఉపాస్థు (Crico-arytenoideus Posticus) లని పేరు. స్వరపేటికను మూయుటకు ముకుళక ఉపాస్థు (Arytenoidus) లును, అభ్యంతర ముకుళక ఉపాస్థులు (Cricoarytenoideus lateralis) ను నేర్పడియున్నవి. అభ్యంతర ముకుళకఉపాస్థులు, పైనున్న ముకుళక ఉపాస్థులయొక్క మూలమును లోపలికి చుట్టివేయును. స్వరపేటికయందు కుడి యెడమలయందు ధ్వనితంతులున్నవి. వానికి కుడిధ్వని తంత్రి




4 వ పటము :

పైనుంచి చూచినప్పుడు స్వర పేటికయొక్క లోపలి నిర్మాణము

2 Cricoid cartie.

3 స్వర పేటికావికసన ఉపాస్థి (Crico-arytenoideus Posticus)

4, 4 ముకుళిక ఉపాస్థులు (Arytenoidus)

5 ఉపజిహ్వా వికసనరంధ్రము (Rima glotidis)

6, 6 కుడి యెడమ ధ్వనితంతులు (Right & Left Chordia Vocalis)

7 వీని కానుకొనియున్నది థైరో ఉపాస్థి సంబంధమగు కండరములు ( Thyroarytenoidii )

8, 8 థిరాయిడ్ – దీనినే వయో గ్రంధియందురు (Thyroid)

9, 9 స్వరపేటికయొక్క వెలుపటి ఆవరణ

యనియు యెడమధ్వనితంత్రి (Right and leff chordavocalis) యనియు పేరు. థైరో కండరమును (Thyroarytenoidei) గలదు. థైరోఉపాస్థిసంబంధమగు కండరము లీధ్వనితంతువులను, థైరో కండరమును పొడవగునట్లు చేయును. ఉపజిహ్వను తెఱచునట్టి ఉపజిహ్వ వికసనరంధ్రము (Rima Glotidis) మార్గమే స్వరపేటికకును ద్వారమై యున్నది.

స్వరపేటికయందలితంతువులు స్త్రీలకు పురుషులకన్న రెట్టింపు పొడవుండును. అందువలన తక్కువధ్వని నిచ్చును. అందువలన రెట్టింపు కంపనము ల (Vibrations) గలిగియుండును. మగపిల్లల యొక్కధ్వని దాదాపు స్త్రీలధ్వనివలెనే యుండును. కాని స్త్రీలధ్వనియందుండెడి మార్దవము బాలురలో యౌవనము వచ్చువరకును తగ్గియుండును. యౌవనము వచ్చినంతనే స్వరపేటికయందును అందలితంతువులయందును మార్పులు గలుగును. నోరు, ముక్కు - వీనివలన ధ్వనియందు అవసరమైన సవరణ గలుగుచుండును. కంఠము, నాలుక, తాలువులు, పెదవులు, దంతములు, నాసిక ధ్వనులను కలిగించుట కత్యంతావసరమై యున్నవి. దాదాపుగా ధ్వనిమార్గమును మూయుటవలన హల్లులును, తెఱచుటవలన అచ్చులును గలుగుచుండును. ఏ భాషయందు అచ్చులు హల్లులు ప్రతిఅక్షరమునను ఒకదాని తరువాత నొకటిగా మారిమారి యుండునో ఆభాష మృదువుగా నుండును. (ఇది సంస్కృతాంధ్రముల యందు గలదు.) పురుషుల ధ్వనియందలి గాంభీర్యమునకు సరియైన హేతువు కనుగొనినవా రెవరును కాన్పింపరు.

3. గొంతునొప్పి:—స్వరపేటిక, సప్తపథ, గవదలు—వీనియందు, వేనియందు తాపము గలిగినను గొంతునొప్పి వచ్చును. వీనిలో స్వరపేటికయందు గలిగిన తాపమునకు స్వరపేటికాదాహ మనియు, సప్తపథయందు గలిగిన సప్తపథాదాహమనియు, గవదయందలిదానికి గవదవాపనియు నందురు. నీలివర్ణోదకమును పుక్కిలించి ఉమ్మివేయవలెను. తేపతేప కొక గుక్కెడు నీలివర్ణోదకమును పుక్కిలించక మానే తాగవలెను. ఎట్టి మందులును పనిచేయనప్పుడునయితేము ఎట్టి దాహమైనను, నోటిపూతమైనను, నంజుపొక్కులైనను నిట్లు నీలివర్ణోదకమును పుక్కిలించుటయు గుక్కెడు అప్పుడప్పుడు మింగుటయు చేసిన తప్పక కుదురును. గొంతునుండి భుజములమీదికిని, హస్తములకును రాచుటవలన నయితేము రక్తమావైపులకు లాగివేయబడి బాధానివారణ మగును.

4. స్వరపేటికయందు ఈడ్పు:—(Croupous laryngitis) తరుణమగు మంటలు స్వరపేటికయందు గలుగును. బిరుసైన పొర బయటికి వచ్చుచుండును. మాంససంతానికయందువలె నిందలి పొర ఆమత్వచపుపొర గాదు. ఏదో అట్టిపొర వచ్చుచుండును. ఇది సాధారణముగా చాల అపాయముతో గూడి యుండును. ఈడ్పు ఉండును. స్వరపేటిక యందలి తంతులయందును, ఉపజిహ్వాయందలి ఆమత్వచమునందును రక్తము గడ్డకట్టుకొనిపోవును. అందువలన శ్వాస స్తంభించిపోవును. స్వరము బొంగురుపోవును. లేదా ధ్వని లేకుండనైన బోవును. అందలి వాపు దిగువనున్న శ్వాసనాళమువరకుగాని, యెగువ

నున్న సప్తపథవరకుగాని వ్యాపించును. అందువలన వెలుపటి గాలి లోపలికిగాని లోపలిగాలి వెలుపటకుగాని పోకపోవుట వలన ఊపిరియాడక ప్రాణము పోవును. ఏదైనను ప్రతీకారము వెంటనే చేసిన మేలు గలుగును. ఎదురు రొమ్మందలి చర్మమును వడిగా రుద్దవలయును. అచ్చటినుండి భుజములవంకకును, చేతులవంకకును మర్దన చేయవలయును. వేడినీటిపాద స్నానము జేయవలయును. ఆనీరు శిశువు భరింపఁగలిగినంత హెచ్చు వేడిగా నుండవలెను. అందు ఆవపిండి చేర్చవలయును. బాగుగా చెమర్చునట్లు ఆవిరిపట్టినను జ్వరవేడిమి తగ్గి అపాయము తప్పిపోవును. ఎండ బాగుగా నున్నయెడల వర్ణకేంద్రీకరోపకరణముతో (Chromo-disc) ఊదాకాంతిని ఎదురు రొమ్ముపై ప్రయోగింపవలయును. అప్పటికి రోగము కుదురకున్నను రోగతీవ్రతనైనను తగ్గించును. దేహమునందు చైతన్యమును, రక్తమునందు శుద్ధిని గలిగించును. ఆదిత్యపేటికా స్నానములవలన నింకను నెక్కువ మేలగును.

5. మాంససంతానిక:— (Diphtheria) ఎలుగువాపు, గవదబిళ్ళలు, మొదలగు వ్యాధుల కిది పర్యాయపదముగా భావింపబడును. ఇది జిహ్వామూలమున నారంభమైన చాల దూరమువరకును వ్యాపించును. ఆరోగ్యనియమానుసారము పెంపుగక రోగప్రవణత గల శిశువుల కీవ్యాధి తీవ్రముగను త్వరగను సంక్రమించును. ఈ విషము 3 మొదలు 5 దినముల వరకు వ్యాప్తిగలిగియుండును. ఈ వ్యాధి సామాన్యముగా గొంతులో గలిగి వాయునాళమువరకు వ్యాపించును. స్వర

పేటికయందలి ఆమత్వచమునందు గలిగిన దాహమునందు రోగము స్వరపేటికలోగాని, వాయునాళములోగాని ఆరంభమై గొంతువరకుఁ బోవును. స్వరపేటికాదాహము మాంససంతానికవలె నంటువ్యాధి గాదు. మాంససంతానికవలన త్వరలో బలము కు్రంగిపోవును. మామూలుగా చేయవాడుకపడియున్న మూర్ఖపువైద్యమువలన ప్రాణాపాయమే తటస్థించును. స్వర పేటికాదాహమున కేచికిత్స చెప్పబడినదో ఆచికిత్సయే యిందును గుణవంతముగా నుండును. ఆదిత్యపేటికతో చికిత్స చేసిన ప్రతితూరియు దానికి బాగుగా శుద్ధిచేయువలయును. నీలివర్ణోదకము పుక్కిలించుటవలన నధికమగు మేలు గలుగును. న్యూయార్కు మెడికల్ టైమ్సు అను పత్రికయందు పేర్కొనబడిన యీ క్రిందివిధానమువలన 30 మందికి చికిత్స చేయగా నం దొకరు మాత్రమే మరణించిరి:— "వయస్ బేడెన్ అనుచోట జరిగిన మహాసభ (Congress) యందు కోయనిగ్స్బర్గ్ అను పట్టణవాసియగు హెన్నిగ్ అనునాతడు మాంససంతానికావ్యాధికి టీకాలువేయుటకు మిక్కిలి విరోధియై యున్నట్లు తేలినది. ఆతడు 1927 మందికి చికిత్సను చేయగా నూటికి 3.07 మంది మాత్రమే మరణించిరి. నిమ్మనీటిని పుక్కిలించుటయును, మంచుగడ్డను కంఠమునకు ఎడ తెగక కట్టుచుండుటయును ఆచికిత్స."

జే. జె. ఫాక్సు, యం. డి అను మిత్రు డొకఁడు నా కున్నాడు. అతడు న్యూయార్కునందలి ష్లషింగ్ అనుచోట కొంతకాలమును, తరువాత కాలిఫోర్నియాలోను నివసించుచున్నాడు.

అతడు సూర్యకిరణ-రోగసజాతి వైద్యుడు (Chromo-homeo path). ఇరువది సంవత్సరములనుండి యీతడు మాంససంతాని కావ్యాధికి చికిత్స చేయుచున్నాడు. అప్పటినుండియు నొక్కరైనను అతని చికిత్సయందు మరణింపలేదు. కాని ప్రారంభమున వైద్యమునందు ప్రవేశింప క్రున్నప్పుడుమాత్రము ముగ్గురు శిశువులు మరణించిరి. అందు 50 మందికి మిక్కిలి దుస్సాధమగు రోగము. మిగతవారికి సామాన్యమగు మాంససంతానిక. ఆతడు చేయుచుండిన చికిత్సయొక్క సంగ్రహమిచట వ్రాయబడినది.

రోగిని దిగంబరునిగా చేయవలెను. తరువాత ఒక ఉన్నిగుడ్డ (కంబళిగాని) పై పరుండబెట్టవలెను. తరువాత చన్నీటిలో ముంచిన స్పంజితోగాని గుడ్డతోగాని రోగియొక్క ముఖము, మెడ, దేహమంతయును బాగుగా తడుపవలయును. తరువాత ఆతడితోనే రోగికి వెచ్చ గలుగువరకును కప్పియుంచవలయును. దానివలన ప్రతీకారము గలుగును. చెమట పోయును. అందువలన రక్తమునందలి విషములు కొంతవరకు వెలువరింపబడును. ఇట్లు ప్రతి రెండుగంటలకును చేయుచు జ్వరము తగ్గి, గొంతు బాధ తగ్గువరకును నెడతెగక చేయుచుండవలయును. జ్వరము చాలభాగము తగ్గినతరువాత నీకట్లు చాల వ్యవస్థతో చేయుచుండవచ్చును. తరువాత కేవలము చన్నీటిలో ముంచిన స్పంజితో రుద్దుటవలననే వేడిమిని తగ్గించుచుండవచ్చును. జ్వరవేడిమి అత్యధికముగా నుండి, సన్నిపాత ముండి శ్వాసకంపుతో గూడియుండి, ఆమత్వచము నల్లబడి యున్నప్పుడు

ప్రతీకారశక్తి బాగుగా నున్నయెడల నిట్టికట్లు ప్రతి 15, 30 నిమిషముల కొకతూరి చొప్పున వేయుచుండవచ్చును.

రోగి బలహీనముగా నున్నప్పుడును, ధాతుశక్తి తగ్గియున్నప్పుడును, పాదములు చల్లగా నున్నప్పుడును, ప్రతీకారశక్తి చాల క్షీణించియున్నప్పుడును, వేడినీటిని త్రాగించుచుండవలెను. పాదములదగ్గర వేడినీటి తిత్తులను పెట్టవలయును. స్నానములు సాధ్యమైనంత తక్కువ చల్లదనముగల నీటితోనే చేయింపవలెను.

ప్రతిస్నానమునకును తరువాత ధారాళముగా చెమటపోయుచుండునెడల వెంటనే సుగుణము గలుగును. చికిత్స చాలకాలము సాగింపవలసియుండును.

పెదవులపై చిలుగుడు గలిగినప్పుడు భూతఅద్దముతో సూర్యకాంతిని ప్రసరింపజేసి డాక్టరు ఫాక్సుగారు కుదిర్చి యున్నారు. అందువలన రక్తమునందలి మాలిన్యములు చెదరగొట్టబడి వెంటనే బాధోపశమనము గలుగును. నోరు తెరిపించి, గొంతులోనికి భూతద్దముద్వారా సూర్యకాంతిని ప్రసరింపజేసి కాల్చుటవలన కొంతమంది కతడు మాంససంతానికను కుదిర్చెను. గొంతులోపలగాక వెలుపట నిట్లు కాల్చినను రోగనివారణ మగునని నానమ్మకము.

శాస్త్రమర్యాద తెలియంగకపోవుటవలననే యింకను మాంససంతానికావ్యాధికి క్రిమ్లినను, ముఱిగిన మానవుల దేహములనుండియో, జంతువులదేహములనుండియో తీసిన పాడుచీమును